# వేదాంత సారము

# VEDANTHA SAARAM

**By**
**Late Dr. Donti  Siddappa Chetty**
**(1906 – 1979)**
**Bazaar Street, PUNGANURU -517247**
**Chittoor District – Andhra**
**2016**

**Note : 1 The contents of this book can be freely used with due acknowledgement, for any bonafide purpose.**

**2. Free e-copies of the book can be had by writing to any of these emails.**
**thanikesh@gmail.com, aparna.donti@gmail.com**
**vishwanath.donti@gmail.com,**
**aruna2207@gmail.com**

**3. The manuscript of this book came to my hand recently, and so final editing of the book has not been done by the author (my father). Hence, there are repetitions, gaps and errors. For this, my sincere and deep apologies to all the readers. Any suggestions/comments for the improvement of the book are humbly welcome.**

**Price Rs. 400 = 00**


**Complimentary**
**Copies of the book can be had from**
**DONTI CHANDRAMOULI**
**Flat No. 9, Block: D-6**
**KENDRIYA VIHAR**
**Yelahanka, Bengaluru – 560064**
**Tel : 080- 2846 30 74**
**9481102784**

**Email id : dchandramouli@yahoo.com**
**aruna2207@gmail.com**


**10012019**

# సూచిక

# వేదాంత ప్రయోజన ధ్యేయం

1. దుఃఖ నివృత్తి
2. ఇష్ట పాప్తి (ఆనంద ప్రా ప్తి)
   నిరంకుశ తృప్తి మరియు ఆనందం

"మోహ నాశమే మోక్షము"

1. True knowledge is to know that you know nothing.
2. To know God, you have to unlearn, what all you have learnt.
3. Humility bestows victory over all.

- Eknath.

మనసా : భగవంతుని స్మరించు నీ మనస్సు తిరిగి "కామిని కాంచనముల" మీద వ్రాలడం అశుభం. ఈగ వలె ఒక పరి మధువుపైన, మరొకపరి అమేధ్యం పైన వ్రాలకు. చాతకము స్వాతి బిందువుకై జీవితాధ్యంతము వేచి యుండునట్లు "భగవంతుని" ఒక్కనినే లక్ష్యించి మనము, ఎన్ని సాగర సరోవరములున్నను నిన్ను ఆకర్షింప జాలవుకదా.

- మానస భోధ
శ్రీ రామ కృష్ణ పరమ హంస.

# వేదములు

వేదములు – భారత జాతి అనాది, సనాతన జ్ఞాన విజ్ఞాన ప్రజ్ఞాన భాండారము. ముక్తి మార్గ ప్రతిపాదకములు, శాస్త్రములనఁబడును. సత్యాన్వేషణ మూల ప్రాతి వదిక.

సిద్ధులు – సాధ్యులు – యోగులు – జ్ఞానులు –మునులు – ఎందరెందరో మహాత్ములు, తమ శిష్య వర్గంతో పాటు జీవితాద్యంతము, కారడవుల్లో కఠోర తపో సాధనలు (సత్యాన్వేషణలో) సాగించిన శ్రమ ఫలితం గా రూపొందిన ఆధ్యాత్మిక సంపదయే “వేదములు” (ఉపనిషత్తులు) –

చతుర్వేదములను స్వతః సిద్ధము లందురు. ఎందువలననగా “బ్రహ్మ తత్వ ప్రతిపాదకము” లగుట వల్ల. “ధర్మార్థ కామ మోక్ష” చతుర్విధ పురుషార్థ సాధనకుపకరించునవి. “అపౌరుషేయ” ములని కూడా వాకొందురు. అవస్థాత్రయ బద్ధులైన మానవ సృష్టి కాదు కదా !!

తురీయ (బ్రాహ్మీ) స్థితి నుండి ప్రభవించిన, ప్రవచనాళి, కాబట్టి “బ్రహ్మముఖతః” ఆవిర్భవించినందున - - - బ్రహ్మకృతములనుటెంతయు సమంజసము గదా !

వేదములు అపౌరుషేయములు – “ధర్మ - – బ్రహ్మ” ల గూర్చి బోధించు నవి. మూడు అవస్థల నధిగమించి, తురీయమున (బ్రాహ్మీస్థితి యందు) ద్యోతమై అయాచితముగ – ప్రవచింపఁబడినవి. తపోధనులు, బ్రాహ్మీస్థితిలో దివ్యావేశమున, నుడివిన ప్రవచనములే, వేద వాంఙ్మయము. వేదములు బ్రహ్మ ముఖతః జనించెను !!

మహర్షులు – తపోధనులు – ద్రష్టలు - - - - తపస్సులో – నిరంతరాభ్యాస వశమున- అవస్థాత్రయము నధిగమించి, తురీయ, బ్రాహ్మీ స్థితిలో - - నెలల కొలది ఉండి పోయేవారు. సద్గురుదేవుల నాశ్రయించి, ఆయా ఆశ్రమములందుండు శిష్య శ్రేణి, బహు జాగ్రత్తగా, అప్రమత్తులై, రేయింబవళ్ళు, కంటికి రెప్ప వలె, శ్రద్ధాసక్తులతో గురుదేవుని పరి వేష్టించి యుండెడివారు.

అందున – ఏకసంత – ద్విసంత – త్రిసంత గ్రాహులు మాత్రము ప్రత్యేకముగ జట్లు, జట్లుగా (By turns only) నిత్య కృత్యముల దీర్చుకొని, తమ గురు దేవుల సాన్నిధ్యమున – రేయింబవళ్ళు కాపు కాచేవారు.

బ్రాహ్మీ స్థితి నుండి గురు దేవులు (సమాధి స్థితి నుండి) – తిరిగి దిగి జాగ్రదవస్థకు రావడానికి, కొన్ని గంటలు పట్టవచ్చును. ఆ సమయమున – అయాచితముగ, తపోధనుని ముఖతః కొన్ని మహత్తర సూక్తులు – దివ్య ప్రవచనాదులు వెలువడేవి. జాగ్రదవస్థ నందిన, మహర్షి, శుశ్రూషాదుల అనంతరం – సేద దేరి, ముందు పంక్తిలో కూర్చున్న "ఏక సంథా గ్రాహులను" కను సన్నతో తానేమి ప్రవచించినది, వల్లించమని సంజ్ఞ చేయును. వారు గురు ప్రార్థనాదికములఁగావించి, తపోధనుని బ్రాహ్మీ స్థితి ప్రవచనాళిని వల్లింతురు. తదుపరి – వీరు మరియు ద్విసంత గ్రాహులు కలసి రెండవ మారు వల్లింతురు. తర్వాత, త్రిసంత గ్రాహులతో 3వ మారు వల్లింతురు. ఈ రీతిగా, క్రమముగా అవియే శ్రుతి (విన్నవి), స్మృతులు (జ్ఞప్తికి గలవి) గ రూపొందినవి.

శ్రౌతులు -- శ్రుతుల నాశ్రయించిన వారు.

స్మార్తులు -- స్మృతుల నాశ్రయించిన వారు.

వేదుల వారు -- వేద పండితులు

ద్వివేదులు -- 2 వేదములందు పండితులు

త్రివేదులు -- 3 వేదములందు పండితులు

చతుర్వేదులు -- 4 వేదములందు పండితులు

నియోగులు -- వేద మత ప్రచారకులు (Missionaries)-

బ్రహ్మకు నాల్గు ముఖములు – 4 వేదములు

చతుర్ముఖుఁడు – బుద్ధి, మనస్సు, చిత్తము, అహంకారము. బ్రాహ్మీస్థితిలో ఇక్యమైన మనస్సు (జీవత్వము) బ్రహ్మమే అగును. బ్రహ్మ సంకల్ప కారి – సృష్టి కర్త – (మనస్సు లేక జీవత్వ రహస్యమదియే)-

వేదములు – (మూలము) గీర్వాణ భాష యందున్నవి. గీర్వాణము సంస్కరింపఁబడి, సంస్కృతమైనది, కావున, మూలము నేటి సంస్కృత పండితులకు సులభ గ్రాహ్యము కాదు. అదృష్ట వశాత్తు, యాస్క మునీంద్రుడు "నిరుక్తము" (8 భాగములు) అను వేద పద నిఘంటువును రచియించి (అనగా, వేదములందలి సాంకేతిక పద జాలమునకు, విపులార్థము వ్రాసినాడు) యున్నందున, దాని నాధారముగఁ జేసుకొని, భాష్య కారులు – విమర్శకులు, తదుపరి వ్యాఖ్యలు రచయించిరి.

యాజ్ఞావల్క్యుడు సూర్యుని వల్లను.
సుమంత, జైమిన్యాదులు వ్యాసుల వల్లను,
పద్మపాద, సురేశ్వరాచార్యాదులు – శంకరుల వల్లను జ్ఞానమును బడసిరి.

ఉపనిషత్కర్తల యనంతరం; విమర్శక చక్ర వర్తులు, తత్వ విచార పరులు, ఉపనిషత్తులందలి మూల భావముల సూక్ష్మాంశములను, వివరణ మొనర్చి సాయ పడి, జిజ్ఞాసువులను తరింపఁ జేసిరి.

వేదములు 4ః
ప్రతి యొక్క వేదము 4 భాగములుః -

1. సంహితలు (సంధాత) మంత్ర భాగము.
2. బ్రాహ్మణములు.
3. ఆరణ్యకములు.
4. ఉపనిషత్తులుఁ వేదాంత – వేద శిరో భాగము.

1. బ్రహ్మ చర్యాశ్రమమున – గురుకులమున – గురు ముఖతః పఠనమొనర్ప దగ్గది.
2. గార్హస్థ్య భాగము – ఇందు గృహస్థులు – దాన ధర్మ, వ్రత, క్రతు, (యజ్ఞ యాగాది) క్రియల క్రమమును గరుపు నది.
3. వాన ప్రస్థుఁడు – సంసార సర్వ బంధములను, కుమారులకప్పగించి, అరణ్యములందు ప్రత్యేక పర్ణశాలల నిర్మించుకొని, గురువుల ఆశ్రమములకు కొంత దూరములో భార్యా సమేతుఁడై సన్యాసాశ్రమమునకై, అర్హతను పొందు సాధన లొనర్ప నిర్దేశింపఁబడినది.
4. సన్యాసాశ్రమమున (వేదాంత అనగా ఉపనిషత్తుల బోధ) గురు సాన్నిధ్యమున సన్యాస స్వీకారము – తపోనిష్టాది కఠోర సాధనలు (మోక్ష కాంక్ష తో) సాగించి, జీవితమున తుది మజిలీగా కృతార్థుడగుట.

వేద విద్యలు – 32 (శుద్ధ విద్యలు) – బ్రహ్మ విద్యలు.

"శుద్ధ విద్యాంకురా కార ద్విజ పంక్తి ద్వయోజ్వల"

-- శ్రీ లలితా సహస్ర నామ స్తోత్రమ్ (25)

యీ 32 వేద విద్యలున్ను, అమ్మవారి (సర్వేశ్వరి) రెండు పళ్ళ వరసలుగా వర్ణించినారు.

| | |
|---|---|
| 1. ఈశావాస్యము -- | ఈశావాస్యవిద్య (1) |
| 2. కఠోపనిషత్ -- | నచికేతాగ్ని విద్య (2) |
| -- | అంగుష్ఠ ప్రమిత విద్య (3) |
| 3. ప్రశ్నోపనిషత్ -- | సత్యకామ విద్య (4) |
| 4. ముండకం -- | అక్షర పర విద్య (5) |
| 5. తైత్తరీయం -- | ఆనందమయ విద్య (6) |
| | పురుష విద్య (7) |
| 6. చాందోగ్య -- | సద్విద్య (8) - అంతరాదిత్య విద్య (9) - ఆకాశ విద్య (10) - ప్రాణ విద్య (11) - పరం జ్యోతి విద్య (12) - శాండిల్య విద్య (13) - ఉపా కోశల విద్య (14) - వైశ్వానర విద్య (15) - భూమ విద్య (16) - దహర విద్య (17) - మధు విద్య (18) - సంసర్గ విద్య (19) - పంచాగ్ని విద్య (20) |
| 7. బృహదారణ్యకం -- | ఉద్ధాలకాంతర్యామి విద్య (21)- గార్గ్యక్షర విద్య (22) - జ్యోతిషాం విద్య / జ్యోతిర్విద్య (23) – మైత్రేయి విద్య (24) - ఆదిత్య మండలస్థ సత్య బ్రహ్మ విద్య (25) – అక్షిస్థ సత్య విద్య (26) – ఉషస్థ కహోళీ విద్య (27). |
| 8. కాషీతకి -- | ప్రతర్ధన విద్య (28), - బాలకీ విద్య (29). |
| 9. శ్వేతాశ్వతర -- | అజా విద్య (30). |
| 10. ఐతరేయోపనిషత్ -- | రుద్ర విద్య(31) - చతుర్ముఖ విద్య (32). |

వేద విద్యలు - పర 32 విద్యలు
అపర 16 విద్యలు
కామ్య 14 విద్యలు.

కామ్య విద్యలు 14

1. తైత్తరీయే పురుష విద్య తైత్తరీయం నుండి
2. ఉద్గీథో విఘువ ప్రణవ విద్య చాందోగ్య నుండి
3. ప్రణవేపరో వరీయస్త్వాది దృష్టి విద్య "
4. ప్రణవే హిరణ్మయ విశిష్ట భగవద్ధృష్టి విద్య. "
5. జైష్ఠ్య శ్రైష్ఠ్య ప్రాణ విద్య "
6. ప్రాణ వాసస్త దృష్టి విద్య. "
7. చాందోగ్యే పురుష విద్య. "
8. హనో పాయన చింతన విద్య. "
9. ప్రణవేరస తత్వాది దృష్టి విద్య. "
10. నామ ప్రకృతిషు బ్రహ్మ దృష్టి విద్య. "
11. ఉద్గీథాదౌ ఆదిత్య దృష్టి విద్య. "
12. మనశ్చిత వాక్చితాది విద్య బృహదారణ్యకం నుండి
13. కృత్స్నోద్గీత విద్య. "
14. జీవే బ్రహ్మ దృష్టి విద్య "

"దహర విద్య" (17) : – పరమాత్మోపాసన – ప్రత్యగాత్మ విద్య – జీవాత్మోపాసన – పై దాని కంగ భూతము అనగా అనుబంధము –

అసురులలొ విరోచనుడు –
అమరుల (సురుల) లో ఇంద్రుడు
} సమిత్పాణులగుచు బ్రహ్మను జేరి 32 సం || లు బ్రహ్మ చర్యము వహించి –
ఈ విధముగా బ్రహ్మను వేడిరి –

ప్రశ్న – ఆత్మయను పేరు గల ప్రత్యగాత్మ మోక్ష మార్గ మెద్ది?

జ -- నేత్రమందు కాన్పించు పురుషుడే ఆత్మ బ్రహ్మము, అమృతము, అభయం, సర్వం -

ఇది గాక "అద్దమున – జలమున - ప్రతిబింబించువాడె! - - - "అసురుఁడు దేహాత్మ బుద్ధి (ప్రతి బింబము) తో తృప్తి పడెను. కాని, సురరాజు "దేహము

(నశించునది దృశ్యము) - - ఆత్మ కాదు - - -అని, ఇక స్వప్న పురుషుడా? . . . . సుఖ దుఃఖాది ద్వందము లనుభవించు వాడు బ్రహ్మ మెట్లగును? - - - తిరిగి బ్రహ్మను గూర్చి 101 సం|| లు తపస్సు – బ్రహ్మ చర్య వ్రతము చేసి సత్య దర్శన మొనర్పఁజాలెను!!

పర్యంక విద్య : -

అమనస్క జీవన్ముక్తుడు (జ్ఞాన or రాజ యోగి) చంద్ర లోకం దాటి ⟶ విధ్యుల్లోకం ⟶ గురు లోకం ⟶ అగ్ని,వాయు,వరుణ, ప్రజాపతి, బ్రహ్మలోకములను, వరుసగా (క్రమముగా) దాటి ⟶ హిరణ్యాగర్భలోకం బ్రహ్మాసింహాసనం ⟶ (సాయుజ్యం) ⟶ జీవ బ్రహ్మైక్యం (సృష్టి స్థితి లయ శక్తులు) లభించును ----- సాక్షాత్పరమేశ్వర పదవి.

ప్రాణ విద్య (11) :-

భోజనారంభమున, “నీరు” త్రాగడం, “ఆపోశనం”; ప్రాణమునకు, జలధారణ అగును. (Sipping of water at the outset of food-taking clothes “Prana” (Passage & Cautions the Digestive Etc organs about the ingestion of food Etc, and their Subsequent Engagement - - - just a notice in advance – a forerunner .

శాండిల్య విద్య (13) : -

“ఆత్మ ధ్యాన భోదకం” - - - - విశ్వాత్మగా - - - “ఆత్మ – విశ్వాత్మ” – చిద్విలాసము – ఏక సత్యము – హృదయ కుహర మధ్యమున – ధాన్యపు గింజ లేక “బార్లీ గింజ” వలె నున్నది. Corresponding to this there is a similar spot in the heart also – a white spot known as “Bundle of His” - - విశ్వాత్మ, విశ్వనాథ, విశ్వ ప్రభు – సర్వాంతర్యామి – సర్వ కారక మూల సత్తా.

-- బృహదారణ్యకం – అగ్ని రహస్యోపనిషత్.

అహరహ విద్య : -

(అహం + అహం) ie The Sun or day + The Self (Ego) – “I” in the Eye (విశ్వుఁడుండు స్థానం)

1. బ్రహ్మ ధ్యానం – సూర్య గోళము మీదను (బాహ్య లక్ష్యం) – నేత్ర రాసి (అంతర్లక్ష్యం) – అందు వల్ల ఈ 2 లక్ష్మములు పేర్కొన బడినవి.

"సత్యం బ్రహ్మ " - - - "సూర్య & నేత్ర"ము ల రెంట ధ్యానం – ఆరాధన
"ఆకాశ" = నేత్రం or హృదయం - - - - సూర్యోపాసన.

-- సూర్య నారయణోపనిషత్

గమనిక ; - కోణార్క లోని సూర్య దేవాలయం, - సప్తాశ్వరథం –
భార్గవీ

<u>వారుణీ విద్య</u> : -

పంచ కోశ విమర్శ –

అన్నమయ – స్థూల దేహం. (The body)
ప్రాణమయ - ప్రాణ (Vital Force)
మనోమయ – మనస్సు (జ్ఞానం – Psychic)
విజ్ఞానమయ – బుద్ధి
ఆనందమయ – ఆనందం (Bliss Absolute)
అనుభవి – Spiritual Happiness.
బ్రహ్మానందపు విలువ ??

సుశిక్షితు(డు – స్థిర చిత్తుడు – విశ్వాసి – సుహృదయు(డైన ఉత్సాహి – యువకుడు – సర్వార్థు(డు అయిన వానికి "మానవ సహజానంద సౌఖ్యము" – ఒక ఎత్తు (unit) – దీనికి 100 రెట్లు (100 times) దివ్యునకు కలదు –

- ఈలాగే వరుసగా 100 రెట్లు అధిక మగును.

మానవ ⟶ దేవ ⟶ ప్రజాపతి ⟶ బ్రహ్మ ⟶ & so on.

<u>వైశ్వానర విద్య</u> (15) ; - విశ్వ సంబంధమైన – విశ్వమానవ సమత్వ – సర్వ సమ్మత – వివిధ ద్యాన పథములు గలది. విశ్వ (విరాట్) హిరణ్య గర్భాది సమిష్టి రూప ధ్యానము (జఠరాగ్ని విద్య)

ఈ విద్యను అశ్వపతి మహారాజు ఉపమన్యు కుమారు(డు, ఉద్దాలకునకు చెప్పెను.

వైశ్వానర – విశ్వ రూప సమిష్టి స్వరూప ధ్యానము.

తల – దీప్త స్వర్గము (ఆకాశము)

కన్ను – రవి – వస్తు వర్ణ ప్రకాశ దాత –

(Sun & moon)

ప్రాణ – వాయువు – దశ దిశా వ్యాప్తి గలది.

బొంది (మొండెము) – ఆకాశ – సర్వ వ్యాపి.

మూత్ర కోశము – జల సముదాయము – సముద్రములు

పాదము – భూమి

ఉరము – యజ్ఞ వేదిక

కేశములు – (రోమములు) – ధర్బ పోచలు.

ఉదరము – గృహ నిత్యాగ్ని

మనస్సు – జఠరాగ్ని

నోరు - యజ్ఞాగ్ని.

వాక్కులు – వేదములు

చెవులు - దిగంతములు

హృదయం – విశ్వము

పాదములు – పృథ్వి

సమస్త విద్యలు మోక్ష సాధనలుగ ప్రతిపాదింపఁబడినవి. మోక్షార్థమే గాక కామ్య కాంక్షలకై ఈ విద్యలు సాధింతురు. "ఓం" అన్నిటికి మూల మంత్రమై (త్ర్యక్షర ప్రణవము) సర్వార్థ సిద్ధికి దోహద మివ్వ గలది.

"సూక్ష్మంలో ఉన్నది మోక్షం" – తల జ్ఞానేంద్రియమములన్నిటికి కేంద్రము – "వాజసనేయ బ్రాహ్మణం (జైమిని).

<u>మధు విద్య</u> (18) :– ధ్యాన, జ్ఞాన సహిత –క్రతు కర్మాదులు అత్యధిక బల ఫల ప్రదములు. ఇంద్రుడు ధధీచి కి చెప్పెను. అతడు, అశ్వనీ దేవతలకుఁజెప్పెను. దీనిని, జ్యేష్ఠుల కే చెప్పుదురు. మధు విద్యాధికులు చచ్చిన వారిని బ్రదికింతురు. పట్ట పగలు నక్షత్రములు కన్పించును.

1. శంబుకుఁడు, ధర్మవ్యాధుడు, విదురుడు, - మొ|| వారు పూర్వ జన్మ సంస్కార తరణులు.

2. సత్యకామ జాబాలి – గౌతమ గాధ,

3. జాన శృతుని "హంసల" దూషణ భూషణలు – శకట సహిత "రైఖ్యు"ని గాధ – బోధ --- శూద్ర నిందాది ప్రస్తావితములు. –

-- చాందోగ్య III part. I – XI – సామ వేదం – శ్లో. 418

"మధు (విద్యా) ప్రీత"

- శ్రీ లలితా సహస్ర నామ స్తోత్రం (510).

<u>అక్షర విద్య (5)</u> ; -

యజ్ఞావల్క్య మహర్షి గార్గి కి చెప్పెను .

నాశ రహిత - అమృత తత్వ – సద్వస్తు విద్య నుపదేశించెను.

"నేతి – నేతి" (By the process of Negation) "వివేక – విచార" - పథము.

"నే నెవరు" – శ్రీ భగవాన్ రమణ మహర్షి బోధ స్మరణీయము.

క్షర మనగా నశించునది.

అక్షర మనగా నశింపనిది.

"అ" నుండి "క్ష" వరకు ఉన్నవి అక్షరములు,

శబ్ద బ్రహ్మము నుండి ఉద్భవించినవి – నాశ రహిత మైనవి.

-- బృహదారణ్యకం – III -8.

<u>సంసర్గ విద్య (19)</u> : -

శకట సహిత రైఖ్య (Cart man) జానశృతి మహారాజునకుపదేశించెను. ప్రాణ ప్రాముఖ్య విద్య – "ప్రాణ వాయువులు" – ప్రాణ ప్రాధాన్యత సూచితము (పంచ ప్రాణములు – పంచ ఉప ప్రాణములు గమనార్హములు) –

"జీవ – బ్రహ్మ" ల మధ్య – సహ జీవనం,

సహ భోక్తృత్వం – 5 అవస్థలు

(జాగృత్స్వప్న సుషుప్తులు – తురీయ తురీయాతీతములు) –

-- చాందోగ్య IV – 2

<u>అహంగ్రహోపాసన</u> – ఆత్మ ధ్యానము

1. బ్రహ్మ (సచ్చిదానంద ప్రాప్తి)
2. ఆత్మ లక్షణములు (బ్రహ్మ స్వరూప నిరూపణం)

3. త్రిపుటివిచ్ఛేదం – ఆత్మ నిష్ఠ – ద్వందాతీత స్థితి – ఇంద్రియ జయం.

విషియాతీత స్థితి –బ్రాహ్మీ స్థితి – తురీయ ప్రాప్తి.

అగ్ని హోత్రం – నిత్య – పక్ష – మాసం –

ఉద్గీత విద్య : - (Loud prayers) గట్టిగా “అరచి” ప్రార్థించుట.

(ఉద్గీత – ఉద్ఘాటన – ఉద్ఘోష్టి – గట్టిగా, ఘాటుగా చెప్పుట) – “ప్రణవ ధ్యానం” ఇది స్వయంగా ఆచరించాలి గాని, ప్రతినిధుల చే చేయబడిన, తక్కువ ఫలం.

సాధకుల శక్తి సామర్థ్య, అభిరుచుల ననుసరించిన “ప్రణవ ధ్యానాదికము. భావ శబ్దాచ్ఛ” –

-- బ్రహ్మ సూత్రములు -22

(ముస్లిం –క్రైస్తవ ప్రార్థనల వలె కాబోలు)

“ఓం” – ఉద్గీత – ప్రాణ రూపం

సుర -- ఉచిత, ఉన్నత, సంస్కారములు, అభిరుచులు –ప్రీతి –“నివృత్తి – సాత్విక ధ్యాన”

అసుర – నీచ – నికృష్ట సంస్కారములు –ఇచ్ఛలు - ప్రవృత్తి – కామ్యములు – ఇంద్రియోద్వేగ వృత్తులు. గట్టిగా ప్రణవ ధ్యాన మొనర్చుట.

భజన -- భక్తి సంకీర్తనాదులు, ధ్యాన గీతావళి – తద్వారా “ప్రాణ జయం” అనగా “ఇంద్రియ + ప్రాణముల” సాయం – ఈశ్వర ప్రాప్తికై కోరి గట్టిగా –ప్రణవ ధ్యానం చేయుటః ప్రాణ సహకారంతో, ఇంద్రియ జయం – తద్ద్వార ఆత్మ సాక్షాత్కరం.

భగవత్సప్తాహదులు – స్మరణీయము.

-- చాందోగ్య (ఆత్రేయ మహర్షి)

పురుష విద్య (7) : -

యజ్ఞ కర్త (Sacrificer) – Soul

యజ్ఞము (Sacrifice) -- Faith (His wife)

బ్రహ్మ జ్ఞాని – మరణానంతరము – కర్మాతీతుడు. ఆస్తిసుతాదులకును - పుణ్యఫలం – భూషించు ఆదరించు హితులకును – ఆశ్రితులకు –కొనియాడు వారికి. పాప ఫలం -- దూషించు, నిందించు, హింసించు, అహితులకును విడుచును.

ఈ విసర్జన క్రియ "విరజా" నదిని దాటు నప్పుడు చేయును. ఇతనికి, ఇక జన్మ జరా మరణ బాధలు లేవు. (జర లేదని అర్థము).

బ్రహ్మ జ్ఞాని -- 1). విముక్తాత్మ – విదేహుఁడు. స్థూల దేహమును వీడి, సూక్ష్మ దేహము తో మహదానందముగా – స్వేచ్ఛగా, సుఖంగా – తిరుగును.

2). త్వరలోనే దివ్య తేజః ప్రభ ప్రసాదింపఁబడి ప్రకాశించును.

3). తదుపరి బ్రహ్మైక్యాను సంధానముఁజెందును. బ్రహ్మ వేత్తలకు, "పునర్జన్మ ' – కారణ జన్మ (On some Divine Mission) లోక సంగ్రహార్థం – లోకోద్ధరణ – ఆత్మ తత్వ ప్రచారము కొరకై (On Divine Deputation) అవతరించ వచ్చును.

జీవన్ముక్తులు, దివ్య తత్వ ప్రచారార్థమై వసిష్టాదులు, పరిహితార్థం జన్మించక తప్పదు. అది ఈశ్వరాదేశము. అవతారమే కావచ్చు.

ఈశ్వరుని – ఆజ్ఞ + శక్తి + అధికారము + ప్రభావము - - - మొ|| సమస్త నిగ్రహానుగ్రహ శక్తులు – అద్భుత లీలా విలాస ప్రదర్శనలు – ప్రదర్శించు సామర్థ్యములతో ప్రభవింతురు. అట్టి మహాత్ముల దర్శనాను గ్రహ భాగ్య మబ్బు వారు ధన్యులు – చరితాత్ములు.

<u>సత్య విద్య (26)</u> : -

(Q). అయాచిత – స్వప్రకాశ – స్వతః సిద్ధ – "ఆత్మ – పరమాత్మ"ల నిర్విరామ – నిరాటంక – సాలోక్య – సారూప్య – సామీప్య – సాయుజ్య – (బ్రహ్మైక్యం) – పంచవిధ ముక్తులు – విదేహ కైవల్యం లెక జీవన్ముక్తి (ఐక్యము) విశ్వాత్మ స్థితి - - - ఎద్ది?

(A) సర్వాత్మ – విశ్వాత్మ - - - - ఆకలి దప్పులు – దుఃఖ అజ్ఞాన – మరణ, నాశనాదుల కతీత మై - - - సర్వ వ్యాపకమై – సర్వాతీతమై జీవుల జీవమై – ప్రాణులలో ప్రాణమై – సర్వాధారమైన - - "అదే నీవు – నీవే అది"

<u>దహర విద్య</u> (16) : - (దహరము = సూక్ష్మాకాశము) – బ్రహ్మ స్థానమే దహరాకాశము, బ్రహ్మోభ్యాసకుడు, తన ధ్యాన లక్ష్య స్థానముగ నెంచుకొని ఎచ్చోట "మనో" ఏకాగ్ర స్థిరతను కేంద్రీకరించు "చిట్టి కాళీ స్థలము" అదే "హృదయ కుహరము" – "దహర కుహరము".

సర్వ స్వతంత్ర, సర్వజ్ఞ, సర్వసామర్థ్య సాధనాధికార, సర్వ ప్రాణ కేంద్ర గత – కీలకాధిష్ఠాన, విశ్వేశ, విశ్వనాథుడే "హృద్గు హాంతర్గతుండు". - - -

దహర విద్య ద్వారా బ్రహ్మైక్య మందిన, ముక్తునకు, సర్వ స్వేచ్ఛ, విహారాది దివ్య శక్తులు లభించును - - - దీనిని కూడా "ఉద్గీత" విద్య అంటారు. దీని ఫలం "ఓం" ప్రణవం. ప్రణవ ధ్యానికి (Meditation on OM) - - - ఉద్గీతాది ఏకర్మయు విధిగా నియమింపఁబడలేదు. ఎందుకు? ప్రణవో పాసన (ధ్యానము) సంపూర్ణమైనది – సర్వోత్కృష్టమైనది.

భక్తి, జ్ఞాన, కర్మ, వైరాగ్యాది పథములు గూడా, ప్రణవ ధ్యానమున కను సంధించిన ఫలము ద్విగుణీకృతమగును.




"అధికస్య అధికంఫలం" – కష్టే ఫలే

సోమయాగం ----

భూమి పాత్ర (Earth is a cup)

సముద్రములే సోమరసం (Seas as Somarasam).

ఇదే మానసిక యజ్ఞం.

"యద్భావో తద్భవతి" – ధ్యాన విదానము ననుసరించే ఫలితానుభవం పూర్తిగా రూపొందును.

సంపూర్ణ – సహజ – అవిచ్ఛిన్న – స్వేచ్ఛాత్మ – స్వరూపమే "బ్రహ్మము" – ధ్యాన లక్ష్య –భావ" స్వరూపము. "విశ్వాత్మ" – సర్వాంతర్యామి యే "ప్రణవ" మని – పూర్ణ జ్ఞానము (ప్రజ్ఞ) తో ఉపాసించ వలెను. (ధ్యానించ వలెను).

ప్రాణము (ఉచ్ఛ్వాస, నిశ్వాసముల) తో ప్రణవము (ధ్యాన) మును సంధించి – (తైల ధార వలె) – మనస్సు నందు లయింపఁజేయుటే - లయ (రాజ) యోగము. ఇంతకు మించిన యోగ రాజము లేదు. (This is the highest & greatest & only path to అమనస్క రాజ యోగ సిద్ధి).

"అథయా ఏతా హృదయస్య నాడ్య స్తాః
పింగళణ్యాని మ్మస్తింష్ఠింతి – శుక్లస్య

నీలస్య పీతస్య లోహిత స్యేత్యా సౌవా
ఆదిత్యః పింగళ ఏష శుక్ల ఏష నీల
ఏష పీత ఏష లోహితః" || -- శృతి.

తా|| "హృదయ సంబంధ నాడులందు, సూక్ష్మ పింగళ వర్ణముండు. శుక్ల నీల లోహితపీత సూక్ష్ములును హృదయ నాడు లందు వర్తించుచుండును. సూర్యుడు ను అట్లే చెలువొందు – శుక్ల నీల పీత లోహిత పింగళ వాతమైన | వర్ణ సముదాయ సూక్ష్మ సంపద ఘుటిల్ల | గొప్ప సంపదైన మహా పథము| సూర్య కిరణములు నైహికాముష్మికముల వ్యాప్తిఁ జెంది హృదయ నాడులందు వర్తించు చుండు" ||

వేదమనగా జ్ఞానము. దైవావేశముతో ఆర్యులు పాడుకొన్న గీతములు. ప్రవచించినసూక్తులు (సూత్ర రూపమున).

వేదములు 4. వేదములకు పూర్వమే గ్రంధమును ఉన్నట్లు కాన్పింపదు. ప్రాచీన సంస్కృతమే గీర్వాణము (దేవ భాష). పాణి న్యాదులు దీనిని సంస్కరించిరి. కావున అదే సంస్కృతమైనది. నేటి సంస్కృత పండితులకు దేవ భాష బాగ అర్థం గాదు. కావున, పూర్వ వ్యాఖ్యలు – ముఖ్యంగా యాస్క కవీంద్రుల నిరుక్తాది వేద పద నిఘంటువు మొ|| సాయమున –ఆచార్యులు -------------.

వేద మనగా జ్ఞానము. పాద బద్ధములై, నియతాక్షరములు గల మంత్రములకు "ఋక్కు" లని పేరు. అతార్కిక, బాల్య మానస ప్రసన్నతా ప్రదర్శనమే వేదము. వీటిని అపౌరుషేయములందురు. అనగా బ్రహ్మవల్ల ఋషులకు గోచరించినవి. కేవల మానవ నిర్మితములు కావు. తురీయావస్థయందు (జీవ బ్రహ్మైక్య స్థితి యందు, బ్రాహ్మీ స్థితి యందు) అయాచితముగా, ఋషి కులమునందున బుట్టి, దివ్యాను భూతినందిన తాత్విక వేత్తల అమూల్యానుభవాలు, దివ్యసూక్తుల రూపమున (బ్రహ్మ వాక్కులు). శ్రుతి-స్మృతులుగా ప్రభవించినవి.

అతీంద్రియ దృష్టి (దివ్య దృష్టి)- అవస్థాత్రయాతీత (మంత్ర దృష్టలగు మహర్షుల – అతీత స్థితి యందు - ఆత్మ (బ్రహ్మ) వాక్కులందు నిగమ విభూతుల నవలోకించి ప్రవచించిన అతీంద్రియ - దివ్యవాక్కులే వేదవాంఙ్మయస్వరూపము. బ్రహ్మవేత్తల బ్రాహ్మీస్థితినుండి ప్రవచింపబడినందున "అపౌరుషేయములు".

దివ్యావేశముచే ఆర్యులు పాడుకొన్న గీతములు. వీరికి పాప భీతి లేదు. పితృ దేవతల కర్పించు మాసికాబ్ధికాది కర్మలు వీరికి లేవు. సర్వాతీతులు.

వేదము = ఆది చేదువులు, ఆది శ్రుతి స్మృతులు = జ్ఞానము

శ్రుతులు = విన్నవి, స్మృతులు = జ్ఞప్తి యందుచు కొన్నవి.

చతుర్విధ మహా వాక్యములు.

భూః : "అ" 1) ఋగ్వేదము – ప్రజ్ఞానం బ్రహ్మ- సాక్షాత్కార మహా వాక్యము = అ

భువః : "ఉ" 2) యజుర్వేదము – అహం బ్రహ్మాస్మి - అనుభవ మహా వాక్యము = ఉ

స్వః : "మ్" 3) సామవేదము - తత్వమసి - ఉపదేశ మహా వాక్యము = మ్

= ఓం : త్రైవిద్య 4) అధర్వణ వేదము - అయమాత్మాబ్రహ్మ - సమాప్తి మహా వాక్యము

= గాయత్రి = 3 వేదముల మూల మంత్రము.

మహర్షులు పాడినవి వేదములు. సాధించినవి సిద్ధులు. మోక్షము గమ్యము. ఇదే మన ఆధ్యాత్మిక సంపద - స్వారాజ్యపదవి. వేదమతము అనాదిః (ఆనాడు ఛందోబద్ధమైన కవిత లేదు. సూత్రప్రాయంగా ప్రభవించిన (ఋక్కులు). జ్ఞానగుళికలు. తపోధనుల దివ్య మధురానుభూతులు. ఉపనిషత్తులై వెలసినవి. ఇవియే వేద శిరో భాగములు లేక వేదాంత్యభాగములు.

వేదములు ప్రాచీన గీర్వాణ భాషలో నున్నవి. భాష్యములు సంస్కృతమున వ్రాసినారుః ప్రాచ్యప్రాతీచ్యనవీన పండితులలో ముఖ్యులు - భాష్యకర్తలుః- ఉగ్వటుడు, మహీధరుఁడు, విద్యారణ్యులు, స్వామి దయానంద, తిలక్, మ్యాక్సుముల్లరు మొదలైనవారు. అందులో ఆర్య (వేద) మత స్థాపనాచార్యులు దయానందులు ముఖ్యులు. వారే సత్యార్థ ప్రకాశిక (I & II సంపుటములుగా, ఆంధ్రమునఁగూడ గలదు) ఉత్తరార్ధము + పూర్వార్ధము = 2 భాగములుగా వ్రాసిరి.

భాష్యకారులకు, యాస్కమునీంద్రులు రచించిన "నిరుక్తము"- వేద సాంకేతిక పదనిఘంటువు. అత్యంతోపకారి. వ్యాఖ్యలు (భాష్యములు) భిన్న భిన్నముగ వ్రాసిరి. (నిరుక్తము 13, మరియు 5 అధ్యాయములలో గలదు ------- లభించునది 8 భాగములు గలది)

ఆనాటి దేశకాల పరిస్థితులు - ఆచార వ్యవహారములు – విజ్ఞానాభివృద్ధి క్రమ విధానము – జీవిత విధానము - అందలి కథల మూలార్థములు, సాధన సంపత్తి - మొదలు, దివ్యానుభూతులు, సృష్టి శాస్త్రము, నీతి శాస్త్రము, మరణానంతర జీవచరిత్ర

- మంత్రప్రభావాది- ఆత్మజ్ఞానసముపార్జన క్రమవిధాన వివరములు......... సర్వం సంస్పృష్టం.

అరవిందుడు వేదముల అంతరార్థమును క్షుణ్ణముగా విమర్శించి, విశదీకరించెను. ఇంద్రియ ప్రవృత్తుల ప్రతిబింబరూపమైన - అధిష్టాన దేవతలనుగూర్చియే, వేదమంత్రములుద్ఘాటించునని అతని భావము (సాంఖ్యవివరములు)

దేహ దేవాలయంనందు ప్రతి అవయవమునకు ఒక అధిష్టాన దేవత నియమితమై- అందు ఆదిదేవుడు "కపాల ద్వారమున" (ఊర్ధ్వముఖ ద్వారం) దేహమున ప్రవేశించెను... సహస్ర కమల సింహాసన స్థితుఁడు పరమాత్మ. మాయాదేవి (శక్తి) తో- జగన్నాటక రంగస్థలిని పరివేష్టించి క్రీడా వినోదముల సాగించే- సంకల్పించిన ఫలంగా

దేవుడు-జీవుడే - త్రివిధపతన సోపానములు.

1. దేహ ప్రవేశము
2. దేహమే తాననుకొనుట- (తాదాత్మ్య భ్రాంతి)
3. ఇంద్రియములద్వారా – బాహ్యప్రపంచ విషయముల వేట - లంపటత్వం(తగులు)

అతీంద్రియ దృష్టి (దివ్య దృష్టి) గల మంత్ర ద్రష్టలగు మహర్షుల - బ్రాహ్మీస్థితి (తురీయ) యందలి ఆత్మవాక్కులందు నిగమవిభూతుల నవలోకించి ప్రవచించిన అతీత - అతీంద్రియ బ్రహ్మవాక్కులే "వేదవాఙ్మయము" - అపౌరుషేయములు.

సర్వపాపహర – సర్వమంత్రోపనిషన్మూల భూతమగు వేదమాత – “శబ్ధ బ్రహ్మము”: వేదము అనగా ఆది చేదువులు - ఆదిశ్రుతులు - జ్ఞానము:

వేదము చదువుకొన్నవారు వేదులువారు.

2 వేదములు - ద్వివేదులు
3 వేదములు - త్రివేదులు
4 వేదములు - చతుర్వేదులు

} ఆధ్యాత్మిక సంపన్నులు

త్రైవిద్య = ఋుక్ + యజుస్ + సామ : 3 వేదముల జ్ఞానము.

అధర్వణం - లౌకిక, ప్రాపంచిక - వేదము.

మంత్ర, తంత్ర, యంత్ర, ఔషధాది క్రియలతో వెలసి, మానవుడు

అభిలషించు సర్వవిధ సుఖ సౌఖ్యములకు వలసినంత దోహదమిచ్చి - "ఇహ" పరమున గూడ తృప్తి చేయగలది.

మహర్షులు పాడినవి వేదములు.

వారి సాధన మార్గములే యోగములు.

సాధించినవి సిద్ధులు - తద్వారా స్వారాజ్య పదవియే గమ్యము, అనగా మోక్షము.

నిష్కామ - ఉదార - సర్వార్పణ బుద్ధితో - లోక సంగ్రహార్థము ప్రసాదింపబడినవి వేదములు. వేదమతము అనాది - సనాతనముః యుగయుగాలుగా, మహర్షులు, మునులు, యోగులు, ద్రష్టలు... తపించి - శ్రమించి - ఆర్జించిన దివ్య జ్ఞాన, విజ్ఞాన, ప్రజ్ఞాన సంబంధమైన మధురాను భూతులు - బండారము, సత్యప్రవచనములే వేదములు.

ఆనాడు ఛందోబద్ధమైన కవిత లేదు. సూత్రప్రాయంగా ప్రభవించిన జ్ఞాన గుళికలే ఋక్కులు. హైందవ మతమునకొక ప్రవక్త, ఒక మత గ్రంథము లేదు. అనాదిగా, అసంఖ్యాకులగు మహర్షుల అలౌకిక, ఆధ్యాత్మికానుభూతిపై స్థిరముగ నెలకొన్న దీ సనాతన వేదమతము. అది అనాది. ఈజ్ఞానము పరిమితిగల మానవబుద్ధికి గోచరించునది కాదు. సమాధి నిష్ఠయందు అనుభూతమైన ఆధ్యాత్మక తత్వమును ప్రసాదించు పరమాత్మ జ్ఞానమై యున్నది. అనగా అపౌరుషేయము. ఈ వేద ధర్మమే వైదిక ధర్మ(మనబడును.

వేద జనన రహస్యము

నిర్గుణ పర బ్రహ్మ ( అఖండచిద్విలాసము)

↓

(సంకల్ప)-(శబ్ద) బ్రహ్మ---ఒక నాదముదయించెను (వృత్తి నిరోదంబున) – ప్రకృతి జననము

↓

నాదము ( ఓం )

( అ ఉ మ్)

సత్వ రజస్ తమో

గుణాత్మకము

↓

సర్వ (శబ్ద) అక్షర జాలము

↓

నాల్గు వేదములు- (ఒకే రాశి- గంప) -

శ్రీ వ్యాస భగవానుడు - వేద (భాగ) భాండారమును - వ్యాసములుగ విభజించి సంపుటీకరణమొనర్చెను. నల్వురు శిష్య ముఖ్యులు - వారి వారి సాంప్రదాయ వర్తులగు శిష్యోపశిష్యవర్గములు పేరోలగమున గురుదేవుల యాధ్వర్యవమున - తీరి కూర్చిండి – వేద విభజన కార్యక్రమమునందు సాయపడిరి. వేదపునరుజ్జీవన కర్త మహానుభావుడు వ్యాసముని చంద్రుడే.




సద్వస్తువు

నిర్గుణ పర బ్రహ్మ

ఊపిరి లేని నిట్టూర్పు ↓ వృత్తి జననం

ఆది సంకల్పము ↓

(Logas-Greek) ఒక నాదముదయించెను.

"ఓం" = వేదత్రయీ మాత

<u>మహా వాక్యములు</u> :-

ఋగ్ - (ఐతరేయం) - "ప్రజ్ఞానం బ్రహ్మ" – హౌత్రము చేయబడును

యజుస్ - ( బృహదారణ్యం) - "అహం బ్రహ్మోస్మి" – ఆధ్వరము చేయబడును

సామ - ( చాందోగ్య) - "తత్వమసి" – ఔద్గాత్రము చేయబడును.

అధర్వణం - ( ప్రశ్న, ముండక) - "అయమాత్మాబ్రహ్మ"

మోక్షాపేక్షకులకు మోక్షసాధనము బ్రహ్మాత్మైక్య జ్ఞానము - నాల్గు వేదముల సారము, నాల్గు వాక్యములందర్థ నిరూపణము వల్ల స్పష్టము.

వర్షమును కోరువాడు - "కారీరి" అనెడు పేరుగల ఇష్టిని చేయవలెను.

ఆయుష్యాభివృద్ధిని కోరువాడు "శత కృష్ణల" అనెడు పేరుగల ఇష్టిని చేయవలెను

1) మంత్రములు (సంహితలు) కవుల సృష్టి.

2) బ్రాహ్మణములు - పౌరోహితుల రచనలు.

3) ఆరణ్యకములు } తత్వ వేత్తల ధ్యాన ఫలం.బ్రహ్మ వాక్కులు-

4) ఉపనిషత్తులు } వైదిక ఉపనిషన్మతము,-1,2, ను గర్భించును,

అతీంద్రియ దివ్యావేశ జనిత ప్రవచన సంపుటము.

వేదములుః ఆదిచేదువులు, శ్రుతులు = జ్ఞానము

"త్రై విద్య" -ఋక్ +యజుస్ +సామ వేదములు - ఆధ్యాత్మికం.

అధర్వణం - లౌకిక, ప్రాపంచిక, - మంత్ర, తంత్ర, యంత్ర, ఔషధాది క్రియలు గలది - (లోక or భౌతిక సుఖములకు).

ప్రతి వేదము 4 భాగములుగా నున్నవి -

బ్రహ్మచర్య 1. సంహితలు (మంత్రములు, మంత్రసంపుటములు) గురుకులమున - బ్రహ్మచారులు గురుముఖంగా-(మంత్రములు)- ఋక్కులు సూచించిన కర్మను భోధించు వాక్కులు సంపుటమునకు - మంత్రభాగములు - "సంహిత"లనిపేరుః సంహిత = సంధిచేబడినవి. సం+ధా+త = సంహిత = కూర్పు అనబడును. ముఖ్యంగా ఇందు " ఆరాధింపఁదగు దేవతలు - ఆరాధన సామగ్రిని విశదపరచును. - మంత్రభాగములు 3 వేదములందును (1st 1/4th) గలవు - ఋగ్వేదమంత్రములు గాయత్రి మంత్ర సదృశములు. "అగ్నిమీళే పురోహితం" అని ప్రారంభమగును. అవే "గాన" రూపం దాల్చి సామ భాగమగును. పైరెండు విధములుగా గానివి "యజుర్ మంత్రములు "అగ్ని ధగ్నీన్ విహారే" అని ప్రారంభించినవి - "నిగధ మంత్రములు" - ఇవి యుజుర్ మంత్రములు.

గార్హస్థ్య 2. బ్రాహ్మణములు ( వచనములు వేరు - మంత్రములువేరు)

a) బ్రహ్మనుండి - మంత్రములు (శిరోభాగ వేదములు) -(ఉపనిషత్తులు సంహితములు)- ఋక్కులు - అపౌరుషేయములు. కర్మను భోధించు వచన గ్రంధములు. (సం+ధా+త=సంహిత) = సంధించ బడినవి - కూర్చబడినవి (compilation).

b) ఋషులనుండి - బ్రాహ్మణములు (కర్మల విధి విధానములదెల్పును). పౌరుషేయములు - గృహస్థులకు వలసినవి:- వ్రతములు - క్రతువులు - వాటి నిర్వహణ క్రమ విధానము. దాన ధర్మములు - సమస్త పుణ్య కర్మలు, యాగాదుల విధి నిషేదములు – కర్మకాండలన్నీ గలవు - గృహస్థకర్మలనుద్ఘాటించి - కర్మకాండల ప్రోత్సహించును.

<u>వానప్రస్థ</u> 3. <u>ఆరణ్యకములు</u> - ఉపనిషత్తులకు - బ్రాహ్మణములకు మధ్యభాగము - అరణ్యవాసులైన గృహస్థ తపోనిరతుల కుపయోగపడును. కర్మలస్థానమున ధ్యానాది రహస్య పరమార్థమును, వానప్రస్థుల కందిచి ఉపనిషన్ముఖోన్ముఖులుగఁజేయును:

<u>సన్యాస</u> 4. <u>ఉపనిషత్తులు</u> - వేద శిరోభాగము – కడపట సన్యాసమునకు - అపరోక్షానుభూతిని ప్రసాదించ గల - తుది ఘట్టము - బ్రహ్మ తత్వ జ్ఞాన నిధులు - తత్వ నిర్ణయ చర్చాత్మకములు.

అధర్వణము - జప, హోమాదులు - మంత్ర, తంత్ర, యంత్రాదుల రహస్యములు - వ్యవసాయము - గోసంరక్షణ - యుద్ధ తంత్రములు - మొదలగు సమస్త ప్రపంచకోర్కెలు సాధింపగల మార్గములు - లౌకిక జీవన సుఖ భోగ, సౌకర్యముల ప్రసాదించు వేదమిది. ముందు మూడును అలౌకికములు. "త్రైవిద్యాం" - అన్నారు.

<u>సంహితలు</u> :- బ్రహ్మ చర్య భాగం (మంత్రములు - కవుల సృష్టి).

<u>బ్రాహ్మణములు</u> :- పౌరోహితుల రచనలు.

<u>ఆరణ్యకములు</u> :- (వాన ప్రస్థుడు - సన్యాసి కాబోవు వాడు).

<u>ఉపనిషత్తులు</u> :- తత్వవేత్తల ధ్యానఫలము: బ్రహ్మ (చతుర్ముఖ) ముఖతః ప్రసాదించబడినవి - అధ్యాత్మకం.

వేదములు యోగ మత ప్రతి పాదకములు. ఈరహస్యము అనధికారులకు తెలియకుండా గురూపదేశ రహస్య పేటికయందు గోప్యపరిచినారు. *ఎందుకీ రహస్యము?

*ఆత్మ=బ్రహ్మ( దైవ ) జ్ఞానము పరమపావన రహస్యము. సామాన్యుడు బ్రహ్మ జ్ఞానానర్హుడు. అందలి పవిత్రత నశించి, లోకకంటకులగు చపలుర హస్తగతమై స్వార్థ పరత్వ దుర్వినియోగమై, లోకవిధ్వంసక (రాక్షస) చర్యల కనుకూలపడి, విషాద, విపరీత పరిణామములు రూపొందించేక తప్పదు. చరిత్రలో పురాణాదులు సాక్ష్యము. కావున

వేదార్థ నిర్ణయ విధానమెంతయో ఔచిత్య గర్భితమై యున్నయది. దివ్య శక్తులు - అష్ట సిద్ధులు- తపో మహిమాది మహత్తర (గురుతర) మహాయోగ ప్రభావ జనిత అద్భుత శక్తులు దుర్వినియోగమై - హింసాపథమున వక్ర గతమైన యెంత ప్రమాదము? దుర్భర దురవగాహ, దుర్వినియోగ పర్యవసానము సంప్రాప్తమౌనో గమనార్హము!!. గురు రహస్యమనబడుటకిదియే కీలక కారణముః (Copy right, Trade secret వలె) సర్వ స్వామ్యమే కావచ్చును. బహుశ! వేమన అభిరాముని మభ్య పెట్టి, గురువు అవసానకాలమున గురు ముఖతః సంగ్రహించిన గురు రహస్యమిట ఊహ్యము.

అపరిపక్వ సాధకులు తమ సర్వసంకల్పములు యీడేరి, ఫలింపకున్న చింతింపఁబనిలేదు. ఉదాః ఒక బాటసారి కల్పవృక్షముక్రింద కూర్చొని తన కోర్కలు వరుసగారూపొందగా, భ్రమసి, బయపడి- అడవిలో ఒక పులి తమ్ము భక్షించునేమోనని భయ సంకల్ప భరితుడై - సంకల్పిత పులి కాహుతి యయ్యెనన్నట్లుః

తపస్వి - యోగి -ఋషి- తుదకు మోక్షమును కూడ లక్ష్యపెట్టని త్యాగ ధనుడు.

ఋగ్వేదము - ఇది ఆది, మూల వేదము.- ఇందలి మంత్రములే పదే పదే ఇతర వేదములందుఁగూడగాన్పించును. చాల పెద్దది.

రెండు భాగములు 1) 1752 ఋక్కులు 2)

ఇది 8 అష్టకములగాను, ఒక అష్టకమునకు 8 అధ్యాయములుగాను (వర్గములుగాను), మరియు దశమండలములుగాను విభజింపబడినది. ప్రతి మండలమునకు 191 మంత్రములు గలవు.

వేదముల గుప్తార్థముల శ్రీ అరవిందుడు బాగుగా విమర్శించి - స్వతంత్రముగ -నిర్భయముగ తన స్వేఛ్ఛాను వాదమును ప్రవచించెను. ఇంద్రియ ప్రవృత్తుల ప్రతిబింబరూపములైన - దేవతలనుగూర్చియే, వేదములందలి మంత్రములు చెప్పుచున్నవి. (వేదములు యోగ మత ప్రతి పాదకములుగదా).

ఉదాః సూర్యుడు - బుద్ధికి

అగ్ని - సంకల్పము

సోముడు - భావము

1. మనస్సు - సంకల్పవికల్పములు - చంద్రుడు
2. బుద్ధి - నిశ్చయాత్మకము - చతుర్ముఖుడు
3. చిత్తము - చంచలమై-ధారణముచేయు - క్షేత్రజ్ఞుడు

4. అహంకారము - నేననెడి అభిమానం - రుద్రుడు
యీలాగె 10 ఇంద్రియములు + 5 పంచాగ్నులు + 5 ప్రాణములు + 4 అంతఃకరణ
20 + 4 = 24 తత్వములు
(సాంఖ్యయోగ రహస్య వివరణములు, చతుర్వింశతి తత్వము చూడదగును)
వేదములు "కవి - పండిత" - గ్రంధములుగావు. నిస్వార్ధ - నిరుపమాన - నిర్మల - పరమోత్కృష్ట సత్యప్రవచన సముదాయ సంపుటీకరణములు. - సర్వకాల - సర్వజన - సర్వలోక సమ్మతములు. సర్వమంగళ ప్రదములు.
వైశంపాయనుడు - యజుర్వేద శాఖాధ్వర్యుడు. యాజ్ఞవల్క్యుని గుర్వపరాధకారణమున, కుపితుడై తాను నేర్చిన వేద జ్ఞానము నిచ్చివేయమన్న "రక్తము తోడ క్రక్కెను" తద్రుధిర రక్తరూప వేదజ్ఞానమును యజుర్గణాధిష్టిత శాఖాధి దేవతలు "తిత్తిరి పక్షు" లై భుజించినందున, యీ శాఖ " తైత్తరీయంబయ్యెను"
యజ్ఞమనగా పూజ, ఆరాధన, త్యాగము. విష్ణువని కూడ అర్ధము.
యజనము వల్లనే యజుర్వేదమయ్యెను.
యజ = దేవతలనారాధించుట.
యాగము = కర్మ
మానసిక వ్యాపారము = జపము
వాగ్వ్యాపారము = స్తుతి, స్తోత్రము
శ్రుతుల నాశ్రయించువారు శ్రౌతులు.
స్మృతుల నాశ్రయించువారు స్మార్తులు.
పండాలు = పండినవారు = పండితులు ( జ్ఞాన )
శాస్త్రజ్ఞానులు = శాస్త్రులు ( శాస్త్రీయ జీవనం చేయు వారు)
నియోగులు = నియమింపబడినవారు - మత (వేదములు) ప్రచారకులు. (Hindu Religious missionaries . Priests)
ఆచార్యులు = ఆచరించి భోధించువారు, ఆచారవంతులు. ( Religious Elders)
పురోహితులు = పౌరహితైషులు -పౌరులకు హిత వర్గము కోరువారు.
శ్రేష్ఠులు = శ్రేష్ఠజనులు - ప్రజాదర్శక పుర ప్రముఖులు.
వేదులు = వేదములను చేదువుకొన్నవారు.
ఆలాగే, ద్వివేదులు, త్రివేదులు, చతుర్వేదులు.

హోత = ఋగ్వేదమంత్రములతో‹గర్మ నడపించువాడు = ఋత్విక్కు.
ఉద్గాత = సామ గానము చేయు‹ వాడు.
ఋత్విక్కు = ఋత్విజుడు - యజ్ఞము చేయించువాడు-అందుకు ప్రతిఫలంగా
డబ్బు వగైరాలు పుచ్చుకొనును.
ఇజ్య = యజ్ఞ కర్మ విశేషము.
- ఋగ్వేదము - హోత ప్రయోగార్థమై ఉపకరించునది. యజ్ఞములందు
- యజుర్వేదము – అధ్వర్యుని ఉపయోగార్థమై (యజుర్వేద మంత్రముల
నడపించువాడు-ఋత్విక్)
సామ వేదము - ఉద్గాత అనగా వేద గాయకుడు.
"బ్రహ్మ & యజమాన" ప్రయోగాదులీ "త్రైవిద్యాం" మూడువేదాల్లో గలవు. - కాని అధర్వణంలో యజ్ఞయాగాది క్రియలు చెప్ప బడలేదు – పరతత్వ వేద త్రయము.
శాంతి, పౌష్టిక, అభిచారక మొదలు " మూడు వేదములందు రూపొందనివి గలవు. కర్మప్రాధాన్యమై "లౌకిక -భౌతిక" సుఖ సౌఖ్యముల ప్రసాదించినది. "ఇహ" వేదము
హోతః = ఋత్విజుడు = యజ్ఞకర్తచేత ధనము పుచ్చుకొని యజ్ఞము చేయించువాడు
( =ఋత్విక్కు)
హోత = ఋగ్వేద తంత్రమును నడుపు ఋత్విక్కు.
ఆధ్వర్యుడు = యజుర్వేద తంత్రముల నడపువాడు.
ఉద్గాత = సామవేద గాయకుడు.
ఐజ్య = యజ్ఞ కర్మ విశేషము.
మేదస్సు = (క్రొవ్వు -మెదడు)
మేధ = ధారణా శక్తి. మరుపులేని బుద్ధి.
మేధము = యజ్ఞము
విద్మహే = ఉపాసించు చున్నాము.
ధీమహి = ధ్యానించెదము
ప్రచోదయాత్ = ప్రేరణ చేయును గాక
సోమ రసము - వేద వాఙ్మయమున - విస్తారము గాను "ముఖ్యహవిస్సుగా" విపరీతంగాను - యజ్ఞయాగాదులందు - "సోమపానేయ సేవనం" అనూచాన

ఆచారంగా విలసిల్లింది.

దాని ప్రభావం - గొప్పతనం మహాద్భుతంగా వర్ణింపఁబడినది.

దేవతలకత్యంత ప్రియ వస్తువుగా వాడినారు. పతిఘుట్టమునను -"అమోఘము - అప్రమేయమని" శ్లాఘించినారు.

నేటి సంఘ మర్యాద "కాఫీ - టీ" లకున్న ప్రతి పత్తి. వేదకాలమున యజ్ఞయాగాది క్రియ లందు సోమరసమున కుండి యుండ వచ్చు. ఏదైన ఉత్తేజకర (మత్తు) పదార్థమందిమిడి యుండనోపు. సోమము = పరాక్రమము, తిప్పతీగ, జలము, కర్పూరము అను అర్థములు కలవుః "వీర రస పానము" సంపూర్ణ శ్రద్ధా సక్తులనొసంగి బృహత్కార్యోన్ముఖులంచేయ వచ్చును. కార్య దీక్షకుఁబూనువారు, వీర్యవంతులై ఉత్తేజితు లగుట భావ్యమే. ప్రాశ్చాత్య సంఘ మర్యాదగా ప్రతి సమావేశమునందును "బ్రాంది" రకాలు సేవించడం విశ్వ విదితంః భారత దేశమున "కాఫీ - టీ" లకీ స్థానము స్వామ్యము. నేటికి పల్లెటూళ్ళలో "తాంబూలము - యిటీవల చుట్ట , సిగరెట్లు" కూడ సమర్పింప బడుచుండుట సామాన్యము.

ఋుగ్ వేదము

ఋుగ్వేదము (ప్రజ్ఞానం బ్రహ్మ)

ఇది ఆది గ్రంధము.

దీనికి గౌతమాది పదునైదుగురు ఋషులు కర్తలు.

భక్తి రస ప్రధానమైన కవిత్వము.

10600 ఋక్కులు (మంత్రములు - సూక్తులు) గలవు.

ఇది (8) అష్టకములు గాను, ప్రతి ఒక అష్టకమునకు 8 అధ్యాయములు లేక వర్గములుగాను, ప్రతి వర్గము, దశ మండలములు గాను, విభజింపబడినవి. ప్రతి మండలమునకు 191 మంత్రములుండును. ప్రతి మండల షట్కమునకు ఒక దేవత అధిష్టానమున్నది. అగ్ని, ఇంద్ర, వరుణ, వాయ్వాదులు.

"ఋుక్కు" అనగా సూత్రప్రాయమైన ప్రవచనము. ఆనాడు ఛందోభద్ధమైన కవిత లేదు. శ్లోక రూపమైన కవిత వాల్మీకి ముఖతః (ఛందోభద్ధమైన ఆది ఆశుకవిత్యము) తొట్ట తొలుత వెలువడినది. అందుకే అతడు ఆదికవి యైనాడు. అతని రామాయణము ఆది కావ్యమైనది.

<u>సామవేదము</u> (తత్వమసి)

సా = భూమి

+ అమ = అగ్ని

సామ = వాయు రూపం

సామము = సాధుత్వమని అర్ధము.

సామవేదము - గాన వేదము - సంగీతమున కాలవాలము - ఇందుండియే సంగీత (గాంధర్వ) శాస్త్రము ప్రత్యేకముగా నుద్ధరింపబడినది. భక్తి ప్రధానము. ఇది ఋగ్వేదమునకే గానముః తపస్సు - సమాధులయనంతర మొదవు భావోద్రేకము (భగవంతుని దర్శనాత్మకమగు) న జనించిన పవిత్ర గాన సహిత ఆరాధనమే "సామవేదము". ప్రత్యేకతః భగవంతుఁడు సామగాన ప్రియుడు.

7 స్వరములు - 3 గ్రామములు -21 మూర్ఛనలు - 49 తానములుః- నాద బ్రహ్మోపాసనః త్యాగయ్య, సూరదాసు, మీరా మొదలగు భక్తాగ్రేసరులు తరించిన మార్గము.

అందు షడ్జ - ఋషభ - గాంధార - మధ్యమ -పంచమ - ధైవత - నిషాదములని - 7 స్వరములు.

సంగీతమంతయు సామవేదమునఁ బుట్టినది. దానినే గాంధర్వ (ఉప) వేదమని అందురు.

స్వరములు రెండు విధములు. 1. ప్రచయము 2. నిగాతము.

గానములు 10 విధములు.

గాత్ర - వీణలతో సామగాన మొనర్తురు. నాదానందమునకు తోడు - దివ్యావేశము + అర్థానుభవము మేళవించి గాన మొనర్చిన, దివ్యరసానుభూతి - శబ్ద బ్రహ్మోపాసన → తన్మయత్వము → హృద్యం – అతీత, తపశ్చర్యలతో అవాఙ్మానస గోచరుండైన పరాత్పరుని ఐక్యానుసంధానమును పొంది యోగ సమాధి ప్రాప్తి.

Part I - మంత్రముల సంఖ్య : 1234ః

ప్రార్థింపఁబడిన దేవతలు : 11 గురు

చూచిన ఋషులు : 175 మంది

ఇందుపయోగించిన ఛంధస్సులు : 11

మంత్రములు - 310-1155 - తండ్రి తనయుల యేకత్వము (ఐక్యము) ను -

"మనోమారుత" లయము - (Prodigal son - Bible) - మరియు "రమణ" సిద్ధాంతము.

31 మంత్రము - సూర్యోదయ వర్ణన - (షేక్స్పియర్ ప్రాతః కాల వర్ణనము)

638 మంత్రము - విద్యుచ్ఛక్తి ప్రస్తావనము : 7 గుఱ్ఱములు (సూర్యుని) రథానికి టకీమని తగుల్కొనుట "సప్తాశ్వ రథమారూఢం" (సప్త వర్ణములు - Vibgyor)

276 మంత్రం - "బణ్యాహాగ్ం అసి సూర్య బడాదిత్య మహాగ్ం అసి|

మహస్తే సతో మహిమా పి నిష్టమ దేవ మహాంగ్ అసి"

ఈ మంత్రం సూర్యుఁణ్ణి చూచి జపిస్తే అనృత పాపశమనం. - ( శౌనక)

అనృత పాపహర విధానం. - ప్రాయశ్చిత్తం.- జమదగ్ని ఋషి - బృహ - ఇంద్రుడు.

457 మత్రం - పగలు నక్షత్రములు కాన్పించును.

254 మత్రం - స్వర్గ సుఖములు (ఇంద్ర భోగములు) అన్నియును అసురులను జయించి తెచ్చినవి. ( ఆర్యులు దాక్షిణాత్యులగు ద్రవిడుల నుండి హరించినవి).

ద్రవిడులు శివ భక్తులు - ఆర్యులు - ఇంద్ర-అగ్ని-వరుణ మొదలగు దేవతలను - తర్వాత వైష్ణవ సాంప్రదాయం ప్రబలినది.

<u>అష్టాదశ ప్రస్థానములు</u>

4 వేదములు - ఋగ్, యజుస్, సామ, అధర్వణ వేదములు

4 ఉప వేదములు - ఆయుర్వేద, ధనుర్, గాంధర్వ, అర్థ }- ఉపవేదములు

6 వేదాంగములు

1 పురాణము

1 న్యాయము

1 మీమాంస

1 ధర్మ శాస్త్రము

------------------

18 వైఖరీ వాణీ రూపమైన విద్యాభేదములు

-------------------

ప్రస్థాన త్రయము

1. ఉపనిషత్తులు

2, బ్రహ్మ సూత్రములు

3. గీత

------------

3

--------------

840 కర్మకాండ ప్రబోధములు

232 ఉపాసనాకాండ

108 జ్ఞాన కాండ

---------------

1180 ఉపనిషత్తులు

---------------

వేద శాఖలు

ఋగ్వేదము - 21

యజుర్ - 109 → శుక్ల -- 2 భాగములు / కృష్ణ -- 4 భాగములు } 6 భాగములు మొత్తం

సామ - 1000

అధర్వణ - 50

--------------

(ఉపనిషత్తులు|శాఖలు 1180 వేదాంత (ఉపనిషద్భాగములు)

-- ముక్తి కోపనిషత్ & మహా వాక్య రత్నావళి

ఉపనిషత్తు – బ్రహ్మము – బ్రహ్మ భోధక వేదాంత మహా వాక్యము – వేద శిరో భాగము – వేదాంత శాస్త్రము – గురు సామీప్య రహస్య భోధ, చర్చ –

మొత్తం ఉపనిషత్తులు (వేద శాఖల) సంఖ్య = 1180.

అందు – 1. కర్మ కాండ బోధకములు - 840

2. ధ్యేయ బ్రహ్మ బోధకములు మరియు ఉపాస కాండకు సంబంధించినవి. -- 232

3. జ్ఞేయ బ్రహ్మ బోధకములు -- 108.

ఇందు ముఖ్యముగా – సర్వసమ్మతమై – సర్వాంగీకారమైనవి దశో (ద్వాదశో) పనిషత్తులు. ఇవి వేదముల అంత్య (శిరో) భాగములగుట వలన, వేదాంత మనియు – జ్ఞాన కాండ సమమనియు పిలువఁబడును –

<u>ప్రస్థాన త్రయము</u> ; - 1. ఉపనిషత్తులు (10, 12, 108)

2. బ్రహ్మ సూత్రములు (550 – 4 అధ్యాయములు, 16 భాగములు)

3. భగవద్గీత (701 శ్లోకములు) + ఉత్తర గీత (192 ½ శ్లోకములు) + ఉద్ధవ గీత సహా.

గంగ (1). అనుభవ ప్రస్థానము.

యమున (2). ముక్తి (బ్రహ్మ ప్రస్థానము)

సరస్వతి (3). సాధన ప్రస్థానము.

న్యాయ ప్రస్థానములు : - (6) (గీత కాలంలో)

1. న్యాయ 2. వైశేషిక 3. సాంఖ్య 4. యోగ 5. పూర్వ మీమాంస 6. ఉత్తర మీమాంస. వేదములు – ఉపనిషత్తులు (వేద శిరో భాగములు). షడ్దర్శనములు – పురాణములు – శృతులు . . . . సారమే “గీత” – ( సర్వ శాస్త్ర సంగ్రహైః -- గీత )

<u>విద్య యొక్క అష్టాదశ ప్రస్థానములు : -</u>

4 వేదములు విద్యాంగమును ప్రస్థాన మందురు.

4 ఉపనిషత్తులు సకల ప్రస్థానము లందును , శ్రేష్ఠమైనవి “వేదములు”

6 వేదాంగములు వాటి యందలి సారము “ఉపనిషత్తులు” -

1 పురాణము

1 న్యాయము

1 మీమాంస

1 ధర్మ శాస్త్రము

----------------

18

4 వేదములందును 1180 శాఖలు గలవు – అందులో బ్రహ్మ పరమైనవి 108 –అందులో సర్వాంగీకార మైనవి 10 లేక 12 ఉపనిషత్తులు.

వేదములందలి 32 విద్యలు కూడా, ప్రణవ ప్రతి పాదితములే.

అధ్యక్ష స్థానమధిష్టించిన వ్యాస భగవానుడు వేద విభజన కర్త – అందుకే అతనిని వేద వ్యాసులందురు. వారి శిష్య ముఖ్యులు నలువురు –

పైలుడు - ఋగ్వేదం – 21 శాఖలు – ఐతరేయం, ప్రశ్నోపనిషత్తులు – (2)

వైశంపాయనుఁడు -- యజుర్వేదం – 109 శాఖలు – అందు – "శుక్ల – కృష్ణ" అని 2 భాగములు.

శుక్ల - ఈశావాశ్య, బృహదారణ్యక
కృష్ణ - కఠం, తైత్తరీయం. } (4)

జైమిని -- సామ వేదం – 1000 శాఖలు – కేన, చాందోగ్య (2)

సుమంతుడు - అధర్వణం – 50 శాఖలు – ముండకం, మాండూక్యం (2)

(ఇవే దశోపనిషత్తులు)

నాల్గు వేదములకు – 6 వేదాంగములు కలవు. అవి యెవ్వి యనిన – శిక్ష, కల్పము, వ్యాకరణము, నిరుక్తము, జ్యోతిషము, ఛందస్సు.

4 ఉప వెదములును, 4 వేదములకుపయోగ పడుటవల్ల, ఉపవేదములనఁబడును.

1. ఋగ్వేదము – ఆయుర్వేదము; కర్తలు అశ్వినీ దేవతలు – ధన్వంతరి, చరక, వాగ్భటులు. ఇందు వాత్స్యాయన కామ సూత్రములు కూడా కలవు.

2. యజుర్వేదము – ధనుర్వేదము.

3. సామ వేదము – గాంధర్వ వేదము, (భరత ఋషి ప్రణీతము)

4. అధర్వణ వేదము – అర్థ వేదము –

అర్థ వేదము 4 భాగములు.

కర్త బ్రహ్మ – ప్రజాపతి సహా

a. నీతి శాస్త్రము.
b. అశ్వ శాస్త్రము.
c. శిల్ప శాస్త్రము.
d. సూద శాస్త్రము.

పాణిని వ్యాకరణ సూత్రములు ; - సూత్ర రూపమైన వ్యాకరణము – అష్టా ధ్యాయములు 8 గా – పాణిని వ్రాసెను. వ్యాకరణము వల్ల వేద శబ్దముల శుద్ధత జ్ఞానము లభించును.

కాత్యాయనుఁడు, పతంజలి, ఆ సూత్రములకు వాఖ్యాన రూపమైన వార్తిక భాష్యములు చేసిరి.

దశోపనిషత్తులు --

ఈశ, కేన, కఠ, ప్రశ్న , ముండకం -- I Volume

మాండూక్య, తైత్తరీయ, ఐతరేయ -- II Volume

చాందోగ్యం -- III Volume

బృహదారణ్యకం -- IV Volume

1 2 3 4 5 6 7

శ్లో || ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండ, మాండూక్య, తైత్తరిః |

8 9 10

ఐతిరేయంచ, చాందోగ్యం, బృహాదారణ్యకం, తథా ||

ఇంకా ముఖ్యంగా చేర్చ దగినవి – 11. శ్వేతాశ్వతర, 12. కౌషీతకి, 13. జాబాల, 14. మహా నారాయణ, 15. మైత్రాయణీయ, 16. పైంగళీయాదులు.

వేదాంగములు (6) - శిక్ష – కల్పము – వ్యాకరణము – నిరుక్తము (వేద పద నిఘంటువు – యాస్క మునీంద్ర విరచిత – 8 భాగములు గలది) – ఛందస్సు – జ్యోతిషము.

వేదో పాంగములు (4) – పురాణ – న్యాయ – మీమాంస, ధర్మ శాస్త్రములు – (ఉప పురాణములు – పురాణములలో మిళితమైనవి) – వైశేషికం న్యాయ భాగములో చేరినది – వేదాంతం మీమాంసలో ఇక్య మైనది – మరియు – మహా భారత, రామాయణ, సాంఖ్య, పాతంజలి, పాశుపత వైష్ణవ గ్రంధాదులు ధర్మ శాస్త్రములలో జమ – అన్ని కలసి 14 విద్యలు.

వీటికి (4) ఉప వేదములు; - ఆయుర్వేద –ధనుర్వేద – గాంధర్వ – అర్ధశాస్త్రములు

పై వన్నియు కలిసి (18) ఆస్తిక శాస్త్రములు.

ఆస్తిక తకు భిన్న భావ పథములు గూడా గలవు – గమనార్హము.

సౌగతులు (4) తరగతులు.

1. శూన్య వాదులు
2. క్షణిక విజ్ఞాన మాత్ర వాదులు

3. జ్ఞాన కారమ మేయ క్షణిక బాహ్యార్థ వాదులు.
4. భౌతిక or ప్రకృతి వాదులు.

చార్వాకులది దేహాత్మ వాదం.

దిగంబరులు (జైనులు) – (ఆత్మ దేహ పరిమాణము గలదని) –

<u>దశోపనిషత్తులు</u> ; -

ఋగ్వేదము -- ఐతరేయం – కౌషీత (కథ, మాండుక్యం)

సామ వేదము -- కేన, చాందోగ్యం

యజుర్వేదము -- ఈశ, తైత్తరీయ, బృహదారణ్యాకం

అధర్వణము -- ప్రశ్న, ముండకం

1. ప్రాచీన గద్యాత్మకములు : – బృహదారణ్యాకం, చాందోగ్య, తైత్తరీయం, ఐతరేయం, కౌషీతకము.
2. పద్యాత్మకములు : - ఈశ, కఠ, ముండక, శ్వేతాశ్వతరములు.
3. అనంతర గద్యాత్మకములు ; - ప్రశ్న, మైత్రాయణి, మొ || తదితరములు ప్రామాణికోపనిషత్తులు.

ఉపనిషద్ద్రష్టలు : - మహిదాసుడు, ఐతరేయుడు, రైక్యుడు, శాండిల్యుడు, సత్యకామ జాబాలి, జైవలి, బాలాకి, అజాత శత్రు , వరుణ, యాజ్ఞ వల్క్యుడు, గార్గి, మైత్రేయ.

దశోపనిషత్తులు – ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండ, మాండూక్య, తైత్తిరిః, ఐతరేయంచ, చాందోగ్యం, బృహాదారణ్యాకం తథా|| - ఇకనూ చేర్చ దగినవి : - శ్వేతాశ్వతర, కౌషీతకీ, జాబాల, మహా నారాయణ, పైంగళ, మైత్రాయణి మొ ||

ఉపనిషత్తులు – 7 – 8 వ శతాబ్ధముల నాటివ నిన్ని, బుద్ధునికి పూర్వమున్నవనిన్ని, -

ఉపనిషత్ రెక్కలు - 2
- (1) ప్రజ్ఞానం బ్రహ్మ - జ్ఞాన పథం
- (2) వైరాగ్యం –సన్యాసం

} స్వేచ్ఛ - శాంతిని ప్రసాదించును

ఉపనిషత్ అనగా = సమీపమున కూర్చుండుట. = దగ్గరగా రహస్య బోధ వినుట – లేక – బ్రహ్మ బోధతో అజ్ఞాన తిమిరము తొలగుట – గాంధీజీ సన్యాసమనగా ప్రపంచమును వదలుట గాదు. తనను తానే “ఆత్మార్పణం” (Self surrender)

అనగా, అహంకార – మమకారములను వదలుట. ద్వందాతీత స్థితి - లోకాన్ని వదలితే, అహంకారం మిగులుతుంది.

"సుఖ దుఃఖ – మానావమాన" విముఖత్వం – ద్వంద్వాతీత స్థితి – ఈశావాశ్యం||

"శుక రహస్యోపనిషత్" – వేదాంత పంచ దశి - 5 వ ఆ.

చతుర్వేద మహా వాక్యముల వివరణములతో వెలసినది. ఉపనిషచ్ఛిరోమణి. ఉపనిషత్తులు – వేదోక్త కర్మలు – వర్ణాశ్రమాచార ధర్మముల నధిగమించి బలపరచవు కాని"బ్రహ్మ జ్ఞానాధికతను చాటును.

జ్ఞాన + అభ్యాస + వైరాగ్యో పేతుఁడు - కోర్కెలు నశించినవాడు, జీవన్ముక్తుడు – మోక్షమందిన వాడు. – కఠం

ఉపనిషత్తులు, సన్యాస పథ ప్రబోధకములు. అనుభవ జ్ఞానమునకు దారి చూపుటయే వాటి ప్రయోజకత్వం.

దివ్యానుభూతినందిన వారికి అవి అనవసరం. బుద్ధిమంతులు ఉపనిషత్తుల నాశ్రయించి బ్రహ్మత్వమందుదురు. వేదోక్త కర్మలు – వర్ణాశ్రమాచార ధర్మములను, అధిగమించి, బ్రహ్మ జ్ఞానాధిక్యమును చాటును.

1. కర్తలు మహర్షులు – కాలము అనాది – విచార విమర్శలు దుస్తరం – కొన్ని చోట్ల పరస్పర విరోధ ధోరణి ధ్వనిస్తుంది.

వేద శిరో భాగములు (ఉపనిషత్తులు) బ్రహ్మ ముఖతః వెడలినవి. మానవ (మనో) విరచితములు గావు – అపౌరుషేయములు, రసమయ – హృదయ స్పర్శ – మైమరుపు – భక్త్యావేశము – అనుభవ (అనుభూతి) అనంద దివ్య ప్రజ్ఞానానంద మధురానుభూతి పూరకములు.

2. బ్రహ్మ సూత్రములు :-

కర్త బాదరాయణుడు (వ్యాసులు) – మూల సూత్రముల కూర్పు (వేద విభజనానంతరం) కేవలం దశో (ద్వాదశ) పనిషత్తులనుండి, ఏరిన క్రోడీకరణమే. కేవలం ప్రత్యేక గ్రంథము కాదు.

4 భాగములు – ప్రతి భాగం – 4 భాగములు. వెరశి 16 అధ్యాయములు – 550 సూత్రములు.

a). బ్రహ్మ సమన్వయ భాగము.

b). ఆభాస ఉపాసనాధికం.

c). సాధన భాగం.

d). మోక్షస్వరూప భాగం.

ఆచార్య త్రయ భాష్యము లే గాక, నింబార్క, శ్రీధర, విద్యారణ్య, దయానందాది ఎందరో మహామహులు, వేదాంత సూత్రములను (ఆదర్శ స్వతంత్ర భావ జనితము లైన) గురు శిష్య సాంప్రదాయ జనితములు గావు.

3. గీత : -

గోపాల గీత (భగవద్గీత) – మరియు రాజసూయానంతరం, శ్రీ కృష్ణ భగవానుడు అర్జునునకుపదేశించిన, ఉత్తర గీత, మరియు ఉద్ధవ గీత – కడపటిది.

(1). ఇతిహాసత్రయం – రామాయణ, భారత, భాగవతములు.

(2). అష్టాదశ పురాణములు – ఆదర్శ మార్గ దర్శకములు.

క్రైస్తవుల మత గ్రంధము : బైబిల్ – ప్రవక్త – జీసను క్రైస్తు

ముస్లిమ్ల మత గ్రంధము – ఖురాన్ –ప్రవక్త – ముహమ్మద్.

భౌద్ధుల మతగ్రంధం – త్రిపిటకం, స్కంద పంచకం, ధర్మ పథ, సుత్తినిపాతం.

హిందువుల మత గ్రంధం – ప్రస్థాన త్రయం.

1. ఉపనిషత్తులు –అనుభవ ప్రస్థానం - గంగ

2. బ్రహ్మ సూత్రములు – ముక్తి లేక బ్రహ్మ ప్రస్థానం - యమున

3. గీత – సాధన ప్రస్థానం - సరస్వతి

(భగవద్గీత – ఉత్తర గీత – ఉద్ధవ గీత)

ప్రస్థాన మనగా ప్రయాణం

మహా ప్రస్థానమనగా (తిరుగు లేనిది) – మరణం –మృత్యువు.

## అధర్వణ వేదము

అధర్వణం - రెండు భాగములు 1. వైద్యము 2. తంత్రము

( కడపటి (4)వ వేదం) ఇందు 1/7 భాగం ఋగ్వేద మూలం.

ఇందు 731 మంత్రములు - 6000 సూత్రములు - 20 భాగములు.

ఋగ్వేదము వలె స్వతంత్రమైనది. ముఖ్యమైనది. ప్రత్యేక భావాన్వితమైనది. అనేక

"రూప - భావ" దేవతోపాసనలుగలది. భూత ప్రేత పిశాచాది విద్యలు - రోగ జరా మరణ విషయములు క్షామ, భూకంప ప్రమాద -రోగ వైద్య మాంత్రిక- బలిదాన - మూఢ విశ్వాస - క్రూర విధాన - అనార్య భావ సౌకర్యము - ఆరాధ్య (ఉపాన) దేవతలు. క్రోధ కిరాత మూర్తులు - క్షుద్రోపాసనాది -"మధు-మాంస" బలులుతోటి - మూర్ఖ -మౌఢ్య -నీచ - ఘోర - అమానుష క్రియాదులు "కాల -కామ - స్కంధ పూజలు ముఖ్యము.

"మలబార్ -టిబెట్ -సిక్కిం - భూటాన్ " మొదలగు "మంత్ర - తంత్ర - యంత్ర " చికిత్సలకు పేరు మోసినవి. - ఇందు, ఊపాసనా సూత్రములు - మంత్రములు – ఆచరణ క్రమాది వివరములు గల్గి: చాల వరకును మూలపడి - దాగి - నశించినవి. మిగిలినవి స్వార్థపరుల చేతనున్నవి. "అధర్వణాంగీరస" - అంగీరసుడు యిందు విఖ్యాతుడు: కర్త వ్యాస శిష్యుడు సుమంతుడు.

"Magic - witchcraft -Medicines -mostly directed against Demonic & Hostile agencies."

మానవులకు వలసిన "భౌతిక - లౌకిక" సమస్తాశయములు - యిందున్న సూక్తముల వలన గ్రహింపనగును. కొన్నిభాగములు విదేశీయులచేఁ గొంపోబడి పరిశోధలందున్నవి. ఆనాడే విద్యుచ్ఛక్తి - ఆకర్షణ - శబ్ద - రసక్రియ - ఔషధాది సర్వసిద్ధులుఁబడయగల సులభసాధనలు - అనుభవయోగములు - సంపుటీకరించి దాచిరి. అవన్నియు క్రమప్రచార - ప్రగతులకునోచుకోక నశించెను. మాయమయ్యెను. దాచబడి కాలగర్భమున కలసిపోయెను.

5 యజ్ఞములు - ( పంచ విధానములు)

1. భూత యజ్ఞము
2. దేవ యజ్ఞము
3. పితృ యజ్ఞము
4. మనుష్య యజ్ఞము
5. బ్రహ్మ యజ్ఞము.

16 దానములు

గావ, స్సువర్ణ, మహిషీ, రత్నానిచ, సరస్వతీ,
తిలాః, కన్యా, గజా శ్వాశ్చ, శయ్యా, వస్త్రంత ధాక్షితిః||

ధాన్యంచ,వేశ్యా,ఛత్రంచ, గృహం, సోపస్కరాన్వితం,
ఏతాన్యేవ మహాదేవి మహాదానాని షోడశః,
ద్వాదశదానాలు (అపర కర్మల్లో చలామణి)

నల్వురు బ్రహ్మతత్వవేత్తలు:

1. బ్రహ్మ విదుడు, 2. బ్రహ్మ విద్వరుడు 3. బ్రహ్మ విద్వరీయుడు 4. బ్రహ్మవిద్వరిష్ఠులు.

1) ఫలాపేక్షవదలి విహిత కర్మలాచరించుచు, అన్నిట విరక్తుడై, యదృచ్ఛా లాభ సంతుష్ట మొదలగు గుణములుగల్గి 1) & 2) లందు ప్రారబ్ధంబుండియు నసత్యముగాఁనుండును.

2) కర్మలన్నింటిని సన్యసించి, బ్రహ్మ విదుని లక్షణములన్నియు గల్గి, సత్వాది గుణ కార్యములనెల్లఁగడచినవాడు.

3) పై గుణములు గల్గి, సహజామనస్క రాజయోగము సమాధియందు, నెలకొని, అప్పుడప్పుడు ఇతరులు లేపగా లేచి, ఆహారమును గ్రహించి, నిద్రపోవువానివలె, మత్తుగా జగత్తును మరచియుండువాడు. ప్రారబ్ధ ముండియు లేకుండును.

4) ఇతరులచే బలాత్కారము ఇతరులచే సమాధ్యావస్థనుండి మేల్కొల్పఁబడి, ప్రపంచమును మరచి, సర్వదా నిర్వికల్ప సమాధియందు పరబ్రహ్మ తేజ స్వరూపుడై యుండువాడు. ఇతనిలో ప్రారబ్ధం ఏమాత్రంలేదు.

వైరాగ్య బోధోపరతులు. - వీరి నల్వురకు కొంచెమెచ్చు తక్కువలుగానుండును.
ఆనందము అంతే. కాని మోక్షము మాత్రము అందరికి సమానము

బోధము : అపరోక్షజ్ఞానము. దీనికి శ్రవణ మనన నిధి ద్యాసములు మూల కారణములు. అందున వివేకము - నిత్ససత్యదర్శనజ్ఞానము -

వైరాగ్యము : ప్రకృతి నికృతులందు దోష దృష్టి - విసర్జనము. తిరిగి ఇహ పర విషయ వాంచలు కోరకుండుట. దీనికి మూలము వివేకము:

ఉపరతి.

యజుర్వేదము - 6 భాగములు. కృష్ణ - 4 భాగములు మరియు శుక్ల - 2 భాగములు.

వేదములకు పూర్వము ఏ గ్రంధము కాన్పింపదు. వేద వాఙ్మయమే (భాషయే) గీర్వాణము. దేవ భాషలోని నానుడిః పాణి న్యాదులు, దీనిని సంస్కరించినందున

"సంస్కృతమని" పిలువబడెను. నేటి సంస్కృత పండితుల కీ "గీర్వాణ భాష" అర్థంకాదు.

విద్యారణ్యుల భాష్యమే విపులమైనది. 15 సంపుటములుకలది. వేదకాలమునాటి ఆచార వ్యవహారములు - సాంఘిక, వ్యావహారిక, పరిపాలనా పద్ధతులు తెలియుటకే వేదములు చాలావరకు. తోడ్పడును.

యజ = దేవతలను ఆరాధించుట.

యాగము = కర్మ (కాయిక).

జపము = మానసిక వ్యాపారం.

స్తుతి = వాగ్వ్యాపారం.

శ్రుతుల నాశ్రయించు వారు శ్రౌతులు.

"యజన" శబ్ధజనితమే "యజుర్వేదము"

మంత్రములలో (ఋక్కులలో) సూచించిన కర్మను భోధించు వాక్కు (వచన) గ్రంధమునకు బ్రాహ్మణమని పేరు. మంత్ర భాగములు = సంహితలు అని కూడ అందురు.

సంహిత = సం + ధాత - మార్పులని అర్థము.

యజ్ఞము = ఇచ్చుట = త్యాగము.

వేదము = జ్ఞానము

వేదములందు బ్రాహ్మణములు వేరు

మంత్ర భాగములు (సంహితలు) వేరు.

బ్రహ్మ నుండి మంత్రములు (వేదములు, సంహితలు) – ఇవే అపౌరషేయములు (=బ్రహ్మ స్థితి)}

ఋషుల నుండి బ్రాహ్మణములు అనగా పౌరుషేయములు.

వేదములు 4, వేద భాగములు 4

1. మంత్రములు - బ్రహ్మచర్య నాల్గు ఆశ్రమముల కనువుగా విభజింపఁబడినవి సంహితలు
2. బ్రాహ్మణములు - గార్హస్థ్య
3. ఆరణ్యకములు - వానప్రస్థ
4. ఉపనిషత్తులు - సన్యాస

భారత వర్ష బ్రహ్మ ఋషులు - ద్రష్టలు – వేదమూర్తులు - సర్వకాల - సర్వలోకభద్రంకరులు. "లోకాః సమస్తా స్సుఖినోభవంతు" అన్నదే వారి పవిత్రాశయము. ఇంతింత విశాలహృదయులై - విశ్వపౌరులైన మహనీయులు భారతమాత గర్భ శుక్తిముక్తాఫలములని మనమెంతయోగర్వ పడవలెను.

వారిది అస్ఖలిత బ్రహ్మచర్యము - అచంచలదీక్ష - అద్వితీయ వైరాగ్యము - అహంకార మమకార రాహిత్యము - అనుపమాన తపోనిరతి - అతిసునిశిత నియమ పరిపాలనము - ఆత్మానందము - అనంత ఆత్మ సౌఖ్యము - పెట్టని సొమ్ములు - అద్వితీయ భూషలు - ఇదియేవారి జీవిత పరమావధి.

వారాత్మ విదులు - కీర్తి కాంక్ష గాని, యిహ పర సుఖా పేక్ష గాని, ఏకోశాన ఎరుగరు.

అష్టాంగ యోగ సిద్ధుఁడు, గురుచరణ సన్నిధిఁ "సాష్టాంగ" ప్రణామ మాచరించి, గురుభోధకై అర్థించును.

వేదాంత జ్ఞానమునకు సాధన చతుష్టయ సంపత్తి గలవారే అధికారులు.

గోత్రము, కులము, వయస్సు, జాతి, ఆశ్రమము, స్త్రీపురుష, పాపపుణ్యా, ఆరోగ్య అనారోగ్య, స్థల, కాలాది బేధములు ఆత్మకు లేవుః సర్వులు సమానార్హులే -

మైత్రేయి, సులభ, గార్గి, శాండిలి మొదలగు స్త్రీలు బ్రహ్మజ్ఞానులు ముక్తినొందిరి.

వాల్మీకి, తిన్నడు, శంబుకుడు, కబీరు, హరిదాసు మొదలగు శూద్రులు తరించిరి.

కావున, యజ్ఞ దాన తపో బ్రహ్మ నిష్ఠాది సత్కర్మలచేతను, పూర్వ జన్మసుకృత ఫల కారణము చేతను, గురు అనుగ్రహము చేతను, ఈశ్వర కరుణా ప్రసాదము చేతను - సాధన చతుష్టయ సంపత్తి పూర్ణముగా ఎవరికి లభ్యమైనదో వారందరు బ్రహ్మవిద్యాధి కారులే! -

పిండి వున్న రొట్టె వున్నట్లే.

టిక్కెట్టు లభించి బస్సు నెక్కిన వారే !

"చెక్" . వారికి "క్యాష్" వున్నట్లే కదా.

ప్యాస్, పర్మిట్, సన్నధు లభించిన ధన్యులే.

నిత్యా నిత్య వస్తు వివేకము:- బ్రహ్మ సత్యం<br>జగన్మిథ్య } విశాల విజ్ఞాన విచారానుభవం.

ఇహాముత్ర ఫల భోగ విరాగము :- ఇహ పర సర్వ, సుఖములు క్షణికములు, అనిత్యములు సత్యముగావు అనెడి ధృడ నిశ్చయార్థము.

షట్కసంపత్తి - శమ - అంతరింద్రియ నిగ్రహము.

దమ - బాహ్యేంద్రియ నిగ్రహము.

ఉపరతి - సర్వసంగ ప్రరిత్యాగ ధ్యాన శక్తిచే, విషయ విరక్తి, లక్ష్యాను రక్తి -(రమించుట)

తితీక్ష - ద్వంద్వాతీత స్థితి.

( సమాధానము = క్షమ) - నిస్సందేహ స్థితి - స్థిర నిష్ఠ - అచంచల స్థిత ప్రజ్ఞ.

శ్రద్ధ - వేద, గురు, ఈశ్వరులందు విశ్వాసం –

తీవ్రసాధనాశక్తిప్రదర్శనం.

ముముక్షుత్వం - తపన, ఆరాటము, ఆవేదన, ఆతురార్భాటము

మోక్షేచ్ఛ - తత్పరత్వము - తీవ్ర వైరాగ్యము, అగ్ని, మృత్యువు సర్పము, జలగండాదులనుండి ప్రాణి తప్పించుకొని పారిపోవుటకై పరితపించి, వ్యవహరించునట్లున్న - విపరీత విపత్కర స్థితి గా, ఈ సంసారము - జన్మ-జరామరణములు - - - భవ భయము నుండి తప్పు కొనుట.

శ్రుతులు = విన్నవి,

స్మృతులు = జ్ఞాపకమున్నవి.

పండాలు = పండినవారు<br>జ్ఞానముతో } = పండితులు

వేదులవారు

ద్వివేదులు

త్రివేదులు

చతుర్వేదులు

సోమయాజులు

శ్రౌతులు = శ్రుతుల నేర్పరులు

ఆగమములు = (వేదములు), శాస్త్రములుఁ, వ్యాకరణాదుల ప్రాశస్త్యము.

నిగమములు = వేదములు -

చం|| శిథిలత లేని భక్తి నతి. సేయుదు వేల్పుల కాసుపర్వులున్|
విధి వశ వర్తులావిధియు -విశ్రుత కర్మ ఫల ప్రదాతయ|
య్యధిక ఫలంబు కర్మవశ - మట్లగుటం బనియేమి వారిచే|
విధికధికంబు గర్మమని- వేమఱు మ్రొక్కి భజింతుఁగర్మమున్!

తా|| దేవతలకు నమస్కారము. కాని, వారును ఆపాడు విధికి (దైవమునకు) లోబడినవారే. ఆదైవమునకు నమస్కారము. ఆ దైవముకూడా కర్మానుసారముగ ఫలమునిచ్చును గాన కర్మకు నమస్కారము. ఫలము కర్మాధీనమైనందున, దేవతలతోను, దైవముతోను మాకేమి?. దైవ-దేవతల చేతదాఁట శక్యముకాని కర్మమునకే మ్రొక్కెదను.

మరియు బ్రహ్మ కుమ్మరివలె బ్రహ్మాండ మధ్యమున నియోగింపబడెనో -
విష్ణువు పది యవతారములెత్తి కష్టములపాలై అలమటించెనో -
రుద్రుడు "తలపుట్టె" పాత్ర చేతనిడి బిచ్చమెత్తెనో-
సూర్య, చంద్ర, వాయు, అగ్ని, వరుణ యమాదులు, ఏ కర్మకుభద్ధులై
కట్టుబడి సర్వదా - అప్రమత్తులుగ చరించుచున్నారో – ఆకర్మకు నమస్కారము.
కావున సత్ఫలముల నొసంగు సత్కర్మల నారాధించి ధన్యుడై, కృతకృత్యుడగుట
మానవ ఏకైక ధర్మము. -- భర్తృహరి

ఆ|| వ్రాఁతావెంటగాని వరమీఁడుదైవంబు|
చేఁత కొలది గాని వ్రాఁత కాదు|
వ్రాఁత కజుఁడు కర్త చేఁతకుఁదాఁగర్త ||వి||

తా|| దైవము వ్రాతనను సరించియే శుభాశుభ ఫలముల నిచ్చును. వ్రాత మన కర్మము ననుసరించి యుండును. కావున నొసటి వ్రాతకు ఈశ్వరుడును, చేత(కర్మ)కు తానును కర్తలగుదురు.

"సుఖదుఃఖములు శుభాశుభ కర్మల ఫలితములే! సర్వమునకును కర్మయే మూలం."

-- వేమన

" Be good & Do good"

మంచి తలంపులు : అంతే : సాధ్యమైతే మంచి చేతలు" -

-- బుద్ధుడు.

" Non violence & Truth "

అహింస & సత్యము

-- గాంధి -

<u>భారత వాక్యం</u>

మహర్షుల యాశీర్వచనముః-

శ్లో|| సర్వత్ర సుఖి న స్సంతు సర్వేసంతు నిరామయాః

సర్వే భద్రాణి పశ్యంతు మాకశ్చిత్ దుఃఖ మాప్నుయాత్||

సర్వత్ర సకల జీవులు సుఖవంతులై, స్వస్థతఁ బడసి శుభములఁ గాంత్రు గాత|

శ్లో|| సర్వస్తరతు దుర్గాణి సర్వో భద్రాణి పశ్యతు|

సర్వ స్సద్బుద్ధి మాప్నోతు సర్వ స్సర్వత్ర నందతు||

సర్వులు కష్టములందాటి, శుభములఁగాంచి, సద్బుద్ధిని బడసి, ఆనందింతురు గాక.

శ్లో|| సర్వేషాం స్వస్తిర్భవతు

సర్వేషాం శాంతిర్భవతు

సర్వేషాం పూర్ణంభవతు

హరిః ఓం శాన్తిః శాన్తిః శాన్తిః - హరిః ఓం తత్ సత్.

ఎల్లరుకు క్షేమమగు గాక!

(ఎల్లరకు) శాంతి చేకూరు గాక,

(ఎల్లరకు) నిండు స్థితి (కొరత లేని స్థితి) ప్రాప్తించు గాక.

కం|| కర్మములు మేలు నిచ్చును

గర్వంబులుఁగీడునిచ్చుఁ - గర్మలుదనకున్

గర్మములు బ్రహ్మకైనన్

గర్మగుఁడై పరులఁ దడవఁగానేమిటికిన్

-- భాగవతము. (దశ.పూ.భా), 32 వ పద్యము.

సమస్తము కర్మాధీనం. సుకృత దుష్కృతములు – తదను గుణమగు ఫలముల నిచ్చును. పురాకృత సుకృతములే ప్రస్తుత సుఖ శుభ స్థితి గతులకు కారణము. భక్తి – భగవచ్చింతనాదికములు జీవుని, దుష్పథమునుండి మరలించి, సత్పథమున నడిపించి సత్కర్మలఁ జేయించి, క్రమముగా ఉద్ధరించి, తరింపఁజేయును.

కడమాట. కీలక రహస్యము, పరమ భక్తాగ్రేసరుండైన నామ దేవునికి పండరినాథుడైన శ్రీ పాండురంగడు ప్రత్యక్షమై, జ్ఞాన దేవుని ఆశ్రయించి, గురూపదేశమునకై యర్థింపమని ఆదేశించి, తాను కూడ స్వయముగ (తన ప్రియ భక్తుని తరపున) జ్ఞానదేవుని కోరెనుః ఈ ఇతి వృత్తము పండరి భక్త విజయమునఁ జూడనగును.

భగవంతుడు కోరిన వెల్లనియ్యగలడు. కాని ముక్తి ( మోక్షము) భవ భయాదుల తొలగింప "గురుడే" సమర్థుడు.

"కర్మ, భక్తులు" - మానవుని మానవునిగను, దివ్యునిగఁ నొనర్ప జాలునేగాని, మొక్షార్హత ప్రసాదింపఁజాలవు.

జ్ఞానాను భవ మొక్కటే (అపరోక్షనుభూతి) - పునర్జన్మబీజమును కాల్చి, శాశ్వతత్వమును ప్రసాదించగల్గును.

# 1. రస విద్య
# (హేమ కార విద్య)

సామాన్యంగా రస విద్య - రస క్రియ, అంటే హేమకార విద్య - స్వర్ణ యోగము, అనగా బంగారు తయారు చేసేవిధానమని ధ్వనిస్తుంది.

కాని, రస విద్యలో "రస" శబ్దమునకు -- అతి చంచలమైన, పారదము, లేక పాదరసమును, మనస్సుతో పోల్చి నారు. మరియు, మనస్సునకు - చపలి - కోతి - (మారుతి - మరుత్పుత్రుడు) - ఇంద్రుఁడు (ఇంద్రియములకు రాజు) - అరూపి – దయ్యము - ఇంద్రజాలికుఁడు - అని పేర్లు కూడా కలవు. కావున, రస విద్య అంటే "మనోజయవిద్య" లేక అమనస్క రాజయోగమని సులభ గ్రాహ్యము.

తద్వాతు, స్వర్ణయోగమనగా - యోగములలో, స్వర్ణప్రాయమైనదనిన్ని, రాజయోగమంటే, యోగములలోకెల్ల రాజు వంటిదనిన్ని, లేదా రాజుల చేత ప్రత్యేకముగా అభిమానింపఁబడి, అనుష్ఠింపబడిన దనిన్ని యూహించడము సమంజసము. దీనినే కేసరీ యోగమని కూడా అందురు. మృగ జాతిలో సింహము (కేసరి) రాజగుట బట్టి యోగరాజమైన దీనికాపేరు ఎంతయుఁ దగును గదా!

ఇక, మనోజయ విద్య వల్ల, ఒక బంగారమే కాదు, చతుష్షష్టి కళలు, అష్ట సిద్ధులు, నానా దివ్య శక్తులు, సమస్త భోగ భాగ్యైశ్వర్య సర్వశుభములు, తుదకు సర్వ సార్వభౌమత్వం కూడ మనో విజేతను వలచి వరించి పాదా క్రాంతమవడంలో ఆశ్చర్యములేదు.

మనోజయంవల్ల, దశేంద్రియముల ద్వారా దశవాహినులై ప్రవహించి, పరవులు తీస్తున్న "మనశ్శక్తి"ని -- సమస్త నదులు తమ పునీత మధుర జలాల్ని వృధాగా సముద్రము నందలి ఉప్పు నీటిలోఁగల్పి వృధా అవుతూన్నట్లు------- బాహ్యప్రపంచమందలి నానా విషయ లంపటత్వ అగాధములఁ జిక్కి పాడుగాక-- దశవాహిని ప్రాజెక్టుగా రూపొంది, తత్ఫలముగా, మహామానస సరోవర నిర్మాణమొక విశ్వకల్యాణ దాయకమగు మంగళకర సాధనము- బహుళార్థసాధకము, శుభఫల ప్రసాదము గదా!

రస విద్య (మనో జయ విద్య) ఆత్మజయ బృహత్త్రియ సాధని. కేవలం తాత్కాలిక భౌతిక సుఖ సౌఖ్యాలకుపకరించు "స్వర్ణము" కన్న, కోటి రెట్లు ఎక్కువ

ఫలదాయని. అనంతకోటి బ్రహ్మాండ మండలాధిపత్యమే కాదు, సమస్త రాజరాజేశ్వర కనకమయ - మణి ఖచిత కిరీట సహస్రములు కూడ యోగి దివ్య పాదాంబుజముల వ్రాలడం నిత్య సత్యం.

యోగి సామ్రాట్ వేమన తన సర్వ ప్రవచనాల్లో విస్తారంగా "హేమకార విద్య" ను ప్రస్తావించడం కాననగును.

క్రమంగా పామర జనావళి తమ సహజ కనక తృష్ణ శమనార్థం బంగారాన్ని సృష్టించే పేరాశతో, వేమన యోగీంద్రుని నిగూఢ ప్రవచనాల్లోని స్థూలార్థాన్ని, భౌతిక దృష్టి నాశ్రయించి, నానారసవాద ప్రయోగ యాతనల్లో మునిగి, తుదకు నిరాశా నిర్వేదాలతో సర్వ నాశనములైన ఉదంతములు సర్వత్రా కాననగును.

కాని, అతని రసవిద్య కేవలం మూలికలు, రసాది ధాతువులతో ప్రావిర్భ వించిందనడం కన్న, అతని తపశ్శక్తి లేక యోగ శక్తి ప్రభావంతో ఫలించిందనడం భావ్యం. మహాత్ములు సర్వ శక్తి సంభరితులు, అనుగ్రహ మూర్తులు - సాక్షాత్ పరుస వేదులు గదా!!

సర్వ సంగ పరిత్యాగి, పరమ హంస వేమన యోగీంద్రుడు, స్వర్ణ పిపాస - భ్రాంతి తో, స్వర్ణ సృష్టికై, తల్లడించెనన్న విజ్ఞులు నవ్విపోరా!!

లోక దృష్టి వేరు- యోగి దృష్టి వేరు. సామాన్యులది బాహ్యా దృష్టి, దివ్య పురుషులది అంతర్దృష్టి.

సమస్త మతములు - మత గ్రంథములు, ప్రవక్తలు, భగవంతుడే పరమ పెన్నిధి, అనన్య శరణమని ముక్త కంఠముతో చాటు తూంటే, పైగా, స్వర్ణమును (కనకమును) మోక్షాటంకముగ, ధనాన్వేషణ క్రింద హేయముగ విసర్జ నీయమన్నారు గదా!!

కామిని కాంచములను శ్రీరామకృష్ణాది మహాత్ములు గర్హించి, దూరీకరించిరి!!

" సర్వే జనాః కాంచన మాశ్రయంతి"

"దుఃఖ నివృత్తి, ఆనంద ప్రాప్తి మొదలు తరహా నినాదములు మంత్రోపాసకుల లౌకిక దృష్టిని - లోక పోకడలను, వక్రార్థ భాష్య కారులను యాకర్షించి, సన్మార్గ గాములుగా, జేయ సత్సంకల్పమే యీ "రస విద్య" విమర్శనమున ధ్వనించును!!

రస విద్యను మనోజయ విద్యగా నిర్వచించి, అమనస్క రాజయోగమని ఒప్పించి, మెప్పించడమే, ఈ రచన యొక్క యుద్ధేశ్యము. బంగారముకన్న భగవంతునే

నమ్మి, ఆరాధించి తరించు తరుణోపాయము "రస విద్య" యే యన్న ప్రాజ్ఞులు మన్నింతురు గాత!!

వేమన యోగి పుంగవుని కవిత్వము, పరమ నిగూఢము. ఈలాంటి ఉభయ తారక శ్లేషార్థ సాహిత్య విమర్శనము లోక కల్యాణ కారణము. ఈతని దివ్య ప్రవచన సూక్తుల, పరమార్థ రహస్య సరళిని ఆస్వాదించు శుభ తరుణ మాసన్నమైనది. త్వరలోనే సర్వజ్ఞ ఆచార్య బ్రహ్మశ్రీ వెల్లలూరు వెంకటాద్రి సత్యనారాయణ స్వాముల వారి యపూర్వ అనంత విజ్ఞాన భాండార లక్ష్మీ సాయంతో, వేమన యోగీంద్రుని పద్య సాహిత్యంపై , సుమారు 1000 పుటల సంపుటము త్వరలోనే ప్రచురణకై బయల్వెడలు శుభ తరుణమాసన్నమైన దనే శుభ వార్త లోకమునకొక దివ్య సందేశమై సర్వజనానంద దాయకమగుగాక.

మరియు మచ్చునకు

||ఆ|| హేమకార విద్య నెరిగిన వారెల్ల
వెతల బడని యట్లు, విద్య చేతఁ
దత్వ మెఱుఁగు వెనుక, తనకు చింతేలరా ||విశ్వ||

||తా|| బంగారు చేయ నేర్చిన వారు సుఖించు నట్లు,
తత్వము నెఱిగిన వారికి తాపత్రయాది
సమస్త కష్టములు కలుగ జాలవు. ||విశ్వ||

||ఆ|| తెలుపు మాయఁ జేసి దిట్ట తనంబున,
దెలుపు భస్మమగును దేట బఱచు,
విధముకన్నఁ పరుస వేదియు లేదురా ||విశ్వ||

||ఆ|| ఇహమున సుఖియింప, హేమతారక విద్య
పరమున సుఖియింప, బ్రహ్మ విద్య.
కడమ విద్య లెల్ల గల్ల మూఢులకురా ||విశ్వ||

||ఆ|| తులసి కారములను దూముపై నీరము
పఱచి దాన దుష్ట పాలు వోసి
కఱగి రాగి పైనిగ్రమముగా నుంచిరా ||విశ్వ||

||ఆ|| గట్టు మీద మన్ను చుట్టపైఁ దగు రాయి

పుట్ట లోనివాని బుడుగు తొడగ
గట్టిగాను మూటఁ గనకంబు పుట్టును ||విశ్వ||
||ఆ|| ఇంటి వెనుక తీగ ఇంగ్లీక ముండంగ
పారదంబు గలుగ బసిడి ఏల
సత్తు పొత్తు జేసి సాధింప వచ్చురా ||విశ్వ||

వేమన యోగీంద్రుని రస విద్య యే కాదు, సర్వ విద్యలు, సర్వ సిద్ధులు వలచి వరించి తరించి నవన్న ఆశ్చర్యము లేదు.. అతని జీవిత పూర్వ గాధలందాతనిని స్వర్ణ కార విద్యా పారంగతుఁడని పేర్కొనిరి.

రస లోహములను, కొన్ని ఓషధ స్వరసములతో వేధించి, ప్రత్యేక రహస్య యోగక్రియా సరళిని బంగారము చేయవచ్చునని, రసార్ణవము, రసవాదశివాగమము, మంథాన భైరవము, రస రత్న సముచ్చయాది గ్రంధములలో సూచితము.

రావణ విరచిత రసయోగ రత్నాకరమునను, నాగార్జున కృత రస తంత్ర మహోదధి మొదలు గ్రంధములందు కూడా కాన నగును.

అందు వేధలు నాల్గు విధములుః- స్పర్శ వేధ, ధూమ వేధ, శబ్ద వేధ, కుంత వేధ----- మొదలగు ప్రక్రియల ద్వార బంగారును విస్తారముగా సృజించు రహస్యములు రస రత్నాకరము నందున కూడ సుభోధము.

కాని, వేమన స్వర్ణకార విద్య ప్రత్యేకము. రావణ బ్రహ్మ రస విద్యా పారంగతుడని రస రత్నాకరము నందు పేర్కొన బడ్డది.

కురు క్షేత్రమున సూర్య కుండ్ తీర్థము వద్ద, కర్ణుడు వేయి మణువుల బంగారమును దానమిచ్చెనని శిలా శాసనము నేటికిని చూడ వచ్చును.

పూర్వము మంత్ర, తంత్ర, యంత్ర, యోగ, తపశ్శక్తుల కారణమునను, రస లోహాదులను, కారణ మాత్రంగా ప్రత్యేక మూలికల రసాదుల సాయంతో బంగారము చేసెడి వారని ప్రతీతి!

మచ్చునకు ఒక పద్యాన్ని విమర్శించి చూద్దాం.

||ఆ|| ఇంటి వెనుక తీగ ఇంగ్లీక ముండంగ
పారదంబుఁ గలుగఁ బసిడి ఏల!
సత్తు పొత్తుఁ జేసి సాధింప వచ్చురా ||విశ్వ||

వెనుక తీగ - అన్నాడు. సామాన్య దృష్టి లో, పెరటి లో మల్లె, చిక్కుడు, దొండ,

బీర, మొదలగు తీగలుండవచ్చు. మరియు కొందరు సూక్ష్మ బుద్ధులు పెరళ్ళందు తిప్పలుండకపోవు, అందు "తిప్ప తీగ" లుప్ప తిల్లక మానవని ఉద్ఘాటించవచ్చు. కాని, కొన్ని ఇండ్లకు పెరళ్ళుండవు, చాలామందికి ఇళ్ళే లేక పోవచ్చు. రూముల్లో, హోటళ్ళలో జీవితం వెళ్ళబుచ్చే రకాల గతేమిటి? కావున విమర్శకుల దృష్టి, దారి యోగి (కవి) దృష్టిదారికి ప్రసరించాలి, విచారము ఆంతర్మఖంగావాలి.

"అంతర్ముఖసమారాధ్య, బహిర్ముఖసు దుర్లభ"

-- శ్రీ లలితా సహస్రనామము(870,871)

మరియుః-

"దేహో దేవాలయః ప్రోక్తో" ..... దేహ దేవాలయం లేని ప్రాణంలేదు.

దేహం లేని దేహి లేడన్నమాట. ఆనగా దేహం (ఇంటి) యొక్క పెరడు అనగా, వెనుకభాగము, అనగా వీపు గదా! అందు వెన్నెముక (మేరువు) లోని సుషుమ్నానాడి (Spinal cord) ద్వారా "తీగ" లాగా పైకి, మూలాధార చక్రం నుండి, సహస్రార కమలం వరకు ప్రాకి వుండడం, ప్రత్యక్షానుభవం. యోగులు, జ్ఞానులు, సత్యసంధులు, వారిది అమరవాణి. ఇప్పుడు పెరటి తీగ అందరికి లభించినట్లే గదా! ఇదే సప్తకమలముల కుండలినీ శక్తి., యోగ పథము.

Next, ఇంగ్లీకముండంగ---- ఇంగిలీకము, రస మాతృక. రక్త లేక అగ్ని వర్ణ ధాతువు. బహు రోగ నివారిణి. ఇచ్చట అరుణ లేక ఆగ్నివర్ణ ప్రశంస. అగ్ని నేత్ర స్థానమగు ఆజ్ఞా చక్రము సూచితము. రుద్ర గ్రంథి, విశ్వ స్థానము. మేరుశిఖరముః మేరుశిఖరాగ్రమే సహస్ర దళ పద్మనిలయము.

ఇక, పారదంబు గలుగ ----- అనగా పాదరసము, ఇదే "మనస్సును" రసము (చంచలత్వం) తో పోల్చినారు. అష్టాంగయోగ (ప్రాణాయామ) పథ సాధన క్రమముల్లేఖితము. షట్చక్ర విభేదన యోగ రహస్యము. సప్తకమలముల గుప్త భాగ్య రహస్య వివరణము లిందు నిగూఢములు. వేమన యోగిచంద్రుడెంత ఘనుడో విజ్ఞులూహింపదఁగును. ("సత్తు పొత్తుఁ జేసి") ఇక సులభగాహ్యాము. సద్వస్తులైన లక్ష్యము అనగా పరమాత్మ తత్వధ్యేయమును(పొత్తు) జేసి అనగా. సర్వాశ్రయాధారముగాఁజేసుకొనడమని (శాంభవముద్ర సాధన ఫలం- చంద్రగిరి ధారి గమ్యం) ---పరమనిధి--పెన్నిధి.

ఇంకెక్కడి బంగారము??. యోగ మరియు జ్ఞాన పధములు రెండును

సూచింప బడినవి.

వేమన ప్రారంభములో ఆశించి, లభించనిది, స్వర్ణ ధాతువే కావచ్చుఁ, కాని, తుదకాతనికి లభించినది స్వర్ణయోగ ఫలము!! అంతా భగవత్కృప, పరమ పురుషునియపార కరుణా కటాక్ష ప్రభావ మహిమయే!!

స్వర్ణ క్రియ మీద అతని మనస్సు పూర్తిగాలగ్నమై లయించి పోవడంతో, స్వర్ణ (రాజ) యోగఫల మాతనికి దక్కడంలో ఆశ్చర్యమేముంది?

భక్తి పారవశ్యముతో నిగ్రహ ధ్యానమున లీనమై భగవద్దర్శనమందిన వారి కన్న స్వర్ణ ధాతువును లక్షించి లయించిన వేమన మనస్సు స్వర్ణమయమైంది. హిరణ్యాగర్భ సాక్షాత్కారమునకు నోచుకొన్న పుణ్యమూర్తి, బ్రహ్మర్షి, యోగి విరాట్ వేమన.

భౌతిక లాలసత్వ ప్రారబ్ధ పరంపరలతో సహజంగా - సులభంగా అధో దృష్టి కలవాటు పడ్డ దౌర్భాగ్యకలి - కాదు. సినిమా యుగమిది. వెండి తెర తారలకున్న వెలుగు, విలువలు, మహర్షులేగాదు, మహాదేవతలు గూడా నోచుకోలేదు. "సర్వేజనాః కాంచన మాశ్రయంతి". ---- ఖానా, పీనా, సోనా, గానా భజానా జీవితంతో మన నేర్చిన మానవ సమాజం, ఆధ్యాత్మిక పురోగతి సులభంగా ఒప్పుకోజాలదు.

మహాత్ముల దివ్య ప్రవచన సూక్తుల యంతరార్థ రహస్యబోధన శ్రమ వృధాగా విలువగట్టు మనస్తత్వము ప్రబలి, బలసి, విజృంభించునేడు యీ "రసక్రియ" రమణీయత ఏ కొందరు సహృదయులకో రుచించవచ్చునేమో. కాని, "సత్యము" సత్యార్థము చిరంజీవికదా!!

అభయం. ఓం తత్సత్.

మనస్సు నకు ప్రత్యేక పుట్టుక లేదు. స్వరూపము లేదు. దేనినో ఒక దాని నాశ్రయించి యుండును. కావున మనస్సే- సూక్ష్మ శరీరము- జీవుడు - అని పిలువబడును. శరీరమున "నేను" అనగా "మనస్సు" అది హృదయమున పుట్టును. ఈ "ఉత్తమ పురుష" లేకున్న మధ్యమ, ప్రథమ పురుషలు లేవు. మనస్సు లయించిన జగత్తేలేదు.

ఇంద్రియముల ద్వార - విషయముల రూప నామ చింతనమే - అనగా - సంకల్ప వికల్పములే స్వరూపముగాగలది "మనస్సు". మనస్సు సంకల్ప స్వరూపిణి. సంకల్పమే ఉనికిగాఁగలది. సంకల్పము లేకున్న మనస్సు లేదు.

మనస్సు దయ్యము. కన్పించకనే (రూపము లేకనే) మనగలది. సంకల్పమే దీనికి మనుగడ. సంసార చక్రమునకు సంకల్పము నాభి వంటిది.

సంకల్పమే సర్వమునకు మూలము. బ్రహ్మ జననమునకా పరాత్పరుని ఆది సంకల్పమే కారణము. కావున సంకల్ప వికల్పములే అనగా గతాగత విషయ చింతన వృత్తియే"మనస్సు".-

కావున సంకల్పములు పుట్టు చోటు (బుగ్గ - జన్మ స్థానము) ను ధ్యానించుటే ఏక లక్ష్య తదేక చింతనమే, ఉత్తమోత్తమ మైన ధ్యానమందురు.

"నేనెవడ" నను తలంపునే చింతనము చేయ మనస్సడంగును. ఈ తలంపు **లెవ్వరికి** కల్గినవి? ఇంతే!! ఇక, మనస్సు జన్మస్థానమున కేగి లయించును.

--- భగవాన్ రమణ.

మనస్సు అవిద్యోపాధిః మనస్సు లేకున్న తటస్థ "బ్రహ్మ - సాక్షి",- సుఖ దుఃఖములు లేవు. మనస్సు (సంకల్పాదులు) న్న "జీవుడు". భోక్త - కర్తృత్వ సుఖ దుఃఖాది ద్వంద్వములకెఱ, సంసారి- హృదయము- జీవనిలయము.(స్థూల) - దహరము బ్రహ్మలోకము (సూక్ష్మ) హృదయమున- గుండెకాయ కిరు ప్రక్కల ఊపిరి తిత్తులున్నవి. ఇదేప్రాణ నిలయము. ఉరమే ప్రాణలయము. (ప్రాణమయ కోశము).

మనసన్నది హృదయమందు గాని, బయటగాని ఎచ్చటను సత్యమైన ఉనికి గలదై లేదు. విషయ చింతన స్ఫురణ - భావన యే సంకల్పము -మన స్స్వరూపము. కావున "సంకల్పమే మనస్సు- మనస్సే సంకల్పము"

సంకల్పము లేకున్న మనస్సు లేదు. కావున నిస్సంకల్ప స్థితియే - (సంకల్ప నివృత్తి,- సంకల్పరాహిత్యము) - అమనస్క స్థితి. అనగా వయో వృత్తులు (అలలు) లయించి ప్రశాంతత నందిన నిస్త రంగ సాగరము వలె, సంకల్ప వృత్తులు నశించి నంతనే స్వస్వరూప, సహజ స్థితి శేషించును. దీనినే ఆత్మ సాక్షాత్కారమనియు - స్వస్థితి యనియు, సహజస్థితి అనియు "ఎఱుక" అనియు అనుభవులందురు. ఇదియే సర్వ వేదాంత సార సంగ్రహ రహస్యము.

అమనస్క యోగ పరమావధి.

మనస్సు - త్రిగుణాత్మకము - అనగా మనోవృత్తులు. త్రిగుణ స్వరూపమై

యుండు.ను. సాత్వీక మనోవృత్తులందు, అనగా అంతఃకరణమున పర బ్రహ్మాయొక్క జ్ఞానానంద స్వరూపము ప్రతి ఫలించును.

మనస్సు:-

సత్య జ్ఞానా (ధ్యానా) భ్యాసముచే
సద్వస్తు చింతనారతిచే
సదాచార పథ గామియై
సహజ సద్రూప సదానంద పదవి ప్రాప్తించును.

'సర్వదా' ఇది ఘటము - పటము -కుర్చీ - గోత్రము---- అనెడి రూపనామ చింతనయే మనస్సు యొక్క పని:

" కుండ లోని సత్యా వస్తువైన మట్టిని,
కుర్చీలోని సత్యా వస్తువైన కొయ్యను,
ఆభరణము లోని సత్యా వస్తువైన బంగారమును

గుర్తించుటయే సత్య (మూల సత్తా) దృష్టి, ఇదే సచ్చింతనము - సద్వస్తు చింతనము. దీనిలో "రూప నామ" విపరీత దృష్టి నశించును. సమ్య గ్దృష్టి నుండి సమ్య జ్ఞానము అవతరించును.

ఈ అభ్యాస సాధన వల్ల "వివేక విజ్ఞానము" పండి ఫలిం చును.

ప్రభవ -----ప్రళయములకు
సృష్టి ----- లయములకు
} యోగమే మూలము

అగ్ని కణము - మహారణ్యమును దహించును
చిన్ని దీపము --నిబడాంధకార పుంజములఁబార ద్రోలును.

"జ్ఞానా (యోగా) గ్నినా సంచితం" -- శృతి

మనస్సు --- కుక్క, కోతి వంటిది. సాధనలన్నియు దీనిని నిగ్రహించి, జయించి, లయించుటకే. నామ జపం మొదలు పంచ ముద్రలు, ఉగ్ర తపస్సులవరకు, మనస్సును పెద్ద తాడు తో ఒక గొత్తునకు కట్టఁబడిన పశువువలె, గావించిన, అ (peg) గొత్తును విడిచి బయటికి పోవుటకు వీలు పడక, దానిని చుట్టి అలసి, దాని వద్దనే పడి నిద్రించు (లయించు) ను, సుఖించును.

మనస్సు, ప్రాణంతో తిరిగి తిరిగి అలసి ఆత్మలో( బడి విశ్రాంతి యొందును. ఆత్మను విడచి ఇతరత్ర ఉండ జాలదు ( మన జాలదు) దానికి ప్రత్యేక ఉనికి లేదు.

<u>మనస్సు</u>




కాని, ఆత్మ పక్షము చేరిన క్షేమం, శుభం, మోక్షం, ముక్తి, అమృతత్వ శాశ్వతానంద పదవీ ప్రాప్తి.

(1). ఊర్ధ్వవాహిని: ఉత్తరాయణ, దేవయానం, నివృత్తి పథం, భవనాశవాహిని. అంతర్ముఖ ఆత్మాకార దివ్య పథం. మోక్షగామిత్యం.

(a) యోగః- సప్త కమలముల (ఏడుకొండల) లేక షట్చక్ర, ఊర్ధ్వగామిత్య మోక్షపథం

(b) భ్రూమధ్య (శాంభవీ ముద్ర) లేక షణ్ముఖజ్ఞాన పథంః త్రివేణి (ప్రయాగ) తీర్థ స్నానము- చంద్రగిరి మార్గము.




(2) అదో వాహిని, దక్షిణాయన, పితృయాన, ప్రవృత్త, జీవత్వ - సంసార బంధ, -జనన మరణ చక్ర భ్రమణ గత మార్గం. ఇంద్రియ శక్తుల విజృంభణ - విషయ వాంఛలు -వాసనా, కాయ, భౌతిక లంపటత్వ ధోరణి -

మనస్సు (మాయ)ను నిగ్రహించి జయించుటకు ఆత్మజ్ఞానము తప్ప వేరొండు ఉపాయములేదు. ఆత్మజ్ఞాన జన్మ స్థానము చిత్తమే " ఆత్మ" ఉభయ సాధన కర్త. బాహ్యా భ్యంతర చర్యలు గలది.

"మిత్రత్వ- శత్రుత్వ" ముల రెంటను నైపుణ్యము గలది. కావున - దృశ్య ప్రపంచమును దూరీకరించి, అదృశ్య, అంతర్యామికై అంతర్ముఖుండువు కమ్ము!!

దుష్ట సాంగత్యమున దుష్ట సంస్కారములు ⟶ దుర్గతి
సత్సాంగత్యమున సత్సంసారములు ⟶ సద్గతి
ప్రాప్తించును.

భక్తుడు ------- బయట
యోగి ------- లోపల
జ్ఞాని ------- లోపల, బయట కూడ
భగవంతుని దర్శించును, సర్వత్ర భగవంతుని ఆరాధించును

మనోజయ (రస) విద్యా సారాంశముః-

1. విషయ చింతనమును మరచుట, మానుట, ( సంకల్పములను పగ బట్టి, పుట్టలోని పామును పైకి రాకుండా కాచి, వేచి, అణచి వేయుట. దీనివల్ల ఇంద్రియముల ప్రాబల్యము (వృత్తులు) తగ్గును -తుదకు సన్నగిల్లి నశించును.
2. వాసనలు అనగా పూర్వానుభవ స్మృతులు. సంస్కార బలమున వృత్తులు రేగినప్పుడు, ఎప్పటి కప్పుడు నిరోధించి, నిగ్రహించి, సాధించి, విజయుడవు గమ్ము.
3. " సంకల్ప వికల్పములు" --- విష సర్పములని పసిబట్టి, బహు జాగ్రతతో, తొక్కి వేయడం ద్వార, మనస్స్థైర్యము, చిత్త శాంతి, ఆత్మ లాభము - కైవల్య ప్రాప్తి తథ్యము.

జ్ఞాని సర్వదా అంతర్ముఖుడే!!
మనస్సే ప్రపంచము -- మనోనాశమే మోక్షము.

సావధానః-

" నా మనస్సు సరిగాలేదు, ఎటో పోయినది, ఏమిన్ని పాలు పోలేదు" - ఇదీ వరస. అంటే నీవు మనసు గాదు.

దానిని గమనించి దాని గమనమును గుర్తించి నియమించే "సాక్షివి - కర్తవు" నీవు వేరు, నీ మనస్సు వేరు!!. మనస్సు నీకు ఉపకరణము. దీనిని పదే పదే వివేచించి,

విమర్శించి, సుదీర్ఘ చింతనము ద్వారా జాగరూకుడవై , మనోవృత్తులను తల చూపకుండా అణచి వేయుము. "త్వం బ్రహ్మ" - శేషించి ఆత్మ లాభ ప్రాప్తి తథ్యము.

సుఖీభవ!! శుభం భూయాత్

కావున సాధకుడు ----

1. నిత్య నిరంతరాభ్యాసాది సాధనలతోను -
2. పురుష ప్రయత్న - శక్తి - యుక్తులతోను -
3. వివేక, వైరాగ్య, ఉపరతులతోను
4. శాస్త్ర జ్ఞాన, గురూప దేశ, సాంప్రదాయికమైన సమస్త అనుకూల సాధన పద్ధతుల ద్వారాను-

సాధనలుః-

కఠోర నియమాదులు, పునీత శుభ వాతావరణ, గురు ఆశీర్వాద, మహర్షుల కరుణాదుల వల్లన్ను "మానసిక చైతన్యము" ను లోబరచు కొనవలెను.

పంచశీలములుః- 'పంచ మిత్రులు' సహకరించాలి.

1. సద్గ్రంధ పఠనము.
2. సత్సంగము.
3. సద్గోష్ఠి.
4. సచ్చింతనము
5. సదా చారము.

ప్రతి వారి యందును, దివ్యత్వము గర్భితముగాఁ నున్నది.

"మానవుడే మాధవుడు" - శివోహం!!

బాహ్యాంతర ప్రకృతి ప్రాబల్యమును నిరోధించుటే యోగ రహస్య కీలకము.

అంతర్గత నీదివ్యత్వమును సాక్షాత్కరించుటే జీవిత పరమావధి.

అందులకే యీ ఉత్తమోత్తమ సుకృత ఫల రూప "మానవ జన్మ" ప్రసాదింప బడినది.

ఇది ఊరక రాదు. ఆమూల్య ప్రసాదము.

కావున - సార్థక జన్ముడైన ప్రతి మానవుడు, నిష్కామకర్మ, భక్తి, జ్ఞానము,

వైరాగ్యాది తరణ మార్గముల నాశ్రయించి తరింప శ్రేయోదాయకము.

తస్మాత్ జాగ్రత - జాగ్రత.

ఓం - శుభం - భూయాత్.

సూక్ష్మముగా - సారాంశము.

బాహ్య ప్రాపంచక విషయముల మీదికి పరువులు తీస్తూన్న, మనోవేగమును (వృత్తులను) యుక్తిగా నిరోధించి, అంతర్ముఖమొనర్చి, అంతర్లక్ష్యమున, ధ్యేయారాధనమున, ధ్యేయా కార మొనర్చి, --- ఏక లక్ష్యోపాసనగా సాధన చేయుటయే "తపస్సు".

నశించు, క్షణిక, నశ్వర, దృశ్య, విషయముల పరిత్యజించి, ద్రష్ట (దృక్) సాక్షియైన తాను స్వ స్వరూప చింతనమున నిల్చి పోవుటే "ఆత్మానందాను భూతి" - "ప్రత్యగాత్మ" ఆరాధన,

మరియు --

దేహము రథము, జీవుడు రథికుడు, ఇంద్రియములు గుఱ్ఱములు, మనస్సు సారథి, "వివేక, వైరాగ్య ఉపరతులు పగ్గములు. ---బాహ్య విషయములే, "విషములు" శత్రువులు.

వీటిని, "అభయం సత్వ సంశుద్ధిః" ---- మొ||

దైవిక గుణ సంపన్నుఁడవై, ఎదుర్కొని విజయుఁడవు గమ్ము!!. ఊర్ధ్వ దృష్టి - దివ్య "పథము" నీ ధ్యేయము --

ఏది శ్రేయోదాయకమో, వివేచించి ఎన్నుకొనుము, యథేచ్ఛ

ఇకనుః-

జాగ్రదవస్థ యందు సర్వేంద్రియములు, ఉప సంహరింపఁ బడనప్పుడు,

1. మనస్సు నందలి సంస్కారములు, వృత్తుల రూపమున చలించి, (చిత్తమై)
2. "నేను-నాది" అనెడి అహంకార మమకార రూపముఁ దాల్చును.
3. మంచి చెడ్డలు, పాప పుణ్యములు వివరించి, వివేచించి, విడదీసి, నిర్ణయించు నప్పుడు "బుద్ధి"గా నిశ్చయించును,-

ఇవే మనోవిభాగ స్వరూపములు.----తుదకు నాల్గు ఒక్కటై సమాధ్యవస్థయందు, (అమనస్కస్థితి) లయించి పోవును. అదే స్వ స్వరూప - సహజా

వస్థ - స్వస్థితి!!

-







స్పష్టా స్పష్టము లైన ఉపాధులు (ఘటజలము - మేఘజలము) గల వారగుట చేత, - స్పష్టోపాధికుఁడగు వాని జీవుడనియు -

అస్పష్టోపాధికుఁడైన వానిని ఈశ్వరుఁడనియును - జీవేశ్వరుల భేద మేర్పడెను.

మాయ మేఘము వంటిది. అనగా మేఘ మందుండెడు జల బిందువుల వంటిది. ఆ మాయ యందుడెడి బుద్ధి వాసనలందు ప్రతి బింబించిన జీవుడే "చిదా భాసుఁడు", అనగా మేఘ జలమందు ప్రతిబింబించిన యాకాశము వంటిదని, తెలియవలెను.

మాయ యందు ప్రతిబింబించి, మాయా ధీనుండై మాయకు ఆధారుఁడైన చిదాభాసుని, ఈశ్వరుండనియును, - ఆచిదా బాసుఁడే, సర్వజ్ఞుడు, అంతర్యామి, జగద్యోని మొదలగు శబ్దములచే శ్రుతులందు చెప్పఁ బడెను.

ఈశ్వరాంతర్భూతమైన మాయ ⟶ - విశ్వం

మాయాంతర్భూతమైన ఈశ్వరుడు ⟶ - జీవుడు

వీరి యవినాభావ సంబంధ విచారమే "వేదాంతము".

పాలు చూస్తే వెన్న కాన్పించదు.-

నోటు చూస్తే నాణ్యాలు కాన రావు.-

మర్రి విత్తన మందు వృక్షం కనఁబడదు.-

మేఘములు చూస్తే నీటి బిందువులు అంతే.

"కార్య కారణ రూపేణ" - మాయా ఈశ్వరులను ఊహించు కొని అర్థం చేసు కోవాలి.

పది తలలతో రావణుడు రాముని గుర్తించడయ్యే, కాని విభీషణుఁడు ఒక్క తలతో నే ధన్యుఁడయ్యెను.




ఆ సమ్మోహనాశక్తి చేతనే జీవుడుఁ మోహింప బడు చున్నాడు. మోహన శక్తి వల్ల జీవునకు బంధము - అసమర్థత - దేహాభిమానము - దేహాత్మబుద్ధి - కర్తృత్వము (అహంకారము) ---- తద్వారా సుఖదుఃఖాది ద్వంద్వముల అనుభవ ప్రాప్తి.

"ఈశ్వరుడు" సర్వ హృదయస్థుఁడై, జగత్తును ఇంద్రజాలికునివలె ఆడించుచున్నాడు.

-- భగవద్గీత

దేహి అనగా దేహధారి ప్రకృతి బద్ధుడై నందున, దేహ ధర్మములకు (అంతఃకరణములు + ఇంద్రియములు) మరియు స్వాభావిక ప్రకృతులకు అతీతుడు కావడం దుర్లభం.

పైగా, ప్రారబ్ధ బలం, (అనగా స్వేచ్ఛ, పరేచ్ఛ, దైవేచ్ఛల బలం) --- అన్నియు కర్మల కధిష్టానములు.

దేహ ధర్మములు తనవి కావని, తాను వేరని గ్రహించడమే "మాయానాశము. మోక్షము!! సర్వేంద్రియ ధర్మములకు - క్రియలకు తాను సాక్షి - తటస్థ నిష్క్రియా పర ప్రత్యగాత్మ" --- ఈ అనుభవ జ్ఞానమే వేదాంతజ్ఞాన పరమావధి.

ఈ సత్య జ్ఞానా నుభవా నందములో నిమగ్నుఁడై (అంతర్ముఖుడై) "తదేక నిష్ఠ, ధ్యానమే" యోగాభ్యాసము - అన బడును.

మనస్సు - జాగ్రత్త - మనోవృత్తులఁవేగముల ను గుర్తించు, గమనించు "నీవు" వేరని జాగ్రత్త పడుము. "కామ- మనో- మాయ" శరీరములు తమ అభివృద్ధి ప్రగతులకు పాటు పడునే గాని ------- "నీ" నాశనమును గర్తింపవు. నీ "స్వస్వరూప"

ధ్యానమునుండి, ఏమరించి, విషయముల ఎఱ జూపి, మభ్యపెట్టి, మాటి మాటికి, ప్రక్కలకు లాగి, వాటి దిశకు త్రిప్పు కొనును. జాగ్రత్త. తన్ను మాలిన ధర్మము మొదలు చెడ్డ బేరము సుమా!!

మనస్సు :-

శుక్తిలో వెండి లేదు
మృగ తృష్ణ లో నీరు లేదు,
త్రాటి లో పాము లేదు,
మ్రోడు లో మనిషి లేడు.

ఆలాగే, గగన కుసుమం, వంధ్యా పుత్రుడు, కుందేటికొమ్ము ---- భ్రాంతిజన్య, అనుభూతులు. ఇదే "మనస్సు" యొక్క స్వరూపం.

సుదీర్ఘ - బహుకాల - కల్ప కల్పాంతరాల (అనంత కోటి జన్మల) నుండి సంప్రాప్తమైన సంకల్పముల ఫలా ఫల విషయాను భవ వాసనలు - స్మరణలు, చింతలు, ---- తెరలు తెరలుగా- సాగర తరంగముల వలె మనః ఫలకం మీద దొర్లడం ---------- విధి బలీయమై నిర్విరామంగా "మనోవాహిని" --- దశేంద్రియములనే ప్రియ సాధనముల నాశ్రయించి బాహ్య ప్రపంచమందలి "విషయముల" వేటకై పరువులు తీస్తునే ఉండును.

"నాయనా" ఒక వేళ నీ మనస్సు చంచలమై స్థిమిత పడక,
కాలు కాలిన పిల్లి వలె, ఎక్కడికెక్కడికో పోవుగాక,
నీవు మాత్రము నీఇంద్రియములను
ఆదెస పోనీయకుండా కాపాడుకో

- **"కబీర్"**

నీ మనస్సును, ఇంద్రియములతో చేర్చి నీదైనందిన చర్యలన్నియు నాపట్ల, నాకై నివేదింపఁబడుతూన్నట్లు నా పరం చెయ్యి; నీదేం పోదుగా మరి! ఇదే నిజమైన (ఆత్మ) పూచీ - "ఈశ్వర ప్రణిధానం" -

శ్లో|| ఆత్మాత్వం- గిరిజా మతిః పరిచరాః ప్రాణా శ్శరీరం గృహం|
పూజాతే విషయోప భోగరచనా నిద్రా సమాధి స్థితిః |
సంచారః పదయోః ప్రదక్షిణ విధిః స్తోత్రాణి సర్వాగిరో |

యద్యత్కర్మ కరోమి తత్తదఖిలం శంభోతవారాధనం|| -- (స్పష్టము)
ఇదే ఈశ్వర ప్రణిధానము.---

ఈ ప్రత్యేక వ్యాసము చదువ(దగును.

ప్రతి ప్రాణి సహజంగా అభిలషించేది, ఆశించేది " దుఃఖ నివృత్తి - ఆనంద ప్రాప్తి" ఎందుకన అది ఆనంద స్వరూపు డైన జీవునికి సహజము. సచ్చిదానంద స్వరూపుడైన "పరమేశ్వరాంశ మేగదా "జీవుడు". తన లక్షణములే జీవునియందు కూడా ద్యోతమగుట వల్ల - "జీవదేవుల" యవినాభావ సంబంధము వూహ్యాము.

మరియు కార్య కారణ వాదము సత్య దర్శనానికి దారి తీస్తుంది. కారణం లేనిది కార్య రూప స్థితి అర్థం కాదు. వైద్య శాస్త్రంలో దీనినే "రోగ నిదానం" అంటారు.

కారణం అర్థమైతే, కార్య జనన - జాతక వివరాల రహస్య స్వరూపము, తన్నివారణోపాయము, నిర్ణయింప సులభం, సుకరం, సుసాధ్యం-

మరియు ---

దేవు(డు ఎందుకీలా జీవ స్థితిని పొందెను? ఈ విషాద చ్యుతితో(జీవ స్థితిలో) భీతి, బాధ, వ్యధ, విచారము, అజ్ఞానముల తో క్రుంగి పోవడం ఎందుకు? దీనికి కర్త యెవ్వరు? కారణ మెద్ది? మొదలగు భగవంతుని త్రివిధ పతన సోపానముల విమర్శించి - తెలుసుకొని, జాగ్రత్తగా కీలు- వీలు- మేలు, తెలుసుకొని తిరోగమించి స్వస్థితి (స్వస్వరూప - సహజత్వ) ప్రాప్తికి పూను కోవడం ఎట్లు? ఇదే మోక్ష ప్రాప్తికి శరణ్యా దివ్య పథము!!

నానా నరక యాతనల నుండి విముక్తి నంది, చెర వీడి, అభయ భద్రతలతో, సరళ, పరిశుద్ధ, శుభ జీవనానందమే మానవ జీవిత లక్ష్యం. కాని, ప్రారబ్ధం మానవుని (ప్రాణం) కర్మోన్ముఖుణ్ణి చేస్తుంది. కారణం? ఇది కామ (ప్రకృతి జనిత) దేహం.

"జీవత్వ పతన" త్రివిధ సోపానములు"

1. దేహ ప్రవేశం.
2. దేహాత్మ బుద్ధి

3. బాహ్యప్రపంచ మందలి విషయములందు తగులు. "Close"

"దేవుడు జీవుడై - బంధితుడై - పతనము చెందిన గాధ వరుస ఇంతే"!!

కాని --

"సర్వ కారక, సర్వ వ్యాపక, సర్వ నియామక - అనాది, అనంత, అఖండ, అద్వితీయ, అసమాన, అద్భుత సచ్చిదానంద పరిపూర్ణ చిద్విలాసమే" పర బ్రహ్మ తత్వము.

"త్వం బ్రహ్మ" - అహం బ్రహ్మోస్మి” !!!

"ఈశ్వరుడు - శక్తి" (భగవంతుడు - మాయ) - జగత్సంసారమున ఆలు మగల వలె రాజించి రంజింపజేయు చిత్ర విచిత్ర లీలా తరంగ విరచిత విశ్వ నాటక రంగమే యీ జగత్తు!!

మనుష్యుడు లేకున్న నీడ లేదు. నీడ కలదన్న మానవుడు (కారణం ) లేక సాధ్యమా? ఇదే ప్రకృతి పురుషుల అవినా భావ సంబంధ బాంధవ్య సరళి.

"జ్ఞాన మయుఁడను పేర ప్రఖ్యాతిఁ గాంచు,
జీవునకు, బ్రహ్మ మాత్మయై - చెలగి నట్లు
బ్రహ్మ మానంద మయ మనం - బడుచు దాని
కాత్మ యయ్యెను, దనకు దా- నాత్మ యగుట.

ఫల ప్రశ్నలుః-

"బ్రహ్మ జ్ఞాని - అజ్ఞాని" దేహాంతరమున బ్రహ్మమును పొందుదురా"? - అను సందేహ చింతతో జగత్తును సృష్టించి అందు తా ప్రవేశించెను తానే

"అతడట్లే జగత్తునకు ఆత్మయై యీ అచేతనమునకు చేత నంబయ్యెను!!."

"జడాంతర జ్ఞానము రూప నామ రహిత సత్తాగా చేతనములై చెలంగు, తదితరంబు అచేతనంబు (జడము); " సదసత్, చిదచిత్” పదార్థాల వివరంబిదియె!!

క్లుప్తముగాః-   ఆది యందు అవ్యాకృతంబైన బ్రహ్మాంబు నుండి, "చేతన + అచేతన "  సృష్టి ద్యోతమయ్యె!

"కారణంబైన బ్రహ్మంబె - కార్య మగుచు,|
తన శరీరంబుగా జగంబును సృజించె|
కారణ బ్రహ్మయే యిట్లు- కార్య మగుట,
చక్కగాఁ జేయఁ బడె ప్రపంచంబటండ్రు||

--" తైత్తరీయము"

నిర్గుణ - ఆకాశము, గాలిని సృష్టించిన
సగుణ - దృశ్య విశ్వాన్ని సృష్టించిన
} భగవంతుడు, సగుణ నిర్గుణములకు అతీతుడు.

అనంత విశ్రాంతి తో విసుగెత్తిన సర్వేశ్వరుడు, కేవలం వినోద విలాసాభిలాష తో ( Simply for a change ) ఒక చిన్న సంకల్ప ఫలంగా - జగన్నాటక వినోదమును చూచేందుకై కాబోలు   "దేహం చెర"  ------ ధనదార "పుత్రాది" సంకెళ్ళు

అరిషడ్వర్గ దురాక్రమణ -------- విశ్వ విషయ లంపట - త్రిగుణానుబంధ  విశాల విస్తరణ తరంగముల గాఢ తాకిడులు ---- నానా భ్రష్టాచార దుర్గతుల కాలవాలమైన ఉపాధుల ప్రాప్తి  ------ పాపం! స్వయంకృతాపరాధిమైన భగవంతునికిక ముక్తీ - శీఘ్ర విమోచన మార్గమే లేదా? ఇక భగవంతునిగతి ఇంతేనా? విచారించి, సహకరించి పుణ్యము కట్టుకోరా?  జై భగవాన్!!

ఈ దేహ బృహత్ వ్యూహమునుండి విడుదలకై ---- అంతర్యామి - ఆశీర్వదించు -- ఉత్తిష్ఠ !! ప్రభూ సుప్రభాతం!!!

మానవుఁ డొక్కడే  భగవంతుని పిలువగలడు!!   అమృతత్వమునకు అఱ్ఱులు చాచి అందుకోఁగలడు!!  అందే లయించి అమృతత్వము  అవఁగలడు.

దేవునియందు విశ్వాసమే అమోఘ మైన వరప్రసాదము. దైవమేగతి.- శరణ్యము - ప్రాపు - రక్ష అని విశ్వసించిన, శాంతి, సుఖము, భద్రము తథ్యముః మోక్షము వేరు ఘుట్టము సుమా!!

జీవుడు చతుర్దశంబున బంది- కాని, - చతుర్దశ ("పంచ కర్మ + పంచజ్ఞాన + అంతఃకరణ చతుష్టయ - వెరశి పదు నాల్గు) -

--- పంచకోశాతీత

--- పంచప్రాణాతీత

--- ద్వంద్వాతీత

--- సంకల్ప వికల్పా తీతుడు ---- కాగలడు!!

ఒక్కొక్క ఇంద్రియమును జయించుట, ఒక్కొక్క లోకమును జయించినట్లే. ఇంక సంపూర్ణ ఇంద్రియ జయం, చతుర్దశ భువన విజయమే.

ఇదియే ఏకాదశి వ్రతమని కూడా అందురు. సనాతన సాంప్రదాయ సిద్ధమైన ఏకాదశి మహత్యా రహస్య మిదియే. దశేంద్రియములను క్రమముగా ఒక్కొక్క రోజున , కేంద్రీకరించిన సాధనా సామర్థ్యముతో ఒక్కొక్క ఇంద్రియమును జయిస్తూ, 11వ తత్వమైన మనస్సును " ఉపవసించి" (అనగా లక్ష్య ధ్యేయ బ్రహ్మ స్థానమందుంచి -----) ధ్యాన ధారణ సమాధి స్థితులను క్రమముగా నందుకొని ధ్యాన ఫలితానందమును ----, ద్వాదశి రోజున సంతృప్తిగా సంతర్పణ మనుభవించుటయే "పారణ" మందురు.

మనస్సు_-- సంకల్ప స్వరూపిణి - మనస్సు కరిగి లయించి

నప్పుడు విశ్వంకూడా మాయ మగును

--- "మైత్రేయోపనిషత్"

కాని, -

మనస్సు మూర్ఛ- తురీయావస్థ లందు

అఖండ దివ్య తేజస్సుతో (పొగ - వేడి లేని) మునిగి లయించినప్పుడు --

(అంగుష్ట ప్రమాణుడైన పురుషుడు -- ప్రత్యగాత్మ – నిష్క్రియ - తటస్థ - కూటస్థ సాక్షి తేజస్సు లో) ----

అనగా ---

నీటిలో చక్కెర - ఉప్పు కరిగి లయించినట్లు -

మిగిలి పోవు ఆయఖండ అద్భుత తేజో విలాస మే "ఆత్మ" (ప్రత్యగాత్మ) -- అపరోక్ష దివ్య మధురాను భూతి ఆత్మానుభవం - అనశ్వర పెన్నిధి- అమృతత్వం - అక్షరత్వం - అఖండత్వం- !!

సర్వ సత్వమైన పరమార్థము ( బ్రహ్మము ) ను జ్ఞానమయమైన భక్తి ప్రపత్తులతో, అఖండ గౌరవ ప్రేమాతిశయములతో, ( ప్రగాఢ వాంఛ), తదనుకూల ప్రవర్తనముల తో నిమగ్నమగుటయే "ఉపనిషన్మత ధ్యాన విధానము" -

పరమ గురు(డు పరుస వేది - తమ తప శ్శక్తి ఫలమును దార పోయగలరు -

బాల గంగాధర్ --- గాంధిజీకి

శ్రీ రామకృష్ణ పరమ హంస --- వివేకానందునకు

ఉపాసినీ బాబా మరియు బాబా జాన్ లు -- మెహర్ బాబా కు

తమ తమ తపశ్శక్తులను ధార పోసిరి.

శ్లో|| ఉద్ధరే దాత్మ నాత్మానం నాత్మాన మవసాదయేత్|

ఆత్మైవ హ్యాత్మనో బంధు రాత్మైవ రిపు రాత్మనః||

తా|| తన యభివృద్ధి కి తానే కారణము. తా నుద్ధరించుకొనుటలో న శ్రద్ధ వహించి, అధోగతిపాలు కా కూడదు. ఇంద్రియముల నిగ్రహించిన తన మనస్సే తనకు చుట్టము. నిగ్రహింపని మనస్సే తనకు శత్రువు.

కాని, సాధకులు తమను తామే ఉద్ధరించు కోవాలి!!

-- భగవద్గీత. అ .6 .శ్లో .5.

మనస్సును అమనస్సు గాను

హృదయం చిన్మయంగాను

జ్ఞాన చక్రంతో, సంకోశ చ్ఛేధనము చేసిన - కామ క్రోధాధి అరిషడ్వర్గ విజయ ఢంకా మ్రోగు తుంది!!

నేను ---- నాది

ఇది ----- అది

అహంకార - మమకార చింతనమే మనస్సు!1

ఇట్టి విపరీత - విబేద భావనలు నశించును, మనస్సు నశించును!!

"మనస్సు" వట్టి భ్రాంతి - భ్రమ - మాయ - గ్యాస్ అనుకో!! నీదేమి పోయిందిలేదు - పీడా వదులుతుంది గదా!!

" బ్రహ్మ చింతన యేలాగ?" -- తుదకు నాకేమీ తెలియదే - ఏమిటో" - ఏమో" అనే ధ్యానించు, ఆయన్వేషిత బ్రహ్మమే చే(దోడై , దారి చూపి, దరి( జేర్చి, తరింప జేయుట తథ్యము.

అయితే త్రికరణ శుద్ధిగా ----

" శరణాగతి, సర్వార్పణ," మత్యంత సులభ, సుకర,శుభ పథము!! అభయం!!

మోక్ష దుర్గమునకు ప్రవేశపు షరతులు రెండు :-

1. నీ యర్హత :- పూర్వజన్మ పుణ్య - శుభ సంస్కారముల ఫలము - మరియు ఈజన్మమున పురుష ప్రయత్నము సాధనలు.

2. నా యనుగ్రహము :-

ఇక జీవత్వ స్థితి నుండి దివ్యత్వ సహజ స్థితికి మార్గమేలేదా? నిరాశ నిస్పృహ లేనా మిగిలేది? సావధాన ! అభయం!!

నీవు అమృత మయుఁడవు - నీస్వస్వరూప స్వారాజ్య పదవికై - పురోన్ముఖుడఁవుగమ్ము!!

పుణ్య గాధలు - దివ్య చరిత్రలు - పుణ్యక్షేత్రయాత్రలు -వేదాంత చర్చలు - భోధలు – శ్రవణ మననాదులు- పంచశీలముల సహకారము - మానవునిలోని పవిత్ర - పునీత - దివ్యత్వ - ఆధ్యాత్మిక సంస్కారములుద్దీపితములై, విజృంభించి, సద్వాసనలు పరిమళించి, ఊర్ధ్వకుంతల గతుఁజేయును.

" సత్సంగ త్వే నిస్సంగత్వం" అన్నారు శ్రీ శంకర భగవత్పాదులు.







కావున, మనస్సు అంతర్ముఖమైన, విషయ దూరమై, నిర్మలమై, స్థిరమై, బలీయమై, శుభ (ఆత్మ) వాసనలు, పరిమళించి, పునర్జన్మ బీజములు నశించును. మనస్సంబంధము చేత, జీవాత్మయై యుండెను. అమనస్క సిద్ధితో ఆత్మాంశ (ప్రత్యగాత్మ) పరమాత్మ యందు లీనమై పోవును.

మనస్సు :- 1. ప్రవృత్తి రూపేణ :-

దేహ ప్రాప్తి - దేహ దారణ - సంసారము - జీవత్వము కేవలం ప్రారబ్ధ ఫలాను భవ జీవ శిక్షణ కారణం - సాధనం ఉపాధి రూపేణ -

బహు జన్మ సంసార సంబంధ ప్రభావంవల్ల "మనస్సు" నిత్య బంధువై --

| | | |
|---|---|---|
| అభీష్టముల సాధించి చేకూర్చగల | - | సేవకుడు |
| ఆలోచనలకు సహకరించు | - | మంత్రి |
| ఇంద్రియ జయమునకు తోడ్పడు | - | సామంతుడు |
| ఆనందము నివ్వగల | - | ఇల్లాలు |
| జ్ఞాన ముపార్జనకుపకరించు | - | గురువు |
| పాలించుట చేత | - | తండ్రి |
| లాలించి ఆనందము నిచ్చుటచేత | - | తల్లి |
| విశ్వాస పాత్రుడగు | - | మిత్రము |
| చిత్ర విచిత్రముల జూపించు | - | మాంత్రికుడు |

కాని

2. నివృత్తి సాధనోపాయములు :-
   a. ఇచ్ఛా త్యాగము
   b. ఇష్ట వస్తు పరిత్యాగము
   c. ఇష్ట వస్తు దూరము

} దీనిని అసంకల్ప శస్త్ర మందురు.

ఇవి మనో నాశమునకు, నివృత్తి సాధనకుపకరించు "అసంగత్వ" కీలకములు. మరియు శుభగతి, సద్గతి, ముక్తి, మోక్షము, ----- స్వస్వరూపాను సంధానమున కుపకరించు దివ్య పథము.

చిత్త జయంతో శాంతి,
అమనస్క స్థితి తో బ్రాహ్మ స్థితి
తురీయ ప్రాప్తి.

ఓం

## 2. మనస్సు.

## ప్రవేశిక

**సుభోధ**

" మనస్సు" అనగా సంకల్ప వికల్పము లెచ్చట నుండి పుట్టునో
" బహు జాగ్రతగా - తీవ్ర సాధనా శక్తి తో క్షణ క్షణమును -
సుదీర్ఘం గా, కనీసం 1 నెల -2 నెలలు- నిష్ఠ తో గమనించు.
మనస్సు అంతర్ముఖమై - దొంగ వలె దాగి తుదకు అదృశ్య మౌతుంది.
యీ అభ్యాసమే అమనస్క యోగ సిద్ధికి పునాది అగును.

మనస్సు ఓం
" క్షణమేకంక్రతు సహస్రంవా "
తా|| ఒక క్షణం మనస్సును, నిగ్రహించడం -
వేయి యజ్ఞముల సమానము.

సంకల్ప వికల్ప స్వరూపమే " మనస్సు"
" స్థిర తా నహి నహి రే మానస
స్థిరతా నహి నహిరే "
-- " కబీర్"

త్రిదశలందు - త్రిపురములందు సంచరించు " జీవత్వమే" మనస్సు లేక త్రిపురాసురుడు.

త్రిపురాంబ- త్రిజగద్వంద్యా – త్రిమూర్తి - త్రిదశేశ్వరి – త్ర్యక్షరీ - త్రిపుర సుందరి- ప్రత్యగాత్మ – (ఆది) పరాశక్తి - జగ జ్జనని - తేజోవతి ---

-- శ్రీ లలితా సహస్ర నామ స్తోత్రం(626 – 630, 234, - , 572, - ,452).

జీవత్వమును పోకార్చి దివ్యత్వమును ప్రసాదించు దేవ దేవి - ప్రత్యగాత్మ.

"సంకల్ప మే మనస్సు" - "మనస్సే సంకల్పము"

- బుద్ధి, క్రియ, అహంకారము, ప్రకృతి, మాయ, బంధము, చిత్తము, అవిద్య, ఇచ్ఛ, వృత్తి, సర్వం.

మనస్సు ఇంద్రియములకు (10 + 4) రాజు. -ఇంద్రుడు బలీయమైన మోహనశక్తి.- నర్తకి చతుష్టయం, ప్రమాదకారి - ఇంద్రజాల మహేంద్రజాలముల కధిష్టానము.

సంకల్పముల వల్ల మనస్సు పుట్టును. సంకల్పములే మనఃస్వరూపములు. వాసనలు (సంస్కారములు - ఇంద్రియముల ద్వారా పూర్వానుభవ స్మృతులు - అనుభూతులు) సంకల్పములకు బీజములు. సంకల్పములే మనస్సు. - నిస్సంకల్ప స్థితియే అమనస్కయోగ సిద్ధి - మోక్ష స్వరూపము.

" ఏకా కార చిత్తవృత్తి " - ధ్యేయాకారమగుటయే సమాధి. అదే ధర్మ మేఘము. చిత్తైకాగ్ర్య స్థితి నభ్యసించుటయే, మనో జయ విద్యా విధానము.

మానవుని మనస్సు - ఉపాధులలోకెల్ల మిక్కిలి బలమైనది. నిగ్రహానుగ్రహ (ఆశీర్వాద - శాప) శక్తుల మహిమ గలది.

మనస్సును (జ్ఞాన - యోగ మార్గములందు) సంస్కరించి, నిత్య నిరంతరాభ్యాసాదులచే బలపరచి, శక్తి మంతముగాను, తేజోవంతముగాను, చేయుటయేగాక, బహు జాగరూకతతో మెలుకువగా, ఉపయుక్తంగా, లోక కల్యాణార్థమై, అనునయంబున, ఉంచుకొనవలెను. అమూల్యమైన, అనంత శక్తి మంతమైన, దివ్య మనశ్శక్తిని మించిన, అస్త్ర శస్త్రాదులు లేవు. జీవాంశ బ్రహ్మావారసు.

ఆనంద స్వరూపమైన దైవాంశము జీవాంశమందున్నది. అందువల్ల మానవుడు, పరమాత్మ సామీప్యమును పొందుచున్నాడు.

జీవాత్మ = (ఇంద్రియ + మనస్సులతో) కూడిన "ఆత్మ".

ఆత్మ స్వత సిద్ధమైనది. పరాపేక్ష, బాహ్య ప్రయత్న సాధనలనవసరం. జ్ఞాని నిర్వికారి - ద్వంద్వాతీతుఁడు. అతడున్నచోటే పవిత్ర క్షేత్రము, దివ్య తీర్థము. మనస్సు యొక్క నిర్వ్యాపార స్థితియే సమాధి. జాగ్రత్స్వప్న సుషుప్తులే మనస్సు యొక్క త్రివిధావస్థా బేధములు.

ధ్యానము -

ఇతర చింతలు, తలంపులు - సంకల్పాదులు మాని, నిశ్చలతను, ఏక లక్ష్య

(ధ్యేయ ప్రత్యగాత్మ) చింతనుండుటయే "నిర్మలోద్యోగము" -

" అచల స్వర్గమాకాశ జల నిధులు పర్వతంబులు,
అచల మూర్తుల ధ్యానించు చుండనగును"

-ఇదే ధ్యానొపాసన

"చిత్త వృత్తి నిరోధమే యోగము"

- పతంజలి

సామాన్యంగా భగవద్ధ్యాన సమయమున, చిత్త వృత్తులు విజృంభించి, ప్రతి ఘటనలను ప్రదర్శించి, కలవరపెట్టి, నానా అగ్ని పరీక్షలకు గురిచేసి, సత్ప్రయత్నముల నెల్ల భంగ పరుపఁజూచును. మహాముని శ్రేష్ఠులు, యోగి పుంగవులు సహా తపో భంగమున కెఱయై, చ్యుతిని పొందిన గాథలు కూడ మెండు.

మనస్సు నకు ఇంద్రియోద్యోగము - (ఇంద్రత్వ పదవీ నిర్వహణము - విషయ లంపటత్వము) సహజము; వెనుకటి గుణము; కాని, నిష్ఠ, నిగ్రహము, ధ్యానము, మొదలగు సరి కొత్త పోకడలు దానికి అసహజములు; అలవాటులేని, కడుంగడు దుస్తర ప్రయత్నములు. అయినను పురుష ప్రయత్నేన సుఖీభవ. ప్రవాహంలో పడి కొట్టుకొని పోవడం సులభం. ఏమియు శ్రమ వుండదు. కాని, ప్రవాహాని కెదురీదడం దుస్సాధ్యం - దుర్లభం -దుస్సాహసం - బాధాజనకం - భయంకరం - కాని, సత్ఫలదాయిని, మనస్సు - ఆత్మ బంటు; దేహ "భవన" రక్షణ పోషణ సుఖాదుల చేకూర్చు హితేషుడు. ఘూర్ఖా, శత్రు పక్షం చేరిన "ఆత్మ" ద్రోహం తప్పదు. స్వామి పతనం తథ్యము.

ఇంద్రియములు - సంకల్పములు -
ఇంద్రలోకమనగ - ఇంద్రజాలమనగఁ -
ఇంద్ర పదవి యనఁగ నిన్ని యొకటె
కలియుగమున నరులు కానరు భ్రమచేత ||విశ్వ||

అన్నియు మనోమాయాజాల, ఇంద్రియక్రియలే!! సర్వం మనోమయ రాజ్యమే. కాని, మాయ కూడా బ్రహ్మలోనిదే. ఇక బ్రహ్మ భిన్న పదార్థమెద్ది? బ్రహ్మేతర పదార్థమున్నదన్న "ద్వైత" మొప్పు కోక తప్పదు. అనగా దృశ్యాదృశ్య (సదసత్) వివేకము కేవలం కల్పితమని, సర్వం - అద్వితీయం బ్రహ్మ - సర్వం ఖల్విదం బ్రహ్మ.
వేద ప్రవచనాలు శిరో ధార్యములనక తప్పదు.

"పురుషునిలోని శక్తి" పురుషునికన్న భిన్నమెట్లగును? అర్ధ నారీశ్వర తత్వము - విష్ణు హృదయస్థ లక్ష్మి, బ్రహ్మ ముఖస్థ భారతు లంతేః ప్రకృతి పురుషుల అనాది అవినాభావ సంబధమతి నిగూఢము. అపర్యాప్తము. అతర్క్యముః అవిభాజ్యము -

ప్రళయాంతమున, అదిలోవలెనే, సమస్త దృశ్యములు సత్తాహీనమై, స్వ స్వరూప (బ్రహ్మ) మందు లయించి, స్వస్థితి - నిర్గుణ నిరాకార సహజ స్థితియందు బీజమాత్రముగ లీనమైయుండును.

"ప్రపంచోపశమనం శాంతం" - శ్రుతి

దీనినే బీజాంకుర న్యాయ మందురు. చెట్టు లేకున్న విత్తు లేదు - విత్తు లేకున్న చెట్టు లేదు. ఇదే ప్రకృతి పురుషుల అనాది అవినాభావ సంబంధ బాంధవ్య రహస్యక్రీడా వినోద గాథ.

మనోజయ మార్గములు.

1. శాస్త్ర జ్ఞానం (పరోక్ష) - సాధన చతుష్టయ సంపత్తి.
2. గురు అనుగ్రహం - అనుభవబోధ - హస్త మస్తక సంయోగం - ఆశీర్వాద పద్ధతి.
3. జ్ఞాన సాధనలు :-
   a). "నేతి నేతి" - దృశ్యం నశించి దృక్ (సాక్షి) శేషించుట
   b). పంచకోశ విమర్శ - ప్రజ్ఞమిగులుట.
   c). దేహత్రయ - అవస్థాత్రయ విమర్శః ఎఱుక - తెలివి
   ఆత్మసాక్షాత్కారమై "అద్వితీయం బ్రహ్మ" నిల్చుట

విషయ వాసనలు - ఇంద్రియముల భూత కాలానుభవములు - విషయానుభవ స్మృతులు - సూక్ష్మ రూప సంస్కారములు.... ఇవే "జీవత్వ" కారణము. హృదయ గ్రంధులు - చిద చిద్గ్రంధులు (ముళ్ళు) అందురు.

పూర్వానుభూతుల స్మృతి బీజ రూపమున "దేవుని జీవుని( జేసి" - దేహ పుర బందీగా - (పురుషునిగా) - స్వస్వరూప జ్ఞానం మరుగు పరచి "అహంకార" వ్యవహార స్థితిలో దేహేంద్రియాత్మ బుద్ధితో, అకర్త కర్తనని భ్రమసి, భ్రాంతి నొంది --- బాపురేః ఏమిటీ మహేంద్రజాల ఘోర మాయా వ్యూహ్యము!! ఈ మాయ (మోహ) నాశమే మోక్షము!!

1. ఇంద్రియ నిగ్రహముతోఁబాటు, జ్ఞానాగ్ని, దృఢ బోధ లుండిన్ని, (విషయ) వాసనలు నశింపకున్న - కర్మ (పునర్జన్మ) బీజములు నశింపవు.
2. రసక్రియ - మనోజయ విద్య - మారుతీ విజయ పూజ - అనగా మనోరూపమగు సంకల్ప వికల్ప నిగ్రహము - మనస్సును అంతర్ముఖ మొనర్చుట -
3. "వృత్తి" నాశకర (నివృత్త) "శవణ, మనన, నిది ధ్యాసనాదులు క్రమముగా అభ్యసించి సాధించుట.
4. ధ్యాన పరం - సగుణోపాసనతో ప్రారంభించి, నిర్గుణోపాసనతో తరించుట (అమనస్కయోగం).
5. మనో + మారుతంః (జప + అజప గాయత్రుల) అభ్యాసం (లయ యోగం)
- 6. ప్రాణాయామాది (పంచ ముద్రల) తారక యోగం.
7. ఆత్మ (ప్రత్యగాత్మ) ధ్యానం - (ప్రజ్ఞానంబ్రహ్మ) -

మనో దోషములు ఆత్మనంటవు. - మనస్సు జడము; స్వతః గా వ్యాపారము చేయ జాలదు. అశక్తము. "ఇది బ్రహ్మము - ఇది ప్రకృతి" - అని గ్రహించు తెలివి మనస్సుకు లేదు. కాని, ఈ సత్యమును గ్రహించు "తెలివి" యే స్వయంప్రకాశకుఁడగు పరమాత్మ స్వరూపుడుః అంతర్యామిః ప్రత్యగాత్మ, కూటస్థ సాక్షి!!

అనగాః-

"ప్రకృతి - పురుషుల" వివేకమునకు, ఆత్మకు గల స్వయంప్రకాశ జ్ఞానమే మూలము; కాని, మనస్సు కాదని భావము.

మనస్సు - అసత్తు; అణుప్రమాణము - దాని దోషములు ఆత్మ నంటవుః

మనస్సును "శశ విషాణ సూర్యః" - దృష్టాంతముగా తెల్పినారు. ఆనగా, చంద్రుని యందు కుందేలు లేదు; ఉండెపో, దానికి కొమ్ము లేదు, తుద కుండెనా, అది సూర్యున కేలాటి హనియుఁ జేయ జాలదు!!

తద్వతు - అసత్తయి, అణుప్రమాణమైన మనో దోషములు " "సత్తు-చిత్తు" అయిన స్వయంప్రకాశమున కెట్టి హాని - కళంకము న్యూనత నాపాదింప జాలవుః నిప్పును చెదలంటనట్లు, బ్రహ్మ నంట జాలవని తాత్పర్యము!!

"పురుషుడు వేరు - ప్రకృతి వేరు" అను భ్రమయే ద్వైత కారణము. . వస్తు రూప నామ రహిత, సత్య దర్శన, తత్వ జ్ఞానమే "మాయకు బ్రహ్మాస్త్రము": "ఆత్మ" సత్యం; తదితరం సర్వం "కల్పితం" - అంతా చిత్ర విచిత్ర - విపరీత - విభేద రచన మాయా జాలము. కాని - అత్మ తత్వము, నిత్యము, సత్యము, నిర్వికల్పము, ఆనందము, జ్ఞానము, శాంతము, అద్వితీయము, అప్రాకృతము, లోక విలక్షణమైనది.

యుక్తి - ఉపాయము - విచారముల సాయమున విషయముల (విష స్వరూపముల) నిజ స్వరూపము నిర్ణయించి, నిశ్చయానంతరం, సత్య దర్శనం తథ్యం. అనుభవ జ్ఞానానందమే అపరోక్షాను భూతి!!

భగవంతుడు సర్వం సృష్టించి తాను తటస్థుడుగా (సర్వ సాక్షిగా), నిర్వికారంగా ఉండటం అతని శక్తికి మించిన పని కాదు కదా!!

-- బ్రహ్మ సూత్రములు. భాగం II. ఆధ్యాయం. I. సూత్రం. 2.




1. సంకల్ప వికల్పాత్మక స్థితియే "మనస్సు"
2. నిద్ర, మూర్ఛలందు మనస్సు లేదు.
3. మనస్సు లేని స్థితియే అమనస్క స్థితియనబడును.
   ఇచ్చట మనోవృత్తులు, ఇంద్రియ క్రియలు రద్దు. దేహ జ్ఞానమే లేదు: లోక జ్ఞానం అంతే!!
4. ఆలోచనలు లేని మనస్సు ఉన్నదనుట స్వవచన విఘాతము - నిరర్థకము, శూన్య ప్రకటనము.

5. దృశ్యమంతరించిన ద్రష్ట లేడా?. ఉన్నాడు!! ఆలా మిగిలిన సాక్షియే ఆత్మ (ప్రత్యగాత్మ) -
6. సర్వ దృశ్యములు అదృశ్యమైనప్పుడు "ఆత్మ" స్వయ కాంతితో ప్రకాశించును: --- కూటస్థ -నాటకదీపము - సాక్షి -ప్రత్యగాత్మ - ఆత్మ.

-- యాజ్ఞ వల్క్యుడు.

బ్రహ్మాండమునంతయు నావరించిన, అఖండ తేజో రాశి (స్వర్ణ ద్రవ సాగర) రూపమే "పరబయలు" -

ఆత్మ పరి పూర్ణము. కాని, మానసిక ఘట్టమునందు జీవునకు పరస్పర వైర వైరుధ్య, విభిన్న స్థితులు గలవు.

మనస్సంబంధ శక్తులే మానవత్వమును గలిగించును. తత్వదృష్టి యందు సర్వము నందతర్యామి యైయున్న సత్పదార్థమే లేకున్నచో జీవాత్మలసలే లేవు.

అంతర్భూతమై - అంతర్హితమై యున్న దైవ శక్తి పూర్ణావిష్కరణ మంది నప్పుడు, మానవత్వము లక్ష్య సాఫల్యము నందును. ఇదే ముక్త స్థితి!!

అనంత స్థితి నందుటే, పూర్ణ దైవత్వము, తురీయావస్థ, స్వస్వరూపాను భూతి -- దీనినే "సప్త పరిణామ శిఖరారోహణ" మందురు.

విదితాత్ముఁడగు నాతడాత్మయే సర్వత్ర - సర్వముగాఁ గాంచును. అఖండ చిద్విలాసాను భూతి!!!

అట్లు జీవ బ్రహ్మైక్యము (బ్రాహ్మి స్థితి) నందిన వాని కెన్నడు "ఇహ-పర" చింతలు, దుఃఖములుండబోవు.

సమస్త సృష్టి - దృశ్య పరిణామములు దేవుని నుండి వచ్చినవే. అందులకే గదా ఐక్య శాంతికై తహ తహలు!!

------ నదులు సాగరమును చేరుటకై పరువులు తీయు నట్లు

------ పిల్ల తల్లి ఒడిలో జేర ఆరాట పడుచున్నట్లు,

------- జీవుడు దేవుడుగా మారుటకై పరితపించును.

జన్మ స్థాన గమ్యమే "శాంతి - భద్రతల" నివ్వ గలదు.

ఇంద్రియములు (10 + 1). బ్రహ్మ నుండి పుట్టినవి. పరిమిత శక్తి గలవి. సర్వజ్ఞత - సర్వ వ్యాపకత్వ స్తోమతలు లేనివి. ప్రాణ శక్తి (vital force)

ఇంద్రియాతీతము. ఇది కూడా బ్రహ్మ నుండి పుట్టినదే. ప్రాణ శక్తి యన కేవలం "గాలి" కాదు. సర్వేంద్రియాధిపత్యం వహించి, భరించ గల అదృశ్య శక్తి; ప్రత్యేక క్రియాశక్తి, ప్రాణేంద్రియ, దేహ ధారణ, రక్షణలకై - సూక్ష్మమై - సర్వదేహ వ్యాప్తమైనది.

ఇంద్రియములు
(1) అంతరింద్రియములు - అంతఃకరణ చతుష్టయము - బుద్ధి, మనస్సు, చిత్తము, అహంకారములు.
(2) 5 కర్మేంద్రియములు + 5 జ్ఞానేంద్రియములు. (బాహ్యేంద్రియములు)

(1) గ్రహణ శక్తులు (2) గ్రాహ్య సాధనములు.

(1), (2) - యీరెండిటి కలయిక వృత్తులకు మూలము. విషయముల వేట - సంసార కారణము. పునర్జన్మ బీజము - వాసనలకు (హృదయ గ్రంధులకు) నిలయము. మోక్షాటంక కారణముః

ఇంద్రియాధిష్ఠానము - ఇంద్రుడు - మనస్సు

దేవేంద్రుడు - ఇంద్రియాధిష్టాన దేవతల కధి నాథుడు = (మహేంద్రుడు); ప్రత్యగాత్మ.

ఇంద్రియములకు ఆయా యధిష్టాన దేవతల యాధ్వర్యము లేకున్న- "గోళకము" లనఁ బడునుః అదృశ్య విద్యుత్ప్రసారము లేకున్న - రేడియోలు, బల్బులు, ఫ్యాన్లు, స్పీకర్లు, స్టౌలు మొదలు నిష్ప్రయోజక (జడము) లుగా, ప్రాణ హీన శవములవలె క్రియా శూన్యమగును.

ద్రుశ్య పదార్థములందు, అదృశ్య చైతన్య శక్తి (పురుషాంశ) ఆవహించి, చైతన్యవంతము చేయుననుట కీ దృష్టాంత మత్యంతఁ సమంజసము, ఉచిత సాదృశ్యము!!

"తాను వేరు - బ్రహ్మ వేరు" అనెడు ద్వైత బుద్ధికి అశాంతి -భయము తప్పవు. మహాత్ముల సందేశములు - భోధలు - దివ్యాను భూతుల చవి చూచిన పుణ్యాత్ములకు కోర్కెలు చివురింపవు, భయాదులు దరి చేరవు. అట్టి ధన్యులను, దివ్యావేశము, ఆత్మశక్తి, విశ్వాసము, అభయము, తేజస్సు, బలము, విశాల పరిశుద్ధ తత్వము లావహించును.

నిగ్రహానుగ్రహ శక్తులు - అత్యద్భుత లీలాతరంగములు - అవతార (జన్మ)

కార్యభార క్రమాచరణాదులు యధాతథంగా సాగి లోక కల్యాణము జరుగును.

నీటి బొట్టు పాలలోఁ గలసిన "తాదాత్మ్య అగును"
కరిగిన (కాలిన) ఇనుము అగ్నిరూపందాల్చి "
సూర్య కాంతి లో కలసిన వాయువు, "
నీటిలోగలసిన ఉప్పు (చక్కెర) "
ఆత్మ చింతలో నిమగ్నమైన మనస్సు "

జ్ఞాన సిద్ధుల హృదయమందుగల ప్రేమ అంతయు సూక్ష్మాకృతి వహించి, దివ్య పరిమళశోభితమై ...... (అసంకల్పిత) సంకల్పములు గామారి, బ్రాహ్మీస్థితిలో మానవాతీతమైన "రూప - శక్తి - తేజముల" నత్యద్భుత లీలా తరంగ రూపమున ప్రదర్శితమై లోక కల్యాణ కారణమగును.

ఇదే అనుగ్రహ శక్తి. తద్వ్యతి రేకతయే నిగ్రహ (శాప) శక్తి.

ముక్త పురుషులు పూర్ణస్వతంత్రులు. సర్వాధికారులు - నిరంకుశ సర్వ సామ్రాట్టులు. విధి నిషేధములు లేని దివ్య నియంతలు. సర్వాతీతులు. పూర్ణార్పణ చేసుకొన్న నిస్స్వార్థ, ఆత్మోత్సాహ నిరవద్య ప్రవాహమైన జ్ఞానధనులు:

మనస్సు - మనోజయ రహస్యము -

మనస్సు ఆత్మస్వరూపమునందుగల యొక అతిశయ శక్తి: ప్రకృతాంశము. నీడ వంటిది. అసలు ఉనికి లేకనే మనగలది. (మనోవృత్తులను) సంకల్పములను సృష్టించి తద్రూపము నే తన ఉనికిగా కల్పించుకొను, కల్పిత తత్వము.

పసి కందునకు తలంపులు లేవు. లోక బంధములును లేవు. తలంపే మనస్సు. జగత్తు తలంపుల యొక్క స్వరూపమే!!

క్రమముగా పెరిగిన మనస్సు "వట వృక్ష విజృంభణ దాల్చును". నిదుర యందు తలంపులు లేవు. లోక బంధమును లేదు.

జాగ్రత్స్వప్నములందు మనస్సు కలదు. మనస్సు సాలె పురుగు వంటిది.

| Object | Shadow |
|---|---|
| సత్యము | ఆరోపితము (అధ్యాస) |
| బ్రహ్మము | జగత్తు |
| త్రాడు | పాము |
| దేవుడు | జీవుడు |

రెండు ఒకే తూరి కాన్పింపవు: ఒకటి సత్యము. రెండవది ఆరోపితము.
ఒకటి కాన్పించిన, రెండవది కన్పింపదు.

"మనో అన్వేషణమున తుదకు మనస్సే లయించి "ఎఱుక" గా తానై మిగులును.

ఆరోపితము అసలు సత్తాలో లయించి ఏక సత్య రూపముగ "ఆత్మ" శేషించి నిల్చును.

1. లక్ష్య గమ్య సాధనమే ధ్యానము
2. అన్వేషిత వస్తు దర్శనమే ధ్యాన ఫలము.
3. తన్మయమగుటయే - తాదాత్మ్యస్థితియే వేదాంత పరమావిధి-
   ప్రజ్ఞానంబ్రహ్మేను భూతి. - శ్రుతి.

మనస్సు - మాయ - స్త్రీ - విశ్వ మోహన శక్తి -
"ఆడది (మనస్సు) తిరిగి చెడె".

పురుషుడు తిరగక చెడె. (అంటె జ్ఞానార్జన లేక), అనగా ప్రయత్నించక, సత్యాన్వేషణ చెయ్యక అని అర్థము - బయట స్త్రీ ని వదలిన సన్యాసి కాడు. లోని "స్త్రీ" ని (మనస్సును) జయించిన వాడే నిజ మైన సన్యాసి.

మనస్సు - "ఆకాశము + వాయువు" వలె వ్యాపించి విహరించునది.
"మననము" చేయు చుండుట వల్ల మనస్సని పేరు వచ్చినది.




"దేహోహం" చేత -- బంధము
"సోహం" చేత -- మోక్షము

జ్ఞానము = మనోజయ విద్య: యోగము = ప్రాణ బంధము

సంకల్పమునకు మూలము బ్రహ్మము: కావున సంకల్ప ధ్యానమే శ్రేష్ఠము: చంచల మనస్కులు బ్రహ్మ విచారము చేయ( జాలరు. అట్టి వారు చిత్త స్థైర్యమునకై యోగ మభ్యసించవలెను. దాని తో చిత్త మద మణంగును. స్థిర చిత్తులై, కర్తృత్వాభిమానము గలవారు, బ్రహ్మ సాక్షాత్కారమునకు ముఖ్య సాధనంబైన "సాంఖ్య" విచార మొనర్ప దగును.

"సాంఖ్య, తారక, అమనస్క" ము లే రాజ యోగ భాగములు.

మనోవృత్తులే (సంకల్పములే) ఉరితాళ్ళు -

జన్మ సంస్కారములే భవిష్యత్ జన్మ నిర్మాతలు -

జీవిత కాలమందెక్కువగా మనస్సు, ఏ విషయములందు ప్రవర్తించునో, తరచుగా మరణ కాలమందా స్మరణ మే దక్కును!!.

కావున జాగ్రత్త!!!

శ్లో|| "తస్మాత్సర్వేషు కాలెషు యోగయుక్తో భవార్జున –

తా|| అర్జునా! నీ విక ముందు నిష్కామ బుద్ధితో సర్వ కర్మలు నాచరించు చుండుము. నే నే కర్త నని నన్ను స్మరించు చుండుము. అర్చి రాది మార్గమున పోగలవు.

-- భగవద్గీత. అ. 8. శ్లో. 27.

"యోగస్థఃకురు కర్మాణి "

ఉపాయశీలుడవై కర్మలను చేయుము. -- భగవద్గీత.

శ్లో|| "అంత కాలేచ మామేవ స్మరన్ముక్త్వా కళేబరం -
యః ప్రయాతి సమద్భావం యాతి నా స్త్యత్ర సంశయః" ||

తా|| ఎవడు మరణ కాలమున నన్నే చింతింపుచు దేహమును వదలునో, వాడు నన్నే పొందును. సంశయము లేదు.

- "భగవద్గీత. అ. 8. శ్లో. 5.

జితేంద్రియుఁడై, సాక్షాత్కార సిద్ధినంది, లోక కల్యాణ నిమిత్తమై, సర్వ నష్ట కష్టముల ననుభవించు వాడే నిజమైన సన్యాసి. ఉ|| మహాత్ములు.

అకర్తృత్వమే - అహంకార రాహిత్యమే - "తూష్ణీంస్థితి" - కల్యాణరూపమగు ఉత్తమ నిర్వాణము. ఇదే సమాధి - ఉ|| అజగర మహర్షి, జడ భరతాదులు.

యోగులు
భోగులు } వీరికి నిద్ర లేదు.
రోగులు

"మహా మౌనము" (తూష్ణీంస్థితి) - అనగా సమ్యగ్దృష్టి చేఁగల్గు "మనో మౌనమే" (నివృత్తి స్థితి) - మహామౌనమనఁబడును.

ముని - "మూగ - గ్రుడ్డి - చెవుడు" - వలె వుండును.

ఆత్మ వేరు - ఆత్మ భావన వేరు. అనగా భావన లేనిదే "ఆత్మ".

"నిర్భావం నిరహంకారః -

"అమనాః శుభ్రః" - శ్రుతి

"స్థితి లేని స్థితి" - ఏక నిర్మలాను భూతమే,

"నిర్వృత్తి స్థితి " - పూర్ణత్వం - ప్రజ్ఞానం బ్రహ్మః

ప్రపంచ మందలి సమస్త దృశ్యములును చిత్త స్పందనములే!! అన్యము కాదని భావము.

" చిత్తే చలతి సంసారః, నిశ్చిత్తే మోక్ష ఉచ్చతే " - శ్రుతి

మనస్సు లయించి - విశ్వం మాయమగును.

జీవుఁడు ఆత్మ ప్రతి బింబము - నిరుపద్రవుడు. ఆత్మ కూటస్థుడు. (కూటమనగా ఇంద్రియముల కూడలి) - నాటక దీపము - నిష్క్రియాపరత్వ సాక్షి -మన శ్చాంచల్యము లయించిన, ద్వైతము తోచదు.

పరి పూర్ణ స్థిత ప్రజ్ఞుడెవ్వడు?

ప్రళయకాల వాయువులు వీచు గాక! -

ద్వాదశాదిత్యులు, ఏకముగా తపింపఁజేయుదురు గాత!

అగ్ని పర్వతములు పెకలి దశ దిశలా "లావా" విరజిమ్ముగాక!

గాలి, అగ్ని, జలము లొకేసారి స్తభించి లయించు గాత!

ఎన్ని ఉత్పాతములు దాపురించినను, మనో నాశమైన మహాత్ముని కే హానియు జరుగదు. –శ్రీ సీతా రామాంజనేయ సంవాదము

మనోరాజ్యము భద్రమగు గాక!

ఆకాశమంతయు సత్పదార్థమే!

అఖండ చిద్విలాస ప్రకాశమే . . .

తురీయాను భవ అద్వైతానందాను భూతి!!

అన్నిటిని అగ్ని దహించును, అగ్ని నెయ్యది దహింపఁగలదు?

ఆత్మ అన్నిటిని తెలుసు కొనును -

ఆత్మను తెలియు వారెవ్వరు ?

--- అయమాత్మా బ్రహ్మ - శివోహం!!

సర్వం ఖల్విదం బ్రహ్మ (అహం బ్రహ్మోస్మి)

తత్వమసి

ప్రజ్ఞానం బ్రహ్మ

అయ మాత్మా బ్రహ్మ -- చతుర్వేద సార మహా వాక్యములు.

-- శుక రహస్యో పనిషత్, -- వేదాంత పంచ దశి - 5 వ భాగము

బ్రహ్మో భ్యాసము జీవత్వ (మనో) నాశన దివ్య పథము - ఎట్లనగా -

- తుమ్మెద నానా పుష్ప మకరందములఁ గ్రోలి చొక్కుచు
  సంపంగి పుష్పమును తాకెనా తక్షణం చచ్చును
- ఉప్పు - చక్కెర నీట బడెనా, వెంటనే తమ వ్యక్తిత్వమును
  కోల్పోయి, అందే కరిగి, లయించి, తాదత్మ్యమును బొందును.
- కట్టెలు అగ్నిలో బడి కాలి, తమ స్వరూపము నశించి, అగ్నిని
  కూడా ఆర్పి వేయును.
- అస్తమయ సూర్యుడు తన కిరణ జాలమును తన వెంటనే
  తీసుకోని పోవు నట్లు . . . . మనస్సు తన సత్వాది ( వాసనా )
  వికారములతో బ్రహ్మమునందు లయించి, తన్మయమగును.
  అనగా బ్రహ్మోకారమగును.

జీవునకు షడ్భావ వికారములు - వర్ణాశ్రమ ధర్మములు -దేశ కాలాదులు - స్థూల సూక్ష్మాది ద్రవ్య గణములు లేవు.

బ్రహ్మత్వానికి పొర - ముసుగ - తెర వంటిది మనస్సు. జీవత్వ కారణము. ప్రకృతి (జడ) బంధ ప్రాప్తి.

మనస్సే - పునర్జన్మకు బీజము.

మనస్సు - కల్ప కాలమును క్షణ మాత్రముగను, క్షణమును కల్పముగను తోపఁ జేయును. దీనికి నిద్ర యే తార్కాణము. సర్వాను భవము.

"ఈ సంసారం కేవలం మనో విలాసమే"

- నారద సంసారాను భవము.

జీవిత కాలం (ఆయువు పరిమితి) ఒక ఓటు కుండ యందలి జలము వలే

క్షణ క్షణమును క్షీణించుండును.

ఆలాగే "కాల సర్ప" మన - కాలమే సర్పము వలె, జననం మొదలు మరణం వర్కు యున్న ఆయుర్ధాయమును (కాలము) మ్రింగుచున్నది. ప్రాణి అయుర్దాయ పరిమితి "ప్రాణముల" (ఉచ్చ్వాస నిశ్వాసముల) సంఖ్య మీద ఆధారపడినది.

బాపురే!! సర్ప ముఖగ్రస్థమైన కప్ప తాను మృత్యువు నోట చిక్కిన్ని, జ్ఞానము లేక సమీపమున నున్న యీగ కై నాలుకను జాపు నట్లు ---- దిన దినము - క్షణ క్షణము మృత్యు రూప కాల సర్పముచే మ్రింగఁ బడుచున్న మానవుఁడు, తన ముందు గతి కానక, కడపటి క్షణము వరకు ప్రగాఢ లంపటత్వంతో విషయ వాంఛలఁ కై యర్రులుఁ జాచి- భ్రమించి - పరిభ్రమించు చున్నాడు గదా!!. నాలుక - గుహ్యేంద్రియములే వీనికి సాక్షి.

బ్రహ్మ నిష్ఠ (బ్రహ్మ జ్ఞానము) - అమనస్క రాజ యోగము (రస విద్య) - అనగా శుద్ధ బ్రహ్మ విచారమతి దుర్లభము.

తారక సాంఖ్యములు సాధనలు మాత్రమేః నిరతిశయానందము అమనస్క (రాజ) యోగము చేత నే లభ్యమగును.

అమృతమును ద్రావి నట్లు రేయింబవలు అమనస్క రాజ యోగము ను బూని అభేద బుద్ధితో కనుఁగొను చుండు బ్రహ్మ విదునకు ముక్తి కరతలామలకము.

-- శ్రీ . సీతా రామాంజనేయ సంవాదము.

అమనస్క యోగ పథమే ఉత్తమోత్తమ మైన సనాతన, పరమ గోప్య దివ్య పథము. ఇదియే బ్రహ్మ విదుల కత్యంత ప్రియమై, ఆనందదాయకమై, నిర్వికల్ప సమాధికి దోహద మివ్వగల "హేమకార విద్య" - రాజ విద్య - రాజ గుహ్యము - కేసరీ యోగము - స్వర్ణ యోగము.

చతుర్ముఖుడుః- "బుద్ధి, మనస్సు, చిత్తము, అహంకారము" లని నాల్గు ముఖములు - ఆది సంకల్పము (బ్రహ్మ) ఆది మూర్తి నాభి కమలంలో ఉద్భవించిన - చతుర్ముఖుడాయన.

శుద్ధ మనస్సు (బ్రహ్మ) యొక్క, సంతానము - "సనక, సనందన, సనత్కుమార, సనత్సుజాతులు" - పరి శుద్ధ మానసము.

అశుద్ధ (మలిన) మనస్సు - ఇంద్రుడు - ఇంద్రియాకర్షణల సృజించి, తన నాల్గు మోహన శక్తులను, "రంభ, ఊర్వశి, మేనక, తిలోత్తమల" ను, దుశ్శక్తుల

రెచ్చగొట్టి, దుర్వృత్తులకు లాగి, తపస్సు, జ్ఞానము, యోగాది సాధనల నరికట్టి, సర్వనాశన మొనర్చుటయే ఈతని నిత్య కృత్యము.

"మనో - మాయ" యొక్క అత్యద్భుత ఆకర్షణ - మోహన - శక్తి - మహామాయా మహేంద్రజాల ప్రదర్శనల వల్ల, భౌతిక సుఖ సౌఖ్య భోగ లంపటత్వం బలసి, "జీవ" చెర (బంధము) - బిగిసి బంధించును.

కాని, విచక్షణ, వివేక వైరాగ్య చింతన సాయమున, అపరిశుద్ధత్వము దూరీకరింపఁ బడి , శుద్ధ తత్వ ధ్యానము వల్ల, మనస్సు కూడా శుద్ధత నొందును.

"మనస్సు" అద్దము లాంటిది. స్వతః, దానికి రూపము లేదు. ఎట్లు తీర్చిన అట్లు ప్రతి బింబించును.

జలము కూడా అంతేః స్వతః శుద్ధమైనను మాలిన్యము కలయిక వల్ల, మలిన మగును.

"సాధన చతుష్టయ సంపత్తి", పూర్ణరూపమున, పండి, ఫలించినంతట . . . "ఆత్మా నాత్మ వివేకము" పరిమళించి పరిపూర్ణ ఆత్మ జ్ఞానము లభించును.

బాహ్య విషయ చింతనం వల్ల - ఇంద్రియోద్వేగము -దాని వల్ల - తీవ్రేచ్ఛ- అలభ్యం వల్ల క్రోధ ద్వేషాదులుత్పన్నమై - - అలజడి, అంతరారాటము - అశాంతి - వృత్తి తరంగముల భీకరాట్టహాసం --- పతనం - సర్వ నాశనం - నరకం!!

మనస్సే సర్వ సంసార కారణము -
మూడు ఆవస్థలు (లోకములు) కు మూలము.
బంధ మోక్షములకు “కీలక” కారణము.






తెలియ చున్నది

అధిష్ఠానమైన ప్రత్యగాత్మ ( పర బ్రహ్మను ) దర్శించిన కల్పిత మనస్సు (జీవత్వ భ్రాంతి), దాని నుండి ఉద్భవించిన త్రివిధావస్థల తో నశించి, బ్రహ్మ సాక్షాత్కార మధురానుభూతి మాత్రము శేషించును.

మనస్సు:
- జడ - విశ్వ - ప్రకృతి చింతనము వల్ల మనస్సు పెరిగి బలియును. ఇదే బాహ్య - (అధోముఖ) వృత్తి అందురు
- చేతన (సూక్ష్మ -ఆత్మ) చింతనము వల్ల, మనస్సు లయించి అంతర ( ఊర్ధ్వ ) ముఖవృత్తి వృద్ధి గాంచును. క్రమముగా మనస్సు ఆత్మాకారమొందును -

ఉ|| "భ్రమర కీటక న్యాయము" -

మనస్సు యొక్క పంచ వ్యాపారములుః-
ప్రమాణము, విపర్యయము, వికల్పము, నిద్ర, స్మృతి.

ప్రాణ పంచకము :-

ప్రాణ, ఉదాన, అపాన, సమాన వ్యానములని 5 విధములు -
(5 ఉప వాయువులు కూడా గలవు) -

వాటి క్రియలు : - ఉచ్ఛ్వాస నిశ్వాసముల వల్ల శరీరమంతయు వ్యాపించి, కర చరణాదుల చలనం, మలమూత్రముల విసర్జన - మరణ కాలమున "ప్రాణ - జీవుల" ను సహా శరీరములనుండి వెడలించుట. . . ఆహార పచన క్రియ - రస, రక్తముల పంపక ప్రసార క్రియలు, . . . అను పంచ ప్రాణ క్రియలు.

మనస్సు త్రిగుణాత్మకము. - సత్వ రజస్తమో గుణాత్మకం. - మరియు మిశ్రకం.

ఉపాధి - అత్మ ప్రతిబింబాధారమైన శరీరము, దేహము (దహింపబడునది) - పురము (పురుష నిలయము) ("అంగుష్ఠ ప్రమాణో పురుషః"), క్షేత్రము (క్షేత్రజ్ఞా ధారము) -

ఉపాదానము - ముఖ్య కారణము. మూల సత్తా.

ఉపాదేయము - గ్రాహ్యము.

"God is sentient, perceptible & visible & vice - versa " --

ఉపనిషదుపమానములుః-

అద్వైతము -- ద్వైతము

జలము -- మంచు గడ్డ

నిప్పు -- అగ్ని రవలు

వేణువు -- నాదము

బ్రహ్మము -- సృష్టి

పాలు -- నెయ్యి

దీపము -- వెలుగు

సాలె పురుగు -- దారము

-- ఉద్దాలక సాంఖ్యము.

కడకు నింద్రియములుఁ – గట్టివేయఁగ లేక|

చావు వచ్చునప్పుడు సన్యసించు|

ఆత్మ జితముగామి - నందునా మోక్షము| || వి||

సత్య ప్రజ్ఞ అభ్యాసం - అను భవం - లేనిది అంత్య కాలంలో ఏలా అబ్బుతుంది?

ఇక గతి? గమ్యము??

కడ మాట!! ఇది శివ రహస్యము!!!

"మనస్సు - ఇంద్రియములు' - ఇవి అనాది మిత్రులుః శుభాశుభములకు, బంధ మోక్షములకు - ప్రగతి - తిరోగతి - దుర్గతులకు హేతు భూతములు. ---

మనస్సు యొక్క సంబంధము లేకున్న ఇంద్రియములు కేవలం గోళకములు - జడ సాధనములు . . . . అని అర్థం.

జ్ఞానేంద్రియములు ----- కర్మేంద్రియముల కన్న

(సూక్ష్మ) (స్థూల)

బలవత్తర మైనవి. అందు ముఖ్యముగా :-

(1) జిహ్వా -- రసన (జ్ఞాన) + వాక్ (కర్మ)

(2) గుహ్యేంద్రియములు -- సంభోగ (జ్ఞాన) + మూత్ర విసర్జన (కర్మ)

ఈ రెంటికిని, ప్రత్యేకముగా "కర్మ + జ్ఞాన" ఉభయ శక్తులు గలవు. (Both executive and judicial powers) - ఇతర ఇంద్రియములకన్న "జంట శక్తులు" (Double powers) గల, పై రెంటిని జయించుట, సాధకునకు దుర్లభము, దుస్తరము; అన్నింటివలె ఇవి లోబడక సాధకుని సాధించి, వేధించి, హింసించి పతనమొనర్చును: సర్వ సత్యము.

మనస్సు:- స్వాధీనమైన, జయ విజయులవలె జీవ దేవుని వైకుంఠ నిలయమును కాచి సేవించి, ఊర్ధ్వపథగామిత్వమున కుపకరించును.

స్వాధీనము గాకున్న "మారీచ - సుబాహు"ల వలె, సర్వ నాశన కారులై, అధోగతి కీడ్చును. పునర్జన్మలు గొలుసు కట్టు -

భార్య అనుకూల వతి - గుణవతి గాకనో, లేక పోషణ శక్తి, భరించు స్తోమత లేక పారి పోవు వాడు, పోట్లాడి పొందక విసర్జించువాడు, లోని " స్త్రీ" ని అనగా "మనస్సు" యను సత్యమును, మరువ రాదు.

సంసారములో నూరు మంది స్త్రీల మధ్య నున్నను, "మనస్సు"ను (లోని స్త్రీని - ప్రకృతిని) జయించిన, అమనస్క యోగియే నిజ మైన సన్యాసి.

16,000 మంది గోపికా పరివేష్టితుఁడైన శ్రీ కృష్ణ పరమాత్మ, పెళ్ళి యాడని, భీష్ముడు, ఆంజనేయాదుల కన్న గొప్ప యని శాస్త్రములు ఘోషించుట లేదా!!

మనో విజేతలే యాశ్రమందున్నను, యే వృత్తి యందున్నను, ఏ రూపము ధరించినను ఒక్కటే.

మనస్సు నందు క్షణక్షణమును, సంసార, సంస్కార, ప్రారబ్ధ ప్రభావ ప్రాబల్యమున బుగ్గ వలె ఉత్పన్నమగుచున్న వృత్తులు (సంకల్ప వికల్పములు), కోర్కెలు, తలంపులు, . . . . పూర్తిగా నశించి, నివృత్తి - సహజ - సామ్య - స్థిత ప్రజ్ఞ లభించినగాని, ముక్తి లేదు - - అమనస్క స్థితియే నిజమైన సన్యాసము. సర్వ సంకల్ప సన్యాసి కావాలి!!

అందుకే --" ఎంతవారలైన కాంతాదాసులే" అన్నారు (కాంత అనగా మనస్సు)

- త్యాగ బ్రహ్మ.

- శివు నంతటి వాడు మోహినీ వేష ధారియైన విష్ణుని వెంటాడడము.

- దేవనాథు డహల్యను, తపోధనుని భార్య యని కూడ మరచి, మదోన్మత్తుడై శాప గ్రస్తుడవడం.

- దేవ గురువు, బృహస్పతి, సాక్షాత్ మాతృ సమానయగు అన్న భార్య ను కలయనుంకించడం.

- గురు భార్యా గమన పాప గ్రస్త చంద్రుడు క్షయ రోగి కావడం.

- దేవర్షి నారదుడు మాయా సంమోహితుడై సంసారిగ తల వంచడము.

- వ్యాస భగవానుని పాఠమును సవరింప పట్టు పట్టి తల వంచిన జైమిని గాథ.

- విశ్వామిత్రుడు మేనకను మరగి పతితుడవడం.

మహర్షులు - మహాత్ములు - దేవతలు - దేవదేవుల గతే యీలాగుంటే . . . . మసాలాకు మరిగిన మానవుని గతేం గావాలి!!

కావున - "తలలు బోడైన తలపులు బోడౌనా?" అన్నట్లు విరక్తితో సన్యాసము తీసుకొని, కావి గుడ్డలు ధరించినంత మాత్రమున - జందెములు తెంపి, జడలు దాల్చిన మాత్రాన - ఇల్లు (మేడ) వదలి - పర్ణశాలలో కాపురంమున్నంతనే - సన్యాస ఫలమబ్బునా? -

బాహ్య "స్త్రీ" ని వదలి అడవులకేగుట సన్యాసము గాదు. అంతరంగమందలి " మనోవాంఛల" - "కామ తృష్ణల" ను తెగ గొనిన గదా!! అంతః

"స్త్రీ" (ప్రకృతి - మనస్సు) జయము లేకున్న, అన్ని జయములు నిరర్థకములే.

ఇంద్రియముల వృత్తులు ఆగవు - మనస్సు నకు ఇంద్రియములు ద్వారా "వృత్తులు" సహజము. నివృత్త స్థితి అత్యంత అసహజము - విడదీయరాని అవినాభావ సంభంధము గలవి.

నువ్వులు - నూనె.

పూవులు - వాసన (తావి)

పాలు - వెన్న

ప్రాణము - మనస్సు . . . . . ఈ విధముగా కలసి విడదీయరాని లంకె గలవి.

మనస్సు - మాయ, శక్తి, అవిద్య, అజ్ఞానమునకు పెద్ద కొడుకు

"పుణ్య- పాప" కర్మ లెన్ని యొనర్చినను, కర్తృత్వ భ్రాంతి అనగా పామరత్వము నశించి . . . . ఇవన్నియు " మనః కృత్యములు " - - - " నాకు "జనన మరణాది వికృతులు లేవు. "నే నెవరు"

ఇంద్రియ క్రియలు - మనో విలాస క్రీడలు - అన్నియు దేహ ధర్మములే!!

అవిః- సచ్చిదానంద , నిర్మల, నిర్గుణ, నిరాకార, నిస్సంగ, నిరంజన, నిత్య, సత్య, బుద్ధ పరమాత్మను అంటవు. సర్వం మాయా కల్పితములు గాని, వాస్తవికములు గావు.

"నేను - నేను" - అనెడు అనుభవమునకు మాత్రము విషయమగు (స్వానుభవైక వేద్యమగు). బ్రహ్మము, స్వయంప్రకాశచిద్రూపము - త్రికాలాబాధ్యము - సర్వా భాసకము - సత్యము, నిత్యము - - - - జనన మరణ రూప, నామ వర్ణ, కుల గోత్రాతీతమై --- (కార్య కారణ ఉపకరణము) --- మొ|| ప్రకృతి గుణములు బ్రహ్మకు లేవని యెడ సత్యము ---- శ్రుతి వచనము - గురూపదేశము.

పూర్వ జన్మలందలి సంస్కారములు సహజముగ మానవుని మనోదౌర్బల్యాన్నాశ్రయించి అతనికి తెలియకుండగనే ఆవరించి - ఆక్రమించుకొంటాయి. పూర్తిగా వశపరచు కొంటాయి. మానవుడు (మనోదౌర్బల్యంవల్ల) దుర్బలుడు. దీని రహస్యము ఆ భగవంతునికే తెలియాలి. ఏ శాస్త్రాలు ఈ విచారాన్ని స్పష్టంగా విడదీసి ప్రవచించ లేదు. ఇది నిజంగా దివ్య రహస్యమే --

మనస్సు యొక్క అమూల్యమైన దివ్య శక్తి, దశేంద్రియముల ద్వారా - దశ వాహినులై --- (జీవ నదులు - మహా ప్రవాహములుగా, అనాదిగా నిరంతరం పరువులు తీస్తు, ప్రచండ వేగంతో ఉగ్ర తరంగములతో, నురుగులు౹ గ్రక్కుతూ, కోలాహలంగా, ఒడ్లను ఒరుసు కొంటూ నిర్విరామంగా తమ మధుర జలాల్ని ఉప్పునీటి సముద్రంలో వృధాగ కల్పి, నిష్ప్రయోజనమౌతున్నట్లు) - విశ్వ విశాల విషయ సాగరంలోకి యుగ యుగాలుగా (జన్మ జన్మాంతరముల నుండి), తరలించి నిష్ప్రయోజనమౌతుంది.

చిత్తనిరోధము లేకున్న పునీత మానస శక్తులు వృధాయై, యే సాధన - సాఫల్యము లభించదు. "కష్టే ఫలే " అన్నారు.

పురుష ప్రయత్నమున - తీవ్ర సాధనల ద్వారా, దశమనఃస్రవంతుల నరికట్టి (అడ్డు వేసి) బంధించినందున, రూపొందు మహా మానస సరోవర నిర్మాణ మొక దివ్య సాగరం. - బ్రహ్మాండమైనసృష్టి కదా!!

అడ్డుకొన్న మనోవృత్తులు వెను దిరిగి అంతర్ముఖమై జన్మ స్థానమైన బ్రహ్మాయందే స్థిర పడి లయించును. ఇదే ధ్యాన - ధారణల ఫలం - దీనినే " ఉపరమేత్" అన్నారు మహర్షులు - మనస్సు ధ్యేయ బ్రహ్మాకారమై స్వస్వరూప స్థితిప్రాప్తించడమే " ముక్తి "

అదిగో చూడు! పది మహా మనః స్రవంతులు, మంత్రముగ్ధముగ అడ్డు వెయ్యబడి,

తిరోగమించి, అంతర్ముఖమై --- తమ జన్మస్థానమైన బ్రహ్మమందే లయించి, బ్రహ్మాకారమై . . . . మహా మానస సరోవరమొక దివ్య సాగరమై రూపొందినది.

అందు హంస వాహనారూఢుడైన పర బ్రహ్మ - దివ్య తేజోరాశియై ప్రకాశించుచున్నాడు!! (దశావాహిని ప్రాజెక్టు చూడుడు)

ఈ విధముగా స్వస్వరూప స్థితి - సహజ సామ్య స్థితి - త్రిగుణాత్మక (పుణ్య పాపముల) నివృత్తి స్థితి - పరంజ్యోతిస్స్వరూప - ప్రత్యగాత్మ - శేషించి ప్రకాశించును.

భ్రూమధ్యమున ఆకాశ సంధి గలదు. ఉపనయన మార్గమున, సునీల ద్వారకా ముఖ ద్వారమున - (పంచ వన్నెల చిలుక పంజరమున) భక్తునకు (సాధకునకు) " శ్రీ కృష్ణ పరమాత్మ చేయూత నిచ్చి వెలుగు చూప . . . తన వేయి చేతులఁ జాపి మన రెండు చిన్న చేతులను అందుకో తహ తహలాడు చున్నాడు. భగవంతుడు దయామయుడుః సర్వత్రాత!! దీనదయాళుఁడు!! కరుణామూర్తి!!!

బాపురే! పది ప్రవాహములు - పది ప్రాజెక్టులు - పది పథకములు . . . యీ బృహత్ప్రయత్నముల వ్యయ ప్రయాసలు - భార భాధ్యతలు - కాలం అంచనా - లాభాలాభములు - బాగోగులు - - - - విమర్శిద్దాం - - - - ఇదే విచారం.

మరొక చిత్రం!! దశవాహినులకు ఒకే మూల కీలకం - ఒకే ప్లాను - ఉచిత బడ్జెట్టు - చీఫ్ ఇంజనీయరు ఎవ్వరు? - - - జ్ఞానాంజన శలాక హస్తుడైన గురుదేవుడు - మహా మంత్ర దండదారియై "బోధ" ప్రసాద దానముతో హస్త మస్తక సంయోగ ఆశీర్వాదమున కై తయార్!!!. ఉత్తిష్ఠ - ప్రాప్యవరాన్ని బోధ!!!

ఉపనిషత్సారమే - ప్లాను!!

స్వదేశీ - విదేశీ ఋణములకై దేబరించి - యాతన పడనవసరంలేదు. అభయం!! అక్షయం!!! నామ జపముతో ప్రారంభించి - సగుణ నిర్గుణోపాసనలనవలంబించి - కర్మ - భక్తి - జ్ఞాన యోగ పథముల విహరించి -

ప్రాజెక్టు ప్రారంభోత్సవం -

మనః ఫలకం మీద రెండు "సైన్ బోర్డులు" తగిలించాలి - అంతా స్మూక్షంగానే రంగు రంగుల వ్రాతలతో ఊహించుకోవాలి.

శమం - వాసనా త్యాగం - అంతరింద్రియ నిగ్రహం.

I సైన్ బోర్డు - "No permission" - అంతః కరణములు బయటకు పోరాదు -
సంకల్ప నాశనం.

దమం - బాహ్యా విషయాకర్షణల నిగ్రహం. –

II సైన్ బోర్డు - ఇంద్రియములు చలించక, నిగ్రహించి, ఎదురొడ్డాలి -"No admission"

రెంటికి నయాపైసా కర్చు లేదు సుమా!! అత్యంత జాగరూకుడవై - సత్వ గుణ శ్రద్ధ - ఏకాగ్రత - పురుష ప్రయత్నం - అభయసాధనలతో - కష్టతరమైన - ప్రమాదభరితమైన - "ఎదురీత" - సాగించాలి!!. కాని, ఫలం??

అద్భుతం - అమోఘం - అనంతం - అఖండం -అక్షయం - జీవుడు దేవుడౌతాడు; దరిద్రుడు సర్వేశ్వరుడౌతాడుః

నిరంతర దుఃఖం పోయి, నిర్మలానంద అమరత్వం - అమృతత్వం - అఖండత్వం - అష్ట సిద్ధులు - అష్టైశ్వర్యములు . . . . అంతే కాదు . . . సర్వేశ్వరత్వం - సర్వసార్వభౌమత్వం . . . అదిగో! అంతరిక్షమున మంత్రముగ్ధముగా వ్రేలాడుతున్న, అనంత కోటి, బ్రహ్మాండ మండలాధిపత్యం - సర్వాధికారం నీదె . . . . సర్వం నీవే . . . . ఇక నీవు కోరవలసింది - కోర మిగిలింది ఏమిన్నిలేదు.

నీవే అఖిలాండేశ్వరుడవు.

చాలునా? శుభం! శివోహం!!

ఇంద్రియాధిష్ఠాన దేవత - ఇంద్రుడు - మనస్సు

ఇంద్రియాదిష్ఠాన దేవతల కధిపతి - దేవేంద్రుడు - ప్రత్యగాత్మ.

" మనస్సే మాయ - మాయే సర్వం " . . . . .

ఆత్మ (ప్రత్యగాత్మ) కల్పవృక్షము -

ఇంద్రియముల యొక్క లోకమే ఇంద్ర లోకము -

భోగ భూమి - మనో రాజ్యం

బ్రహ్మ - రాజు

మనస్సు - యువరాజు - కల్పకంక్రింద ఉన్నాడు. ఏది కోరిన అది పొంద గలడు.

పురుషోత్తముడు - సహ స్రార (దహరస్థ) మున పరబ్రహ్మ (సాక్షి) మరియు క్రింద - మనస్సు (జీవుడు - పురుషుడు) - - అనగా ఫలాఫల భోక్త ఉనికి - నివాసము -

జీవుని ఫలాపేక్షయే సంసార బంధము.

విపులంగా -

దహరస్థ ఆత్మ (ప్రత్యగాత్మ - అంతర్యామి) సాన్నిధ్య ప్రభావ ప్రాబల్యమున, ఉర (హృదయ) పర్యంతము జీవుడు (అంగుష్ఠ ప్రమాణః పురుషః) - త్రివిధావస్థలను అనగా - జాగృత్స్వ సుషుప్తులందు క్రమముగా "విశ్వతైజస ప్రాజ్ఞ" సంజ్ఞలతో - నేత్ర - కంఠ -హృదయ స్థానములందు చరించును:- అనగా : "ఆజ్ఞా - విశుద్ధ - అనాహత" చక్రములందుడును:-

జీవుడు - "పొగ వేడి" లేని (సాక్షి - కూటస్థ ప్రత్యగాత్మ) దివ్య తేజః పుంజమున విలసిల్లును.

మరియు, కర్మ, భక్తి, జ్ఞాన, యోగాదులు ప్రవృత్తి పరం కారాదు. నివృత్తి మార్గంలో, మోక్షార్థ దృష్టితో నుండఁ దగును. శుభకరము; క్షేమ కరము.

భగవంతుడు - భక్తుడు -

ఆత్మతత్వం - జ్ఞాని - వీరు వ్యాపార సరళిని ప్రవర్తించడం శోచనీయం. "నేనెవ్వ" రని గ్రహించిన, యీ దౌర్భాగ్యపు యాచన - అభ్యర్థనల్లాంటి దరిద్రపు బుద్ధులంకురింపవు!! "త్వం బ్రహ్మ" - అంతే!! ఇంకేమి కావలి?

మనస్సు < శుభ - మంచి - ఊర్ధ్వగామి / అశుభ - చెడ్డ - అధోముఖ } రెండు విధములు

శుభా శుభ వాసనలే (సంస్కారములే) అందుకు మూలము - మనస్సు లేకున్న జగతి లేదు. మనస్సు కలవాడే మనుష్యుడు. మనస్సు మహిమ కలది. మాయావి. ఒక్క రూపము లేదు. అన్ని రూపములు దాల్చును. ఊర కుండదు. అనాద్యవిద్యా పరిణామము.

మనస్సు ద్వివిధ స్వరూపము :-

(1) భూత వాసనలు - కల్ప కల్పాంతరముల నుండి - జన్మ జన్మలుగా సంక్రమించిన, సంస్కార రూపానుభూతులు - వాసనలు: వీటి చింతన, స్మరణయే చాలా బలీయమైనది. పూర్వము నానా ఉపాధుల నాశ్రయించి, అర్జించిన అను భూతులు (సంస్కార వాసనలు) సూక్ష్మస్థితి. జాగ్రత్సుషుప్తులందు గుప్తముగ దాచి యుంచిన చిత్రములను, స్వప్నమందు విడదీసి ప్రదర్శించును. మనస్సు స్వప్నానుభవమున "చిత్ర గుప్తుడు"

(2) <u>భవిష్యత్ చింతనలు</u> - విషయేచ్ఛలు, అనుభూతుల చింతనలు - నమటి వేత, ఇంద్రియముల ద్వారా ప్రేరేపణ - బాహ్యా విషయముల ఆకర్షణ, అనుభవాసక్తి, (తగులు) - సంసార కారణం - కోర్కెల స్థూల రూపం.

ఇక, వర్తమానం - కేవలం ప్రారబ్ధ భోక్తృత్వానుభవంః సుఖ, దుఃఖ (మిశ్రమ) అనుభూతుల మయం.

సంస్కార - వాసనాబల – భోగలాలసత్వ తృష్ణ - (వెనుకటి గుణం) - సంకల్ప వికల్ప వృత్తుల ప్రేరణలు - తదను గుణ నానా క్రియా రూప పరిణామ ఫలా ఫలముల ప్రాప్తి.

ప్రారబ్ధ ఫలమీ దేహము,
దేహ నాశంతో ప్రారబ్ధం నశించును.

మాయా ప్రతిబింబిత మగు బ్రహ్మ చైతన్యము, మాయా తాదత్మ్యమును బొంది - "హంస" అనబడునట్టి "జీవ" రూపమగు హంస మండలము - - (షట్కమలముల విహారము) న సంచరించి ఆనందాను భూతులఁ చొక్కి - - - - సర్వ పరిపూర్ణ పరబ్రహ్మము నాధారముగా శుద్ధ బుద్ధ ఆనందమయమై - - - - సత్య స్వరూప పరతత్వము నందా సక్తి చేత "వాహనంబై" - - - మానస సరోవరమున (సత్య లోకమున - అనగా - బ్రహ్మ లోకమున) "రాయంచగా" హంస(జీవుడు) సంచరించును.

క్షీర నీర విభజన సహజ సామర్థ్యము గల "హంస" - (జ్ఞాని - యోగి) సత్యజ్ఞానానందమయ పర బ్రహ్మ తత్వాన్ని స్వీకరించి – తద్వ్యతిరేకమగు (దుఃఖమయ బహుళ సంసార బంధ) - " అసత్ " ను నిగ్రహించి విడనాడునుః-

ఇంద్రియముల నిగ్రహించి ప్రాణములతో |
మానసమును గూర్చి - వాని తోడ |
హంస యనగ నొప్పు - నక్షర ద్వయము |
యోచించి సంతతము భజింప వలయు ||

హంస శబ్ద వాక్యుడు - జీవుడు
దశ విధ నాదముల - నాదము
చిద్బిందువు బుద్ధి ఏకాగ్రత - బిందువు
చైతన్య కళ - కళ



→ సంకల్ప వికల్పాత్మక మైన భావ చైతన్యము

తారక మంత్రము | "ప్రాణముతో + ప్రణవమును సంధించి"
(హంస) (ఓం)
"మనస్సును" --- నియమించాలి |

"అపరోక్షాత్మ జ్ఞానము & పరోక్ష బ్రహ్మ జ్ఞానము"

6 నెలల దృఢాభ్యాసము చాలును.

జీవుల హృదయ పుండరీకమను పురమున నున్నవాడగుట వలన పురుషుఁడనియును - - - సర్వేంద్రియ + అంత కరణముల యొక్క వ్యాపారములకు - తటస్థుడు (కూటస్థ)

అవిద్యయు + అవిద్యయందు ప్రతి బింబిచిన చైతన్యమును + ఈ రెంటికిని ఆధారభూతమైన బ్రహ్మ చైతన్యము --- కలసి "జీవుఁడ" న బడును.

ఈ జీవునకు ఆనందమయ కోశ మని పేరు గల భిన్నమైన అజ్ఞానము "కారణ శరీరము" ను సుషుప్తి యను అవస్థయు నగును.




అవిద్యోపాధి

<u>జీవుడు</u>




సూక్ష్మ - తైజస ← హిరణ్య గర్భుడు } సూక్ష్మ శరీరాభిమాని

కారణ - ప్రాజ్ఞ

(వ్యష్టి కారణమైన అవిద్య)

అవ్యాకృతుడు } కారణ శరీరాభిమాని

(సమిష్టి కి కారణ మైన - మాయ)

సర్వాధిష్ఠాన (కార్య కారణ) రూపుఁడైన - నిరాకార, నిర్గుణ నిర్వికల్పుడు, నిర్వికారుడు, అఖండుడు (అపరిచ్ఛిన్నుడు) తురీయ సర్వ వ్యాపక, శుద్ధ బ్రహ్మమనియు - ఆ ఆదిదేవుని, పరమ పురుషుని, పురుషోత్తముని - - - మూల కారణుడని తెలియఁదగు.

1. వ్యక్తమగు స్థూల దేహము - జాగ్రత్ - విశ్వ - స్థూల - 24
2. పంచీ కరణము గాక - - స్వప్న - తైజస - సూక్ష్మ - 17
   అవ్యక్తంబగు లింగ దేహము
3. అజ్ఞానావచ్ఛినంబగు చైతన్యం - సుషుప్తి - ప్రాజ్ఞ - కారణ - 1 + 1
   రూపంబగు కారణ శరీరము

షరా : ఈ భేద భావనలు పోయిన సర్వాత్మ భావన" అల వడును.

మనో వృత్తులు నిద్రా శక్తి యందు బీజ రూపముగ నుండి స్వప్న - జాగ్రత్త లందు వికసించును: కాని ఆత్మ - 3 అవస్థలకు సాక్షి కావున "సత్య" రూపుఁడనఁబడును.

ఇంద్రియముల విషయ భోగము లే "కర్మ" అనఁబడును. అట్టి మనస్సును భగవదాయత్త మొనర్చడమే "నైష్కర్మ్య సిద్ధి" అందురు. జాగ్రత్స్వప్నములందు తెలివి - అనుభవం -కలదు. సుషుప్తి యందు లేదు. కాని, అనుభవము - అజ్ఞానమునకు "సాక్షి" మాత్రము కలడు.

"కార్యోపాధిరయం జీవః - కారణో పాధిరీశ్వరః"

<u>మాయ</u> : అవిద్య, తుచ్ఛ, అనిర్వచనీయ, అవ్యక్తము, తమస్సు,
సుషుప్తి, ప్రకృతి, ప్రధానము, అజ్ఞానము,

అవిద్యా ప్రతిబింబమగు జీవ చైతన్యము } వీటి వ్యష్టి
మాయా ప్రతిబింబతమగు ఈశ్వర చైతన్యము } సమష్టి రూప విభజన.

- - - మేధావి యైన జ్ఞానికి (యోగి) - "సర్వోపాధి వినుర్ముక్త" - అపరిచ్ఛిన్న, స్వయంప్రకాశ, సర్వవ్యాపక చిదాత్మ యొక్కటే ద్యోత్య మగును. ఇదే "తత్వమసి"కి అర్థం.

అవస్థా త్రయ సాక్షి - ఉప ద్రష్ట.

పంచ కోశాంతర్గత తటస్థ - చిద్రూప కూటస్థ - ప్రత్యగాత్మ పరమాత్మల అభేద

జ్ఞానము - - -  మోక్షమనబడును.

భ్రాంతి జన్యములగు నీ విపరీత విభజన భావములు నశించినంతనే "తత్త్వమసి" మహా వాక్యార్థము సుగమ మగును.

- - ఛాందోగ్య

పంచకోశములు -

అన్నమయ - శుక్ల శోణిత సంయోగ జనిత స్థూల దేహము
అన్న రసము తో పెరిగెడి - 24 తత్త్వములు.

ప్రాణమయ - పంచ ప్రాణములు + పంచ కర్మేంద్రియములు

మనోమయ - పంచ జ్ఞానేంద్రియములు + మనస్సు + చిత్తము

విజ్ఞానమయ - పంచ తన్మాత్ర (విషయము) లు +
నిశ్చయాత్మక బుద్ధియు

ఆనందమయ -1. చిత్త వ్యామోహ జనిత యభీష్ట సందర్శన
సంతోష రూపమగు ప్రియము.
2. కామితార్థ లాభ జన్య హర్ష రూపమగు మోదము.
3. ఇష్ట కామ్యార్థ అనుభవ జనిత ప్రీతి రూపమగు ప్రమోదము.

ఈలాగు చిత్త వృత్తుల విపుల - విస్తార - ప్రపంచమునకెల్ల హేతు భూతమైన - - ఆద్యంత రహిత - మూలా జ్ఞాన రూపమగు " చీకటి పిండు "

నేను -

దశేంద్రియములుగాను
పంచ ప్రాణములుగాను
అంతః కరణ చతుష్టయమునుగాను
} వీటినన్నింటిని గాంచు - సర్వ సాక్షిని.

(పంచాగ్నులు) పంచ తేజస్సులు
సూర్య
చంద్ర
అగ్ని
నక్షత్ర
మెఱుపులు.

"ఈశ్వర ప్రణి ధానాద్వా"

"సమాధి సిద్ధిరీశ్వర ప్రణి ధానాత్"

- - పతంజలి

-- ఆత్మ పూజ – సులభ పూజ . . . . . . .

అనగా, రోజు మనము చేయు నిత్య నైమిత్తిక, సమస్త కర్మలు, (వాటి ఫల భోక్తృత్వం) అంతర్యామి యైన ఈశ్వరుని కర్పించుటే "ఆత్మ పూజ - సులభ పూజ" అందురు.

అంతర్యామి (ప్రత్యగాత్మ) ని శరణాగతి పథమున, ఎవరి హృదయ పూజా మందిరమును వారే నిర్మాలిన్య మొనర్చు కొని - బ్రహ్మ పీఠము నుద్దీపింపఁ చేసి - ఆత్మారాధన మొనర్పఁ బూనుటే "ఆత్మారామ పూజ" అందురు.

భక్తులు - "తస్మాత్ సర్వేషు కాలేషు "యోగ యుక్తోభవార్జున" - అన్న

నశ్వర దేహ పోషణకు ఆహార పానీయాదులెంత వసరమో, ఆత్మోద్ధరణకు దైవ ధ్యానము ప్రాణ తుల్యము!!

మానవ జన్మ దుర్లభ మైంది. క్రిమి కీటక సర్ప పక్షి జంతు జాలాది ఉపాధు లందుఁ బడక శుభ సంస్కారములతో, జ్ఞాన సుర గుణ రూప, ఆరోగ్యైశ్వర్యాదులతో, మానవుడుగ మనడం ప్రత్యేకత.

కాని, మెదడు గల మానవుడు చేయ జాలని పాపంలేదు. సామాన్యంగా ప్రతి ప్రాణికి కర్మ ఫల భోక్తృత్వం, పునర్జన్మ, జనన మరణ చక్ర భ్రమణ గతి తథ్యమని సులభ గ్రాహ్యం.

మనస్సు మానవుని మభ్యపెట్టి పెడ త్రోవలఁ ద్రిప్పుతూంది. ఒక ప్రక్క శుభ సంస్కారములు (సుర సంపద) ఉత్తేజితమై పురోగతిని ప్రోత్సహిస్తూ, ఉర్ధ్వగామిత్వాన్ని ప్రసాదిస్తూంటే, మరో ప్రక్క జన్మ జన్మాంతరముల నుండి పేరు కొని కరుడు గట్టిన అసుర వాసనల (అశుభ సంస్కారములు విషయ వాసనల) కలవాటు పడ్డ మనస్సు, దశేంద్రియముల సన్నిహిత, సాహచర్య, సహకార, సంగ దోషములతో విజృంభించి, విశృంఖల వీర విహారం చేస్తూ తిరో (అధో) గతికి దోహదమౌతూండడం సర్వానుభవంః

మానవుడు సహజంగా శుభాశుభ సంస్కారముల కుప్ప.

నశ్వర దేహ రక్షణ కాహార పానీయాదు లెంత అవసరమో ఆత్మోద్ధరణకు

(నిష్కామ) కర్మ - భక్తి - జ్ఞాన యోగ సాధనలంత యవశ్యముగ రూపొందినవి.

భక్తుడు బయట

యోగి లోపల

జ్ఞాని లోపల - బయట కూడా భగవంతుని దర్శింతురు.

(కర్మ యోగి భగవంతుని (ఎక్కడనూ) చూడ దలచడు)

ఈ దేహ దేవాలయంలో - జీవ దేవుడుండ, అటువంటి భగవద్గృహంలో, ప్రభు సన్నిధిని, అరిషడ్వర్గాది, అశుభ, అసుర. అమంగళకర, భ్రష్ట, పాప, సంకల్పములఁ జొరనీయ వచ్చునా? అంతకన్న ఘోర అపచారమున్నదా?

దేవుని జీవునిగా చేసి, జీవుని రాక్షసునిగను, _ - - తుదకు క్రిమి కీటక తృణ - తుచ్ఛ - ప్రాణులు గాను పతనం జేయు పాప వృత్తులకు చోటివ్వడం ఘోర ప్రమాదం - అపచార - ఆత్మ ద్రోహ కరంకాదా? ఎంత నిష్కృతి లేని దుష్కృతి!!

ప్రభూ! నీవు అద్వితీయుడవు. నీకు ఎన్నికలు, రాజకీయాలు లేవుః వీధులఁబడి కృతఘ్న మానవుల వెంటఁబడి "ఓట్ల" కై, దేబరించు దుర్గతి నీకెన్నడుఁ బట్ట కుండు గాక! నీవు ధన్యాతి ధన్యుడవు. మేధావంతులైన కృతఘ్న పాపులను సహా మన్నించు మహోదారుఁడగు -పరమ దయామూర్తివి !!.

దేహమొక అద్దె కొంప. దాని పోషణ రక్షణార్థమై వెచ్చించు వ్యయమే అద్దె కాగలదు. వ్యాధి నివారణాది ఖర్చులే "రిపేర్" రివాజు. వెళ్ళి పోయే నాడు వెంటరాని ఈ కళేబరమే "తానను కొని" - భ్రమసి - భరించి - భ్రాంతిఁజెందిన జీవుడు నిర్వాసిగా - ఫకీరుగా - అగతికుడుగా - విదేహుడై (విగత) - - - - చిర ఉపాధియైన దేహమును విసర్జించి. . . . . సూక్ష్మ తేజోమయ రూపమును దాల్చి - ఒర నుండి లాగిన కత్తి వలె - వేరై నిల్చొనును.

నిర్గుణ - నిరాకార - నిరంజన . . . అఖండ తేజోరాశి యైన పర బ్రహ్మ సంచలన జనిత ఆది సంకల్పమే యీ అనంత కోటి బ్రహ్మాండ విశ్వ జనన కారణమని, గ్రహించి . . . . . . నిస్సంకుల్పుడవై (అమనస్క యోగ సిద్ధి నంది) బ్రాహ్మీ స్థితి నంది,

"త్వంబ్రహ్మ" . . . . అంతే!

మనస్సు అనంత విశాల రంగ స్థలము -

సంకల్పములు బుగ్గలు -

దశేంద్రియములు దశ వాహినులు -

ప్రకృతి - తల్లి - వీరి సంతానమే --- సంకల్ప వికల్ప స్వరూపిణియే

పురుషుడు - తండ్రి — మనస్సు మనస్సు (జీవత్వ కారణము)

విషయ చింతనమే మనస్సు పని - ఆత్మ చింతనము దాని చేత కాదు - అలవాటే లేదు. కావున –

శ్లో|| "ఉద్ధరే దాత్మ నాత్మానం నాత్మాన మవసాదయేత్

ఆత్మైవ హ్యాత్మనో బంధు రాత్మైవ రిపు రాత్మనః

తా|| తన యభివృద్ధికి తానే కారణము. తా నుద్ధరించు కొనుటలో న శ్రద్ధ వహించి, అధోగతిపాలు కాకూడదు. ఇంద్రియముల నిగ్రహించిన తన మనస్సే తనకు చుట్టము. నిగ్రహింపని మనస్సే తనకు శత్రువు.

-- భగవద్గీత. అ. 6. శ్లో. 5.

"ఆత్మను ఆత్మే ఉద్ధరించు కోవాలి."

ఎన్ని విద్యలు నేర్చిన - ఆత్మ విద్య నేర్వని వాడు అంధుడే - తన్నుమాలిన ధర్మము మొదలు చెడ్డ బేరము అన్నారు. మరి -

ఇంట గెల్చి రచ్చ గెల్వ మన్నారు -

బహిః సాధనల కన్న అంతః సాధన మిన్న -

పుస్తక జ్ఞానం కన్న మస్తక జ్ఞానం గొప్ప -

దంత శుద్ధి కన్న అంతః శుద్ధి లెస్స -

"భాండ శుద్ధి లేని పాక మేల" - అన్నాడు వేమన!! గనుక ---

మనోజయమునకు సంకల్ప ధ్యానమే ఉత్తమోత్తమమైన సాధన!

"నే నెవరు?" అంతరాత్మాన్వేషణ పథము - భగవాన్ రమణ

మనస్సును - గాలి - రసం(పారదం) - తో పోల్చినారుః "రస విద్య" అనగా మనోజయ విద్యయనియే - అంతరార్థము - సత్యార్థము -

<u>మనోమాలిన్యములే - జీవత్వ లక్షణములుః-</u>

"విషయాసక్తిః; ప్రజ్ఞామాంద్యము; కుత్కరబుద్ధి; విపరీతార్థము; నీచ పదార్థము లందాసక్తి" - మో||

ఉ||  బ్రాహ్మణునికి మ్లేచ్ఛ దయ్యం పట్టినట్లు, ఈశ్వరునకు, జీవత్వం, ఆవహించింది. సంసార దీర్ఘ రోగమునకు బ్రహ్మ విచార ఔషధం కావాలి! మలత్రయం పోవాలిః లేకున్న జ్ఞానానుభవం దుర్లభం.

మనస్సే పునర్జన్మకు బీజము -

మనోరాజ్యము భద్రమగుగాక!

ఆకాశమంతయు సత్పదార్థమే!!

అనంత, అఖండ, చిద్విలాసమే! సర్వ సాక్షి!! సర్వాంతర్యామి -

అగ్ని అన్నింటిని దహించును -

అగ్నిఁ నెయ్యది దహింపఁగలదు?

ఆత్మ అన్నింటిని తెలుసు కొనును -

ఆత్మను తెలియు వారెవ్వరు?

"ప్రజ్ఞానం బ్రహ్మ"

చతుర్వేద మహా వాక్య సారాంశమిదియే !!

ప్రళయ కాల ఝంఝా మారుతము వీచు గాక !

ద్వాదశాదిత్యులు ఏకమై తపింపఁ జేయుదురు గాక !

అగ్ని పర్వతములు పెకలి దశదిశల తమ "లావా" ను విర జిమ్ము గాక!

గాలి, అగ్ని, జలము లొకేసారి స్తంభించి లయించు గాక!

మనో నాశనమైన మహాత్ముని, ఎన్ని ఉత్పాతములు దాపురించినను, ఏ మాత్రము చలింప జాలవు !  -- శ్రీ సీతా రామాంజనేయ సంవాదము.

కావున, సర్వ కాల సర్వావస్థల్లోను -

నిత్యం - నిరంతరం - - -

"తస్మాత్సర్వేషు కాలేషు . . . . ." యోగస్థః కురు కర్మాణి. . . . . భగవచ్చింతనము. "ప్రాణ సదృశము" మనస్సును ప్రాణముతో లంకె పెట్టడమే" - రాజాధిరాజ యోగము విద్య. ఇదే "మనో - మారుత" సమ్మేళన విద్య. తండ్రి - తనయుల ఐక్యము. - - క్షేమ కరము - శుభ కరము - . . . . ఇది అభ్యాసంలేకున్న అంత్య కాలములో . . . . "ఎఱుక" లేక "మరుపు" సర్వ నాశన కారి యై - సర్వా నర్థమునకు దారి తీసి. . . . పతితుని చేయును!

సోహం - హం -సోహం||

మనస్సు - బుద్ధి

బుద్ధి వాసనలు ప్రత్యక్షములు గావు.

కనుకనే ఆనందమయ కోశమునందు సర్వజ్ఞత్వాది ధర్మములు తెలియబడుట లేదు. సకల బుద్ధులయందున్న సర్వజ్ఞత్వమును బట్టి బుద్ధులయందలి వాసనల నూహించి తెలుసుకొన వలెను.

అది యెట్లనగా -

వస్త్రము నందలి రంగుల వెనుక దానికి కారణమైన దారములను ఊహించి సులభముగా తెలుసుకో గల్గి నట్లు -

ఆత్మ (ప్రత్యగాత్మ) బుగ్గ యందు సంకల్పములుగ పొంగి పొరలు మనో వృత్తులు, నిర్విరామ తరంగములవలె కాన్పించి, అందే లయించు చుండును. కాని సమాధి స్థితి యందు దివ్యాను భూతి - బ్రహ్మానుభవం ప్రాప్తించును. ద్వైతమద్వైత మందు లయించును. ఏకమేవ అద్వితీయం బ్రహ్మ!!

మనః శునకమునకు సాక్షియైన కూటస్థ సాక్షి, ప్రత్యగాత్మ, నిశ్చల నిర్మల నిష్క్రియా తాటస్థ్యమున శోభిల్లి ప్రకాశించును.

స్త్రీ, పురుషుని సాన్నిధ్యమున,- అయము, అయస్కాంతము సాన్నిధ్యమున చలించి వికసించి, విజృంభించినట్లు -

"జీవత్వం" (పురుషుడు) ప్రత్యగాత్మ సాన్నిధ్యమున ప్రబలి చలించును.

- అనుభవం

జీవాత్మ - పరమాత్మల ఐక్యమే (కూడికయే) అద్వైత సిద్ధి.

"తండ్రి - తనయుల ఐక్యము" - రమణ మహర్షి.

"Prodigal son" - Bible

"మారుతి, మారుతం" - తారక యోగం

జీవాత్మల యవినాభావ సంబంద రహస్య విమర్శ ఇందంతర్భూతము.

మనస్సు - ప్రాణము; - ప్రాణ బంధము - యోగము - మనో నిగ్రహం - జ్ఞానము.

ప్రాణాయామ కుంభక స్థితి లో - వృత్తులు స్తంభించి, స్థిరతఁ జెంది, నిలకడ పొంది, ప్రాణశక్తి యందు లగ్నమై ధ్యాన పాటవమున కెంతయు దోహద మిచ్చును.

ప్రాణ చలనంతో మనోవృత్తులు (అనగా సంకల్ప వికల్పములు) - కూడా పునరుత్థానమై యథాతథంగా విజృంభించి, పరువులు తీయ సాగుచుండును.

"ప్రాణ బంధమే మనో బంధము" -

ఊపిరితోనే ఉత్పన్నమగు సంకల్ప రూప తరంగిణి యగు మనస్సు, ఊపిరి అణిగిన తాను కూడా మణగును; కావున, మనో బంధ సాధనకు ప్రాణ స్థిరత సాధన దోహదమిచ్చును. ఎందుకన - "మనస్సు - ప్రాణము" లు పుట్టు చోటు ఒక్కటే గనుక; --

అగ్ని - జలం - భూమి . . . . . . భూతములనుండి

క్రమముగా ↓ ↓ ↓

⟶ - వాక్ - ప్రాణం - మనస్సు - పుట్టెను

శ్లో|| పవనో బద్ధ్యతే యేన మనస్తేనైవ బద్ధ్యతే |
మనశ్చ బద్ధ్యతే యేన పవనస్తేనైవ బధ్యతే ||

తా|| మనస్సు చేత ప్రాణము, ప్రాణము చేత మనస్సుకట్టఁ బడును.
ఒక దానితో నొకటి కట్టిన రెండును బంధింపఁబడును. ఇదే
తండ్రి తనయుల ఐక్య రహస్యము ----

చిత్త వృత్తికి ; - 1. వాసన - భావన, విషయ చింతన, తలంపు, కోర్కె, సంసారము – ఇహ పర సంపర్కము.

2. ప్రాణము -చలనము, సంకల్ప జనన కారణము - వృత్తులకు మూలము! ఒకటి నశించిన, మరొకటి కూడ మాయ మగును. మనస్సు లీనమగు వరకు ను, విషయ వాసనలు నశింపవు. వాసనలు నశించు వరకు చిత్తము నశింపదు. చిత్త నాశము వరకు తత్వాను భవం కల్ల.

<u>ఇదే మోక్ష చక్రం</u> ----

- తత్వ జ్ఞానము వల్ల వాసనాక్షయము
- వాసనా క్షయం వల్ల మనో నాశము నకు దారి - తద్విదంగా " అమనస్క " సిద్ధి -- మోక్షమూ. ఇదొక శుభమోక్ష చక్ర రహస్యము; ఏ యొక్క దాని తో ప్రారంభించినా, ఫలితం తథ్యము.

" మనో నాశమే - దేహాత్మ బుద్ధి (మోహ) నాశమే మోక్షము "

- అన్నపూర్ణోపనిషత్ & ముక్తికో పనిషత్.

శ్లో|| మనఏవ మనుష్యాణాం కారణం బంధ మోక్షయోః
బంధాయ విషయా సంగి ముక్త్యైనిర్విషయం స్మృతమ్

తా|| మనసు కారణంబు మహనీయ ముక్తికి బంధ కారణంబు మనసే యగును.
బంధ మొసగు విషయ వర్తిత చిత్తము ముక్త బంధ మైన ముక్తి నొసగు.
అనగా మనస్సే బంధ మోక్షములకు కారణము

- అమృత బిందు ఉపనిషత్. శ్లో. 2

మనస్సు - అల్ప స్వల్ప కోర్కెల కలవడి పైకి పోదు. . . . .
దేహారోగ్యమునకై సూర్య నమస్కారములు,
ఈతి బాధల నివారణకై నవగ్రహ జపాదులు
ధనాశ తో లక్ష్మీ ఆరాధన
విద్యార్జనకై సరస్వతీ పూజలు
కార్య సాఫల్యమునకై వినాయక పూజ
కరువుల నివారణకై వరుణ యజ్ఞము
సంతానాపేక్షతో సత్యనారాయణ వ్రతము
అంటు వ్యాధుల నివారణకై గంగ జాతరలు

ఉపాసకులు తమ కోర్కెలు పండించుకోవచ్చును. కాని ముక్తి మాత్రము లేదు. దేహ సేవల వల్ల (యాత్రాదుల వల్ల) దేహారోగ్యము బాగు పడవచ్చును. కాని మోక్షము కల్ల.

మరియు విపులంగా - వివరంగా - వివేక - వైరాగ్య జనిత విషయ పరిత్యాగం వల్ల
(మనస్సు విషయములందు ప్రవేశించుటే " సంసారము " - బంధము గాన) --
చిత్త చాపల్య రహిత, స్థిరత్వ, వాసనా రహిత, ఏకాగ్రత - అంతర్ముఖ ప్రజ్ఞ ల వల్ల - మనస్సు లయించి, ఆత్మదక్కి - ప్రకాశించు ఆ ప్రగాఢ ఏకత్వ మధురానుభూతి యే మోక్ష స్థితి - కైవల్య పదవి -సమాధి స్థితి.

---- హఠ యోగ దీపిక.

బ్రహ్మ మే జగత్తు - జగత్తే బ్రహ్మము. బ్రహ్మ సత్తా కంటే జగత్సత్తా వేరు గాదు!! శక్తుని నుండి శక్తిని విడదీయ నెవరి తరము? విలయ కాలమున సృష్టి యావత్తు కూడా బ్రహ్మ సత్తాలో లయమై నిర్గుణ (సహజ) స్థితికి వచ్చును. తిరిగి "ఊపిరి" తో

(సంకల్పముతో) పునః సృష్టి ప్రారంభమై సాగి పోవు చుండును.

ఇదే ప్రకృతి పురుషుల "సంసార రహస్య" చర్వితి చర్వణ జగన్నాటక (సృష్టి స్థిత లయ) విధాన గాధ. భగవల్లీల.

భగవంతుఁడెందుకో యీలాగు నిర్విరామ "సృష్టి స్థితి లయాత్మక" క్రియల వల్ల ద్వంద్వముల తాకిడి, - విపరీత వినోద విచిత్ర విడ్డూర పరిస్థితుల ప్రాప్తి ---? దేవుని కిదేమి చెరలాట ప్రీతి? ఏమిటాతని సంకల్పం? ఇవి మామూలు జ్ఞిజ్ఞాసువుల సందేహ చిట్కాలు!! సత్యమెఱుంగ దలచిన నేరులో అతన్నే అడిగి తెలుసు కోవడం ఉత్తమ పద్ధతి!! భగవంతునకు మధ్యవర్తిత్వమనవసరం !!! - విజ్ఞుల జవాబు-

భగవంతుడే "జీవ" పాత్రధారియై నానా ఉపాధుల నాశ్రయించి, బహురూప నామ ధారియై, జగన్నాటక రంగమును నడుపుచున్నాడు. తాను సూత్ర ధారి, మాయా దేవి (శక్తి) సూత్రధారిణిః వీరే సర్వం, వీరిదే సర్వంః వీరు లేనిది, వీరికి మించినది, వీరు కానిది మరెద్దియును లేదు.

ప్రకృతి పురుషులు వేరు కాదు
శక్తుడు - శక్తి అవిభక్తం కదా!!

మనస్సు - చిత్తము - ఇంద్రియములు తమ తమ స్వాభావిక సహజ వ్యాపారముల వృత్తుల ననుసరించి అనగా విషయముల వేట + సంపర్కములను విసర్జించి సహజ సత్య మంగళ స్వస్వరూప లక్ష్యమున స్థిర పడుటే ప్రత్యాహారమనఁ బడును.

మహోత్కృష్టమైన ఇంద్రియ వశీకరణము (జయము) వల్ల, దేహమందలి ప్రతి నాడియు, ప్రతిస్నాయువు, స్వాధీనమగును. సమస్త మైన ఇంద్రియ వ్యాపారములకు, అనుభవములకు అది కేంద్ర స్థానము. మనో జయముతో శరీరము సంపూర్ణముగా యోగికి స్వాధీనమగును. ఆనాడు యోగి తన జన్మ తరించి, సార్థకమైనదని అనుభవించి, ఆనందించును.

జితేంద్రియా నుభవానంద శుభ దిన మిదిః తన మానవ జన్మకు తుది ఉపాధి యగు దేహము యొక్క అత్యద్భుత ప్రయోజనమును గ్రహింపఁ గల్గును. అది సాధకునకు - యోగికి - సిద్ధునకు, మహాపర్వదినము.

అనిర్వచనీయ, అవ్యక్తానందాను భూతి - పరమ శాంతి - అదియే!!

సారాంశము --

ధ్యేయము (లక్ష్యము)న మనో ఏకాగ్ర స్థిరతను సాధించుటయే "ప్రత్యాహార" ఫలమందురు.

చిత్త వ్యాపార నిరోధము వల్ల మనశ్శాంతి, దివ్య ప్రసన్నత, సహజ స్థితి, స్థిత ప్రజ్ఞ, అఖండ అద్వితీయ మధురాను భూతి ప్రాప్తి!!! "నివృత్తి" గమ్యము!!

"ముని" యన మౌనధారి యని స్థూలార్థముః కాని మనో మౌనమే సత్యార్థము! అనగా సర్వ సంకల్ప సన్యాసి యే "ముని" --

సాధన పరంపర -

బ్రహ్మాభ్యాసకుఁడు - ఆత్మ వేత్తయై జీవ బ్రహ్మైక్యమును పొందును. బ్రాహ్మ స్థితి, క్రమ బ్రహ్మ భ్యాసము వల్ల లభ్యమగును. బ్రహ్మత్వ ముత్తమోత్తమ స్థితి!!

ఇంద్రియ వాంఛా వేగ మరి కట్టవలెను. కామమునకు (మనస్సు) చుక్కాని వశమైనయెడల ఆత్మ నౌక మునిగి పోవును. కామము, పశు ప్రవృత్తి; జీవుని (దేహిని) శునకముగ నొనర్చి, వీధుల వెంట యీడ్చి, పతితునిఁ జేయును.

మనస్సు ఆత్మ పరమైన - శుభము -భద్రము - మోక్షము తథ్యము
మనస్సు దేహ పరమైన - పతనము, సర్వనాశనం - నరక ప్రాప్తి,
జనన మరణ చక్ర భ్రమణం తప్పదు.

“వివేకం - వైరాగ్యం" శుభ ఆప్తులు . . . . ఉత్తమ, ఉన్నత, ధార్మిక నైతిక సత్య ప్రయోజకత్వమును జ్ఞప్తికిఁ దెచ్చి హెచ్చరించి కాపాడుచుండవలెను.

"స్వార్థరహిత" (వ్యక్తి త్వాతీత - పారమార్థిక) - వివేక శోభిత మైన
జీవితము లోక కల్యాణ కరము. విశ్వ మంగళదాయకము.

" సర్వసమ - సర్వాత్మ " భావము, ఆత్మ శుద్ధి, ఆత్మ సిద్ధి,
తత్వానుష్ఠానముచే లభించును!! జ్ఞాని -- యోగి -
సాధకుఁడు ఈ విధంగా పరమానంద తత్వాను సంధాన
క్రీడలందు నోలలాడి, ఆత్మ విజయ (స్వాతంత్ర) శంఖారావ
మొనర్ప సాహసోపేత స్థిత ప్రజ్ఞ ఉటంకించి, ఉర్రూత లూపాలి!!

జై భగవాన్!!!

మనస్సు నందు ఆత్మను పెంచు కొనుటే "తపస్సు". తపస్సనగా, ఆత్మ సిద్ధి కొరకు శరీర దాస్యమే!!. అనగా సూక్ష్మ తత్వ ప్రాప్తికై స్థూల యజ్ఞ మన్నమాట! ఇదే బలి

దానము, సర్వార్పణ త్యాగము, అఖండయజ్ఞము, అపూర్వాహుతి!!! పూర్ణాహుతి!!!

సాధకుని జీవిత ప్రస్థానంలో, స్వార్థరహిత (నిష్కామ) కర్మాచరణము, ప్రేమ, భూతదయ, సత్యసంధత, ఉత్తేజ పరచి, సులభగమ్యుని( జేయును: ఏత జ్జీవిత మొక్క శుభ మహోత్సవము - ఆనంద మేళా !!

జీవునికి (పురమందలి పురుషునకు) అంతర్యామియైన ప్రత్యగాత్మ సాన్నిధ్య సామీప్య ప్రభావ మాహాత్మ్యాల వల్ల - "క్షణిక -అశుభ - ఖండ" ఇంద్రియ సుఖములందు విరక్తి, విముఖతలు బలిసి, శాశ్వతానంద ప్రాప్తికి దోహదము లభించును.

శుభ పరిస్థుతుల - శుభ వాతావరణ సాయమున, శరీరేంద్రియముల తుచ్ఛ కామ వాంఛలను రేకెత్తించి, ఉద్రేకించి, ప్రకటించు ఇంద్రియోద్వేగ ఉన్మాద విజృంభణల పిలుపులకు బానిసలుగాక, - నిర్వీర్య, నిస్సహాయ, నిర్వేదములకు తలవొగ్గి లొంగిపోక, నిగ్రహించి, విజయుడవై తత్త్వానుసంధాన వ్రత శుభ పరి సమాప్తితో మోక్ష ఫల మందుకొమ్ము!! నీవు మానవుడవు గాదు - సాక్షాత్ మాధవు(డవే సుమా!!

- ఉపనిషద్దర్శనభావము

ప్రాణలయం.

విశ్వ వ్యాపకమైన ప్రాణశక్తి ప్రాణాయామ సాధన వల్ల స్వాధీనమై, అష్ట సిద్ధులేగాక అపరోక్షాను భూతి సహా లభ్య మగుట తథ్యము.

మనస్సు - ప్రాణము-

వీటి అవినాభావ సంబంధము -

సృష్టి - లయములకు ఏక స్థానము -

ఏక లక్ష్యము - అగుటయే

మారుతి - మరుత్ పుత్రుడు - చపలి, కోతి, ప్రాణ దేవర "మనస్సు" - అనగా ప్రాణం (ఉచ్ఛ్వాస న్శ్వాసముల) నుండి మనస్సు (సంకల్పాదులు) పుట్టుచున్నవి.

ప్రాణ బంధము వల్ల మనస్సు -

మనో బంధము వల్ల ప్రాణము -

లయించును: " ప్రాణ మనో" లయ సాధన వల్ల (సోహం భావేన) - - - అనగా తండ్రి

తనయుల ఐక్యం వల్ల - - అమనస్క యోగ ఫల సిద్ధి - మోక్షము ప్రాప్తించును.

హృదయము నందలి గాలి (ప్రాణము) గాలి గోపుర మెక్కి, భ్రూమధ్యమందలి (శాంభవీ ముద్ర - ఆజ్ఞా చక్రము) - తుది మజలీ నుండి, బ్రహ్మ స్థానమును తాకు చుండును. బ్రహ్మ దేవునికి (దహర స్థిత) పావనమూర్తి వింజామరల్ వీచుచున్నట్లుగా, హృదయ స్థానము నుండి, భ్రూమధ్య స్థానము వరకు, యాతాయాత ప్రాణ ప్రసార (చిద్విలాస) చైతన్య "జీవ" (పురుష) త్రివిధా వస్థల క్రీడా రంగ భూమి గలదు. -

- ముక్తాను భవం

ప్రాణోపాసన - ప్రాణ ధ్యానం - అజప - హంసోపాసనలో - ప్రాణ గమనమును - ఉచ్ఛ్వాస నిశ్వాసములు - అజప గాయత్రి - (అనగా జపించకనే జపించునది) - ప్రణవ (ఓం) ధ్యానంతో అను సంధించి, లయించి, ఏక ధారగా - అహర్నిశము - అనుక్షణము ఎడతెఱపి లేక - తైల ధార వలె - - ధ్యానం చెయ్యడమే - అజప గాయత్రి జపమందురు.

దీనిని మించిన, మంత్రము - ధ్యానము - లేదు. అఖండ ఫల దాయని.

హంస (ప్రాణము) --<br>
ఓం (మనస్సు) -- } హంస + ఓం = హంసోంసోహం

(గాయత్రి) నాదము

మంత్రోపాసకులకు ---

భూత వాసనలు మరియు

భవిష్యత్సంకల్పములు -- అనగా

సంచిత మరియు ఆగామి -- అనగా

హృదయ గ్రంథులు + విషయేంద్రియ చింతలు నిశ్శేషముగ అంతరించి, శీఘ్ర ఫల మొసంగి, అమనస్కస్థితి, యోగ సిద్ధి కరతలామలకము.

32 వేద విద్యలు ప్రణవ ప్రతిపాదితములే.

వ్యాస వసిష్టాది మహాముని లెల్లరు తరించిన మంత్ర తరణ సాధన యిదియే!!

"క్షణమేకంక్రతు శతం వా"

ఒక క్షణము యీ మంత్రా భ్యాసము 100 యజ్ఞముల ఫలము నిచ్చునని శ్రుతుల

ప్రమాణము. సంచితము ధగ్ధమై, రాబోవు జన్మలు సహా నశించి, సర్వ కర్మ ఫలములు సమసి పోవును. సర్వోపనిషత్తులు ఐక్య కంఠమున, ఎలుగెత్తి చాటిన ఏకైక మహత్తర దివ్య రహస్య ప్రవచనమిది. కడమాట కూడా.

ప్రాణము

కావున, ఈ హృదయ - దహర (భ్రూమధ్య) ముల మధ్య " జీవ "రంగ స్థలమే, మానస సరోవరమనియు, అందు హంస (ప్రాణము) చరించుననియును, అజ్ఞా (భ్రూమధ్య) - త్రికూట పీఠమునకు పైనున్న బ్రహ్మకు వాహనమనియును - మహాత్ములు బహు చమత్కారముగ ప్రవచించిరి.

జాగ్రత్స్వప్న సుషుప్తులందు (త్రివిధావస్థలందు), విశ్వ తైజస ప్రాజ్ఞ నామముల చే, నేత్ర, కంఠ, హృదయస్థ, జీవ (పురుష) సంచారము - - - - హృదయము నుండి దహరం (సూక్ష్మ హృదయం) వరకు కలదు. ఈలాగు హృదయస్థ జీవుని సహస్రారస్థ దేవునిఁ కూర్చు, ("జీవ బ్రహ్మైక్య") శక్తి, స్తోమత, ప్రాణపుత్రుడైన ఆంజనేయుని (మనస్సు) కొక్కనికేగలదు.

హృదయస్థ (లంక లోని) సీతను (జీవుని) అయోధ్య (చోర రాని చోటు) లోని రామ బ్రహ్మ తో చేర్చు పుణ్య క్రియాశక్తి మారుతి కొక్కనికే దక్కినది.

: తండ్రి తనయుల ఐక్యము.

: ( మారుతి మారుతం ) మనో మారుత లయం.

: Prodigal son - " Bible "

: హంస + ఓం. ( ప్రాణ + మనోలయ మంత్రం )

" సోహం "

(జప + అజప = జపాజప) - యోగ + జ్ఞాన = రాజ యోగ పరమావధి.

మనస్సు - చంచలము కాని మహాబలవత్తరమైనది. ధృడమై, ప్రమాద భరితమై, సర్వ సామర్థ్య కారణము కావచ్చును. జ్ఞాన సముపార్జనకు, లోక హితార్థమై , స్వార్థ పరం మాత్రం కారాదు. తుదకు నిగర్వినని కూడా గర్వించరాదు. అహంభావమును జయించితినని అహంకరించరాదు.

మనస్సు - మారుతి - పావని . . . . ఎంత బలవత్తరమైన దో అంత బలహీనమైనది కూడ. ఆంజనేయుడు ఎంత బలశాలియో, అంత చపలిఁ కోతిః మనస్సు దైవిక సంపద. కావున, హఠాన్మరణ వార్తలు, భారీ లాటరీల గెల్పు వార్తలు,

విన్నంతనే, శోకానందముల తాడికి తట్టుకో జాలని దుర్బల మనస్కులెందరు " థార్ " మని చావడం లేదు?

అల్ప స్వల్ప తాడనలకు సహా మూర్ఛిల్లు వారు కూడాఁ గలరు. మనో దౌర్బల్యం గల వారెందరో, రక్తం - శవం - ప్రమాదం చూచి నంతనే మూర్ఛిల్లు వారు కూడ కలరు.

మహా గురుతర అంత స్సాధనలకు, బాహ్యా తాడనలకు తట్టుకొని, నిగ్రహించగల మనోదార్ఢ్యం అత్యావసరం.

ఇంద్రియ జయంతోనే స్థిత ప్రజ్ఞత్వం, ద్వంద్వాతీత స్థితి, . . . . . యమ నియమాది సాధనల ఫలితంగా ప్రాప్తించడం సహజం. దీనికి తోడు వైరాగ్య భోధోప రతులు, శుభ ప్రారబ్ధం, పంచ శీలములు - శాస్త్ర జ్ఞానం - గురు అనుగ్రహం అవసరం.

" గాలి నైన మూట గట్టవచ్చు

మనస్సు నెట్ల బట్టగలము!! --- గీత

షరా : - పంచ శీలములు :- సత్యంఫలము, సత్ చ్చింతనం, సద్గ్రంధ పఠనం, సదాచారం, సచ్ఛీలములు!!

అజ్ఞానాంధకార మందున్న వారు, జ్ఞాన దీపిక ప్రకాశమున జ్ఞాన వంతులై పరోక్షాను భూతి, గురు అనుగ్రహము, పురుష ప్రయత్నముల సాయమున, శుభ ప్రారబ్ధ పుణ్య కారణంగా, అపరోక్షానుభూతి నందు చున్నారు.

అపరోక్షానుభూతి ---- Cash ( క్యాష్ )

పరోక్ష జ్ఞానం ---- Cheque ( చెక్ ) అంతే.

ఆత్మ విద్య (బ్రహ్మ జ్ఞాన) సంపద, దేహ నాశముతో నశింపక, జన్మ జన్మాంతరముల వరకు "జీవుని" పునీతునిఁజేయుచు మోక్ష ప్రగతికి పూర్ణదోహద మిచ్చుచునే ఉండును.

పరి శుద్ధ "సత్వ" మానసము, తల్లి, తండ్రి, గురువు, ప్రియ మిత్రుల వలె, తోడ్పడి, " పాలలో కలసిన నీళ్ళు పాలగు నట్లు " దేవునిలోఁ గలసి దివ్యత్వమందును.

" మనస్సు నందు ఆత్మను పెంచు కొనుటే తపస్సు " --

దీపము తో చీకటిని వెదికి నట్లు - వివేక జనిత సద్విచారము, ప్రారంభించి నంతనే, విషయ చింతనము దూరమై మనస్సు అంతర్ముఖమై, అత్మధ్యానమునఁ బడి, ఆత్మాకృతినంది, ఆత్మైక్యమును పొందును.

" యోగ మాయచేఁగప్ప బడిన నేను అందరికిఁగన్పింపను. ప్రాకృత శరీరులు అప్రాకృత దివ్య మంగళ విగ్రహుఁడగునన్ను తెలియజాలరు"!!

--- గీత.

చంద్రునితో పోల్చ బడినది. చంద్రుడు కూడా - సంశయించు - క్షీణించు స్వభావము గలవాడు. సంశయ నాశనమనగా నిజ జ్ఞానోదయ మగుట. చంద్రునకు (అనగ మనస్సునకు) బ్రతికియు, సుఖించు భాగ్యము లేదు. మనస్సు "క్షయ రోగము వంటిది ": సంశయమనగా "అవిశ్వాసము"

నిజమైన జ్ఞానికి కామ్యము లేదు. కర్తృత్వము లేదు. అతడు సర్వారంభ పరిత్యాగి.

మనస్సు అఖండ సచ్చిదానంద అమృత (త్వ) సాగరమున - జనించినవాడు. ఈ సామ్య సాదృశ్య మెంతయు సమంజసము.

అవిద్య - విద్య లేమి

అజ్ఞానము - జ్ఞానము లేమి

చీకటి - వెలుగు లెమి

అశ్రద్ధ - పురుషప్రయత్నము లేమి

సంశయము - విశ్వాసము లేమి.

వీటి కంతయు, అశుభ ప్రారబ్ధము ముఖ్య కారణము.

| | |
|---|---|
| విషయ వాసనలు అనగా పూర్వ విషయాను భవ స్మృతులు | } విషయాకర్షణలుకు మూల హేతువైన, విషచక్ర భ్రమణ కారణము. |

ఈవాసనలే, ఆవరణ - విక్షేపములు - ఇవే చిద చిద్గ్రంథులు - (హృదయ గ్రంధులు) - మోక్ష ప్రతి బంధకములు - కావున - వీటి నివృత్తికే - తొలగించుటకే - వివేక - వైరాగ్య - విచారాదులత్యవసరము -

ఆత్మసాక్షాత్కారమునకు -

స్వస్వరూప సంధానమునకు -

అద్దముపై దుమ్ము దులుపునట్లు -

బియ్యముపై పొట్టు (పొర) తీయు నట్లు -

నీటిపై పాచిని తొలగించినట్లు -

సూర్యుని అడ్డిన మేఘములు తొలగినట్లు -
ఆత్మను  ఆవరించిన "వాసనలు" నశించాలి !!!
అగ్ని మీద  బూడిద (కప్పడం) - పోకున్న అగ్ని ప్రకాశింపదు గదా!!!

## 3. మహా మానస సరోవరము

**(దశ వాహిని బృహత్ ప్రాజెక్టు)**

మున్నుడి:-

పురుషుడు (తండ్రి)
ప్రకృతి (తల్లి)
> సంతానము "మనస్సు" (జీవత్వము)

మనస్సు – చిజ్జడాత్మకము – సంకల్ప వికల్ప స్వరూపిణి – "జీవత్వం" –

సంకల్పమే సర్వమునకు మూలము – బంధ కారణము. మనస్సు దయ్యము వంటిది – కాన్పించేకనే మన గలది. మనస్సే బ్రహ్మము (చతుర్ముఖుఁడు) అంతఃకరణ చతుష్టయ రూపుడు.

ఇంద్రుడు – ఇంద్రియములకు రాజు – ఇంద్రియాధిష్ఠాన దైవము – ఏకాదశేంద్రియము.

చంద్రుడు – శపింపఁబడి క్షీణించు వాడు.

అరూపి - కాముడు కాలి పోయి భస్మమై బ్రతుకువాడు.

చపలి – మారుతి (మరుత్పుత్రుఁడు)

ప్రాణదేవర – వాయు నందనుఁడు.

మాయామృగము - రస తుల్యుడు.

(వేమన – రస విద్యా విచారమున – మనస్సును రసము (పాదరసము) తో పోల్చినాడు)-

మనస్సు జడము. ఆత్మ చింతన దాని చేత కాదు. అనాదిగా, జన్మ జన్మాంతరముల నుండి, ఇంద్రియముల ద్వారా, విషయ చింతనమే దాని పని. దాని వెనుకటి గుణము – అనాది అలవాటు – శునక తత్వం.

"Deserve & Desire" అర్హతా నంతరం అభిలషించు, నీ అంతరంగ హృదయ పీఠమున, సర్వేశ్వరుఁడు, సుప్రతిష్ఠితుఁడై, నీ దేహ దేవాలయమున,శుభ సంస్కారములు (వాసనలు) దివ్య పరిమళ శోభితమై ఉద్దీపించాలి!!

ఈ బృహత్సాధనను సంకల్పించి, సాధించి నిస్సంకల్పుఁడవు కావాలి. పురుష ప్రయత్నం, శ్రద్ధ, భక్తి, గురు అనుగ్రహాశీర్వాదములు – భగవత్కటాక్షము, శుభప్రారబ్దాదులు - - - అత్యావసరము.

జాగ్రత్త -----

-- సముద్రోదకమంతయు పానము చేయుట,

-- మేరువును పెళ్ళగించుట –

-- బడ బానలమును మ్రింగుట –

-- అగ్ని పర్వతములతో ఢీ కొనుట –

వీటి కన్నిటి కంటే మనో నిగ్రహమతి ధుర్లభము"

--జ్ఞాన వాసిష్టము.

కావున చిత్త (ప్రవాహ) నిరోధమన, మనస్సు అంతర్ముఖముగాకున్న, ఏ విద్యయు, సాధనయు ఘటింపదు. ఏల యన --- మనస్సు యొక్క ఇంద్రజాల – మహేంద్రజాల అత్యద్భుత శక్తి, పరమ పురుషుని సహా లొంగదీసి, సంసారిని చేసినది. నిరాకార, నిర్గుణ, నిస్సంగుఁడైన, యా సర్వేశ్వరుని సమ్మోహితుఁజేసి, సంసార దుఃఖ భారమున – స్వస్వరూపా జ్ఞానిగా దిగ జార్చి, దీనునిగ, దుఖమున, దేహినంటూ కన్న తిప్పలు పడేట్టు చేసినది. భగవంతుని చెర –వ్యూహము (స్వయంకృతాపరాధ జనిత) నుండి తప్పించి, విముక్తతను చేకూర్చు ప్రయత్నమే "సదుద్యోగము"- లేకున్న, బ్రహ్మ హత్యాపాతకం తప్పదు. ఇదే ఆత్మ ధర్మం

దేవుని పతన త్రయ సోపాన వివరణము – జీవత్వ కారణ రహస్యము –

1. దేహ ప్రవేశం – స్థాన భ్రష్టత్వం
2. దేహమే తానను కొనుట – దేహాత్మ బుద్ధి – భ్రమ – "అహం దేహోస్మి" అనే ప్రమాదం.
3. తదుపరి ఇంద్రియముల ద్వారా విశ్వ విశాల విషయాకర్షణ పరంపరల తగులు -

భగవంతుని జనన మరణ చక్రభ్రమణ భ్రాంతి – బంధ శాప విమోచన రహస్య విచార వివరణ సాధనాదులే "నిర్మలోద్యోగము"! దీనికి చతుర్వేద మహావాక్యార్థ సువిచారమే దివ్యౌషధము. ఇందుకు తిరుగు లేదు.

-- సర్వ సారో పనిషత్

-- శుక రహస్యోపనిషత్

-- వేదాంత పంచదశి – పంచమాధ్యాయం, మొదలగు ఉద్గ్రంథ పారాయణమే విమోచన కారి కావున, సంకల్పించి, నిస్సంకల్పుడవు కమ్ము!!

ఇంద్రియముల ద్వారా – సంకల్ప వికల్ప – మనః ప్రవంతుల పదింటిని, అడ్డుకొని, బంధించి, తిరోముఖం పట్టించి (అంతర్ముఖమొనర్చి) తన సహజ స్థానమైన బ్రహ్మ యందు లయించి, స్థిరపడి, తదాకారమై, మహా మానస సరోవరం దివ్య సాగరముగ రూపొందు ఒక అపూర్వ –అత్యద్భుత నిర్మాణమొక, బ్రహ్మాండ దివ్య సృష్టి కాదా!! ఇదే "ధ్యాన – ధారణ" ఫలం - - దీనినే "ఉపరమేత్" అంటారు, మహర్షులు.

అమనస్క రాజ యోగ సిద్ధి - - నిత్య నిరంతర దుఃఖం పోయి, నిర్మలానంద, అమరత్వం, అమృతత్వం, అఖండత్వం, అష్ట సిద్ధులు, అష్టైశ్వర్యములు, - - అంతేకాదు – సర్వేశ్వరత్వం – సర్వ సార్వభౌమత్యం - - ఇంకా __ అదిగో, అంతరిక్షమున, మంత్ర ముగ్ధముగ వ్రేలాడుచున్న అనంతకోటి బ్రహ్మాండ మండలాధిపత్యం – సర్వ సామ్రాజ్యాధికారం నీదే!

ఇక నీవు కోరవలసినది – కోర మిగిలినది ఏమిన్ని లేదు. మానవుడే మాధవుడౌతాడు. నీవే అఖిలాండేశ్వరుఁడవు – చాలునా? నీవు సర్వ సంసిద్ధుడవేనా? ఆత్మ పరీక్ష చేసుకో – శుభం – శివోహం!! జాగ్రత్త! అమూల్యమైన దివ్య మనశ్శక్తి ప్రవంతుల్ని (ప్రాపంచిక – తుచ్ఛ –ఖండ – నశ్వర) భోగములకై, విషయ సాగరమున పడ ద్రోసి, వృధాగా – నిష్ప్రయోజన పరచడం – బుద్ధిమంతుల లక్షణం కాదు!

కల్ప వృక్షాన్ని కలప కోసరం -

కామ ధేనువును చర్మం కోసరం – చంపు కోవడం – అమానుషం – ఘోర అనర్థదాయకం.

క్లుప్తంగాః-

నామ జపంతో ప్రారంభించి – సగుణ – నిర్గుణోపాసనల నధిగమించి - - కర్మ, భక్తి, జ్ఞాన, యోగ సాధనల పూర్ణోత్తీర్ణత నంది, గురుదేవుల అనుగ్రహం భగవత్కటాక్షం – శుభ పుణ్య ప్రారబ్ధఫలం – పురుష ప్రయత్నాల నాశ్రయించి, పంచశీలముల సహకారంతో (సత్సంగత్యం – సద్గ్రంథ పఠనం – సచ్చింతనం – సదాచారం – సత్క్రియాపరత్వం) - - - చతుస్సాధన సంపత్తి – హంస విద్య - - మొదలు

సర్వసాధనలనాశ్రయించి - - మరియు శమ దమములు అవినాభావ సంబంధంగలవి – ఒకటిని విడచి మరొకటుండబోదు.

వివరణము –

శమం- వాసనా త్యాగం – అంతరింద్రియ నిగ్రహం – మరియు -

దమం – బాహ్యాకర్షణలను (మనో వృత్తుల) ప్రేరేపణలనాపి

మనః ఫలకమున – పెద్దక్షరాల (సువర్ణాక్షరములతో) రెండు సైను బోర్డులను (ఊహించు కోవాలి) కట్టాలి -

మనో వృత్తుల నిరోధం (1) No Permission ఆంతరింద్రియములు విషయముల వేటకై, బయటకు తొంగిచూడ్డానికి వీలు లేదు – అంతఃకరణములు బయటకు పోరాదు.

(2) No admission –బాహ్య విషయాకర్షణలకు, ఇంద్రియములు చలింపక, నిగ్రహించి ఎదురొడ్డాలి. ఆనగా – వషయాకర్షణలు లోనికి చొరరాదు.

మనస్సనే దొంగనే – ఘూర్ఖాగా (ద్వార పాలకునిగా) జేసి, పకడ్బందిగా నియమించాలి. భావాంబర వీధి, దివ్య తేజో (రాశి) విరాజితమై, అరుణోదయ ప్రాప్తి, ఆవిర్భావము కావాలి!! జాగ్రత్త!!! ఎదురీత మహా ప్రమాద భరితమైనది సుమా - -

కావున, ఆత్మను ఆత్మే ఉద్ధరించుకోవాలి! . . .

శ్లో|| ఉద్ధరే దాత్మ నాత్మానం నాత్మాన మవసాదయేత్|
ఆత్మైవ హ్యాత్మనో బంధు రాత్మైవ రిపు రాత్మనః||

తా|| తన యభివృద్ధికి తానే కారణము. తా నుద్ధరించుకొనుటలో నశ్రద్ధ వహించి, అధోగతి పాలు కాకూడదు. ఇంద్రియముల నిగ్రహించిన తన మనస్సే తనకు చుట్టము. నిగ్రహింపని మనస్సే తనకు శత్రువు.

---- భగవద్గీత. అ. 6. శ్లో. 5.

ఎవరి బాగు వారే చూచు కోవాలి. తన్ను మాలిన ధర్మం మొదలు చెడ్డ బేరమంటారు.

మరియు ఇంట గెల్చి రచ్చ గెల్వ మన్నారు. బహిస్సాధనలకన్న, అంతః స్సాధనమే అఖండ ఫలదాయిని. పుస్తక జ్ఞానము కన్న, మస్తక జ్ఞానమే లెస్స. దంత

శుద్ధి కన్న, అంతః శుద్ధి యే గొప్పయని మరువ రాదు. "భాండ శుద్ధి లేని పాక మేల" -- అన్నాడు వేమన యోగీంద్రుఁడు.

"అంతర్ముఖ సమారాధ్యా, బహిర్ముఖ సుదుర్లభా"

--- శ్రీ లలితా సహస్రనామ స్తోత్రమ్. (870 – 871)

సంకల్పమే సర్వమునకు మూలము. పరమాత్మ ఆది సంకల్పమే, బ్రహ్మ (పద్మ సంభవ) జననముకు కారణము.

రూపము లేని మనస్సు, కేవలం సంకల్ప వికల్పములనే ఉనికిగాఁ జేసు కొని మన గలది. కావున, సంకల్పము లేకున్న మనస్సు లేదు. సంకల్ప రాహిత్యమే (నిస్సంకల్ప స్థితియే) నివృత్తి పథము – ఫలము – నిర్మలోద్యోగము – అమనస్క యోగపరమావధి.

తద్వతు, సంకల్ప ధ్యానమే, అనగా సంకల్పములు "బుగ్గ" (Spring) గా పుట్టుచోటును, అంతర్ముఖుఁడవై ఏకాగ్ర చిత్తంతో ధ్యానించుటయే, ఉత్తమోత్తమ మైన ధ్యాన విధానము.

"ఆత్మ జిజ్ఞాస యే – బ్రహ్మ జిజ్ఞాస"

అదే "నేనెవరు?" – ఏక లక్ష్య విచార దీక్ష!!

--- **భగవాన్ శ్రీ రమణ మహర్షి.**

మనస్సే పునర్జన్మకు బీజము. మూల కారణము. మనో రాజ్యము భద్రమగు గాక!!

అగ్ని అన్నింటిని దహించును, అగ్ని నెయ్యది దహింపఁ గలదు? ఆత్మ అన్నింటిని తెలుసు కొనును. కాని, ఆత్మను తెలియు వారెవ్వరు? "ప్రజ్ఞానం బ్రహ్మ" మొదలు చతుర్వేద మహా వాక్యముల సారాంశ మిదియే!!

ప్రళయ ఝంఝూ మారుతములు వీచు గాక!

ద్వాదశాదిత్యులు ఏకమై తపింపఁ జేయుదురు గాక!

మహోన్నత అగ్ని పర్వతములు, పెకలి తమ "లావా" ను దశదిశల విరజిమ్ము గాక!

గాలి, అగ్ని, జలము లొకేసారి, స్తంభించి లయించు గాక!

మనో నాశమైన మహాత్ముని, ఎన్ని ఉత్పాతములు దాపురించిసనను, ఏమియు చేయఁ జాలవు.

-- శ్రీ సీతా రామాంజనేయ సంవాదము.

ఔరా! మనోజయం (జితేంద్రియత్వం) అంత సులభమను కోవడం అతిశయోక్తి కావచ్చు. దశేంద్రియములకు అధినాథుఁడు ఇంద్రుడు – అనగా – మనస్సు. ఇంద్రియాధిష్టాన దేవతలకు రాజు దేవేంద్రుడు – ప్రత్యగాత్మ!!

ఇంద్రియము లజేయములని సర్వానుభవం. అందున "జిహ్వా – గుహ్యేంద్రియము" లు రెండును ప్రత్యేకముగ బలవత్తరములు. ఎందులకనగా – ఈరెంటికిని – Double Powers – రెండు శక్తులు గలవు.




కావున, శివుఁడు సన్యాసి రూపమున, ఒకా నొక రాజునకు మౌన బోధగా, - ఈ రెంటిని రెండు చేతులఁ బట్టి, క్రియారూపమున – బోధించి అంతర్ధానమైనట్లు, శాస్త్ర ప్రవచనము.

మనస్సు అనంత విశాల రంగ స్థలము – సంకల్పములు బుగ్గలు-

ఇంద్రియముల ద్వారా మనో వేగ స్రవంతులు, (విశ్వ విశాల విషయ సాగరం లోకి) మహా ప్రవాహములు గ "దశ వాహినులై" ప్రవహించుటే, ----మహోగ్ర సమస్య.

సంకల్ప నిరోధ సాధన మార్గమే, మహా ప్రణాళిక ప్రయోజనక్రియ. ఇంద్రియ జయమే – మనో జయము. తత్ఫలమే మహామానస సరోవర – దశ వాహిని బృహత్ ప్రాజెక్టు ఫలము. బహుళార్థ సాధక ప్రణాళికా రూపము. సర్వతో ముఖ సౌభాగ్యదాయిని. బ్రహ్మాండ మానస సరోవర నిర్మాణ ప్రాప్తి!!

మనస్సు ఉన్నది, కాని లేదు. నీడ – భ్రాంతి దృశ్యం!! మనస్సు ఎట్టిది? . . .

మృగ తృష్ణ జల స్నానం - -

ఆకాశ పుష్ప మకుట ధారణం --

శశి శృంగాయుదో పేతం --

ఇంద్ర ధనస్సు (రథ) అధిరోహణం –

వంధ్యా పుత్రునితో యుద్ధం –

ఇదే మనః స్వరూపం. అన్నీ అసంభవములే. ఉన్నట్లు కాన్పించి, తుదకు లేకుండా పోవునదే “మనస్సు”!!.

మనస్సే పునర్జన్మ బీజం!

మనో రాజ్యము భద్రమగు గాక! ఆకాశమంతయు సత్పదార్థమే, అనంత – అఖండ – చిద్విలాసమే అద్వైతా నందానుభూతి!! ఇదే తురీయానుభవం.

పుట్టనుండి, విష సర్పములు బయలుదేరునట్లు - - అంత రంగము నుండి (బుగ్గ నుండి) సంకల్పములు పెల్లుబుకి, విశృంఖల వీర విహారము (ఇంద్రియముల ద్వారా) చేయును.

వివేక- విచార –వైరాగ్య సాధనలతో – తీవ్ర తర దీక్షతో – పూర్ణ పురుష ప్రయత్నమున – విజయ ఖడ్గమును దాల్చి, నిర్దాక్షణ్యముగా - - “ప్రతి తలంపును” - - అక్కడికక్కడే చీల్చి చెండాడుము – నిలువున నరికి వేయుము – అవలికి త్రోయుము. విజయీ భవ!

వివరణము –

సంకల్ప వికల్ప స్వరూపిణి యైన మనస్సు – దశేంద్రియముల ద్వారా – దశ వాహినులై (పది ప్రవాహములుగా) – నిత్య నిరంతరము పరువులేస్తుంది. ప్రకృతి మహా మాయా మహేంద్ర జాల ప్రభావ ప్రాబల్యంతో – ప్రచండ వేగంతో – మహోగ్ర తరంగముల కోలాహలంతో, నురుగులు గ్రక్కుతూ, ఒడ్లను ఒరుసుకొంటూ, నిర్విరామంగా – నిరాటంకంగా - - - జీవ నదులు తమ మధుర జలాల్ని, సముద్రపు ఉప్పు నీటిలో కల్పి వృధాగా నిష్ప్రయోజనమౌతున్నట్లు,- - - మనస్సు తన అమోఘమైన దివ్య శక్తుల్ని – యుగ యుగాలుగా – తర తరాలుగా – జన్మ జన్మాంతరములనుండి, విశ్వ విశాల విషయ సాగరంలోనికి, తరలించి, నిష్ప్రయోజనమవుతూంది.

కావున, చిత్త ప్రవాహములు, నిరోధింపఁబడి, అంతర్ముఖము గాకున్న, ’ఏ విద్యయు’ – ఏ సాధనయు ఘటింపదు.

ఈ విధముగా దశేంద్రియముల ద్వారా మనః స్రవంతులను అడ్డు వేసి (అరి కట్టి) బంధించడం ద్వారా రూపొందు “మహా మానస సరోవర మొక దివ్య సాగరంగా బ్రహ్మాండమైన సృష్టియగుట తథ్యము.

ఈ విధముగా స్వ స్థితి – సహజ స్తితి – సామ్య స్థితి – త్రిగుణాత్మకమైన పుణ్య పాప నివృత్తమై – పరంజ్యోతి స్వరూప – ప్రత్యగాత్మ స్వరూప – సాక్షాత్కార దివ్య తేజః పుంజ మందు, జీవుఁడు (లింగ శరీరుఁడు - మనోమయుడు) లయించి, ఉత్కృష్ట పదవి ప్రాప్తించును. ఈ విధంగా మనోలయ ప్రాప్తి ఫలం, అద్వితీయ విజయ సాధన మగును.

భ్రూ మధ్యమున ఆకాశ సంధి గలదు. ఉపనయన మార్గమున – సునీల ద్వారకా ముఖ పథమున – భక్తునకు (సాధకునకు) శ్రీ కృష్ణ పరమాత్మ చేయూత నిచ్చి, వెలుగు చూపి, తన వేయి బాహువులఁ జాపి, మన రెండు చిన్ని చేతులను, అందుకో తహ తహ పడుచున్నాడు!! ఉత్తిష్ఠ!! (Get Up – Awake)

చూడు – సుమతీ – గురునందనా – దశవాహినీ ప్రాజెక్టు నిర్మాణంతో ప్రాప్తించు "మహా మానస సరోవర" మొక విశ్వ కల్యాణకర మంగళ ప్రసాదం కాదా! ఎంత సుదినం – ఈ భావమే సత్సంకల్పం, ఈ పథమే "యోగం"-

బాపురే! పది నదుల ప్రాజెక్టు నిర్మాణం ఒకే మూల కీలకంతో, రూపొందడం హర్షణీయం కాదా! ఇక ఇంజనీయర్లు – ప్లాను – బడ్జెట్టు –సమస్త సరంజామా కావాలి కదా!

అంతా రెడీ! 1180 వేద శాఖల పైకి బ్రహ్మ నందు కొన్న (పరమైన) 108 ఉపనిషత్తుల నుండి, కోరి ఏరు కొన్న (సమన్వయమై – సర్వ సమ్మతమై, పరస్పర విరుద్ధ – విపరీత దోరణుల ధ్వనించని – దశ లేక ద్వాదశ (10-12) ఉపనిషత్తుల (సూత్రముల) నుండి సార సంగ్రహ రూపమనందగు – 555 సూత్రముల "బ్రహ్మ సూత్రముల" –నఁబడు బృహద్గ్రంధము (4 భాగములు – 16 అధ్యాయములుగ రూపొందడమే "వేదాంత శాస్త్ర అవతరణ గాధ" వాటి సార సంగ్రహమే భగవద్గీత (ఉత్తర గీత – ఉద్ధవ గీతలు సహా). ఇదే ప్లాను రూపము.

సద్గురువే (పరుస వేది) "జ్ఞానాంజన శలాక" హస్తుడై "గ్రీన్ సిగ్నల్" ఇస్తున్నాడు. హస్త మస్తక సంయోగ మైనది. "బోధ" యే శంకు స్తాపన. వ్యాస భగవానుఁడే" చీఫ్ ఇంజనీర్" - - - ఉపనిషద్ద్రష్టలే తోటి ఇంజనీర్లు - - - కర్మ, భక్తి, జ్ఞాన యోగ – చతుర్భూమికలే ---- (four phases or stages of the plan) ---- నాల్గు అంచలుగా రూపొందినది.

ఏలాంటి వ్యయ ప్రయాసలు, విదేశ ఋణములకై దేబరించడము గాని, అనవసరం. శుభం – అభయం – అక్షయం!!

దశ దిశలనుండి దివ్య గంధం పరిమళిస్తూంది. తథాస్తు దేవతలు మంగళ గీతముల నాలాపిస్తున్నారు. ప్రకృతి పురి విప్పి నృత్యం చేస్తూంది. దేహ త్రయాది సర్వేంద్రియములు, ఉద్విగ్నమై, తన్మయత్వమున "ఉత్తరాయణ పథోన్ముఖమై" బ్రాహ్మీ స్థితినందుకొని, ఏకా కృతిఁ జేంది, నిస్త రంగ తేజ స్సాగరమై, శాంతి పరిపూర్ణత నందినది.

దశ, మహా మనో స్రవంతులు మంత్ర ముగ్ధంగా స్తంభించి, (అడ్డు వెయ్యఁ బడి) – తిరోగమించి తమ జన్మ స్థానమైన బ్రహ్మ యందే లయించి, బ్రహ్మాకారమై – తత్ఫలంగా రూపొందిన మహా మానస సరోవర బృహత్ నిర్మాణమొక దివ్య సాగరమై ఆవిర్భవించి, ఆందు హంస వాహనారూఢుఁడైన బ్రహ్మ - - - హిరణ్యగర్భ సాక్షాత్కారమును ప్రసాదించును.

# 4. సృష్టి

ప్రవేశిక

శక్తుడు ⟶ శక్తి

పురుష——— ప్రకృతుల

అవినాభావ సంబంధము

అర్ధనారీశ్వర రహస్యము

సృష్టి రహస్యము

(శక్తి పాతము)

అర్ధ నారీశ్వర తత్వము

నిర్గుణ పరమాత్మ -- పురుషుఁడు

సగుణ (శబ్ద) బ్రహ్మము -- శక్తి

( మాయా శక్తి )

----------------

“ఏకంసత్ విప్రా బహుధా వదంతి”—(బ్రహ్మము)

ఉన్నది ఒక్కటే సత్యం – బుధులు అనేక విధములుగా వర్ణిస్తున్నారు. ఆది లో ఆత్మ వల్ల ఆకాశ మాయెను.”

--- ఋగ్వేదము

**రూప**నామ రహిత నిర్గుణ చిదాభాసము – అఖండ చిద్విలాసము.

నిర్గుణ పర బ్రహ్మము







రూప నామములు

స్థూల సృష్టి

అనగా బ్రహ్మాండము

ఈ బ్రహ్మాండము --1 సం|| అట్లనే యుండి – తర్వాత పగిలి 2 కపాలము లయ్యెను.

స్వర్ణ      రజిత

స్వర్గాది 7 ఊర్ధ్వ లోకములు      పృథ్వి మొదలు 7 అధో లోకములు

బ్రంహాండము లోని –

| | | |
|---|---|---|
| మావి (Placenta) | ---------------- | పర్వతములు గను |
| అందలి తడి | ----------------- | మేఘములు గను |
| అందలి నాడులు | ----------------- | నదులు గను |
| అందలి గర్భ జలం | ----------------- | సముద్రములు గను |

(= Omiatic fluid).

"ఆకాశం" – ప్రకృతి పురుషుల ప్రథమ సంతానం. ఆకాశమున విరుపులే మెఱపులు – చిద్విలాస క్షణిక ప్రదర్శనములు. ఆకాశ తత్వము నుండి ⟶ శబ్దం, అనగా ఉరుములు. . . . . . . క్షణ క్షణమును సాక్షాత్కారించు చిద్విలాస దర్శనమే అది. ఇంకేమి కావాలి? (Lightening & Thunder) .

---- చాందోగ్య అ. III

మనస్సు నకు (జీవత్వ) హృదయ కమలము స్థానము. శిరస్సు కాదు.

-- వేదాంత పంచ దశి. భా III. అ. II. శ్లో 12-13




ఓం కారము – సగుణ బ్రహ్మము –శబ్ధ బ్రహ్మము – పరమాత్మ చిహ్నము.

పురుషోత్తముని లాంచనము – త్రివిధ (అ+ఉ+మ్ = ఓం) రూపము

"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" -- తైత్తరీయం

"బ్రహ్మ యెందున్నాడు?" - - - - - ఇది అధికముగా నన్నడగ వద్దు"

---- యాజ్ఞ వల్క్యుడు.

--- సృష్టి కేంద్ర సత్యమైన (మూల సత్తా) బ్రహ్మమును, తెలియు నున్నత శక్తి మనకు ప్రసాదింపఁబడినది" -- శ్రుతి

"ఆత్మ దర్శన మాత్మ దృష్టి వల్లనే కల్గును. – అట్టి ఆత్మ దర్శనమునకు తోడ్పడు (సాధన) శిక్షణ మార్గమే – "యోగ విద్య" అని పేరు.

"ఆత్మతో మనస్సంయోగమువలన జ్ఞాన మగును" లయ మగుట వల్ల "మనస్సు" అనిత్యమని సిద్ధము—

<u>అరిస్టాటల్ పరిణామ వాదము—</u>

పరిణామ వాదము –

నిర్గుణ పరబ్రహ్మ నుండి ⟶ సగుణ ప్రకృతి ⟶ అష్ట రూప ప్రకృతులు – (5 భూతములు + 1 అవ్యక్తం + 1 మహత్తు + 1 అహంకారం) ⟶ క్రియ ⟶ తపస్సు ⟶ బ్రహ్మ –

సూక్ష్మము నుండి ⇄ స్థూలమునకు మరియు తిరోగతి పరివర్తనము (సృష్టి – (స్థితి) లయములు) క్రియలు అనాదిగ జరుగు చున్న పరిణామ సిద్ధాంతము సత్యము. జడ పదార్థములలో చేతనములందు కంటె బ్రహ్మ శక్తి ఎక్కువగా అణగి (గర్భీభూతమై) యున్నది.

--- అరిస్టాటల్

కణాదుని సిద్ధాంతము (అణు – Atomic Theory)

కణములు గర్భీ భూతములు – (అణు సిద్ధాంతము)

1. మానవ జన్మ ఉత్త మాధిక్య మైనది.
2. ఇతరులతో సంబంధము గలది.
3. ప్రజ్ఞ – సంకల్ప శక్తులు గలది.
4. ప్రేమ – అంతఃకరణాదుల క్రియలు.

పరి పూర్ణత చేకూర్చును. ఎందుకనగా ద్వంద్వముల వైరుధ్యము చే జనించు "సుఖ దుఃఖములు" సంప్రాప్త మగుట వలన.

నిర్గుణ ఏక రూపుడే – సగుణ ప్రపంచ పరిపూర్ణ బ్రహ్మ స్వరూపమైన – ఇక మిగులున దేమియు లేదని చెప్పునదియే.

--- కణాదుని సిద్ధాంతము.

ఉ|| వెలగ పండు గుజ్జు – బీజముల వలె

"ప్రకృతి – పురుషుల" పరస్పర, అన్యోన్య, అవినాభావ సంబంధ బాంధవ్య మీ సృష్టి స్థితి లయ తతంగ రహస్యము.

కృష్ణార్జునులు
యుక్తి శక్తులు
జ్ఞాన కర్మలు.

ఈ యుగళ సమ్మేళన – ఉత్సాహ లీలా తరంగిత మైన పరిపూర్ణ జీవిత విశేషము నే, ఉపనిషత్తు లుద్ఘోషించు చున్నవి.

"ఎవఁడు తన ఆత్మను, పరమాత్మగాఁ నెరింగి యారాధించునో, యాతడొనర్చిన కర్మ, యెన్నఁడు నశింపదు"—

---- బృహదారణ్యకము

"పరమాత్మ లక్ష్యము లేని కర్మ వ్యర్థము."

"ఈశ్వర ప్రీతిగా సర్వ కర్మలు చేయ వలెను"

"కర్తృత్వ రాహిత్యమే – అనాసక్త స్థితి" నిర్బంధ జీవనము –

మొట్ట మొదట సదసత్తులు రెండు లేవు. ఒంటరి యైన యా దివ్య పురుషుడూపిరిలేని "నిశ్వాస" మొనర్చెను. నిట్టూర్పు కావచ్చు. ఆదిలో నిర్గుణ – నిరాకార – నిరంజన –నిరామయ –అవ్యక్త – అసంగ – సద్వస్తువునందు- - - మొట్ట మొదట "నే" నను భావము పొడసూపినది. ఇదే "అహంకార" జనన రహస్యము. ద్వంద్వములు (ద్వైతము) పూర్ణత్వము నుండి వచ్చినవే!

మాయ అనాది – కాని అంత్యం ఉన్నది. అంత్యమన్న అదృశ్యం లేక విరమణ అని అర్థముః మాయ మూడవస్థలందును ఉన్నట్లు కాన్పించును. కాని, నిజంగా లేదు. అందుకే "మాయ" కా పేరు.

"సర్ప రజ్జు భ్రాంతి వంటిది" –"శుక్తి రజతం" – మృగ తృష్ణ" . . . .మొ|| అధ్యాస వలె!!

నిర్గుణ పురుషుని నుండి ⟶ శక్తి (బహిర్గత విజృంభణ)

నిర్గుణంలోనికి ⟵ శక్తి లయించినప్పుడు అదృశ్య మగును.

ఇదే సృష్టి స్థితి – లయ రహస్యము –

--- సారస్వతోపనిషత్తు –యజుర్

కాని, అన్నిటికి – మూల కారణం – మూల సత్తా – నిర్గుణ పర బ్రహ్మామే – ఆయాది నారాయణ మూర్తి – ఆది మూలం – అనంత – అఖండ – అ సంగ – అచ్యుత – అక్షర – అవ్యయ – అసమాన – అద్వితీయ – తేజోరాశి కూటస్థుడు – సర్వ సాక్షి –

ప్రత్యగాత్మ–పరమ పురుష -నిర్వికారుని నుండి ⟶ మూల ప్రకృతి ⟨ మాయ / అవిద్య ⟩ లచే

కల్పితము లైన (త్రిగుణాత్మక) – శరీర త్రయాది (వ్యష్టి – సమిష్టి) – మొ|| ఉపాధులను బట్టి వచ్చిన నామ రూపాదులన్నింటి యందును నిరంతరము వ్యాపించియున్న చిద్రూపు(డై, ఆ యా ఉపాధులన్నింటి యొక్క కృత్యములఁ గాంచు చుండును - - -

⟶ "ఉపద్రష్ట".

చైతన్య ప్రతి బింబము ఆభాసకుడను “జీవుడు” తాను చైతన్య మనెడి మరపు చే ఆభాస గల్గు చున్నది. ఇతనికి యింద్రియములే సాధనములు . అవి జ్ఞాన + క్రియా రూపములు. ప్రకృతి పురుషుల సంసారము, పంగ్వంధ సంబంధము లాంటిది.

ఈ దేహము సర్వ సుఖ సౌకర్యములతో జీవుని విడిది గృహముగా భగవంతుడు నిర్మాణించెను. దేహ యంత్రమును పరిపూర్ణమైన క్లుప్త స్రుష్టిః దీనిననుసరించియే – జగత్సృష్టి జరిగెను.

“నిర్గుణ బ్రహ్మమే – సగుణుడగు దేవుఁడయ్యెను.” – ఏకాంత – స్తబ్ధ – జడతుల్యమై – దుర్భరమై –దుస్తరమై –విసుగుఁబారి – “మార్పు” (Change = relaxation) నభిలిషించుటే ఆది (అనాది) సంకల్ప కారణం. “కామ ప్రవృత్తి”ః మానవునకు దివ్యదృష్టి – ధ్యాన దృష్టి  యున్నవి. బుద్ధి శిఖరాగ్రమున నిల్పి సత్పదార్థమును ధ్యానించి దర్శింతురు.

ఫలముః- అశృతము – శృతమగును –
అదృశ్యము – దృశ్యమగును –
అవిదితము – విదితమగును –

విద్య, జ్ఞానము, పాండిత్యము, రూప, కుల, ధన, వంశ, వర్ణ, పదవీ మొ|| ప్రాముఖ్య – ప్రాబల్య గర్వమును దూరీకరించి, అహంకార, మమకార రహితుడై, నిగర్వియై, నిర్మల – నిగర్వ – నిర్విచార – నిర్వికార – పసిపాప వలె, అమాయకపు దృష్టితో అంతర్ముఖుడై - - -  “బలేనఁ గాదు – బాల్యేన”  - - - తుదకు నిగర్వినని కూడ గర్వింపరాదు. సర్వ వాసనా క్షయాంత స్థితిలో  - - “సత్య పథము – సత్య జ్ఞానాంద ప్రాప్తి” సుగమము –సులభ లభ్యము.

“తాను చూచి, అనుభవించిన దేవుడే – తానను స్థితి” – ధ్యానఫలము – దివ్య సృష్టి – తాదాత్మ్యమును పొందుటే ధ్యాన యోగ సమాధ్యవస్థలో ఆత్మ సాక్షాత్కారము. ఇదియే పరమగతి, పరమానంద, పరమ పద ప్రాప్తి – పరమ నిలయము – అవాంఙ్మానసగోచర స్థితి – యోగి యొక్క ఆత్మ సాక్షాత్కారానుభవం – యోగి గాని వానికిఁ జెప్ప జాలడు – దివ్యానుభవం – అనిర్వచనీయానుభూతి

“ప్రజ్ఞానం బ్రహ్మ” --- (వేద వాణి)

విశ్వరూపము – అవ్యక్తుఁడైన – అప్రాకృతుఁడైన – విశ్వేశ్వరుని ప్రాకృత దేహము వ్యక్త మగుట.

దృశ్యాదృశ్యమంతయు – బ్రహ్మాండములో – ప్రాణి కోట్ల ఉనికి - సంచలనము సులభగ్రాహ్యముః గాలిలో – జలములో – భూమిలో – సాగర గర్భంలో – భూమి మీద - - సర్వత్ర ప్రాణ (చైతన్య) శక్తి కాన్పించు చున్నది. భూతద్దము (Microscope) సాయమున, చెట్లు చేమల అణువులందు సహా ప్రాణ శక్తి "స్పందనము" విస్పష్టము. చెమటలో, మలమూత్రాదులలో – (రక్త కణములలో) – ప్రాణి కోట్లు ఉద్భవించడం గమనింప దగ్గ విషయం - - అదిగో! గగన వీధిని కోట్లాది బ్రహ్మాండములు – నిరాధారంగా – మంత్రముగ్ధంగా – మహేంద్రజాల క్రియ వలె దృశ్యమగుట కన్న 'ఈశ్వర మాయాశాక్తి ప్రభావమునకు సాక్షి" – "అంతర్యామి (అంతరాత్మ) మాయా సంబంధముగల ఆత్మ" – "చిత్తు" – మాయయు, తత్కార్యసంబంధము లేని పరమాత్మః

సృష్టి క్రియ క్రమ రహస్యమొక దివ్యాద్భుత గాథ!

ప్రతి కల్పము (Cycle of creation) నందును, ఆయా యుగముల కాల ధర్మముల నాటక పునఃప్రదర్శనం యధాతథంగా – చర్వీత చర్వణంగా – జరిగి పోవు కథనము, "సృష్టి స్థితి లయ" క్రియల విధంగా – ఉపనిషత్తుల్లో ఏకాభిప్రాయం కాన్పించదు. విచారింతాం - - - ?

1. సూర్య చంద్రాదులు – ఋతువులు – పంచభూతాదులు - - - - అన్నీ మరి మరి అవతరించ వచ్చును. కాని "విముక్తాత్ములు" తిరిగి దేహ ధారులై – బందీలుగా ప్రభవించడం ధర్మ దూరమైన విషయం. కాని, లోక సంగ్రహార్థమై "ఈశ్వర ప్రేరేపిత" పరిత్రాణాయ - - యుగే యుగే" --- కొరకై, తమ యవతార పరంపరలు లోక కల్యాణార్థమై సాగించవచ్చు.

శ్రుతి స్మృతులందు యీ విమర్శ స్పష్టముగా విమర్శింపక పోవడం – మానవ మేధా శక్తికి అందని యీ బెడద తీరని సమస్యగా కూర్చుంది.

మాయా మయ జగన్నాటక కర్త – సూత్రధారి – ఆసర్వేశ్వరుఁడే – సగుణ నిర్గుణముల కతీతుఁడు – అతని చర్య లగమ్య గోచరములు –

ఆత్మ జ్ఞాన స్వరూపుఁడు, అతనికి సంకల్పములు పుట్టు స్వభావము. జగదుత్పత్తికి సంకల్పములే కారణ బీజములై తుదకు బ్రహ్మాండమైన విష వలయముగా రూపొందెను. దేవునికే ఒక విషమ సమస్యగా పరిణమించినది. దేవుడు జీవుడయ్యెను. పరమాత్మ జీవాత్మగా మారెను. ఇదియే ప్రకృతి – మాయాలీల –

దేవ – మానవ – జంగమ – స్థావరముల యొక్క త్రిపుటి వర్తనమే సంసార జగత్తు. ఆసక్తి – కర్మఫలాపేక్ష లేకున్న బంధ మెక్కడిది? విత్తనమే నశించిన వృక్ష మెక్కడిది? "భర్జిత బీజ న్యాయవత్" – ఒక అవస్థ యే లేకున్న మరొక అవస్థ లేనే లేదు.

కామ చైతన్యముః సృష్టిలో ప్రతి శరీరము (దేహము) – ఒక విధమైన ప్రత్యేక అణువులచే నిర్మితమైన దివ్య సంస్థ. ప్రత్యేక వ్యక్తిత్వము. ఈ అణువులకు "ప్రజ్ఞ" అసంపూర్ణముః కాని, సహజ – సామాన్య గుణములైన "అసూయ – స్వార్థ – కోప – తాప – మాత్సర్యరాగాదులు – సర్వ సామాన్యము. ఇదే మాయ – కామ చైతన్య క్రియ. దీనిని బట్టియే "మానసిక – స్థూల" చైతన్యములు రూపొందును. ఇదంతయు మాయామయ – ఇంద్ర మహేంద్ర జాల క్రియః ఈ ఆకర్షణలకు సాధకుడు తల వొగ్గక – నిగ్రహించి జాగ్రత్త పడవలెను. "నీవు ఈశ్వరుడవు – ప్రకృతికి బానిస కారాదు. నీ బాగు – ఘనత, నీవు మరచిన వ్యక్తిత్వ నాశనం – బంధం శాశ్వతం.

"కార్య కారణ వాదం" – అనగా కారణము లేని కార్యముండజాలదు. ఇకను, ఆకారణమునకు, కారణముండనవసరంలేదు. కారణము స్వయంభు. కర్త. కర్తకు కర్త హాస్యాస్పదం. సాక్షికి సాక్షి లేదు. ఒకే సాక్షి – సర్వ సాక్షి – ద్రష్ట - - - సూర్యునికి వెలిగిచ్చు, మరొక సూర్యుని చూప గలమా? వ్రేలి కొన అన్నిటిని తాకవచ్చు, కాని తన్ను తాను తాకుటెట్లు? కత్తి (పదునైన) అన్నిటిని కత్తరించ వచ్చు, కాని తన్ను తాను కోయుటెట్లు? ద్రష్టను చూచు వేరొక ద్రష్ట యున్న, ఇక యీ ద్రష్ట కూడా దృశ్య మగును గదా!

జగన్నిర్మాణమునకు మూడు కారణములుః-

| | | |
|---|---|---|
| 1. నిమిత్త కారణం (కుమ్మరి వలె) | తాను మారకనే పరమాత్మ సమర్థన. | కర్తృత్వము కల్గి యుండటం - "రచన – ధారణ – లయము' – క్రమ ("సృష్టి –స్థితి – నాశము") |
| 2. ఉపాదాన కారణము (చక్రము – కర్ర ) | సామగ్రి – ప్రకృతి – అవస్థానంతరం – తాను లేక – యేదియు లేకుండుట. | |
| 3. సాధారణ కారణం (మట్టి – కుండవలె) | కార్యాంతర రచన - లభించు వాటిని | రూపనామాదులు – రూపాంతరత గావించు జీవుడు. |

ప్రకృతి – ( పాంచ భౌతిక సంబంధమైనది) – అంతఃకరణము – బుద్ధి.
చిదాభాసుఁడు (జీవుడు) = "అంతఃకరణము + ఆత్మ "
బుద్ధి కర్తృత్వమును, ఆత్మ ప్రకాశమును కల్గించును.
ఇదే చిద చిద్గ్రంధి – సదసత్ గ్రంధి – లింగ దేహము – హృదయ గ్రంధి – విధి క్రియ – బ్రహ్మ ముడి – "స్థూల + సూక్ష్మముల బంధం = సంసారం.
బుద్ధి (అంతఃకరణ) నాశంతో, అనగా "సంకల్ప వికల్ప" నాశంతో "ఆత్మ" తానుగా (ఆవరణ రహితమై) ప్రకాశించి శేషించును – మిగులును – అనగా – అమనస్క స్థితి – స్వస్వరూప స్థితి – సహజ స్థితి – ఆత్మత్వ స్థితి - -- ప్రకాశించి మిగులును –ఇదే – (బంధ – సంసార -) మోక్షము – విముక్తి - ముక్తి - - - మనో నాశమే (మోహ నాశమే) మోక్షము.

సృష్టి – లయములు అనగా అనులోమ – ప్రతి లోమములు.

Projection & Retraction - Evolution & involution.

శ్లో|| ఆకాశత్పతితంతోయం యధాగచ్ఛతి సాగరం|
సర్వదేవ నమస్కారః కేశవం ప్రతి గచ్ఛతి||

తా|| వర్ష జలమంతయు సముద్రమున చేరునట్లు, అందరి దేవతలకు చేయు నమస్కారములు కేశవునికే చెందును. - - - Imperial Bank కదా!!

కూటస్థుని యందు బుద్ధి కల్పింపఁబడి – ఆబుద్ధి యందు కూటస్థుని ప్రతి బింబమైన చిదాభాసుడు "జీవుడ" ని వ్యవహరింపఁ బడుచున్నాడు. అదెట్లనగా సముద్రమునందు మంచు కొండ లుత్పన్నమై వాటి యందు సముద్రము ప్రతిబింబించునట్లు- --

జీవ శబ్దమునకు వ్యుత్పత్తి "ప్రాణమును ధరించుట" యని అర్ధము. ఆ కూటస్థుని కంటే జీవుడను నామాంతర మేల గల్గె ననగా - - కూటస్థుడు నిర్వికారుడు. కనుక వానికి సంసారము లేదు. చిత్ప్రతిబింబుడై చిధా భాసుఁడనఁబడు జీవుడే సంసారమును పొందు చున్నాడు.

ఘటాకాశము – జలాకాశముచేఁగప్పఁబడినట్లు జీవునిచేత కూటస్థుడుఁ గ్రమ్మఁ బడినాడు. అందు వల్ల అన్యోన్యాధ్యాస తెలియడం లెదు. జీవుఁడు కూటస్థుని తెలియక పోవడం అనాది. అవిద్య – ఆవరణం – అజ్ఞానం - - - ఇదియే సంసారం.

జీవ కూటస్థుల సంసార దశలందు భేద ప్రతీతి లేమియే అవిద్య.

ప్రకృతి పురుషుల కలయికయే సృష్టికి కారణం. (ఇదియే లింగము + పాణివట్టముల ప్రతిష్టాపన మందలి రహస్యం) - ప్రజాపతి పూజ – బాహ్యారాధనం - ”ప్రకృతి పురుషుల” సంగమ (సన్ని వేశ) రహస్య లక్ష్యం - -

ఈ అవిద్యా కల్పిత జీవుఁడు, జీవత్వం తెలియవలెనన్న – అవిద్యా స్వరూపం – విక్షేప – ఆవరణములు – అజ్ఞానమే కారణమని తెలియ వలెను.

వెలుగు వంటిది ఆత్మ – చీకటి వంటిది అవిద్య – యీ రెంటికిని ఏక స్థితి ఎట్లు కల్గును? దీపము తో చీకటిని వెతికినట్లే! అవిద్య కూటస్థు నాశ్రయించినది – మనిషిని నీడవలె - నీటిలో మంచు గడ్డవలె – అగ్గిలో పొగ వలె - - - - “శక్తుడు – శక్తి” – సహజ అవినాభావ సంబంధం –

మణి - - కాంతి

పుష్ప - - సౌరభం

వెలుగు - వేడి

పురుష - ప్రకృతులు.

- గడ్డిపరక మొ|| బ్రహ్మ పర్యంతం – దృశ్య జాల సంపూర్ణం.



విశ్వ రూప వివరణములు :--

భగవద్గీత యందు 11 అధ్యాయం. శ్రీ కృష్ణ భగవానుడు 10 అధ్యాయములు బోధించినా, అర్జునుఁడు ప్రత్యక్ష ప్రమాణమును గోరినాడుః నూరు బోధలకన్న ఒక స్వానుభవము హెచ్చు గదా! "ద్రష్టు మిచ్ఛామి" – అంటే చూడు నాయనా!! అన్నాడు గురు దేవుడు. విశ్వరూపం చూపించాడు – కాని అర్జునుఁడు తన స్థూల నేత్రములతో చూడఁ జాలఁడని భగవానుఁడాతనికి "దివ్య దృష్టిని" ప్రసాదించెను. అద్భుత లీలా తరంగిణిని దర్శించనిదే, మానవ బుద్ధికి విశ్వాసం – గురు భక్తి –తత్వబోధ కాజాలదు. ఆత్మ విద్యా ప్రచారం పెరిగి శిష్య వర్గం వృద్ధి కాజాలదు.

విశ్వ రూప దర్శనం ; -

1. యశోదకు నోటిలో,
2. శిశుపాల వధ – రాజసూయ యాగ సందర్భంలో,
3. కౌరవులకు "కృష్ణ" రాయభార సమయాన,
4. గోపాల గోపికాదులకు – రాస క్రీడా దృశ్యం,
5. కురుక్షేత్ర సంగ్రామారంభంలో . (భగవద్గీత 11 అధ్యాయము)

అవిద్య వల్ల (ఆవరణ వల్ల) ఆత్మ పరిపూర్ణత మరుగు పరచబడునే గాని, ఆత్మకు దేనివల్లను స్వతః వికారము కలుగఁ జాలదు. సూర్య చంద్రులను మేఘము లడ్డు కొన్నను అంట జాలనట్లు - - - "కల్పిత చిత్తములు" – తెరలు –

భగవంతుని ఆది సంకల్పమే తొలి పొరబాటు – ఇంత ఆగడ – అభాండములకు (సృష్టికి) దారి తీసినది. "నేను విస్తృతమౌతాను" – అన్నాడు నిర్గుణ పరమాత్మ – వెంటనే అతని శక్తి (మాయ) – బహిర్గతమై – సృష్టి జగన్నాటక రంగం – కల్పం వెంట కల్పం –కాల చక్రం గిఱ గిఱ - - - అణు ప్రమాణ సంకల్ప ఫలం మహా పర్వత సృష్టికి దారి తీసింది - - - ప్రభు రంగంలోకి లాగ బడ్డాడు. స్వయంకృతాపరాధ ఫలం - - మరియూ జగత్సంసార రంగ జీవన పరి సమాప్తి ఎప్పుడో ఆయనే చెప్పాలి.

తాను, సహజానంద మయుఁడు. బాహ్యా వస్తువులలో (విషయ సంగమమున) తన ఆనందముందను కొనడం "మాయ" – భ్రాంతి – మోహము - - మోక్షమునకు ప్రతి బంధకం. బంధ మోక్షములకు పూర్వజన్మము లందలి సంస్కారముల బలము దోహదమగును. కాని, తత్వ జ్ఞానంద మయుడగు పురుషుడు

– తన ప్రయత్నమున "ద్వంద్వాతీతుడై" - సచ్చిదానంద రూపత్వ స్వస్థితి – సహజానంద అమరత్వ – అక్షయ పదవి నందడమే "మోక్షము" --------

ఆత్మ – బ్రహ్మము -

తురీయ – సమాధ్యవస్థ – సర్వాతీత స్థితి యందు – బ్రహ్మాత్మ భావ మచంచలమై - ఏ కొరంతయు – లోటును లేక – నిర్వక్రముగా మూల మంత్రమై – పరమ – ఏకైక – సత్య రూపమున – నిల్చును. జీవ బ్రహ్మలొక్కటే యని – అనిర్వచనీయమగు అఖండ మధురాను భూతి స్ఫురించి, స్వ స్వరూపాను సంధాన మనుభవ మగును. – "ప్రజ్ఞానం బ్రహ్మ" –

ఈ జగమున కొక పెద్ద (సమిష్టి) మనస్సున్నది. అదియే హిరణ్యాగర్భుడు. (సూక్ష్మ సమిష్టి). ఇక స్థూల సమిష్టి "విరాట్పురుషుడు –

| ఆత్మ (వ్యష్టి) | బ్రహ్మ (సమిష్టి) |
|---|---|
| 1. దేహత్మ (విశ్వ) | 1. జగత్తు (విరాట్ లేక వైశ్వానరుడు) |
| 2. ప్రాణాత్మ (తైజస) | 2. ప్రపంచాత్మ (హిరణ్యా గర్భుడు) |
| 3. బుద్ధ్యాత్మ (ప్రాజ్ఞ) | 3. ఆత్మ - ద్రష్ట (బ్రహ్మము) |
| 4. ధ్యానాత్మ (తురీయ) | 4. ఆనందము (పర బ్రహ్మము) |

శ్లో॥ జాగ్రత్స్వప్న సుషుప్తి తురీయమితి – చతుర్విధా అవస్థాః
జ్ఞాన కర్మేంద్రియాంతః కరణ చతుష్టయం చతుర్దశ కరణ
యుక్తం జాగ్రత్। అంతః కరణ చతుష్టయై రేవ సంయుక్తః
స్వప్నః। చిత్తైక కరణా సుషుప్తిః। కేవల జీవ సంయుక్త మేవ తురీయం॥

"ఈశ్వరా సిద్ధే" – ఈశ్వరుఁడు సిద్ధింపఁడు (కాని ఉన్నాడని అర్థము)
-- కపిల సాంఖ్యం

"ఈశ్వరా భావాత్" – అనగా ఈశ్వరుఁడు లేడు.
-- పతాంజలి యోగ సూత్రం

కరణం – ఇంద్రియం

అధి కరణం - ఇంద్రియాధిష్ఠానం.

మనస్సు = ఇంద్రుడు - దశేంద్రియములు – పంచ భూత రూపములేః అంతఃకరణ చతుష్టయం, త్రిగుణములు వాటి పరిణామములే.

4 అవస్థలు – "దేహం + ఆత్మ" అందలివే -.

జీవేశ్వరుల సంఖ్య ద్వైతమును ధ్వనించునా?

1. మాయ ప్రకృతి యనఁబడును. మాయయే ఉపాధిగాగల ఈశ్వరుడు జగత్తును సృష్టించెను. --- "శ్వేతాశ్వతరం"
2. సృష్టికి పూర్వం "ఆత్మ" సృజన సంకల్పమున లోకముల సృష్టించెను. -- ఐతరేయం
3. ఆప్రత్యక భిన్న బ్రహ్మము వల్ల క్రమముగా, ఆకాశాది – దేహాంతర సృష్టి గల్గెను. -- తైత్తిరీయం

అనగా సమస్త బహురూప సృష్టి తానే అయ్యెను. –

4. సద్రూప బ్రహ్మము, బహురూప సృష్టి సంకల్పములచే, పంచ భూతాది - అండజ - స్వేదజ – జరాయుజ –ఉద్భిజ్జాది – చతుర్విధ భూత జాలమయ్యెను. -- చాందోగ్య
5. ప్రజ్వరిల్లు అగ్ని రాశి యందలి కణములు – మిణుగురులు –విస్ఫు లింగోద్భవ మగునట్లు, పరమాత్మ నుండి "చేతన - జడాత్మక" సర్వ సృష్టియు జనించెను.
6. నిర్గుణ సూక్ష్మ బ్రహ్మము నుండి – జగత్సృష్టి నామ రూపములుగా "బ్రహ్మము నుండి – పిపీలి కాదుల వరకు – మిథున రాసులుగా (స్త్రీ పురుష రూపములు దాల్చి), స్థూల కార్యములైన విరాడాదులుగా - - - మంచు తెరలందు దాగి వుండి సూర్యోదయంతో స్పష్టముగా ద్యోతమగు నట్లు – రూపొందెను.
7, ఆ బ్రహ్మమే వికార రూపమగు జీవత్వము పొంది దేహ సమూహములందు ప్రవేశించెను. ప్రాణాదులకు ప్రేరేపకుఁడగుటవల్ల జీవ భావ మేర్పడెను.
8. "సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్" – సృష్టికి పూర్వము విశ్వమంతయు, నమ రూప రహితమై, ఒక్క చిద్విలాసంగా (పర వస్తువుగా) నే యుండెను. సజాతీయ - విజాతీయ – స్వగత భేద రహితమై జ్ఞాన దృష్టికి మాత్రము – (ప్రజ్ఞానుభవంగా) గోచరంబగును. పంచ విధ భ్రాంతుల వల్లఁ గల్గెడునది సర్వము అబద్ధము.

శ్లో|| అచింత్యమవ్యక్త మనంత రూపం|
శివం ప్రశాంత మమృతం బృహద్యోనిం|

తథాది మధ్యాంత విహీన మేకం|
విభుం చిదానంద రూప మద్భుతం||

--"కైవల్యోపనిషత్" భా 1-6

"జగద్యోనిం" – (గీత) – జగత్తును కన్నది – భగవంతుడు – శక్తిని (ప్రకృతిని) కన్నందున, (భగ) శబ్ధార్థం "మాతృత్వ" – జగన్మాత – "శాక్తేయ" మతమున కాధారమీ సాంప్రదాయార్ధము




ఇదియే "మాయ" – ప్రకృతి – కోర్కెలో పుట్టి – కోర్కెలు సృష్టించు వ్యక్తిత్వం.
ఈ విధముగా "ప్రకృతి పురుషులను" పేర్కొని వేదములు (ఋక్కులు) ఆగి పోయినవి.
కామమే అహంకార కారణము – మనస్సు నకు బీజము.

"మనసో రేతః " -- శృతి

కావున, కామమే పరిణామ రహస్య హేతువు. సృష్టికి – వృద్ధికి మూలము – ప్రకృతి (మాయ) సామీప్య –సాన్నిధ్య – ప్రభావముననే పురుషునకు కోర్కెలు ఉదయించినవి, కామము – ఆలోచనమున కంటే బలవత్తరమైనది. బుద్ధి సంచలనము – లోపములను జూచుట – వాటిని పూరించుటకు ప్రయత్నించుట – కామము యొక్క క్రియలే.

వ్యక్తా వ్యక్త (ప్రకృతి పురుషుల) సంబంధ బాంధవ్యమే సంసారము. ఇదియే కామ క్రియా కలాపము.

సృష్టి క్రియ కూడా "యజ్ఞ"మే! (పంచాగ్ని క్రియ) విరాట్పురుషుఁడు – పశువు –క్లుప్తంగా సృష్టి క్రియా తంతు వివరమిది. ఓం!!

"యద్దృశ్యం తన్నశ్యం" –

ఏది మార్పు చెందునో అది జనించినదని యర్థము. –

ఏది వికారము చెందునో అది నశించునని యర్థము –

జనన – మరణములు కవలలుః వాటి మధ్యనున్న విరామమే ఆయువుః రెండు తీరములు లేని నది ప్రవహింపఁజాలదు.

"ఆదిలో అవిచ్చిన్న – అఖండత్వం ఉండినది"

"విశ్వ నిర్మాణం జరుగు గాక! పరమాత్మేచ్ఛ"

--- ఆత్రేయోపనిషత్. అ. 1 – 1 – 12

"బ్రహ్మకు జన్మముండిన - అతఁడు శాశ్వతుఁడు కాడు"

--- ఉద్ధాలకుఁడు **శ్వేతకేతునకు** చెప్పెనుః

అష్ట ప్రకృతులు

పురుష – ప్రకృతి(-మాయ) 5 భూతములు

1 అహంకారము

1 బుద్ధి

1 అవ్యక్తం

--------------

8

శ్లో|| మహాభూతా న్యహంకారో బుద్ధి రవ్యక్త మేవచ
ఇంద్రియాణి దశైకంచ పంచ చేంద్రియగోచరాః||

శ్లో|| ఇచ్ఛాద్వేష స్సుఖం దుఃఖం సంఘాత శ్చేతనాధృతిః
ఏతత్ క్షేత్రం సమాసేన సవికార ముదాహృతమ్||

అ|| మహాభూతాని = పంచ భూతములును, (5) (పృథ్వి, జలం, అగ్ని, వాయువు, ఆకాశము). 6. అహంకారః = అహంకారమును, 7. బుద్ధిః = బుద్ధియు,

8. అవ్యక్తమ్ =  ప్రకృతి లేక మాయ, దశైకంచ = పదనొకండగు (11). ఇంద్రియాణి = ఇంద్రియములును, (జ్ఞానేంద్రియము లైదు – శోత్ర, త్వక్, చక్షుః, జిహ్వా, ఘ్రాణములు – కర్మేంద్రియము లైదు – వాక్, పాద, పాణి, పాయు, ఉపస్థలును, మనస్సు ఒకటియు మొత్తము 11. (11 + పైవి 8, మొత్తము 19), పంచ = ఐదయిన, ఇంద్రియగోచరాః = విషయములును (శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు 5), 19 + 5 = 24, ఇవియే చతుర్వింశతి తత్వములు, జీవుడు యిరవది యయిదవ వాడు. ఇచ్చా = కోరికయు, ద్వేషః = ద్వేషమును, సుఖం = సుఖమును, దుఖః = దుఃఖమును, సంఘాతః = పంచభూత సంయోగమును, చేతనా = ప్రాణాదుల వ్యాపారమును, ధృతిః = ధైర్యమును, (7 గుణములును, 24+7, మొత్తము 31) సవికార = వికారములతో గూడిన, ఏతత్ = ఇది, క్షేత్రం క్షేత్రమని, సమాసేన = సంగ్రహముగ, ఉదాహృతం = చెప్ప బడెను.

తా|| కాణాదుల మతమునందు చివర 7 గుణములును ఆత్మ సంబంధములయిన వందురు. ఆట్లు గాక, అవియు ఈ క్షేత్ర సంబంధములైనవియే యని భగవాను లిచట నిర్ధారణ చేసి యున్నారు. ఈ పై విషయములన్నియు కలసి క్షేత్రమైనది.

- భగవద్గీత. అధ్యాయం 13. శ్లో. 6-7

I. విష్ణువు } ప్రకృతి → చేతనము (జీవ)
పురుషుడు } లక్ష్మి
శక్తి → జడము – దృశ్య జగత్తు (సర్వం)

II. బ్రహ్మ (నిర్గుణ → ప్రకృతి

పురుష ↓ హంస వాహనం (సోహం మంత్రం)

గాయత్రి — శబ్ద బ్రహ్మం — వాక్స్థానము

గాయః + త్రి = గాయత్రి

- (అ + ఉ + మ్) – ప్రణవము

జప గాయత్రి (త్రిపుటి) ↓ "ఓం" Trinity

ఉచ్ఛ్వాస నిశ్వాస క్రియ ↓ హంస → అజప గాయత్రి

నిరాకార – నిరంజన – నిర్వికార – నిష్క్రియ

పరుఁడైన నిర్గుణ – నిశ్శబ్ద బ్రహ్మం

ప్రకృతి (అష్ట ప్రకృతులు)

5 భూతములు + 1 అవ్యక్తం + 1 మహత్తు + అహంకారము

→ + ←

జప + అజప

సగుణ + నిర్గుణ

శబ్ద బ్రహ్మం + నిశ్శబ్ద బ్రహ్మము

ఓం + హంస

గాయత్రుల ఐక్యము ↓ మోక్షము

-- సర్వ వేదాంత సార సంగ్రహము

III. పురుష — ఈశ్వరుడు — (నిర్గుణ)

ప్రకృతి — పార్వతి — (సగుణ)

↓

సంధి స్థితి లో} సగుణ – నిర్గుణముల సంధ్వవస్థ

అర్ధ నారీశ్వరుడు}

దశోపనిషత్తుల్లోని 32 విద్యలును – ప్రణవోపాసనను ప్రతి పాదించునవే! –
"ఓం" – ఆది – మూల – మంత్రము,
- పురుషుడు – నిర్గుణము – చైతన్యము –

ఈశ్వరుఁడు కపాల ధారి – పుర్రె లోనున్నాడు. (అర చెతిలో వైకుంతం చూపడం – అదే రహస్యేంగితం = చేతిలో చూపిస్తాడు. (సూక్ష్మార్థం) – తుదకు మిగిలేది బూడిదే – శ్మశానంలోనిది - - - సంపూర్ణ వైరాగ్య పరమా వధి.

<u>అన్నింటికి "ఆత్మ" బీజం – జీవంః-</u>

1. మూల ప్రకృతి – 1
2. మహత్తత్వం - 1
3. అహంకారము- 1
4. భూతములు — సూక్ష్మ – 5, స్థూల – 5
5. ఇంద్రియములు — జ్ఞాన - 5, కర్మ - 5
6. మనస్సు - 1
7. ఆత్మ - 1

------------

తత్వములు 25

తల = అగ్ని
కళ్ళు = సూర్య చంద్రులు
చెవి = ఆకాశం
వాక్కు = వేదం
ప్రాణం = వాయువు
గుండె = విశ్వం
పాదము = భూమి

- సాంఖ్యం

– బ్రహ్మ సూత్రములు. అ. 1 –భా.4. సూ. 21.

--- చాందోగ్య ఉపనిషత్.



పర బ్రహ్మము
మూల ప్రకృతి
(శక్తి – త్రిగుణాత్మక ప్రధానము)
నారాయణి
వైష్ణవి
దేవి
త్రిగుణాత్మక
మైన ప్రకృతి.
సత్వ, రజస్,
తమో గుణాత్మకం.
పరాప్రకృతి
(A)
బింబము
అపరాప్రకృతి
(B)
దైవి
అసుర,
అశుద్ధ(మలిన)
(A) జీవుడు–మదంశ సంభూతుఁడు-
పంచవింశకుఁడు – క్షేత్రజ్ఞుడు
- అక్షరుఁడు – పురుషుఁడు – ఆత్మ
ద్రష్ట, సద్రూపకుఁడు – చేతనుఁడు
ఆనందమయుఁడు – “సంసారి” -
“బింబము” – త్రివిధావస్థ పర్యంతము
-“సంసారము” తప్పదు.
విద్య-మాయ
శుద్ధ సత్వప్రధాన
మైనది - ఈశ్వర
కారణోపాధి
ఈశ్వరుఁడు
(సమిష్టి)
సత్వం అనగా
రజస్+తమో గుణ మిశ్రం
అవిద్య
జీవుఁడు
(వ్యష్టి)
(B)క్షేత్రము–క్షరము–అనాత్మ-దృశ్యం-
జడం – అసత్తు –దుఃఖాత్మకం - -
ప్రకృతి – సంసారము -
జీవేశ్వరులకు మూడుఅవస్థలు గలవు
( కాని పర బ్రహ్మ తటస్థుడు – సాక్షి) -
--జాగ్రత్స్వప్న సుషుప్తులు.
5 భూతములు + 5 ప్రాణములు
10 ఇంద్రియములు + 4 అంతఃకరణములు
= (వెరశి 24 తత్వములు) –

పాఠాంతరం




(తిరోహితం = మరుగు వడుట)

(అదృశ్యం = మాయ మగుట)

--- శ్రీ సీతా రామాంజనేయ సంవాదం.

ఉత్తర దక్షిణ ధ్రువము లందలి అత్యధిక ప్రత్యేక పరిస్థితులందు, మంచు కొండలు (నీటి పరిణామ స్థితి) రూపొంది ప్రత్యేకతను (విపరీతమును) చూపెట్టు నట్లు నిర్గుణ పరబ్రహ్మము నుండి సగుణ ప్రకృతి ఉద్భవించును – ఇదే మూల ప్రకృతి – సామ్య స్థితిలో త్రిగుణాత్మిక – "అర్ధనారీశ్వర స్థితి"




1. పురుషునకు "మాయ – అవిద్య" రెండును ప్రకృతి భిన్నావస్థలే. ఉపాధులు – ఆవరణలు అనఁబడును.

2. ఉపాధిభేదములు – వికారములు - బింబ ప్రతి బింబముల నంట జాలవు.

3. అద్దములోని ముఖ బింబము జడ మగునట్లు (అచేతనము) ఉపాధిగత వికారమును తనదిగా అభిమానించదు. కాని బ్రహ్మ చేతనుఁడగు "సాక్షి" యొక్క, అభిమానమే బంధము – మోహము – మాయ – అవిద్య – అజ్ఞానము.

4. కాని, అద్దము లో వలె ఉపాధులందలి ధర్మములతో ప్రతి బింబమునకు వాస్తవిక స్థితిలో సంబంధము లెదు. అట్లే:-

5. బ్రహ్మమునకు మాయ / అవిద్య లతో సంబంధము లెదు . కాని, ఉన్నట్లు భావించడమే బంధము – అజ్ఞానము – భ్రాంతి –మోహము. "ఉపాధుల పరిణామము – బింబ –ప్రతిబింబముల కంటవు. – సంబధము లేదు.

6. పరబ్రహ్మము

- మాయ--ఈశ్వరుఁడు → కారణోపాధి
- అవిద్య — జీవుఁడు
- ఆవరణ / విక్షేపాదులు } స్థూల విద్య ప్రపంచము ఉపాధులు సృష్టి – → కార్యోపాధి

7. త్రిపుటి విచారము:--

జీవుఁడు -- ద్రష్ట --- అంతఃకరణ ప్రతిబింబము
ఇంద్రియము -- దృక్ --- ఇంద్రియ క్రియ
మనస్సు -- దృశ్యం --- సమస్త ప్రపంచము

సృష్టి -- "బ్రహ్మ" -- "ప్రకృతు" ల ఉభయ తారక క్రియ.
క్షేత్రజ్ఞ క్షేత్ర
( కారణం ) ( కార్యము )




తమో భాగము నుండి – బ్రహ్మాండం
14 లోకములు – భోగ భిన్న భిన్న
పదార్థములు – నానా రూపములు
పూర్ణ తమో గుణ
విక్షేప -- ఆవరణాధిక
జడ జగత్తు సర్వమున్ను

విశిష్టాద్వైతము → ( 3 in 1 & 1 in 3 )









ప్రకృతి --- పురుషులు ---- అనాదులు

--- కపిల సాంఖ్యము




ప్రకృతి -- మూల ప్రకృతి -- శక్తి

పురుషుడు -- నిర్గుణ మూర్తి -- "పుర వాసి" --

క్షేత్రము (దేహము) -- 24 తత్వములు గలది -- ఉపాది

క్షేత్రజ్ఞుఁడు -- జీవుఁడు -- క్షేత్ర వాసి (తెలుసు కొను వాడు) –

జ్ఞానము – సత్య దర్శనము – నిజము తెలిసి కొనుట –

నిత్యా నిత్య వస్తు వివేకము

సత్యా సత్య జ్ఞానము

జ్ఞేయం = దృశ్యం = జగత్తు, సృష్టి, -- మాయ యొక్క కార్యము –

క్షేత్రం = శరీరం – జీవుని సుఖ దుఃఖా నుభవములకు – సాధనం – ధర్మ కర్మముల ద్వారా భవతరణకు నావ. జీవ దేవాలయము – జ్యోతిష్మతీపురము.

క్షేత్రజ్ఞుడు – పురుషుఁడు, ద్రష్ట, నిర్గుణ, నిరాకార, నిరంజన – నిత్య, సత్య, బుద్ధ – ఆనందరూపుఁడు.

ఆత్మ స్వరూప నిర్ణయ విషయములో విరుద్ధ (విభిన్న) ప్రకటనలు జేసిరి.

→ (బుద్ధ – శంకర – కపిల –పతంజలులు)

బుద్ధి – విషయగ్రహణ శక్తి – పరిమిత మైనది. పరమ సత్యమును గ్రహించు శక్తి దానికి లేదు.

జ్ఞానం – సామన్య –ఇంద్రియ – (విషయ) సంబంధమైన – ప్రాపంచిక – స్థూలానుభవ – జ్ఞానం.

విజ్ఞానం – విశేష (ప్రత్యేక) – ఆత్మానాత్మ సంబంధమైన సూక్ష్మ – విచార జనిత –జ్ఞానం.

ప్రజ్ఞానం – కేవలం – మనసున కందని – ఊహాతీత “అనుభవ” జ్ఞానం (దృశ్యాను భవం కాదు).

విశ్వము – విశ్వేశునియందు బీజ రూపమున నుండెను – సంకల్పానంతరం (కల్పాంత స్థబ్ధత చలించి), నిగూఢ బీజము విశ్వ వికాసము చెందెను.
--

“స దేవ సోమ్యే దమగ్ర ఆసీత్”

“ఏక మేవా ద్వితీయం”

’తదైక్షత బహుస్యాం ప్రజాయే యేతి” -- శ్రుతి

ప్రధానమగు మాయ (యందు) ను వీక్షింప నామూల ప్రకృతి యందు ప్రతి ఫలించిన పరమేశ్వరుని చిచ్ఛక్తి వలన



మాయ యందలి శుద్ధ సత్వ గుణ ప్రభావమున } అంతఃకరణ చతుష్టయం (బుద్ధి – మనస్సు – చిత్తము – అహంకారము) – 4

పంచ భూతములందలి అర్ధ తమో గుణ ప్రభావమున } పంచ కర్మేంద్రియములు -- 5

పంచ భూతములందలి అర్ధ రజో గుణ ప్రభావమున } పంచ ప్రాణములు -- 5

= 29 తత్వములు

లింగ దేహములు = 19 తత్వములు

తత్వముల పాఠ బేదం - 25, 26, 29, 36, 96 - - - - - - - -

పాఠాంతరము ;-

బ్రహ్మ నుండి ➔ ఆకాశం ➔ వాయ ➔ అగ్ని ➔ జలం ➔ పృధ్వి (పంచ భూతములు) - - - - అనంత – సమస్త సృష్టి జాలం యావత్తు.

తెర లోని మాంత్రికుని కోతి వలె -- సృష్టి ---- లయం

అనులోమన X ప్రతిలోమన క్రియలు –

మరియు ➔ జనన, మరణ, రహిత, అమృత, అనంత, అద్వితీయ మూర్తిత్వం నుండి అనగా పరమాత్మ నుండి ⟶ ప్రాణ శక్తి ➔ మనస్సు (అంతఃకరణచతుష్టయం) ⟶ పంచ తన్మాత్రలు జ్ఞానేంద్రియములు 5 + కర్మేంద్రియములు 5 + భూతములు 5.

శరీరము షడ్వికారములు గలది.

జీవాత్మ – జనన మరణములు లేవు. అహంకారమమకారములుగల బుద్ధి చైతన్యాంశయే –

నిద్ర లో ప్రజ్ఞ అవిద్య (అజ్ఞానంతో) కూడినది. సంస్కారములు (వాసనలు) – వృత్తులు – అజ్ఞాతంగా కారణ దేహంలో అణిగి యుండును - - - మెలుకవతో "విషయ" జ్ఞానంతో తిరిగి వికసించి విజృంభించును.

యోగ దర్శనము పూర్తిగా సాంఖ్య తత్వముపై నాధారపడియున్నది.

ప్రకృతి యే < నిరుత్త / ఉపాధన } కారణముగ రెండును తానెయై యున్నది. ఆ ప్రకృతియే అవ్యక్తావస్థ యందు "మహత్" (= అవ్యక్తం) అనియు, ఆ అవ్యక్తం లేక మహత్ నుండి
→ అహంకారము పంచ తన్మాత్రలు పంచభూతములు + త్రిగుణములు
- - - ఈ విధంగా బుద్ధి తత్వం మొ|| పాషాణాదుల వరకు సృష్టి అవతరణము.

కార్యాకారణ వాదము:-

సూక్ష్మావస్థ కారణం → స్థూలావస్థ కార్యము

Cause → Effect

ఇక, మనస్సు బాహ్యేంద్రియముల ద్వారా – విషయములను గ్రహించి, బుద్ధికి తెల్పును – నివేదించును. తదుపరి బుద్ధి "ఇద మిత్థ"మని నిశ్చయించును. ఆత్మ వల్ల బుద్ధి ప్రకాశించును. (అయస్ – అయ స్కాంత సంబంధం).

ప్రకృతి పురుషుల సంయోగమునకు "అవిద్య" యే మూలము. ప్రకృతి కధీనం కాకుండుటే యోగము యొక్క ముఖ్యోద్దేశ్యము. మనము, ప్రకృతికి దాసులై - ప్రకృతి శాసన బద్ధులమై – యుండుట సామాన్యము. "మనో నిరోధమే – ప్రకృతి నిరోధము" – అనగ యోగము.

బాహ్యా ప్రకృతికన్న అంతః ప్రకృతి దృఢమై, బలవత్తరమైనది !! మనస్సు దశేంద్రియముల ద్వారా – "మనో వాహినియై" – బాహ్యా ప్రపంచమందలి విషయముల వేటలో (భోగేచ్ఛ – లంపటత్వము – తగులు – సంసారము), నిమగ్నమై "తన్ను తా మరచి పోకుండా" - - నిగ్రహించి "No permission – No admission" బోర్డులు తగిలించి - సాధించడమే – "రాజ యోగము" –

బాహ్యా దృశ్య ప్రపంచమంతయు (పాంచభౌతిక) – అంతర సూక్ష్మ ప్రపంచము యొక్క స్థూల వ్యక్తీ కరణమే!! అనగా:- భౌతిక శక్తులు కేవలం సూక్ష్మ శక్తుల యొక్క స్థూల వ్యక్తీకరణమే!!

"జగత్తు ఆత్మ ప్రతి బింబమే"

"The Universe is simply a projection of Self"

"ఆత్మ కృతేః పరిణామాత్" -- బ్రహ్మ సూత్రములు. ఆ 1. భా 4. సూ 26.

శ్లో|| యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత|
అభ్యుత్థాన మధర్మస్య తదా ౽౽త్మానం సృజామ్యహమ్||

తా|| ధర్మముయొక్క తగ్గుదల, అధర్మ వ్యాప్తి ఎప్పుడెపుడు కలుగునో, అప్పుడపుడు నేను నన్ను సృష్టించుకొందును. (అనగా ఆకారమును దాల్చి ఇంద్రియములకు గోచరింతును).

-- భగవద్గీత. అ 4. శ్లో 8.

"బ్రహ్మ తననుండి తానే విశ్వ నిర్మాణ కర్తయై – కారణమును తానే యై" – వెలసెను.

"జీవన్ముక్తుడు నిర్యాణానంతరం బ్రహ్మైక్యము చెందును.

--- బ్రహ్మ సూత్రములు. అ 1. భా 4. సూ 21.




(జీవ) ఆత్మ -- రథికుఁడు.
బుద్ధి -- సారథి
మనస్సు – కళ్ళెము -- కథోపనిషత్. 1-3.3.
వ్యక్తం -- దేహము
అవ్యక్తం – కారణ దేహం (అవాఙ్మానస గోచరమైనది)

జ్ఞాని -- మనస్సును ⟶ జీవాత్మ యందును
జీవుని ⟶ మహత్తునందును
మహత్తును ⟶ పరమాత్మ యందును (హిరణ్య గర్భునందును)
⟶ నిర్గుణ పరమాత్మ యందును చేర్చును.

--- కఠోపనిషత్ 1-3-13



చమస = గరిటె –

బ్రహ్మ యందు – సృజనాత్మక "శక్తి" సహజ గర్భితము.

సృష్టి సమయమున - బహిర్గతమగును. (బ్రహ్మ సూత్రములు. అ 1. భా 4. సూ 9.)

పరబ్రహ్మ కును – జీవునకును భేదా భేదములు గలవు.




విశ్వం కేవలం భ్రాంతి కాదు – బ్రహ్మ కారణముగా గలది. బ్రహ్మ యందలి దృశ్యా దృశ్య ప్రకృతి విశేషమే!!

సంసార దశయందు "దేవ – జీవు" లకు భేదము నిత్యముగా కలదు. జీవునకు స్వస్వరూప జ్ఞానము కల్గిన పిదప, పరబ్రహ్మాతో అబేధము సిద్ధించును. అనగా "ముక్త" దశయందా అభేదము.

అరణ్యాం -- వృక్షం

(సమిష్టి) -- (వ్యష్టి )

విరాట్ పురుష -- మానవ

అన్నిటిని భరించి పైగాఁనున్న విశ్వేశ్వరుడు మూలాధిష్టానం

"సర్వం ఖల్విదం బ్రహ్మతజ్జలానితి -- శాంత ఉపాసీత" –

-- చాందోగ్య. అ III - 14 – 1

సృష్టిలోని చరా చర సర్వస్వం – బ్రహ్మ భిన్నంగాను, బ్రహ్మగాను కూడా నున్నది.

"నీరు – నీటి బుగ్గ" సాదృశ్యంగా.



బ్రహ్మ

↓

తనలో ప్రతిబింబించిన - ప్రతి బింబములో – హెచ్చు తక్కువలు లేక

త్రిగుణ సామ్య స్థితియే --

↓

మూల త్రిగుణ సామ్య స్థితి

ప్రకృతి

↓

శుద్ధ – నిర్మలిన సత్వం
-మాయ

అశుద్ధ – మలిన –రజస్తమో గుణ మిశ్ర సత్వం
అవిద్య ( అజ్ఞానం)

ఆవరణ | విక్షేపం

ఈ త్రిగుణములు ఈశ్వరుని క్రియలు – నిత్యములు

<u>సత్వం</u> -- జ్ఞానం, శాంతం, దయ, సత్యం, అహింస, ప్రేమ, శుద్ధం – శ్వేత వర్ణం -

<u>రజస్</u> -- ప్రయత్నం – ఇచ్చ, క్రియ, కామక్రోధాదులు – మధ్యమం

<u>తమస్</u> -- ఇచ్చ – నిద్ర – జడత్వం – ఆలస్యం - జాడ్యం --- అధమం

ఈ మూడు కలసి “ప్రకృతి”యని పేరు. దీని నుండి మహత్తత్వమను బుద్ధియు, అందు నుండి → అహంకారము → పంచతన్మాత్రలు→ 5 సూక్ష్మ భూతములు → 5 సూక్ష్మ + 5 స్థూలేంద్రియములు → 5 భూతములు -- 24 తత్వము + 1 పురుషుఁడు

<u>ఉపాదానకారణమనగా</u> కార్యమునందు, కారణము ప్రవేశించియుండుట. కారణము కార్య రూపముఁదాల్చుట. “నూలు - వస్త్రము”, “మట్టి - కుండ”, “బంగారం – నగలు”, “ఇనుము – పనిముట్లు” – ఆలాగే అంతర్యామి జగత్తునకు ప్రధాన కారణమై జగత్తంతయు నిండి యున్నాడు.

<u>ఉపాదేయం</u> – గ్రాహ్యం.

ఉపాధి –ఆప్రతిబింబాధార శరీరము పురుషుడు దేనికిని (ప్రకృతికి) అనగా ఉపాదానకారణము కాని, కార్యము కాని కాడు – తటస్థుఁడు.

“ఒక చోట యిటుక – మరొక చోట మన్ను” తీసి అతడు ఇంటిని నిర్మించెను. అన్నట్లు – రెంటికిని మన్నే కదా కారణం – మూలం.

భగవంతుడు మహా మాంత్రికుడు. అతని మాయా శక్తి అమోఘము.



1. నీరు (జలం) — ఆవిరి (వాయు రూపం) – వాయు తత్వం
— మంచు గడ్డ (ఘనం) – పృథ్వీ తత్వం

2. సృష్టి — రూపం (సగుణ), ఆకాశం, వాయ్వాదులు
— రహిత (నిర్గుణ) – దృశ్య, జడం - - - -

3. భగవంతుడు "గుణ – నిర్గుణుడని" చాటడం లేదా?

అగ్నిలో గాలి పుట్టినది. గాలి అగ్నికి మాతృక. అనగా ప్రాణ వాయువే అగ్ని క్రియలకు అన్నింటికి మూల సత్తాః ప్రాణ వాయువు లేని చోట అగ్ని రూపొందదు. - - ఇక అగ్ని + గాలి తండ్రి తనయుల జత. మహా బలీయ మైనది.

" $H_2$ + O" + వేడి → జలం

వాయువు + అగ్ని → ◀జలం ▲

ఇక అగ్ని మాపక యంత్రం (Extinguisher) – ప్రాణ వాయువు రహితమైననే అగ్ని చల్లారునుః లేదా "క్లోన్"—

ఆంజనేయుడు – ప్రాణ దేవర – "ప్రాణము నందు పుట్టెను". మారుతి – మారుత పుత్రుడు – పాపాలయమైన లంకను కాల్చెనుః జీవత్వమునకు చెర వదల్చి – దైవత్వ ప్రాప్తికి తోడ్పడెను.

మారుతీస్తవంః- "మనోజవం మారుత తుల్య వేగం
జితేంద్రియం బుద్ధి మతాం వరిష్ఠం
వాతాత్మజం వానర యూథ ముఖ్యం
శ్రీ రామ దూతం శరణం ప్రపద్యే"

పంచతన్మాత్రలనుండి →పంచ భూతావిర్భావ వివరము. –

ఆకాశం – నిర్గుణ, నిరాకార, పరబ్రహ్మ, "సర్వ వ్యాపకత్వం" – తొలి సంతానం.

గుణం -- శబ్దం

(పంచ) వాయుః – "ఆకాశ మాతృక లక్షణములు + గుణం" – మరియు "చలనం"

(వాయు పుత్రుని వల్ల లంక ధగ్ధమయ్యెను) శబ్దం(మాతృక) స్పర్శం(ప్రత్యేక) (స్వగుణం)

(పంచ) అగ్నిః – మాతృక గుణములు "శబ్ద + స్పర్శలు" + రూపం (స్వగుణం) ప్రత్యేకం
(గాలి లో 1/5 భాగం, ప్రాణ వాయువు, అగ్ని, జఠరాదులకు మూలం)

జలం – మాతృక గుణాలు "శబ్ధ- స్పర్శ –రూప" ములు + రసం (ప్రత్యేక గుణం)
జల పుత్ర సమాగంతో పితృ (అగ్ని) కోపం చల్లారును.

పృథ్వి – మాతృక గూణములు "శబ్ద స్పర్శ రూప రస" ములు + గంధం (స్వ- ప్రత్యేక గుణం)
వర్షా కాలారంభమున – మట్టి వాసన – జల మాతృక పృథ్వీ (మట్టితో) విహరిచును

సృష్టి.
- అనులోమనం – Evolution (పుట్టుక)
- ప్రతిలోమనం - Involution (లయం).

పంచ భూతములు–పరమ పిత నుండి ఎడబాటును సహించక, వియోగ దుఃఖము తో

1. అగ్ని - ఏక ముఖంగా మెరుస్తూ ఊర్ధ్వ దిక్కుగా పరుగులు తీస్తు. "ఓం" జపం.
2. జలము - కొండలు, గుట్టలు, అరణ్యములు – చుట్టి, ఏకోన్ముకముగా ప్రవహించి, పుట్టిన చోటుసాగరం గచ్ఛతి – తర్వాత చూస్తాం . . . సమిష్టిగా శ్రమించి ఈశ్వరైక్యం పొందుదాం. ప్రవాహముల రొద "ఓం"
3. గాలి – విధి విరామం లేకుండా, అహర్నిశలు, దశ దిశలు – బ్రహ్మాండంగా వెదకుతూంది, "తల్లిని పోగొట్టు కున్న శిశువు వలె" ఆక్రందిస్తూ – ఆ మోర్పులు – చుట్ర గాలి (Vortex) – తుఫాను (వరుణిని తో) జల మిత్రుని కలసి "Joint Effort"
4. ఆకాశం – సర్వత్రా వ్యాపించి, అన్నిటి కన్నా అధికంగా, తాపత్రయ పడుతూంది. కాని ఫలం?
5. పృథ్వి – జడ్డు – జడం – కదిలి మెదలదు – గాలి తోడై "నీకేం బుద్ది లేదు,

ఏమిటా మొద్దు నిద్దుర – లే, పోదాం" అంటే . . . . అప్పుడు గాలి తో కలసి చెల రేగి "దుమ్ము – దుమారం" – "చుట్ర గాలి" గా తండ్రిని వెదకే – ఆందోళన – ఆర్భాటం – ఆరాటం – ఆక్రందనం - . . . ఏమిటీ ప్రకృతి "అంతర ఆవేదన – అబ్బ . . . ప్రకృతంతా "అహర్నిశలు – వినండి . . .ప్రణవ జపం చేస్తూంటుంది . .  .చెట్లు, గుహలు – సర్వం . . . తండ్రి తనయుల ఐక్యం.

# 5. జీవ ప్రశంస
## (ప్రవేశిక)

చైతన్యము + చైతన్యము నందు కల్పింపఁబడిన బుద్ధి (లింగ శరీరము) + అందు ప్రతిబింబించు చైతన్యము, అనగా “చిదాభాసుడు” - - - - కలిసి జీవుఁడనబడును.

--- వేదాంత పంచదశి.

వ్యాఖ్య :-

ప్రత్యేక పరిస్థితులందు సముద్రములో ఏర్పడు మంచు గడ్డ, అందు ప్రతిబింబించు సముద్రమే “చిదాభాసుడు”

జీవుఁడు, దేహి, కర్తృత్వ భోక్తృత్వ అహంకారి –

పురుషుడు, (దేహ పురమందున్న వాడు) –

“అంగుష్ఠ ప్రమాణః పురుషః”

---- కఠోపనిషత్.

వెండ్రుక కొనలో 1/100 భాగం జీవ పరిమాణం.

--- ముండకోపనిషత్ మరియు అధర్వణం.

( అనుభవం వూహ్యం )

అంతర్యామి X సర్వాంతర్యామి

(ప్రత్యగాత్మ)

పురుషుఁడు X పురుషోత్తముఁడు

జీవుఁడు X దేవుఁడు

ఆత్మ X పరమాత్మ

ఖండ X అఖండ

ఆత్మ -- ద్రష్ట

ప్రత్యగాత్మ -- అంతర్యామి

జీవాత్మ -- లింగశరీరము

"భ్రూ మధ్యమున ఆకాశ సంధి కలదు" – శాంభవీ ముద్ర ద్వారము

జీవ ప్రశంస --

" ఉపనయనము" – "సునీల ద్వారక" – ముఖ ద్వారము.

పంచవన్నెల పంజరము నందలి 'చిలుక" –

ఇంద్రియాదులు "జీవ దేవుని"కి సాధనములు మాత్రమే.

"నీలతోయద బ్రహ్మాంబును మనంబున – అందలి "చిద చిత్"

విశిష్ట తేజో బ్రహ్మాంబును చింతించి, సంతుష్టుడగుట ఉత్తమోత్తమ పదంబు"

"నీలతోదయ మధ్యస్థ విద్యుల్లేఖేవ భాస్వరా" -- మంత్రపుష్పం.

"హయము రోమాళి విదిలించు నట్లు సర్వ|
పాపజాలంబు విదిలించి వైచు రాహు|
ముఖము వెడలి వచ్చెడు చంద్రుఁ బోలుఁగర్మ|
సిద్ధిఁ జెందిన యాత్మ సం – శుద్ధి తోడ||

--- తైత్తిరీయం

జీవ ప్రమాణము --- పూర్వపుణ్యా పాప కర్మఫలంగా జీవుని జన్మ రూపొందును. –

1. హృదయ కుహరంలో "అణు స్వరూపుఁడు"

"నీలతోయద మధ్య స్థవిధుల్లేఖేవ భాస్వరా" నీ వార శూకవత్తన్వీ - - - "

-- మంత్ర పుష్పం.

2. "ఆత్మ – జీవాత్మ"లు రెండును "అకర్తృత్వ – కర్తృత్వ" పక్షులుగా ఒకే వృక్షం మీద నున్నట్లు – ఉపమానం. ఒకటి కర్మ ఫలానుభవి(జీవ పక్షి = క్రింది పక్షి) – మరొక్కటి సాక్షి (అకర్తృత్వ ఆత్మ) (పై పక్షి)

--- ముండకం. అ. III. 1. 1.

3. ఒకటి బింబము –మరొక్కటి ప్రతి బింబము (నీడ) ఉపాధి గలది. – "దశేంద్రియ + అంతః కరణ" – దేహము –యొక్క "చలన వృత్తులకు" చిక్కినది (జీవ – ఆభాస)

సత్యం – ఆభాస

బ్రహ్మాం -- జీవం

ఆరాధిత -- ఆరాధక

Light -- Shade

బింబం -- ప్రతిబింబము

వస్తువు -- నీడ

4. "నిద్ర గన్న వాఁడు నిజమైన యోగి" --- వేమన

గాఢ నిద్రయందు జీవాత్మ, ప్రత్యగాత్మ (పరమాత్మ) యందు లయించి విశ్రాంతిఁ గాంచును. విశ్వుఁడు (నేత్ర వాసి) - తైజస (కంఠ) ప్రాజ్ఞ (హృదయ) సంజ్ఞలననుభవించడం, మానవుని బుద్ధికి అందని దివ్య రహస్యం. జీవుఁడాత్మలో సుఖశాంత్యనుభవమును పొందును. అజ్ఞాన సమాధి నిద్ర.

5. నేత్రస్థ ప్రత్యగాత్మ (దృక్ = ద్రష్ట) చిత్కళయే బ్రహ్మమని – ఉపాసింప వలెను. లేకున్న పంచ దేవతల గతి పట్టును. - - - ఈతఁడు దేవయాన గతుఁడై, అమరత్వమును పొందును. "కనపడని – వినపడని ఆత్మ" సుషుప్తిలో నున్నవాఁడు తన్ను తానెరుఁగ లేడు. భూత జాలముల నెఱుంగఁడు. తానే నశించినట్లుండును. దేహము నశించునది – ఆత్మ శాశ్వతుఁడు – "జన్మ – దేహము" ప్రారబ్ధఫల ప్రసాదితములు.

6. "ఆత్మ – పరమాత్మల" అభేద జ్ఞానమే సత్య జ్ఞానము. – అతడె యోగి – సత్య దర్శకుఁడు. ఆత్మ సర్వవ్యాపి – సర్వజ్ఞుఁడు – సర్వాంతర్యామి – సర్వేశ్వరుఁడు".

7. "సూక్ష్మంలో ఉన్నది మోక్షం." (సూక్ష్మేంద్రియములు అనగా జ్ఞానేంద్రియముల కునికి పట్టయిన తల అని అర్థం) –

--- వాజసనేయబ్రాహ్మణం

8. "అంగుష్ఠ ప్రమాణః పురుషః" -- శ్రుతి

(పురుషుఁడు ధాన్యపు గింజ లేక విత్తనం ప్రమాణం)

--- బ్రహ్మ సూత్రములు. అ. I . భా. III . సూ. 24 నుండి

9. "అంగుష్ఠ ప్రమాణుఁడు" భూత భవిష్యత్తులను పాలించును.

--- కఠోపనిషత్ అ. II. – 11.12.

10. చీమ –దోమల పరిమాణ మత్యల్పము గదా?. అంగుష్ఠ పరిమాణమెట్లుండ గలదనే సందేహముండవచ్చును. ఇక దారి? విమర్శ? - - -ఏదేహికి ఆదేహంలోని తన "అంగుష్ఠ పరిమాణ జీవంబు వెలయు"

--- ధర్మ పథము – బుద్ధ భగవాన్.

జీవ స్థానములు –

జాగ్రత్త – నేత్రస్థానం – విశ్వుఁడు – ఆజ్ఞా చక్రము
స్వప్న – కంఠము – తైజసుఁడు - విశుద్ధ చక్రము
సుషుప్తి – హృదయము – ప్రాజ్ఞుడు – అనాహత చక్రము
తురీయం – దహరకుహరం –బ్రహ్మైక్యం – సహస్రారము
భ్రూమధ్యస్థ బ్రహ్మస్థానం" (లక్ష్య స్థానము)

--- శాంభవీ ముద్ర.

జీవ విచారముః-

1. జీవాంశ "తృణ –అణు" పరిమాణ. "పరిమిత" శక్తి – ప్రకాశ – వ్యాపకత్వములు" – పలుమారు స్థూల "ఉపాధులు" దేహముల విసర్జించి - - తిరిగి తిరిగి భువికి వస్తూండడం.
2. వెలుగు "కిరణం"గుండా – సూర్య రశ్మి కిరణ పథ మార్గంగా - - - అనగా కన్ను – తల మొ|| వాటి మార్గంగా –
3. ఇంద్రియముల ద్వారా ⟶ చంద్ర లోకం – పుణ్య ఫల భోగానాంతరము – తిరిగి "కర్మ" (తరణ) కొరకై భువికి దిగడం.
4. మరణం అంటే దేహ త్యాగం – దేహానికి "విడాకులు"
5. It is the Spirit - intelligent inner light with in the heart operating thro' the senses – by whom the "పరబ్రహ్మ" is realized or known.
6. 1/100 th of 1/100 the size of a hair (thickness) – జీవ పరిమాణం. హృదయ కుహరమున "నీ వార శూకవత్తన్వీ" – నీ వార ధాన్యపు ముల్లు కొన ప్రమాణము.

- ముండక – అధర్వణం -10 – 8 - 35.

"గంధ స్పర్శ సుఖం – పుష్పపరిమళ వ్యాపకం – దీపపు వెలుగు ప్రకాశ వికాసం – జీవుడు దేహాత్మ బుద్ధి గలవాడు" --- శ్రుతి

జీవునికి అంతరంద్రియం (మనస్సు) కలదు కాని దేవునికి లేదు. అమనస్క స్థితియే దివ్యత్వం. జీవుడు జన్మరాహిత్యము (మోక్షము) కొరకై – నిష్కామ కర్మ – భక్తి –ఆరాధన – యోగాభ్యాసాదులు చేయ వలెను. "దేహ చెర" – దేహాంతర్యముగా –

స్వేచ్ఛగా చరింప వచ్చును. బాహ్యా (విషయ) లంపటత్వా చెర పూర్తిగా నశించాలి. కాని, వివేచనార్థమై "బుద్ధి" - సచివుఁడు గలడు.

జీవుఁడు పరిమిత శక్తి – అస్వేచ్ఛ – బాహ్యా పరిస్థితుల కధీనత – ప్రారబ్ధ కర్మాది, సంస్కారముల ప్రభావము – జనన – జీవన – వాతావరణ ప్రాబల్యముల వల్ల – పుణ్యా కార్యములే చేయ గల్గుట దుస్సాధ్యంః "పాప – దుఃఖ – కష్ట" కర్మలు చేయుఛుండును. ఇది సామాన్య, సహజ, సామాజిక జీవన గాథ.

పురుషుఁడు స్వయంగా శుద్ధుఁడు. – తటస్థుడుః కాని, మనస్సుతో సంయోగము వల్ల – సమస్త దుఃఖములు –(శుభేచ్ఛలు) – సుఖేచ్ఛలు – ఉత్పన్నమగుచున్నవి -. ప్రకృతి పురుషుల సంయోగముచే, సంప్రాప్తమగు సుఖ దుఃఖములు తనపై ప్రతిబింబించునప్పుడు – వానిని తానే – అనుభవించునట్లు భావించి "భ్రాంతి" బాధ పడుచున్నాడు.

జీవుని మంత్రి – ప్రతినిధి యైన "బుద్ధి" – యజమానుని స్థాన మాక్రమించి – పూర్ణ భాధ్యత వహించి – కర్తృత్వము ప్రకటించి, "జీవుని కేలాటి సంబంధంలేని కారకత్వం" - తానే యజమానినని నిస్సంగుఁడగు జీవుని పేర - సాగించేడం వల్లనే - -"ఆభాసత్వము" – ఆరోపింపబడి - - దేవుఁడు జీవుఁడుగ, తయారయ్యేను. కావున, సర్వ కార్య నిర్వహణ బాధ్యత – కర్తృత్వాదు లారోపింపఁబడిన "జీవునే" – కర్త గావించి, భావించి, పూజ, ధ్యాన, నిష్ఠాదులందు నియోగించుట తప్పదయ్యేను.

-- బ్రహ్మ సూత్రములు. అ. 2. భా. III.

తీవ్రతర ధ్యాన సాధనలందు – ఆత్మ తన్మయత నొందును. – కాని బుద్ధి (అంతఃకరణము) జడము – కావున ధ్యాన లక్ష్యముగా నుంచుకొన్న ధ్యానమే వ్యర్థమగును.

కొయ్య పనివాఁడు పని వేళలందు సాధన పనిముట్లు చేబట్టును.

కొయ్య పనివాఁడు పనిలేని వేళలందు పనిముట్లు ఆవలపెట్టి తానుగా విశ్రాంతిఁగొనును. బుద్ధి జీవునకు సాధన సామగ్రి "జడము" --

కర్తృత్వము వహించేక – సాధనమగు బుద్ధికి దూరమై (పనిముట్ల నవల పెట్టిన వాడై) – యుండిన యిక "క్రియ" కార్యము లేదు గదా! మిగులునది - శాంతి – నిష్క్రియ – స్వస్థత – సహజ స్థితి - - - తనకు తానై "బ్రహ్మ" గా (తటస్థ స్థితిలో) నిల్చును.

ఫలశ్రుతులుః-

1. ఈశ్వరు(డు జీవుని పూర్వ జన్మ కర్మ ఫలముల – (సంస్కారముల) ను బట్టి నడిపించును.

2. "జీవ దేవుల" భేదము కల్పితము – ఎట్లనగా – ఘటాకాశ మహాకాశములు వేరని గాని – వేరుకాదనిగాని ఎట్లు చెప్పనగును.

3. ఆలాగే ఉపాధిగత బ్రహ్మము – బుద్ధి ఆవరణం (అధ్యాసత్వం) వల్ల, జీవు(డు బ్రహ్మము కాదని ఏలా చెప్పడం. జీవు(డు పరమేశ్వరుని కల్పితాంశ.

4. శ్లో|| మ మైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః|
మనష్షష్ఠా నీంద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి||

తా|| జీవాత్మ లన్నియు నా యంశములే. ఇవి జ్ఞానేంద్రియములను మనస్సును ఆకర్షించి లాగు చున్నవి. -- భగవద్గీత. అ. 15. శ్లో. 7.

సూర్యకాంతి వంకర కట్టె మీద వక్రించి కాన్పించినా, కాంతికి వక్రత లేదు గదా! ఆలాగే ఘటాకాశం, ఉపాధి చాంచల్యము వల్ల చలించినను, మహాకాశము అచంచలమై ఏలా మార్పు చెందకుండునో, ఆలాగే ఉపాధికారణమున సుఖ దుఃఖములనుభవించు చున్నను ఆ యనుభవము పర బ్రహ్మకు లేదు.

పరిశుద్ధు(డగు జీవు(డు, ప్రకృతి సంబంధమువల్ల దేవ మానవ తిర్యగ్జంతు జాలాది – నానా విధ శరీర (ఉపాధుల) ధారణము ద్వారా, సర్వేంద్రియ విషయ వ్యాపారముల అనుభవంతో – పంజర నిబద్ధ కీరము వలె, విముక్తి మార్గము( గాన( జాలక, విషయ లంపటత్వమునందగుల్కొని, జనన మరణ చక్ర భ్రమణమున తల్ల డిల్లు చుండును.

జడ చేతనాత్మకమగు (చరా చర) జగత్తు – జీవేశ్వరాది రూపమున విలసిల్లు చున్నది. -- జడమంతయు - మాయా స్వరూపము –
-- పరిచ్ఛిన్న జ్ఞానము - జీవ స్వరూపము –
-- అపరిచ్ఛిన్న జ్ఞానము -- ఈశ్వర స్వరూపము –

జీవ బ్రహ్మలకు భేదం లేదు. ఆత్మతత్వం ప్రకాశించియు – ప్రకాశింప కున్నది. కారణం? అజ్ఞానం – ఆవరణం. సృష్టిలో "చేతనాచేతనములు" రెండే గలవు. జీవు(డు – ఆత్మ-

భగవంతుఁడు




తల్లి -- దేహము

తండ్రి -- ప్రాణం

తండ్రి –తనయుల ఐక్యము– యోగమే యోగము

తనయుఁడు - మనస్సు

-- రమణ బోధ.

మనో + మారుత సంయోగం.




ఓం + హంస = హంసోంసోహం -

1. హ → పరమాత్మ
2. 0 → జీవుఁడు(మనస్సు)
3. స → జగత్తు

విమర్శానుభవ శేషం –1. మిగులును అనగా శేషించును:
2, 3, కల్పితములు గాన, లయించి మాయ మగును.

కావున, ఆత్మానాత్మ విచారము అత్యావశ్యకము "జగజ్జీవులు" – భాదితములగును – దృశ్యములు గాన – అసత్యములనియును, మాయా కార్యములనియును, మిథ్యయనియును గ్రహించడమే. "జ్ఞానము" - - శేషించు "ప్రజ్ఞ" – పరమాత్మ సత్యమనెడి జ్ఞానము (స్థిర విశ్వాసము – అపరోక్షానుభూతి – స్వాను భవం) – మోక్షము.

జీవన్ముక్తి :- జీవించి యుండగనే సంసారబంధమునుండి విడి వడుట: ప్రత్యగ భిన్నమైన అపరోక్షజ్ఞానము.

పరబ్రహ్మము:- సచ్చిదానందమయుఁడు (క్షేత్రజ్ఞుడు)

జగత్తు :- కల్పితము – రూపనామాత్మకము – క్షేత్రము మాయా కార్యము.

ఖచ్చితంగా నశించు ఉపాధులను అశాశ్వతంగాను, లోపలి అంతర్యామిని (ఆత్మను) ఏకరూపునిగ కనిన ధన్యులు – సత్య దర్శనమైన ఆత్మ వేత్తలు.–




1. జీవుఁడు -- అండము -- ఘటాకాశం
2. ఆత్మ -- పిండము -- మఠాకాశం
3. పరమాత్మ -- బ్రహ్మాండము -- మహాకాశం

జీవుఁడు – ఆత్మ ప్రతిబింబము – నిరుపద్రవుఁడు –భోక్త –

ఆత్మ -- కూటస్థుడు (కూట మనగా – ఇంద్రియ సమ్మేళనము)

- నాటక దీపము – ద్రష్ట – సాక్షి – నిష్క్రియాపర సాన్నిధ్య సాక్షిః తటస్థుడు

ఉ|| భాండ జలమందలి సూర్య (చంద్ర –ఆకాశ) ప్రతిబింబము – ఉపాధి చలన కారణమున, సూర్యాదులు చలించినట్లు కాన్పించును కాని, నిజముగా, వారికి ఏలాంటి చలనము లేదు. కాన్పించు చాంచల్యము – ఉపాధి చలన కారణమే గాని, అసలు సూర్యాదులు చలించుట లేదు గదా! భాండ జల స్వస్థితితో, తిరిగి ప్రతిబింబ స్వస్వరూప (నిజ – అచంచల) దర్శన మగును –

1. జాగ్రదవస్థ – విశ్వుఁడు –విశ్వ సంబంధి – ఇంద్రియముల ద్వారా బాహ్య విషయ (వస్తు) జాల సంగ ప్రయత్నం – శరీరాధారము – స్థూలానుభవము.
2. స్వప్నము – తైజస –సూక్ష్మ వస్తు అనుభవం – స్థూలానుభవ సామగ్రితో నూతన సృష్టి - ఆత్మ, శరీర బంధ విముక్తమై స్వేచ్ఛా విహార మొనర్చును. వాసనామయ లింగ దేహము – పూర్వ జన్మలందలి – జీవుని యిచ్ఛానుభవ సంజాత సంస్కారముల కూడిక.
3. సుషుప్తి – ప్రాజ్ఞ – శరీరము సర్వ దుఃఖముల కతీతమై తన సహజ దైవత్వమును ప్రకటించుకొనును. యాధార్థ్యమును రూపించును. సుషుప్తి (నిద్ర)లో కోర్కెలు లేవు. ఆత్మ పరబ్రహ్మను సంధాన మొందును. వాంఛాతీత స్థితి – సుఖము – ఆనందము – విశ్రాంతి – దుఃఖరహిత ద్వంద్వాతీత స్థితి. అజ్ఞాన సమాధి.

దీనికి పై స్థితి మరొకటి కలదు.

4. తురీయం – కారణం – నిద్రలోని నిష్క్రియత్వమునకు మారుగా – ఇందు పరిపూర్ణత్వము ప్రదర్శితమగును. ఇందు త్రిపుటి లేదు. ద్వంద్వములు లేవు. అవస్థాతీత స్థితి – అదృశ్యము – అవేద్యము – అనూహ్యము – అనిర్వచనీయ స్థితి – సర్వజగత్పూరి పూర్ణము. నిత్యశాంతి – "ప్రజ్ఞానం బ్రహ్మ" అఖండానందానుభూతి.

"1. కామ – 2. రూప – 3. ఆరోప – 4. లోకోత్తరులని" – పై నాల్గు అవస్థల భౌద్ధుల విభజనము. 3 ను 4 వ దానిలో లయం. మొదటి 3 ను తాత్కాలిక సత్యములు. 4 వ అవస్థ పై 3 ని మ్రింగి (నిర్మూలించి) మించి "అసలు సత్తాగా నిల్చును".

<u>జీవత్వ పతన సోపానములు 3</u> (దేవుడు పద్మవ్యూహ్యంలో జీవు(డు)

1. దేహ ప్రవేశం – భోగ సంకల్ప కారణం – స్వరూప చ్యుతి    I పతనం
   ఆవరణ ప్రాప్తి – సంసార బంధం -స్వయంకృతాపరాధం.
2. ఇంద్రియముల క్రియలు తనవేనని "భ్రాంతి" – కర్తృత్యం –    II పతనం
   అహంకారము – దేహాత్మ బుద్ధి – బాహ్య విషయములతో
   తగులు - తాదాత్మ్యం –తన్ను(దా మరచుట –
3. స్థూల (బాహ్య) భోగ భూమి –ప్రపంచ సృష్టి - విషయ –    III పతనం
   భోగ పదార్థముల ఆకర్షణ – సంగము – సంసారము –
   తగులు – లంపటత్వము – స్వరూప చ్యుతి -భ్రష్టత్వం
   పూర్తి – పతనం 10 గుర్రములు + 4 విమానముల మీద
   పరుగు – క్లోన్. (దశేంద్రియములు + 4 అంతః కరణములు)

- ప్రతి జీవి యొక్క హృదయాంతరాళమున – హృదయ గుహ కుహరమున – జ్వాజ్వల్యమానమై ప్రకాశించు జ్యోతి – సర్వ ప్రాణి కోట్ల యెందుండి పుట్టినవో యాసూక్ష్మాకాశము. -- చాందోగ్య.

- సృష్టికి కారణ(ము) భూతము -- చాందోగ్య.

- చరాచర జగత్తు భయాన్వితమై అందు చలించుచున్నది. – కఠం.

- ఆత్మేతరమైనట్టి దేదియు లేనే లేదు. సర్వ జీవాత్మ – కర్త –భర్త –హర్త – సర్వవ్యాపి – జ్ఞాపక శక్తి – సమాలోచనము – జ్ఞానము – ధర్మ తత్వము - - - -

అన్నియు ఆత్మ శక్తి సంజాతములే. సర్వానుభవ కర్త – అనుభవమున కందడు – అంతరంగమున అజ్ఞాతమై యున్న ఆత్మారాముఁడు – సర్వసాక్షి - - అనుభవమునకు ద్వంద్వములుండవలెను.

జనన జరా మరణ పునర్జన్మ దుఃఖము – షడ్వికార పరిణామము – ఆకలి దప్పులు – ఇచ్ఛలు – సంకల్పములు – సమస్త భౌతికానుభవములు - దుఃఖ హేతువులని స్వానుభవమున గ్రహించి . . . అందు నుండి విముక్తి – విడుదల – మోక్షమును కాక్షించును - - - - "ముముక్షువు". –

జాగ్రత్ స్వప్న సుషుప్తుల కెల్ల అధారమై – శాశ్వతమైనదై – మృత్యుంజయత్వము నకు నోచు కొన్నదే "ఆత్మ తత్వము" – పాప పుణ్యములు దీని నంటవు. . . . ద్రష్ట – పరతత్వము – దృశ్యాతీతము - - అనుభూత "ప్రజ్ఞ" –

<u>జీవుని అవస్థలు 7</u> (సప్తావస్థలు)

1. అజ్ఞానము - తాను తన తెలివి కి తెలియకుండుటయే.
2. ఆవరణము – నా తెలివియందు పరబ్రహ్మము లేడు. ఉండినను కనబడడు.
3. విక్షేపము – ఆత్మజ్ఞానము లేక – ఇంద్రియావస్థలఁజొక్కి సుఖదుఃఖములందుట.:
   కర్తృత్వం. దేహాభిమానం.దేహాత్మ బుద్ధి.
4. పరోక్షజ్ఞానం – శాస్త్ర జ్ఞానం + గురు భోధ + ఆత్మ విశ్వాస జననం – "బ్రహ్మ సత్యం – జగన్మిథ్య" – జ్ఞానోదయం. ముక్తిద్వార గత స్థితి.
5. అపరోక్ష జ్ఞానం – అనుభవం – ప్రత్యక్షం – "ప్రజ్ఞానం బ్రహ్మ" –
6. దుఃఖ నివృత్తి -
7. ఆనంద ప్రాప్తి -

} ఇవి అవినాభావ సంబంధము గలవి ఒకటిని విడచి మరొక్కటి లేదు } జ్ఞాన భానూదయం తో తమస్సు అంతరించడం - ఏక క్రియ – రెండు గా లేవు –

దేహత్రయ – జీవత్రయ – అవస్థాత్రయముల కవ్వల భిన్నుడై – అసంగ సాక్షి – తటస్థ ద్రష్ట – కూటస్థుడు – సర్వాతీతుఁడు – సర్వజ్ఞుఁడు – శుద్ధ చైతన్య స్వరూపుడు – స్వయంప్రకాశుఁడు – అద్వితీయ పరమాత్మ.

-- (కాణాదాః తార్కికులు)

1. పుట్టు గ్రుడ్డికి స్వప్నమున్నదా?
2. స్వప్నంలో ఎవరైన తన ముఖం తాను చూచు కున్నారా?

3. కలలో "ఇది కల-నిజం కాదు" అని గ్రహింపఁ గల్గిన వారున్నారా?

4. కలలో – స్వప్నావస్థలో – వెను దిరిగి చూచిన వారి యనుభవ మేమి?

5. నిద్ర యేలా వస్తుంది? ఏలా మెలుకవ వస్తూంది? లోపల నుండా? లేదా బయట నుండియా?

6. ఉపనయనానుభవం – ద్వారకా పట్నం –పంచ వన్నెల చిలుక – యీలాటి గూఢ నిగూఢ పదజాలమునకు విపులార్థము వివరింప విజ్ఞుల కభ్యర్థన. –

7. భ్రూమధ్యమున ఆకాశ సంధి కలదు – ఉపనయన స్థిత సునీల ద్వారకాపతి – శ్రీ కృష్ణ పరమాత్ముని నిలయము ----

8. పరమేశ్వరుడు సత్య (ప్రేమ) స్వరూపుడు – ప్రేమమయుడు. మనం ఎటు చూచిన, ఏది గాంచినా, సత్య స్వరూపుని చూడాలని వుంటే మనలో యీషన్మాత్రం కూడా అసత్యం ఉండరాదు. మనలో జాజ్జ్వల్యమానంగా, అగ్ని హోత్రంవలె, ప్రకాశించి వెలుగుతున్న విశుద్ధ పరతత్వాన్ని – సాక్షాత్కరించుకొనిన – అదే కైవల్యం – మోక్షం.

జీవ – ఆత్మ -- ప్రత్యగాత్మ –

ప్రత్యగాత్మ – ద్రష్ట –సాక్షి – (విశ్వ –తైజస – ప్రాజ్ఞ" – సంజ్ఞలు గలవాడు – త్రిదశుడు) – ఇంద్రియాగోచరుఁడైనను "అహం" – నేనునేనను – స్ఫురించు – స్వప్రకాశుడైన – "సత్యం జ్ఞానం మనంతం బ్రహ్మ" – శ్రుతి.

సచ్చిదానంద – అనంతాది బ్రహ్మ రూప లక్షణములు ప్రత్యగాత్మ యందు గలవు. గనుక ఆత్మకు బ్రహ్మత్వము సిద్ధించెను. ఎందుకనగా ఆత్మ యొక్క ఆభాసము నెఱింగెడు సాక్షి లేడు. ఆత్మయే - సర్వానుభవి – జ్ఞానం – ద్రష్ట – సాక్షి – కూటస్థ చైతన్యం – ఉప ద్రష్ట – ఎఱుక - - - -శేషించి కలిమి లేములు గ్రహించు తత్వం – ఇదే తీర్మానం –కడమాట - -

సత్యమన అబాధితం –బాధింపబడునది మిథ్య. ఇంటి లోని పదార్థములను తీసి పారవేయ వచ్చును కాని, అందలి ఆకాశమును తొలగింపఁనగునా? అదే విధంగా, దేహేంద్రియాదులను "నేతి నేతి" – నేను కాను, నేను కానని త్రోసి వెయ్య వచ్చును కాని, చివరకు మిగిలే "శేష మూర్తిని" – ఎఱుక" – సర్వ సాక్షిని తొలగింప – నిరాకరింప

నగునా? నిరాకరించి, ఇక ఏమిన్ని మిగుల లెదని గ్రహించి నిల్చు "భోధ" – "ఎరుక" – "ప్రజ్ఞ" యే "నేను" (ఆత్మ)ను –

దృశ్యమును – గ్రహణమును పూర్తిగ త్రోసి వేసి యింకేమిన్ని మిగులలేదని గ్రహించి – శేషించు నిల్చు తత్వమే "నీవు" – నిజమైన – సత్యమైన – శాశ్వతమైన అమర తత్వము – "ఆత్మ" -

సర్వా భావ ఎఱుక – నిరాకరింపఁబడలేదు. సర్వ సాక్షిగా నిల్చి పోవును.

"నిత్యం విభుం సర్వ గతం"

"నిత్యం నిత్యానాం"

"సర్వంహ్యేతద్బ్రహ్మ" --- శ్రుతులు.

"ఆత్మ" మూడు విధములగు నాశత్వము లేనిది. త్రిపుటి వల్ల అలసినది (జాగ్రద్దశలో)ః సుషుప్తిలో మనో ఉపాధికుఁడగు జీవుఁడైన చిదాభాసుఁడు, బ్రహ్మానందానుభవాసక్తుఁడై నిద్రించును. "ఆనందముగ ఏమియు తెలీక నిద్ర పోతిని" – ఇది "అజ్ఞానం + అనందం" = నిద్ర ః ప్రజ్ఞ సాక్షిగా అన్ని అవస్థలను గ్రహించి నిల్చి యే యుండునుః సర్వ దేశ – కాల – అవస్థ – పరిచ్ఛేదం లేక – నిరాకరింపఁ బడక నిల్చి యుండు "నేను" – ఆత్మను. "ప్రజ్ఞానం బ్రహ్మ" -

జీవుడెవఁడు – ఎక్కడున్నాడు?

సమస్త శరీరములందును, ఇంద్రియములు + గ్రహణ శక్తి యున్నది. శవమునకు ఇంద్రియము లన్నియు గలవు, కాని గ్రహణ శక్తి లెదు. కావున, సకల వ్యాపారములకు కారణమైన తేజస్సు (జీవ శక్తి) చైతన్య స్వరూపము ఒకటున్నది. అదే "ఆత్మ" –ఇంద్రియముల వృత్తి – వ్యాపారములు లేకయే – వాటి సాయ మపేక్షించకనే . . . అన్నిటిని తెలుసుకొను శక్తి యున్నది. ఆ ప్రాణ – చైతన్యము – తప్తలోహము నందలి దీప్తి వలె, శరీరమును భరించుచుండియు, తగులు లేదు. ప్రకృతి గుణములు లేవు. కాని ఆ మూడు గుణముల కార్యముల ననుభవించు చున్నది.

విద్యుచ్ఛక్తివలె కాన్పింపక అన్నిట ప్రసరించి, ప్రకాశించి, ఆడించి, తిరిగి విరమించు నట్లు –

సుషుప్తియందు ఏమియు తెలియదని, తెలిసెడి, యానందానుభవి – సాక్షి – జాగ్రద్దశ యందు కూడ మేల్కొంటిని – తింటిని – కంటిని – వస్తిని – పోతిని – అని తెలియు సాక్షి – విజ్ఞానమయుడు – ఎఱుక –

"పోనీ! నెను దేనిని నమ్మక పోయినా, నా ఉనికిని, నన్నే నేను ఏలా నమ్మకుందును?"

నేనన నా దేహం కాదు కదా!! నా దేహ మని (శవ మని) గ్రహించు నేను – నేనే!! శివోహం.

లింగ శరీరం — 10 ఇంద్రియములు, 4 అంతః కరణములు, 5 ప్రాణములు } 19 తత్వములు

ఇతర పాఠాంతరములు కూడా కలవు -- } 15 + 1 మనస్సు = 16 తత్వములు
15 + 2 (బుద్ధి + మనస్సు) = 17 తత్వములు
15 + 3 (బుద్ధి + మనస్సు + చిత్తము) = 18 తత్వములు

లింగ శరీరము + దేహం

19 తత్వములు + 5 భూతములు = 24 తత్వములు చతుర్వింశతి.

+ 1 ఆత్మ = 25 తత్వములు = మానవు(డు

బ్రహ్మ లోకములు ( దహరాకాశము ) ---

1. "దహరః" "ఉత్తిరేభ్యం" -- దహరాకాశం – త్రివేణి కూడలి – బ్రహ్మ పురి – జోతిష్మతీ నగరాంతఃపురము – ధర్మ కర్మ క్షేత్ర కేంద్రము – దేహ దేవాలయ గర్భ గుడి – అంతరాకాశం – పరాకాశం - - -

---- బ్రహ్మ సూత్రములు. అ. II. భా. III. సూ. 14.

2. సూక్ష్మ పద్మ నిలయము – హృదయ కుహరం – సూక్ష్మ హృదాయాకాశం – "సూక్ష్మాతి సూక్ష్మమైన దీని యందు బాహ్యాభ్యంతర విశ్వంబు లన్నియు నివాస మొనర్ప గలవు" – ఉ|| మఱ్ఱి విత్తనమున మహా వృక్ష మణిగి యున్నట్లు.

3. ఈ ఆకాశమే – నిర్మలినాత్మ; సర్వాతీత – సర్వాభాధిత "స్వస్థితి" - ఈ దివ్య స్థలమే సమస్త "జీవాత్మలకు" – నిద్రావస్థ యందునికి. రక్షా స్థానముః నిగూఢ జీవైక్య (సమాధి) స్థితి; బ్రహ్మ లోక మందురు.

ప్రతి ప్రాణియు, రోజు ఇందు నిద్రించి (విశ్రమించి), - మాయా మోహిత జ్ఞానాంధకార ప్రభావమున, సమ్మూఢ చేతస్క స్థితి నంది "-ఏమియు ఎరుగకనే –

హాయిగా – బాగా నిద్రించితి నను; - - - చిన్న పిల్లలు “చాక్ లెట్ – పప్పరమింట్లు” తిని ఆనందించి నట్లు గానే.

అనంత కోటి బ్రహ్మాండముల కందు ఉనికి, రక్ష, ప్రాపు, విశ్రాంతి, అనందము, ఇంపు – తంపు ---- క్రమ శిక్షణ కూడా! ఈ దహరాకాశ ప్రభావ మమోఘము. “దివ్య రహస్యము” :---

జీవాత్మ స్థూల ఉపాధి (దేహ) సంబంధము వీడి, అంతఃరంగమున దహర సచ్చిదానంద శాంతి నిలయమున విశ్రయించి, ఆనంద మయానుభూతితో, ఉత్తేజిత దీప్తి – తృప్తులను బొందును. ఇదే “జీవ బ్రహ్మైక్య స్థితి”

అగ్ని – రవి – చంద్ర – తార – విద్యుల్లతాదులకు వెలుగు నిచ్చు “చిద్విలాస మూర్తి” నిలయం. - - - - అదే దహరాకాశము (బ్రహ్మ పురి). (The final place or state of no return) – ఇదే తండ్రి తనయుల ఐక్య మందురు. - “Prodigal son” బైబిల్ కథా దృష్టాంతము.

“పాలలోని వెన్న”
“నువ్వుల లోని నూనె”
“గాలి లోని గంధం” ,
“వెలుగు లోని వేడి” - - వలెనే సర్వత్రా వ్యాపించి ప్రకాశించు ఆత్మ తత్వం కూడా.

అనంత కోటి బ్రహ్మాండములందు (వివిధ గ్రహములందు) జీవ రాశులుండుట సత్యా దూరమైన విషయం కాదు. భౌతిక దేహములందు, ఉండక పోవచ్చును.

దేహము నాల్గు విధములు

1. స్థూల దేహము – పార్థివ దేహం

| | |
|---|---|
| పంచ భూతములు<br>పంచ తన్మాత్రలు<br>పంచ కర్మేంద్రియములు<br>పంచ జ్ఞానేంద్రియములు<br>అంతఃకరణ చతుష్టయం | } 24 తత్వములు గలది |

2. సూక్ష్మ శరీరము -- స్థూల దేహ ఆకారమే వుండును. సుఖ దుఃఖము లననుభవించును. (అతి వాహిక దేహమనబడును) – దూర దృష్టి – సంఘటన

విఘటనలు స్వత స్సిద్ధము. శ్వేత వర్ణం. 2 ½ తులముల బరువు. (త్రికాల జ్ఞానం వుండును). ఇదే చాయా పురుష (లక్షణ) రూపము – యోగ సాధకులు తమ తమ రూపములఁ జూడ గలరు. – పూర్వ జన్మలందలి రూపములు గూడా దర్శనీయముః స్థూల దేహమునంటుకొనియే వుండునుః సూక్ష్మ శరీరము యొక్క అభివ్యక్తావస్థయే స్వప్నములు –

మృతాత్మలు యీ సూక్ష్మ శరీరముల నాశ్రయించియే యుండును. పెక్కు శక్తులుండును. క్రమముగా స్థూల శరీరమును విడచి, కారణ, లింగ, సూక్ష్మ శరీరములఁ బడయును.

ప్రేతాత్మలు సూక్ష్మ శరీరములతో నుండును. వాయు మండలమందలి అన్య స్థూల – సూక్ష్మతత్వముల నానా క్షణిక రూపములఁదాల్చును – అంతరిక్షమున సంచరించును –పెక్కు శక్తులుండును.

ఆజపా**** – ప్రకాశసాధనల ద్వారా సూక్ష్మ దేహుల దర్శింపవచ్చును. లోక – లోకాంతరాల అభాసను కూడ పొంద వచ్చును.

3. <u>లింగ శరీరము</u>

ఇందు – 5 జ్ఞాన + 5 కర్మేంద్రియములు

+ 4 అంతః కరణ చతుష్టయము

3 బుద్ధి, మనస్సు, అహంకారము (నేను అను)

= 13 తత్వములుండును. (పంచ భూతములుండవు)

4. <u>కారణ శరీరము</u> - కేవలం అహంకారము మాత్రమే. ఇదే అంగుష్ట ప్రమాణం – ఆత్మభోద – వ్యక్తిత్వ భోద మాత్రమే వుండును.

నేను “జీవుఁడను” అనే భావమే అహంకారము – స్థూలముగా వుండదు. పిత్రు లోకము, చంద్ర లోకమే – చూడ జలము – దేవ వర్గమునకు చెందినవారు – ఊర్ధ్వలోక వాసులు. కారణ శరీరము – అతి దూర అంతరిక్ష సంచారము చెయ్యి గలరు.

స్థూల దేహమును వీడి కారణ దేహము వీడుటకు – 1 – 2 క్షణములు పట్టును.

1 క్షణము = 5 నిమిషములు ; అప్పుడు మాయ – మోహ రహితుఁడై జీవుఁడు “మరుపు” – “నా – నీ” జ్ఞాన ముండదు.

జన్మాంతరముల స్వరూప బోధ – ఉండును
స్మృతి వ్యాపకము ప్రకాశపు తునుకగా
పూర్వా పర జ్ఞానము వుండును.

Light travels at 1,86,000 మైళ్ళు (Miles) per second.

యమ లోకము చెరుటకు – 96 నిమిషములు పట్టును.

2 ముహూర్తములు = 4 దండములు = 96 నిమిషములు పట్టును.

-- 1,86.000 X 60 X 96 = 1,07,13,60,000 మైళ్ళు (Miles)

= 1,07,13,60,000 X 1.6 = 1,71,41,76,000 కిలో మీటర్లు (KM)

భూలోకము ⟶ యమలోకమునకు దూరం

అమెరికన్ వ్యోమ గాములు చంద్ర మండలమున దిగి నప్పుడు – రెండవ మారు – ఉన్నట్టుండి, పెద్ద శబ్దములు – దిక్కులు పిక్కటిల్లునట్లు వినపించడం , క్రింద భూలోకమున "కంట్రోల్" స్థానమందున్నవారు కూడా, ఆ ధ్వనులు విని దిగ్భ్రాంతులైనట్లు పత్రికల ద్వారా విని యుంటిమి. –

బహుశః అచ్చట ఉనికి గల సూక్ష్మ జీవులు, (విదేహులు) – దేహ ధారుల రాకను, నిరసించుటకో – గర్హించుటకో, అలాంటి శబ్దములను కల్పించి యుండ వచ్చును. స్థూల (బాహ్యా) దృష్టి కగోచరమగు తత్వములు గదా!!

జీవు(డు స్వప్నము నందు తనయొక్క మాయ చేత గల్పింప( బడిన సకల లోకముల యందును సుఖ దుఃఖముల ననుభవించు చున్నాడు. సుషుప్తి కాలమునందు, సర్వమును లయ మొంది యున్నప్పుడు, ఆజ్ఞానముచే నావరింప( బడిన వాడై, సుఖ స్వరూపమును బొందు చున్నాడు.

జీవ – ఆత్మ –

1. మోక్షము – విమోచనము –ఆత్మ విజయం – స్వస్థితి ప్రాప్తి – అనగా "జీవ స్థితి నశించి బ్రాహ్మీ స్థితి"- ప్రాప్తించడం. ఎవరు? ఎవరికి?
2. పురాకృత సుకృత పరిపాక ఫలము.
3. గ్రహణ శక్తి – సత్సంస్కారములు – పంచశీలముల సహకారము – యథార్ధ దర్శనాసక్తి. – అభ్యాసం.
4. సద్గురు కటాక్షం – గురూపదేశ ప్రాప్తి.
5. భగవత్కృప.

ఆత్మ దర్శన భాగ్యము – పై వాటి పరిపాకము వల్లనే!!. స్థూల – సూక్ష్మ – కారణ ఉపాధులే పంచ కోశములుగా (ఆవరణములుగా) విభజన గలదు –

<u>అవస్థలు 5 –</u>

1. జాగ్రత్త –స్థూల – జడసత్తా – అన్నమయకోశం (1) – జన్మతో పుట్టి – అన్నముతో పెరిగి – చావుతో అంతరించునది. కరణత్వ శక్తి గలది (కరణం = సాధనం) – కర్మేంద్రియ సమూహం. దృశ్యం – (10 ఇంద్రియములు + మనస్సు) –

2. స్వప్న –సూక్ష్మ
- ప్రాణమయ (2)
- మనోమయ(3)
- విజ్ఞానమయ(4)

} కరణత్వ శక్తి (సాధన)

పంచ ప్రాణ సముదాయం + మనస్సు + బుద్ధి కలసినది.

(మనస్సు + సూక్ష్మేంద్రియములు + ప్రాణములు 5)

3. సుషుప్తి – కారణం – ఆనందమయ (5) – అజ్ఞాన ప్రజ్ఞానందం స్వప్న మందలి సూక్ష్మ – లింగ శరీరము – తనకు కారణమగు "అవిద్య" యందు లీన మగును – 1-2 అవస్థల లయ స్థితి – అహంకారాధారం. {ఇంద్రియములు (10 + 4) ప్రాణములో లయం} – మనస్సు ఆత్మలో లయించును.

4. తురీయం – ప్రజ్ఞానం బ్రహ్మ – ఆత్మ సాక్షాత్కార స్థితి – సుషుప్తి కూడా లేదు – అవస్థ లేని యవస్థ. స్వస్థితి – స్వస్వరూప స్థితి. చతుర్వేద మహా వాక్యానుభవం. ఆత్మను చూచు – గుర్తించు – మరొక సాక్షి లేదు. సాక్షియుండిన యెడల "ఆత్మ" జ్ఞాన విషయము (జ్ఞేయం) అగును. తనకు మించిన, తన్ను గ్రహించు మరొక్కటి లేనిదే "ఆత్మ" – ఆత్మే అనుభవరూపం. "ప్రజ్ఞానం బ్రహ్మ" – పూర్ణానంద స్థితి – అతీంద్రియ

5. తురీయాతీత స్థితి – మహా నిర్వాణము – మహా ప్రస్థానం – మహా ప్రయాణం – మరణం – నిష్కృతి. వ్యక్తిత్వ నాశనం – పరిపూర్ణ యోగ ఫల ప్రాప్తి. జీవ బ్రహ్మైక్యం – తిరుగు లేని స్థితి.

ఆత్మానాత్మ విచారము – త్వంపదార్థ శోధనం.

"కోఽహం" –నేనెవరు? – సర్వంఖల్విదం బ్రహ్మ – (సర్వ వ్యాపక బ్రహ్మము)

"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ"

"శ్రుతి చేత బ్రహ్మ" సత్ + చిత్ + ఆనందము – అని బ్రహ్మత్వ లక్షణములను చెప్పి – తల్ల క్షణముల ప్రత్యగాత్మ యందుఁ గూడా కాన్పించుటచేత, ఆత్మకు బ్రహ్మత్వము స్వతః సిద్ధము - - -అని తీర్పు –

"నేతి – నేతి" – న్యాయమున సర్వం తొలగించి, ఏమియు మిగుల లేదని చింతింప నక్కర లేదు. చివర కేమియు మిగుల లేదని తెలిసి కొనెడి (సర్వాభావ జ్ఞానమే) "ఎఱుక" – "జ్ఞానము" – "ప్రజ్ఞ" – "ఆత్మ" - . . . సర్వం నిరాకరణాంతము ను చూచి – కడపట నిరాకరింపఁబడక – సాక్షిగా మిగిలినదే "ఆత్మ" – నిరాకరణాభాదితం "ఆత్మ" ---- సత్యాత్వం – నిత్యాత్వం - - -

"నిత్యం విభుం సర్వ గతం"
"నిత్యం నిత్యానాం"
"సర్వం హ్యేతద్బ్రహ్మ" } శృతులు.

"సత్యం జ్ఞానా(నందం-) అనంతం బ్రహ్మ X అనృత జడ దుఃఖ సహితం జగత్"

"జీవేశ్వరులు – అవిద్య – మాయ యనెడి గుణ భేదములు గల రెండు ఉపాధుల చేత బ్రహ్మమున కల్పింపఁబడెను.

"నీ వెవరు"? ఈ "జాగ్రత్" యనెడి "కల" నుండి మేల్కొనుము. "నీవెవరు?" దేహమా? మరి చూడు ఆ శవం నీల్గి పడి వుంది. ఉలకదు పలుకదు. ఎందుకు? "నేను" అనకున్నది? చూచేది ఎవరు? నేను! అంటే? నా కళ్ళు! అంటే నేను వేరు – నా కళ్ళు వేరు గదా! - - - కళ్ళు మూసి కూర్చో, ఇప్పుడు ఊహించి చూడు! - - - బాహ్యా ప్రపంచమందలి వ్యక్తులను . . . వస్తు జాలమును! చూస్తున్నావా? ఇప్పుడు కళ్ళు మాత్రం చూడ లేదని నమ్ము తావా? మరెవ్వరు చూస్తారు? – నీవా? – నీ కళ్ళా? కళ్ళు గాదు – నేను!!. ఆ"నేను" ఎవ్వరో విచారించి "ఆత్మ జయం" పొందు. స్వారాజ్య సామ్రాజ్యాధి నేతవుఁ గమ్ము!! విజయీ భవ!! ఇక నీవే అమృతమయుఁడవు! అనంతుఁడవు!1 ఆద్యంత రహితుడవు!! జై భగవాన్!!!.

ఇక, నిన్ను నీవు – నీ ఉనికిని లేదన లేవు కదా! తన్ను తాను తెలుసుకొన లేకున్న మరి , ఎన్ని తెలిసి ఏమి లాభం? "తన్ను మాలిన ధర్మం మొదలు చెడ్డ బేరం" కదా?. "ఆత్మ జయమే సర్వ విజయం". –

బాల్యం – యవ్వనం –కౌమారం – వార్ధక్యం . . . తుదకు దేహాంతర ప్రాప్తి (జనన మరణాదుల ఆద్యంతం) నీకు తెలియదా? నశ్వర దేహ పరిణామ – వికార –

వినాశములు "ఆత్మ" కు లేవు. "ఆత్మ" శాశ్వత తత్వము!!. ఈసత్య జ్ఞానమే వేదాంత (ఆత్మ) శాస్త్ర పరమావధి. మోక్షం – ముక్తి!!

మూడు అవస్థలే ముల్లోకములు ;-

"జాగ్రత్ స్వప్న సుషుప్తులే" – ఏ రెండు, మూడవ దాని లో లేవు.

1. జాగ్రదవస్థ – స్థూల – దేహ ప్రపంచము – స్వప్న – సుషుప్తి – తురీయ్యాల్లో లేదు.
2. స్వప్నావస్థ – సూక్ష్మ – మనో(జీవ) రాజ్యం –ఇది జాగ్రత్ – సుషుప్తు లలో లేదు.
3. సుషుప్తి – కారణం – దేవ లోకం – ఇది జాగ్రత్ స్వప్నము లలో లేదు.

1. ఒక అవస్థలోని శరీరం మరొక అవస్థలో లేదు. కావున ఇంద్రజాలం – కల్పన – అసత్ – సత్య దూరమైనది. కాని, "ఆత్మా నిర్వికారో" – అనగా అన్ని అవస్థల్లోను సాక్షిగా, నిర్వికారిగా – కూటస్థుడుగా నుండు "నేను" – సచ్చిదానందమయుఁడగు "ఆత్మను" త్రికాలాతీతము. అవస్థాత్రయాతీత ఆత్మః

2. పంచకోశానుభవి. ఆత్మ అనుభవ విషయంకాదు. బోధ – అనుభూతి – స్వయంప్రకాశత్వం – దృక్, ఆత్మ, ద్రష్ట, - సాక్షి – తెలివి – ఎఱుక – "తాను" ఎట్లు శూన్య మగును.

3. "తాను" లేదన్నవాడే "ఆత్మ" – తాను లేకున్న వాదమే లేదు కదా! ఆత్మను ఎవ్వరు వర్ణింపఁగలరు? వర్ణించు వారున్న "ద్రష్ట" – "దృశ్యమగును". – "అట్టిది – ఇట్టిది" అని వర్ణింప రానిదే "ఆత్మ"

ఈ ప్రత్యగాత్మ "ఇంద్రియ జన్య జ్ఞానము చేత, తెలియబడెడువాఁడు కాడుః కాని, సాక్షాత్ప్రత్యక్షముగ "అహం" "నేను – నేను" – అనెడు స్ఫురణ చే స్వయంప్రకాశుఁడగును.

ఆత్మ దర్శన భాగ్యము –

1. ఇంద్రియములు (దేహము) చాలా బడలి – అలసి –స్రుక్కి – డస్సి – తపించినప్పుడు – స్పృహ తప్పును - - - - మూర్ఛాస్థితి – ఉ|| వివేకానాంద జీవితారంభములో (ప్రజ్ఞానం బ్రహ్మ).

2. అద్దమునందు – అరచేత లేక పాత్ర యందు జలములో ప్రతిబింబిచునది ఆత్మ. (ప్రజాపతి ఇంద్రునకు చెప్పెను)

3. పంచె వన్నెల చిలుక పంజరములోని "తేజో బిందువు" –ద్వారకా పురమందున్న "జ్యోతి స్వరూపము".

4. స్వప్న సంచారి - సూక్ష్మ దేహం –అశరీరం – ఆత్మ(జీవ)

5. సుషుప్తి సుఖానుభవి.

6. తన యింద్రియ వ్యాపారములను – మానసిక వృత్తులను గ్రహించి అర్థము చేసుకోగలదే "ఆత్మ"

7. "నేతి నేతి" న్యాయమున – దృశ్య మంతరించిన –ఏమియు మిగుల లేదని గ్రహించి సాక్షిగా – అనగా శూన్యమునకు సాక్షి – ద్రష్ట –ఎఱుక – ప్రజ్ఞ – సాక్షికి – సాక్షి లెదు గదా! కత్తిని అదే కత్తి కోయ జాల నట్లు! వ్రేలి కొనను - ఆ వ్రేలి కొన ఏట్లు తాక గలదు? "ప్రజ్ఞానం బ్రహ్మ"

8. సమాధ్యవస్థ యందు (తురీయమున) నిల్చి, సచ్చిదానంద మధురానుభూతి హేతువే (అనుభవి) ఆత్మ సర్వ దృశ్యములు అదృశ్యములై నప్పుడు – ఆత్మ స్వీయ కాంతితో ప్రకాశించును. తురీయా వస్థ యందు బాహ్యా ప్రపంచమే గాదు – తన స్థూల – సూక్ష్మ దేహములు కూడా మానవునికి అగమ్య గోచరమగు (ఊహా తీత) అనంత అజ్ఞాత శక్తి – విశ్వ నియామక – పోషక – లయాధికారత్వము గలది. సర్వ వ్యాపకత్వ – అధిక్యత – ప్రకాశత్వములు గలది.

బ్రహ్మ చరాచరముల సృష్టి స్థితి లయము లకు కారణం

బ్రహ్మ సచ్చిదానంద స్వరూపం – శ్రుతుల వచనం

బ్రహ్మ అచేతన ప్రకృతి కాదు – శుద్ధ చిత్- అఖండ జ్ఞాన ప్రకాశం.

సూర్యుని నుండి – కీటకము వరకు అంతర్యామిగా వెలుంగు బ్రహ్మము – "ఆకాశం_ ప్రాణం – జ్యోతి – జీవ(ప్రాణులు) – అతీత స్థితుల్లో –

| | |
|---|---|
| గురూప దేశముతో, సాధు సాంగత్యముతో | పాపులు - పరమ హంస లగుదురు |
| మహత్ముల దర్శన – స్పర్శన – ప్రశ్నా | భోగులు - యోగులగుదురు |
| శీర్వాదములతో –అనుగ్రహ – దృష్టులతో | జీవులు - దేవులగుదురు. |

ఉ|| వాల్మీకి, లీలాశుకులు, బిల్వ మంగళుడు, వేమన, శతాంగుళీకుడు, గిరిష్ చంద్ర బోస్, జగాయ్ మాదాయ్ – మొ|| వారు.

<u>పంచ కోశముల విపుల విమర్శ –</u>

"ఏక విజ్ఞానేన సర్వ విజ్ఞానం భవతి" – ఏ ఆత్మ జ్ఞానమైతే తెలుసు కొన్నట్టయితే, సమస్త విజ్ఞాన పరంపరలు తామే వచ్చి వరించునో – ఆ జ్ఞానమే బ్రహ్మ (ఆత్మ) జ్ఞానము. ఇదే సర్వ వేదాంత రహస్య కీలకం –

పంచ కోశములు – ప్రారబ్ధ ఫలమీ పంచకోశాత్మక శరీరం అనుభవించక ఎంత వారికైన తప్పదు.

I. స్థూల 100 సం|| లోపుగ నశింపు – 1. అన్నమయ – స్థూల – 100 సం|| లోపుగ ఆయుః ప్రమాణము గలది సప్త ధాతు యుత – షడ్వికార – బాధిత – "నేను" అను దేహాత్మ బుద్ధి లోపుగా కల్పించినది. – జడం

II. సూక్ష్మం ప్రళయం తో ఆఖర్ – 2. ప్రాణమయ – 5 కర్మేంద్రియ + 5 ప్రాణములు + ఆకలి దప్పులు - 5 ప్రాణ వికారములు – కాని నేను వేరు ప్రాణం వేరు.

3. మనోమయ – 5 జ్ఞానేంద్రియములు + మనస్సు + అరిషడ్వర్గములు - వీటి దోషములు (వాసనలు) + నేను వేరు – నా మనస్సు వేరు.

4. విజ్ఞానమయ -5 జ్ఞానేంద్రియములు + బుద్ధి + కర్తృత్వ + భోక్తృత్వ + అహంకార హేతువు!

III. కారణ బ్రహ్మతత్వ జ్ఞానాగ్నిని నశింపు – 5. ఆనందమయ – అంతఃకరణ చతుష్టయ + అజ్ఞానం గాఢాంధకారమగు నిద్ర యే దీని ఆనందం, స్వయం ప్రకాశమైన నేను వేరు –నిద్ర వేరు – నేను సాక్షిని.

1. త్రివిధ – సజాతీయ – విజాతీయ –స్వగత భేదములు లేని వాడను.

2. పంచకోశములు – దేహ త్రయ – షడ్వికారాదుల కందని అతీతమైన సాక్షి నేను – ఆత్మ: పంచ కోశములు నాకు ఒరలు. కత్తి వేరు – ఒర వేరు. పొట్టు వేరు గింజ వేరు – "ఆత్మను" -

కర్మేంద్రియములు - కార్యాచరణ
జ్ఞానేంద్రియములు - గ్రహణ శక్తి.
మనస్సు -- మంచి చెడ్డల విచారణ
ప్రమాత -- కొల్చు వాడు
ప్రమాణం -- కొలత

ప్రమేయం -- కొలవఁబడు విషయమం
ఇంద్రియములు -- వాటి విషయములు - ప్రమేయములు
కాని "నేను" అప్రమేయుఁడను.

జీవ – అహంకారము -

కం|| నర జన్మము తానెత్తియు |
పరమాత్మ నెఱుంగ లేక పాపాత్ముండై |
కొర గాని పను లొనర్చినఁ |
దిరిగి యధోగతికి నేగుఁ – దిరముగ వేమా |

శ్లో|| ఇంద్రియార్థేషు వైరాగ్య మనహంకార ఏవచ
జన్మ మృత్యు జరా వ్యాధి దుఃఖదోషాను దర్శనమ్||

తా|| ఇంద్రియ సుఖముల యందు ఆశ చంపుకొనుటయు, అహంకార వృత్తి నశింప జేసి కొనుటయు, చావు పుట్టుకల యందు, యౌవన ముసలితనముల యందు దుంఖమును దోషమునే చూచుచుండుటయును,

" అనహంకార ఏవచ "

తా|| అహంకారము నశింప వలెనన్న " --- భగవద్గీత. అ. 13. శ్లో. 9.

"కర్తృత్వ రాహిత్యము – అనగా అకర్తృత్వం- తాటస్థ్యం –సాక్షిత్వం" - - - జితేంద్రియత్వం – దేహాభిమాన రాహిత్యం కావాలి!! జన్మ జరా మృత్యు వ్యాధు లందు దుఃఖ దర్శనం – విషయ విముఖత్వం --- అత్యంత అవసరము ---

కార్య కారణ సంఘాత విలక్షణమైన పరబ్రహ్మమే మనమైనచో "బాహ్యాభ్యంతరేంద్రియ వ్యాపారాదులు మనము చేయు చున్నట్లనుకొనుటకు కారణమేమి యనిన" – అజ్ఞానమే! భ్రాంతి జన్యమే!!. మోహ కారణమే !!! ఇదియే "అధ్యాస" – అనగా లేనిది ఉన్నట్లు తోపఁజేయు భ్రాంతి – భ్రమ జన్య జ్ఞానము - - -
ఉ|| శుక్తిరజతము – రజ్జు సర్పము మొ|| -

సహజానంద స్వరూపుఁడగు, మానవుఁడు – దుఃఖ రూప రుగ్మతల తగులు కొనక - సహించక –అవి అతనికి సహజములు కావు గావునను - ఆ గంతుకములగుట వల్లను - - - సహించి భరింపఁజాలక ద్వేషించు చున్నాడుః

"ఆత్మ" యందలి ప్రీతిచే, తుదకు, - ధన దార పుత్రాదులనేఁగాక – దేహమును కూడా విసర్జించు చున్నాడు.

దేహము షడ్వికారి – మలమూత్ర పురీష నిలయము – సప్త ధాతు నిర్మితము – పాంచ భౌతిక (క్షణిక – క్షర – అనశ్వర) దేహము – ఉపాధి – "దుఃఖాలయం" – భగవద్గీత.

ఇక ఆత్మ లక్షణములు - అత్మ జ్ఞానము.- - -

నిర్గుణ, నిష్క్రియా, నిర్వికల్ప, నిరంజన, నిర్వికార, నిరాకార, నిర్మల, నిత్య, ముక్త – అచ్యుత, అచల, అమృత, అనంత, సర్వగత, అసంగ, అద్వైత, అఖండ, సర్వసమ, సత్య, సచ్చిదానంద స్వరూపము. - నిరుపాధిక, మూల సత్తా –

అతని శక్తి యే "సగుణ బ్రహ్మము" – ప్రత్యగాత్మ – త్రిపుర సుందరి – త్రిపురాంబ – త్రిదశేశ్వరి – త్రిపురాసుర సంహారిణి – రాజరాజేశ్వరి – లలిత – అంతర్యామి – సర్వాంతర్యామి.

జీవ – సృష్టి –

1. భానుని అనంత కోటి కిరణముల వలె.
2. కమ్మరి పట్టెడ మీద సుత్తి వేటుతో అగ్ని తప్త అయమునుండి దశ దిశలు చిమ్మఁబడు అగ్ని కణ జాలము వలె (విస్ఫులింగములవలె) – నిర్గుణ పర బ్రహ్మమునుండి జీవ కోట్లు బయల్వెడలు చుండును.
3. ఇంద్రజాల మహేంద్ర జాల మాయా శక్తి ప్రభావమో యన్నట్లు "మంచు తెరల చాటున (దాగి) మణిగి అదృశ్యముగనున్న పట్టణము – మంచు తెర (సూర్యోదయముతో) వీడిన వెంటనే స్పష్టముగా దృశ్య మగు నట్లు.
4. మాయ బ్రహ్మ లోని శక్తియే గదా – "అద్వితీయం బ్రహ్మ" .

"సర్వం విష్ణుమయం జగత్"

"ఏకంసత్ విప్రా బహుధా వదంతి"-

"ఈ శావాస్య మిదం సర్వం - - - "

సర్వం "బ్రహ్మణః సర్వ భూతాని జాయంతే పరమాత్మనః"

వ్యష్టి – విశ్వ –తైజస – ప్రాజ్ఞులు

సమిష్టి – విరాట్ – వైశ్వానర (= హిరణ్యగర్భ) – అవ్యాకృతులు- ఈశ్వర - విరాట్ స్వరూపము – బ్రహ్మాండమైన బహిరంగ –సమావేశము లందలి లక్షలాది జన సమూహ దర్శనం – పర్య వేక్షణ లాంటిది, దౌర్భాగ్యవశాత్తు – విష వాయు ప్రయోగాది

ప్రమాదముల వల్ల (యుద్ధములు దుష్పాలకుల వల్ల) – విశ్వ విశాల చైతన్యహీన శ్మశానములుగా రూపొందును.

కాశ్మీర లోయ ల్లోని పుష్ప ఫల సౌరభ దృశ్యములన్నియు ఈశ్వర విలాస ప్రదర్శన శాలలు గదా!!

# 6. గ్రంధి

## చిద చిద్గ్రంధి – హృదయ గ్రంధి.

## (దేహ + దేహుల ముడి)

## పంగ్వంధ సంబంధం

## చిజ్జడాత్మక గాథ

శ్లో|| భిద్యతే హృదయ గ్రంధి శ్ఛిద్యంతే సర్వ సంశయాః |
క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే||

--- ముండకోపనిషత్ . 2. 2. 8.

గ్రంధి అనగా "ముడి" (గంటు) – తగులు అని సాధారణార్థం.

హృదయ గ్రంధి – చిదచిద్గ్రంధి - - లింగ శరీరము –

ఈ ముడి (బంధము) ఎవరికి? ఎట్లు? కల్గినది? దీని ప్రభావ మేమి? ఇది వీడు టెట్లు? మొ|| అంశములు విమర్శార్హములు.

గ్రంధి విడి పోవుట – విచ్ఛేద మగుట – అనగా – "అధ్యాస" (మోహ – భ్రాంతులు) నశించి (నివర్తించి) - - దేహాహంకారాదులు అంతరించి, వాటన్నిటికి సాక్షియైన – చిద్రూపుఁడు, స్వస్వరూపమున ప్రకాశించుటయే గ్రంధి భేదన మనఁబడును – "ప్రజ్ఞానం బ్రహ్మానుభవంతో ప్రాప్తించును.

మరియు-

అజ్ఞానము – ఆవరణము – గ్రంధికి కారణము?

గ్రంధి విచ్ఛేదనమే జ్ఞానము యొక్క స్వభావ – ప్రభావముల ప్రకాశము – త్రిగుణాతీత – ద్వంద్వాతీత స్వస్థితి –ఉదాసీనత్వము – తాటస్థ్యము – సామ్య స్థితి – స్థిత ప్రజ్ఞ – సత్య జ్ఞానానంద ఫలము.

సత్య జ్ఞానము నిత్యానిత్య వస్తు వివేకము వల్ల ప్రాప్తించును. అనగా, సత్యము నందనురక్తి, అనిత్యమునందు విరక్తి, అనగా వైరాగ్యముదయించును. శమాది షట్కసంపత్తుల సాధనానంతరం, ద్వంద్వాతీత స్థితి (స్థిత ప్రజ్ఞ) – మోక్షార్హత ప్రాప్తించి, ఆత్మ సాక్షాత్కారమునకు దోహద మివ్వ గల్గును. – అనగా - అవిద్యానివృత్తి – సచ్చిదానంద ప్రాప్తి ఫలితము.

ఇక –

అధ్యాస – మాయ – మోహము – భ్రాంతి – అజ్ఞానము – అవిద్య – ప్రతిబంధము – సంసారము – తగులు - - - - దేహాత్మ బుద్ధి - - - బుద్ధి వాసనలే గ్రంధులకునికి పట్టు.

గ్రంధులు - కామ గ్రంధులు – వాసనా గ్రంధులు – విషయ గ్రంధులు – "సద సత్ లేక చిద చిత్" గ్రంధులు - - - ఒకే ధోరణి.

గ్రంధి యొక్క "ఉనికి – లేము" లే అజ్ఞాని – జ్ఞానులకు౹గల భేధము.

నిర్గ్రంధి - జ్ఞాని

గ్రంధి - అజ్ఞాని.

కావున గ్రంధి యొక్క కలిమి – లేములే బంధ మోక్షములకు కారణము గాని, దేహేంద్రియ మనో బుద్ధుల ప్రవృత్తి నివృత్తుల౹ బట్టి యేమాత్రం కాదు.

షరా ; - వృత్తులనగా –(వృత్ శబ్దమునుండి వచ్చినది) నిశ్చలముగనున్న సరస్సున ఒక రాయి విసిరిన, అందలి జలము చలించి, వృత్తములగ (స్పందనము) ఏర్పడును. దీనినే వృత్తులందురు. తద్వతు, ప్రశాంతాత్మయందు మనస్సు (సంకల్ప వికల్పముల) తాకిడి వల్ల వృత్తు లేర్పడును.

1. చిద చిద్గ్రంధి – అచిత్తయిన, అహంకారము, చిద్రూప కూటస్థుని – ఒక్కటిగా తలంచుట - (అజ్ఞానము వలని "అధ్యాస" – భ్రాంతి) - - - "నేను – నాది" అనెడి ఇచ్ఛలు కామ్యములు. అనగా అహంకార మమకారాదులు.

2. జ్ఞాన విద్య – వేదాంతార్థము, ఎన్ని విధములుగ బోధించినను పాపాధిక్యము వల్ల సంతోషము కలుగకున్నందున గ్రంధి భేదనమయినను "అధ్యాస – భ్రాంతి" నివర్తించినను, ప్రారబ్ధ (కలుష) కర్మాధిక్య దోషమున కామాది అరిషడ్వర్గములు – ఇచ్ఛలు – సంకల్పములు – సంస్కార ప్రేరేపణలు - - - వృత్తుల రూపమున పుట్టుచుండుట, అసంభవము గాదని గ్రహింప దగును. – వాసనలు –

3. ప్రత్యగాత్మను, అహంకారము కంటె విలక్షణమైన దాని గను, అనగా, దానితో నంటు కొనని దాని గను తెలుసుకొనుటయే "గ్రంధి" భేదనము. దీనినే "అధ్యాస నివృత్తి" అందురు. అప్పుడే యేకోర్కెలున్నను – అవి సాధకునకు, సుఖ దుఃఖాద్యనర్థముల నీయ జాలవని భావము.

4. సాధకునకు అధ్యాస నివృత్తించి నంత, సర్వమునకును, "సాక్షి" – చిద్రూపుఁడై, దేహాహంకారముల తో సంబంధము లేక, అహంకార కామాది వికారములచే బాధింపఁబడ కుండును.

5. ఆత్మ అసంగుఁడై అనారోపిత సత్స్వరూపుడై, అద్వైత తత్వమై, ఆనంద ఘనమై, అపరోక్ష స్వరూపమై సాక్షియై యుండు కూటస్థ స్థితియే, "గ్రంధి విచ్ఛేదనం" బనఁబడును. సాక్షి నాటక దీపము వంటి వాఁడు.

అధ్యాస ----

అనగా - సర్ప రజ్జు

శుక్తి రజతము

మ్రోడు మనిషా

మృగ త్రుష్ణ మొ|| వాటి వలె

షట్చక్రములు –

మూలాధార, స్వాధిష్టాన, మణిపూర, అనాహత, విశుద్ధ, ఆజ్ఞా, చక్రములు

సప్త కమలములు – పై ఆరింటితో – సహస్రారమును చేర్చిన - ఏడు అగును సహస్రారము –

మేరువు (వెన్నెముక - Vertebral Column) షట్చక్రములు లేక సప్త కమలము లందుగలవు. అందు మూడు గ్రంధులున్నవిః-

మూలాధారం -- బ్రహ్మ గ్రంధి

మణిపురం -- విష్ణు గ్రంది

ఆజ్ఞా చక్రం -- రుద్ర గ్రంధి

మేరు శిఖరం –సహస్రార కమల కర్ణిక – సుధా సాగరమునకు ప్రవేశ ద్వారము.

ఇదే చింతామణి గృహాంతస్థము –

శ్రీ లలితా సహస్రనామ స్తోత్రం. (57)

అపర కర్మ లందు "గ్రంధి పూజ" (బేసి దినము లందు) గత జీవ గ్రంధి బంధ విమోచనమునకై సంకల్పించి చేయుట పరి పాటి. "గ్రంధి" – యన "దేహాత్మ సంసార బంధము – (ప్రకృతి పురుషుల సంసార సరళి) – మోహ జనితము గదా!

దేహ వినిర్ముక్త జీవుని (విగత దేహుని) – సూక్ష్మ దేహము యొక్క క్షుత్పిపాసా తాపోపశమనార్థ మై ఉత్తరక్రియల యావశ్యకత మరియు సూక్ష్మ దేహాభి (లింగ శరీర) వృద్ధికిని అత్యవసరమని "వ్యాస ప్రోక్తం" –

సాధకులు – యోగులు ఇంద్రియ నిగ్రహము ద్వారా (ప్రణవ ధ్యాన పూర్వకంగా) అంతఃకరణమును హృదయ (దహర) ఆకాశమందు నిల్పి, వేరు తలంపులు లేక, ఆ అంతఃకరణమందు లయమై (వృత్తి శూన్యమై) బ్రహ్మా కార వృత్తిని స్వయంప్రకాశ రూపుడుగ – ఆత్మారాముఁడై – అఖండ చిద్విలాసముగ – ఆత్మ పరమాత్మయై వెలుగుటే – గ్రంధి విచ్ఛేద ఫలం.

సాధకుని హృదయమున రాగ ద్వేషాదులు (అధ్యాస మూలంగా) – అహంకారము జడమైన – చిదాత్మకు – "తాదాత్మాధ్యాస" యగును. అట్టి అధ్యాస చేతనే – ద్వంద్వములు – రాగ ద్వేషాదులు – హృదయమున "పీట ముళ్ళ" వలె దుర్భేద్యములై యున్నవి.

శ్లో|| భిద్యతే హృదయ గ్రంధి శ్చిద్యంతే సర్వ సంశయాః |
క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే||
--- ముండకోపనిషత్ . 2. 2. 8.

తా|| ఎగుడు దిగుడులలో కూడా ఆత్మను సాక్షాత్కరించుకోవడం వలన అతని అజ్ఞానపు ముడి వీడిపోతుంది. అన్ని సంశయాలు నమసిపోతాయి. అన్ని కర్మలు క్షయించిపోతాయి.

తత్వ జ్ఞానంతో (అనుభవంతో) హృదయ గ్రంధులు ఛేదింపఁబడు చున్నవి. అవే కామ గ్రంధులు – విషయ గ్రంధులు – వాసనా గ్రంధులు –వీటి నశింపుతో, సర్వ సందేహములు నివర్తించి "అమృతత్వ" సిద్ధి ప్రాప్తించును.

అవిద్య – భ్రాంతి –మోహము – అజ్ఞానము –మాయ –ముడి –గ్రంధి –

అది మూడు విధములు గా గలదు –

1. దేహమే తానను కొనుట.
2. లోకము (జగత్తు) సత్యమని (సత్తని) నమ్ముట.
3. దేవుడు ఎక్కడనో ఉన్నాడను కొనుట. (దేవుడు తన యందు లేడను కొనుట) ఈ భ్రమ పోవు వరకు, బ్రహ్మా జ్ఞానముదయింపదు.

మోహ నాశమే మోక్షము.

కర్తృత్వము అహంకారమును బాగా బలిపించి “నేను –నాది” యను అనుబంధములను బిగించి, ద్వంద్వములను చొప్పించి –దుఃఖితునిఁ జేయును.

మమ – బంధ హేతువు.

నమమ – మోక్ష కారణము.

కర్తృత్వరాహిత్యము, ఈశ్వరార్పణ బుద్ధితో, కర్మ ఫల త్యాగి యైన – నిష్కామ కర్మ యోగి సుఖి – ద్వంద్వాతీతుఁడు – స్థిత ప్రజ్ఞుడు – ధన్యుఁడు – ధన్యతముఁడు .

ఆత్మ శుద్ధియనగా – ఆత్మ నంటు కొని యున్న “జీవత్వ మాలిన్యం” పోవాలి. అనగా, “చిత్తు” నావరించి –అంట బట్టు కొన్న “అచిత్” అనగా – పురుషు నావరించి యున్న ప్రకృతి.

చిత్ + అచిత్ = చిదచిత్

సత్ + అసత్ = సదసత్

ఆత్మ + ప్రకృతి (మనస్సు) = జీవుఁడు.

అనగా ప్రకృతి బద్ధాత్మ – లింగ శరీరము – చిదచిత్ గ్రంధి(ముడి – బంధము) వాసనలే –గ్రంధులు – ముళ్ళు.

“లింగ శరీరం భంగం కావాలీ” అంటే వాసనారాహిత్యం కావాలి. అనగా ప్రకృతి బంధము – సంసారము – వాసనలు నశించిఁన గాని, ముక్తి (మోక్షము) లేదు. విషయ వాసనలే హృదయ గ్రంధులు.

ఋణ, అగ్ని, వ్యాధి, శత్రు, స్నేహాది విషయ శేషములు కొంచెమున్నను, క్రమముగా అవి ప్రబలి బలీయమగును.

“లింగ” (సూక్ష్మ లేక కారణ) శరీరమున బీజ రూపముగ నున్న యీ వాసనలు అనుకూల పరిస్థితు లందు విజృంభించును. కావున, వాసనా క్షయము ఆత్మ చింతన – విచారాదుల వల్ల గల్గును. తద్వారా జీవన్ముక్తియు – పునర్జన్మ రాహిత్య ప్రాప్తి యును అనగా మోక్షమును లభించును అని అర్థము.

వాసనలు, బుద్ధిలోనివి, అజ్ఞాన స్వరూపమైన ఆనందమయ కోశమనెడి కారణమందు – జీవుల బుద్ధి వాసనలు “గ్రామ ఫోన్ ప్లేట్ల” యందు పాటలు వలె లీనమై యుండి, సూది తగిలిన వెంటనే పాటలు (శబ్దము) బయల్పడు నట్లు,

ప్రపంచమంతయు (విశ్వ విశాల విషయ సాగరం) బుద్ధి వాసనల తోడ స్పష్టమగు చున్నది. ఆ ఆనందమయ కోశమే "సర్వజ్ఞుడని" చెప్పఁబడెను.

వాసనలు 3 విధములు:-

- "దేహ – శాస్త్ర – లోక" వాసనలని. వాసనా క్షయంతో "ద్వైతము" నశించి, "అద్వైతము" జనిస్తుంది. శ్రద్ధ లేని వాని, అవిశ్వాసము, దృష్టాంతార్థము కానేరదు. వైదిక కర్మలందు శ్రద్ధాళువే అధికారి.

కామ – క్రోధ –లోభ – మోహ - మద – మాత్సర్య – డంబ – దర్పాసూయాది గుణములు కూడా వాసనలే. లింగ శరీరము నాశ్రయించి "గ్రంధులు" (ముళ్ళు) రూపమున విడదీయ రానివిగ నుండును. తాప హేతువులు. జీవుని వెన్నాడి తపింపఁ జేయును. పునర్జన్మకు బీజముల వంటివి.

శమదమాది సాధనల వల్ల "భిన్నమై" (భంగమై) నశించి మోక్షము (విమోచనము) ప్రాప్తించును.

పరమాత్మను తెలుసు కున్న యెడల "హృదయ గ్రంధులు" వీడి, సందేహములు నశించి, సర్వ వాసనలు - - - దగ్ధ కర్మాణి" అంతరించును. గ్రుడ్డు భిన్నమై పిల్ల (స్వస్వరూపము) బయల్వెడలు నట్లు, "అపరోక్షాను భూతి" తథ్యము.

లింగ దేహము – సూక్ష్మ దేహము అనగా –

1. కల్పనాధారమైన చైతన్యము.
2. చైతన్యము నందు కల్పింపఁబడిన లింగ దేహము.
3. లింగ దేహమున ప్రతిబింబించిన చిధాభాసుఁడు

ఈ మూడును చేరి "జీవుఁడన బడును.

బింబము యొక్క ప్రతి బింబము "చిదాభాసుఁడు" –

బ్రహ్మమే వికార రూపమగు జీవత్వమును పొంది, దేహము(ఉపాధు) లందు ప్రవేశించెనని శ్రుతులు పల్కు చున్నవి. ప్రాణాదులకు ప్రేరేపకుఁడగుట వల్ల "జీవ" భావ మేర్పడెను.

శ్లో || ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి|
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా||
-- భగవద్గీత. అ. 18. శ్లో. 61.

తా ||  ఈశ్వరుడందరి హృదయములందును. ఉన్నవాడై యంత్రగాడు బొమ్మల నాడించు నట్లు మాయ చేత అందరను, భ్రమింపఁజేయుచున్నాడు.

ఆత్మ తీర్థ స్నాత – సమస్త పుణ్యా పాప రహితుఁడగును. జనన మరణ వర్జితుఁడగును. కర్మ రహితుఁడుగాను – సర్వ పరిపూర్ణుడు గను, నిత్యానంద స్వరూపుఁడుగాను ఉంటున్నాడు.

ప్రశ్న_ అంగుష్ఠ ప్రమాణుఁడైన లింగ శరీరము (కఠం) – నల్లగా వుండుటెందులకు?

జ|| - జీవ సంస్కార మాలిన్య ప్రభావమే.

షరా : ముండకోపనిషత్తు నందు జీవ ప్రమాణము – వెండ్రుక కొనలో 1/100 భాగమని ప్రవచించినారు. అది కఠమునకు (గ్రంధ కర్త అనుభవమునకు) విరోధము. ఉపనిష ద్రష్టలే విభిన్నాభిప్రాయముల ఉద్ఘాటించిన, మోక్షాన్వేషుల గతి ఏంకావాలి??

అనాది నుండియు హృదయమునందు అజ్ఞానముచేఁనేర్పడినట్టి, (కరుడుగట్టినట్లు – వాసనలు లేక గ్రంధులు ముళ్ళా) గురు కటాక్షముచే భేధింపఁబడు చున్నవి. అవే జన్మ జన్మాంతరముల నుండి, పునర్జన్మాపాదించు, సంకెళ్ళు.

అనగా గురుభోధ వల్ల జ్ఞాన ఖడ్గముచే గ్రంధులు విచ్ఛిన్నమగును.

తపో ధ్యానాదులతో బ్రహ్మాభ్యాసము ద్వారా హృదయములో సదా పుట్టు చున్నట్టి సంకల్ప వికల్పముల (వృత్తుల బుగ్గ) నశించునంతనే, సూర్యోదయముచే పుండరీకములు వికసించు నట్లు, జ్ఞాన భానూదయంతో హృత్పుండరీకము వికసించి – ఆత్మ సాక్షాత్కార ప్రాప్తి కల్గుచున్నది.

ఈ దివ్యానుభూతిలోని మాధుర్యము – పరిమళము (దివ్య గంధము) – సుకుమారత్వము –మృదుత్వము – విశాల భావము – అనూన సౌందర్య సౌరభము – ప్రజ్వలిల్లు చున్న ఆ ప్రత్యక్ష దివ్య ప్రకాశ ప్రదర్శనమే – అంతర్యామి (సర్వాంతర్యామి) తేజోరాశి సాక్షాత్కార దివ్య దర్శనము.

---------------------

# 7. మృత్యువు.
## (ప్రవేశిక)

మృత్యువు శత్రువు కాదు. భవ బంధ విమోచనకారి. తప్పించుకోలేని సాహస క్రియ. దేహాంతర ప్రాప్తికి ఆది ఘట్టము.

దేహ ప్రాప్తి (జన్మ) ఒక శాపము. సుధీర్ఘ చెర. పాప పరిహార కారణం. కఠిన శిక్ష.

భవిష్యత్తను దానికి చావు లేదు. జీవుడు (ఆత్మ) చిరంజీవి. కల్పము క్రింద జీవిస్తూన్నాడు.

ప్రత్యగాత్మ (అంతర్యామి)యే, జగజ్జనని. – తేజోవతి – ఆది పరాశక్తి.

జన్మ మంటే నూరేండ్ల జన్మ ఖైదు. – దేహ చెర, ఆశలు పెంచుకొని, పునర్జన్మ ను కోరి తెచ్చు కోవడం కన్న, ఆత్మ ద్రోహం లేదు.కాని, జన్మ వద్దనడానికి, ఆ అర్హత ఎందరి కున్నది?

రాగ విరాగాలు పడుగ - పేకల్లాగ అల్లుకు పోయినదే మానవ జీవితం,

అందరు వెఱచే మృత్యువునే, ఆహ్వానించ సాహసించును. ఆశ నిరాశ లనే చక్రాల మీద దొర్లుక పోతూంటుంది జీవిత శకటం.

కాని, హృదయ నైర్మల్యం –
చిత్త సంస్కారం –
కలగడం పునీత జీవన లక్ష్యం

ఆత్మ – ద్రష్ట,
ప్రత్యగాత్మ - అంతర్యామి.
జీవాత్మ - లింగ (సూక్ష్మ) శరీరం.

మరణముః-

మరణమంటే  దేహము నుండి దేహి వెడలి పోవుటే. "క్షేత్ర – క్షేత్రజ్ఞుల" – విడాకులు. ( Forcible eviction of the soul from the body – by Divine injunction) – జీవితమునకు తెర; భరత వాక్యము!! ప్రతి ప్రాణికి మృత్యు స్పర్శ పిడుగు లాంటిది.

"జనన – మరణములు" – దైవేచ్ఛ, ప్రారబ్ధ వశములు. తండ్రి బిడ్డలకు, క్రొత్త గుడ్డల నిచ్చు రీతిని, భగవంతుడు, జీవులకు వారి వారి ప్రారబ్ధానుసారము, వారి వారికి తగిన (అర్హమైన) క్రొత్త దేహములను ప్రసాదించును.

మరణమంటె అనిర్వచనీయమైన, అగాధమైన, అంధకారములోకి, అత్యున్నత గిరి శిఖరాగ్రంనుండి హటాత్తుగా త్రోసి వేయడం లాంటిదేమో ననిపిస్తుంది. ఇక, క్రింద తన గతి ఏమౌతుందో? అందే మున్నదో, ఊహింపరాని, దుస్సహ – దుర్భర భీతాహమే, అసన్న మృత్యు ముఖమున ఉన్నవానిని ఆవరించు కొంటుంది.

మరణమనగా భౌతిక దేహము శిథిలమై, దేహబంధ శాపగ్రస్తతను వీడి పునీతమైన దివ్య దేహము – నిత్య నిర్మల శోభితమై – ప్రకాశించి, భగవంతుని ఆతిథ్య –సాన్నిధ్య ప్రాప్తికి నోచు కోవడమన్నమాట.

నిజంగా, జీవితంలో మృత్యుభయం అనుక్షణం వెన్నాడిన మానవుడు పిచ్చెత్తి కూలి పోవక తప్పదు. కాని, ఈశ్వర విలాసం మానవుని అత్యద్భుతమైన మరపు చే మభ్యపెట్టి, రక్షిస్తూంది. దీనినే "మాయ" అంటారు.

యక్ష ప్రశ్నల్లో ధర్మనందనుని, "లోకంలోకెల్ల అత్యాశ్చర్యమైన విషయమేమని" అడుగగా –ధర్మజుఁడు "లోకంలో రోజూ చేని పోయేవారిని చూస్తూవుండిన్ని, మానవునికి స్వయంగా మృత్యు భీతి, జ్ఞప్తిలో వుండకపోవడమే" నని, అన్నారు. దీనినే వేదాంతులు "మాయ" అంటారు. అనుక్షణమున్ను కాల మృత్యువు కరాళ దంష్ట్రల్లో చిక్కిన్ని మరపు మానవుని రక్షిస్తూంది.

మృత్యువునకు విధి నిషేధములు లేవు. వయస్సు ప్రసక్తి అసలే లేదు. లోకంలో మృత్యుంజయులైన మార్కండేయు లెందరున్నారు?

"జాతస్య మరణం ధ్రువం" అని బాగా తెలిసి కూడా, ప్రాణం మీద తీపి నెవరు  చంపుకొన్నారు?

"వెలుగు – చీకట్లు" వలె – జనన మరణములు ఒక దాని నొకటి తరుముచునే వుండును. "సృష్టి – స్థితి – లయ" – జనన మరణ చక్ర భ్రమణ – విషవలయమునకు పరి సమాప్తి ఎప్పుడో?

మృత్యువనగా దేహాంతర ప్రాప్తికి తొలి ఘట్టము. మృత్యువును సాహసోపేతమైన ధైర్యంతో ఎదుర్కోవడానికి అపారమైన ఆత్మ విశ్వాసం, గుండెబలం అవసరం. చిరకాల (నూరేండ్లు) అనుబంధాన్ని పుటుక్కున త్రెంపి వేయడ మేమంత సులభం కాదు. ఈ వీడ్కోలు ఘట్ట మొక విషాద కాండ. అనివార్యమైన అశుభాంతము (ట్రాజెడి).

అనంత కాల వాహినిలో జీవితమొక మజిలీ – మృత్యువొక తెర. జనన మొక శుభోదయం. జనన మరణ గాథయే జీవిత గానం. మహా ప్రస్థానం. మహా పురుషుల చరిత్రలే పుణ్యకథా స్రవంతులు. పునీత ప్రశంసలు. తీర్థయాత్రల్లాంటి యజ్ఞ రూపములు. –

"మరణ" మనగా మార్పు – నాశము కాదు. ఉపాధియైన దేహము యొక్క రూపము మార్పులుఁ జెందును., కాని "దేహి" మారడు. పరిపూర్ణత చెందు వరకును, వ్యక్తిత్వముండును. అదే జీవత్వ స్థితి. "చిద చిద్గ్రంధి" లింగ శరీరము. ఇదే సమస్త అనుభవాలు – వాసనలు – సంస్కారములను కేంద్రీకరించు కొన్న "కర్తృత్వ – భోక్తృత్వ" అభిమాని – అహంకారి – భోగి : క్రింది పక్షి –

"దేహ" మనగా దహనార్హమైనదని అర్థము. "దేహి" అనగా దహింపఁదగు దేహమును ధరించిన వాడని అర్థము. "మర్త్య" శబ్దం కూడా, మృత్యు సాన్నిధ్యాన్ని సూచిస్తుంది. ఇక, పాంచ భౌతిక దేహము పంచీకరణం కాక తప్పదు. మరణమన్న పంచ భూతముల ఋణ విమోచన క్రియ అనవచ్చును.

అనంత కాలవాహిని లో దీర్ఘాయువు కూడా అత్యల్పమనిపిస్తుంది. దేశ కాల మనంతము. – అపర్యాప్తము!!. కాని, చిరంజీవి మానవుడు, ప్రతి కల్పంలోను, సృష్ట్యాదిని, జగచ్చక్ర పరిభ్రమణం యధాతథంగా సినిమా రీళ్ళవలె పదే పదే ప్రదర్శనం జరగడం భగవన్నియామకం. జగన్నాటక సూత్రధారి యిచ్ఛనెవరాపఁగలరు?

"జీవిత మొక పవిత్ర యజ్ఞము"
"మృత్యువందులో పూర్ణాహుతి"
"జన్మకు సత్యం చావొక్కటే"

అత్యంతాద్భుతము – అపూర్వము – అగమ్యగోచరము – అయిన మృత్యుయవనికకు ఆవలవైపున, భగవత్స్వరూపమే వున్నదో? లేక ఘోర భయంకర పాప రూపమే ఉన్నదో? లెక ప్రాణి కర్మ ఫల స్వరూపమే రూపముఁ దాల్చి తన నెదుర్కొన వేచి యున్నదో? - - - - శిథిల దేహము వ్రాలి పోతూ, మృత్యు హస్తాల బిగి కౌగిలి కాహుతి కాబోతూన్న ప్రాణి యొక్క "మరణ భీతి" కి కారణం (ఆసన్న మృత్యువు నెదుర్కొన్నవాని) --

ప్రతి జీవితం కూడా, వెనుకటి మృత్యు రాశి మీద నిల్చుంది. కాల మృత్యువనగా వయః కాల పరిమితమై, క్షణ క్షణము, జననం మొదలు మృత్యు సమయ పర్యంతము, దిగ మ్రింగుటయే "కాల మృత్యువు" అనగా, కాలమే మృత్యువై (ఓటు కుండలోని నీటి వలె) – క్షణ క్షణము, మానవ జీవిత కాల ప్రమాణమును, మ్రింగు చున్నది గదా!

దైహికంగా "జన్మ – జీవన – మరణ" కథనము సులభ గ్రాహ్యము. కాని, జనన మరణములకు ముందు వెనుకల ఇనుప తెరలు సుస్పష్టము. జనన మరణ రహస్యములు అగమ్యగోచరము. ఊహాతీతము – దివ్య రహస్యము.

కఠోపనిషత్తు నందు, వాజస్రవసుని పుత్రుడైన నచి కేతస్సు, యమ ధర్మ రాజు నుండి గ్రహించిన "మృత్యు" రహస్యమిట స్మరణీయము. దీనినే "నచికేత విద్య" అంటారు. (32 వేద విద్యల లో నిదొకటి) –

సామాన్యంగా, (ప్రత్యక్షానుభవం లో మానవుడు (ప్రాణి) పుట్టుకకు ముందు లేడు. మరణానంతరం కూడా అంతే. ఇందు మరే రహస్యేంగతమున్ను లేదు. ఇది సామాన్య దృష్టి – కాని, ఇక మరణ భయానికి సహేతుక కారణం గాని, ఊహాగానంగాని అనవసరం. మరణానంతరము, ప్రాణి జననానికి మునుపటి పరిస్థితుల కన్న దిగజారి పోడు. జననము నకు మునుపెట్లో మరణానంతరము కూడా అంతే. ఎట్లయినప్పటి కిన్ని, జీవ "జనన –మరణము" ల యొక్క పరస్పర సంబంధము మారదు. "పగలుకు చివర రాత్రి, రాత్రికి చివర పగలు" న్నట్లు – అంతే.

ముఖ్యంగా, మరణ భీతి దేహ సంబధమైనదే. ప్రాణమును ప్రాణి నుండి బలవంతముగా లాగి వేయడ మేమన్న భయోత్పాతమే మరణ భీతికి కారణం. మరణ భీతి మానవుని ఒక్కుమ్మడి క్రుంగఁ జేసి కలచి వేస్తుంది. అశనిపాతమే అవుతుంది.

సాధారణంగా, అగమ్యగోచరమైన యీ మృత్యు భీతి, స్వర్గ నరకముల ఉనికిని శంకించి, అంత్యకాలమున, ప్రాణిని ఉక్కిరి బిక్కిరి చేస్తూంటుంది. కాని, ఆ స్వర్గ నరకముల స్థితి గతులు యీలోకాని కేమిన్ని క్రొత్త కాదు. సాహసోపేతమైన మనస్థితితో, మృత్యువు నెదుర్కొన గల గుండె నిబ్బరం సామాన్యుల కేలా అబ్బుతుంది?

మరణంతో దేహంలేదు. కాని, ముక్తా ముక్త సూక్ష్మ జీవులు (Spirits) శక్తి వంతమై దేహులఁ (సజీవుల) నాశ్రయించి, చిత్ర విచిత్ర లీలా తరంగములను ప్రదర్శించడం నిత్య జీవితానుభవంలోచూస్తున్నాము.

భౌతిక దేహాన్ని ఆశ్రయించి దాన్ని నడిపించే అజ్ఞాత చైతన్య శక్తి యే జీవ శక్తి. అది లోపించెనా, మానవుఁడు శవమై నీల్గి నేల కొరుగుతాడు. దేహము జడ పించెము గదా!

అశాశ్వత దేహంలో – శాశ్వత చైతన్య శక్తి అధిష్టించి, రథాన్ని నడిపే రథ చోదకుని వలె, చైతన్య లక్షణముల ప్రదర్శించును. గీత లోని "క్షేత్ర క్షేత్రజ్ఞుల" విపులార్థమిదియే.

ప్రత్యేక వ్యక్తులందీ శక్తి, దే దీప్య మానమై, అగణితమై, దివ్య జ్యోతిగ ప్రకాశించి అదర్శ నాయకత్వమును వహించును. అపూర్వ వ్యక్తిత్వ శోభ వివరణమే గీత యందలి విభూతి యోగము నందుఁ గమనార్హము.

పంచీకరణ వివరణము –

జనన మాదిగా దేహ పోషణాభి వృద్ధికై పంచ భూతములనుండి, సంగ్రహించి యుండు ఆయా భాగములను దేహి మరణ కాలమున, ఋణ విమోచనార్థమై, శ్మశానమున (పూడ్చియో, కాల్చియో) ఋణ విముక్తుఁడగును. ఇదే పంచీకరణమందురు. (Liquidation of the dead body into five Primary Elements)

ప్రాణము -- అగ్ని లోను
శ్వాస -- వాయువులోను
నేత్రములు -- సూర్యుని లోను
మనస్సు -- చంద్రుని లోను
శ్రోత్రములు -- దిక్కులందును

శరీరము -- మట్టి (పృథ్వి) లోను
చైతన్యము -- ఆకాశము లోను
రోమములు -- లతాదులందును
శిరోజములు -- వృక్షములందును
రక్త – రేతములు – ఉదకము లందును --- క్రమము గా లయించును.

-- చాందోగ్య. అ. 5. సూ. 340

-- బృహదారణ్యకము. అ. 6. సూ. 20

ప్రస్థానము = ప్రయాణము = నిర్వాణము – మోక్షము

మహా ప్రస్థానము = మహా ప్రయాణము = మహా నిర్వాణము = మరణం.

దేహము (స్థూలము) – పంచీకరణమగును. జీవుడు (సూక్ష్మము) – లింగ శరీర రూపమున, మరణ కాలమున, ప్రాణము చే కొంపోఁబడును. ఇల్లు వాకిలి పోగొట్టు కొన్న నిర్వాసి – బికారి అగతికుని వలె, విశ్వేశుని పాలఁబడి, ప్రారబ్ధానుసారముగా తిరుగు సమయమున, నూతన దేహ ప్రాప్తితో పునర్జన్మఁ గాంచును.

"యదృశ్యం తన్నశ్యం" అన్నట్లు దృశ్య జగత్తు నశింపకఁ దప్పదు. స్థూల దేహము, రోజు రోజుకు మార్పులఁ జెందుచు అస్థిరత్వమునే జాటు చుండును.

పురిటిలో దేహం బాల్యంలో లేదు. బాల్యంలోని దేహం యవ్వనంలో లేదు. యవ్వనంలోని పాటవ దేహం వృద్ధ్యాప్యంలో లేదు. వృద్ధ్యాప్యంలో – నెరసి – ముడుతలు బడి –పండ్లూడి – కండ్లు పోయి – ఢీలు పడ్డ ముదుసలి దేహం పండినాకు వలె రాలి పోతుంది. "జాతస్యమరణం ధ్రువం" –

హృదయ నైర్మల్యం – చిత్త సంస్కారం కలగడం పునీత జీవన లక్ష్యం.

వ్యక్తులే కాదు, సామ్రాజ్యముల గతి కూడా యింతే! కాని, వ్యక్తులు నశించినా వారి సామ్రాజ్యముల సంస్కృతి ప్రభావములు మాత్రము మానవ హృదయముల నంటి నేటికిన్ని సజీవమై విరాజిల్లు చున్నవి. అందుకు చరిత్ర లే సాక్షి. కాల ప్రవాహము ఏక ధాటిగా చెదురు బెదురు లేక ఒకే రీతిని సాగి పోవు చుండును. గత క్షణములు తిరిగి రావు. జీవుల సంస్కృతీ – ప్రగతులు కూడా అంతే!

జీవ శక్తి, ప్రకృతి శక్తుల నధిగమించి సూక్ష్మాతి సూక్ష్మమై, అత్యంత బలవత్తరమైన వ్యాపక శక్తిని గల్గినది. మూల వస్తువులైన పంచభూతముల (Primary

Elements) వలె చ్యుతి లేక, శిథిలము గాక, అమరత్వమునే చాటు చుండును. అమరత్వము, ఆద్యంతముల నెఱుంగదు. అచింత్యము, అనూహ్యము. అమర జీవులు శాశ్వితులు. అట్టి వారి జీవిత గాథలు లోక సంగ్రహార్థ పునీత లీలా తరంగములు.

గాలి, మెఱుపుల వంటి అదృశ్య – అమోఘ శక్తుల వలెనే జీవ శక్తి కూడా సూక్ష్మ ప్రపంచమున, భౌతిక ఆవరణమునకు అవ్వల బలీయ ప్రకృతి శక్తిగా రూపొంది వుండ వచ్చును. జీవ శక్తి, జ్ఞాన శక్తి కన్న మిన్న, మానవుడు నశించినను జ్ఞాన శక్తి చిరకాల ముండును. బుద్ధుడు వాల్మీకి కన్న గొప్ప వాడు. క్రైస్తు షేక్స్పియర్ కన్న అధికుఁడు. అమరత్వ మాద్యంత రహితము. దురూహ్యము. అగమ్య గోచరము.

శ్లో|| "నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః
న చైనం క్లేదయం త్యాపో న శోషయతి మారుతః"

తా|| ఆత్మను శస్త్రములు ఛేదింప జాలవు, నిప్పు కాల్ప లేదు. నీరు తడప లేదు. గాలి శోషింప లేదు. పంచ భూతములకు లోబడునది కాదు.

-- భగవద్గీత. అ. 2. శ్లో. 23.

నాశరహిత మైనదీ అఖండ చిద్విలాసము. జీవోత్థానము (Resurrection) అమరత్వమనిపించుకోదు. అమరునకు జనన మరణము లెక్కడివి? అహంకారము ఆత్మ కాదు. ఆత్మ వేత్తలు అహంకార వర్జితులు.

అద్దములో కాన్పించు మనము, మనము కాదు. ప్రకృతి రమణీయత అంద చందాది అలంకారములకు భ్రమసి పోయే భ్రాంతి – దేహాత్మ సౌందర్యోపాసనాదికములు-కేవలం క్షేత్ర పూజలే. అంతా శవారాధనమే – శివారాధనము కాదు. క్షేత్రము వేరు – క్షేత్రజ్ఞుడు వేరు. దేహము వేరు – దేహి (జీవుడు – దేవుడు) వేరు.

కళ్ళు, లోనికి చూడ జాలవు. మనస్సు భావమును మించి పోజాలదు. ఇకదారి? బ్రహ్మము ⟶ అవ్యక్తము ⟶ మహత్తు ⟶ ప్రకృతి(పరాపర) ⟶ అహంకారము (మనస్సు) - - - ఇట్లు బ్రహ్మమునకు ఆరవతరమైన మనస్సు బ్రహ్మను కనుగొనడం అనూహ్యం.

దేహ వర్జిత పూర్వాపర జీవ స్థితి జనన మరణ కారణము. పూర్వ జన్మ జ్ఞానమ – పూర్వ జన్మ వృత్తాంత రహస్య ప్రదర్శన ప్రస్తావన లనంతం.

బుద్ధుని జాతక కథలు – అవతార తత్వ సిద్ధాంతములు – మహాత్ములు – ప్రవక్తలు – ఆచార్యులు – బాబాలు – వీరి అవతరణ గాథలు పునర్జన్మ సిద్ధాంతమును ధ్రువ పరచి చాటుట లేదా?

మానవ జన్మలో పూర్వజన్మ వాసనలు – విభిన్న సంస్కారములు – వీటి యొక్క సాక్ష్యము చాలదా? శ్రీ గౌరాంగ, శ్రీ రామకృష్ణా ద్యవతారాదు లందుకు ప్రత్యక్ష నిదర్శనములు.

నిత్య జీవితంలో. అచ్చటచ్చట పూర్వ జన్మ స్మృతులు ప్రదర్శితమైన వార్త లందుకు ప్రబల తార్కాణము.

ఈజిప్టులో "పెహరాలు" – "పిరమిడ్లు" ఈ విశ్వాసంతోనే వెలసినవి.

"డూమ్స్ డే" – మరణించిన వారి విచారణ రోజున, వారి సమాధుల నుండి జీవులు (ఆత్మలు) పునరుత్థాన మొందునని (రిసరెక్షన్) క్రైస్తవుల విశ్వాసం. దేహము పూర్తిగా శిథిలమై, రూప నామములు లేకుండు నప్పుడు, ఇక లేచునదేద్ది? నశించని జీవ (చైతన్య) మే కదా? అది సూక్ష్మాతి సూక్ష్మ మైనది. అది ఏనాడో లేచి పోవడంతో, పక్షి పోయి మిగిలిన గూడు (పంజరము) వలె, శవం దుమ్మైపోయింది.

మరియు, జీవుల పాప పుణ్యముల విచారణ దిన ప్రస్తావనము – తీర్పులు – వాటి ఫలా ఫల యనుభవ కారణమే కదా? ఆ అనుభవమెక్కడ? ఎప్పుడు? ఏ రూపమున? ఎవ్వరికి? శిథిలమైన దేహమునకా? లేక ఎప్పుడో – ఏనాడో లేచి పోయిన రూప నామ రహిత "జీవు" నకా? ఈ ధోరణి, "పునర్జన్మ" సిద్ధాంత వ్యతిరేక వాదుల (పిడివాదుల) కు తప్ప సామాన్యుల, ఊహలకు అందరానిది.

లోకమున ధర్మము నశించి – అధర్మము బలిసి, సాధు హింస సాగునెడ శిష్ట సంరక్షణార్థము యుగ యుగములుగా భగవంతుడే అవతరించడమో లేదా తన ప్రియ దూతలను అనగా ప్రవక్తలు – మహాత్ములను పంపించడమో పరిపాటి. లోక సంగ్రహార్థమీ రీతి జరగడం, భగవంతుడు లోకానికిచ్చిన హామిగా అన్ని మతముల వారికి విశ్వాసము గ నున్నది. ఇక పునర్జన్మ సామాన్యులకన్వయించదని వాదించడం నిరర్థకం – వృధా శ్రమ.

అ వాంఛనీయమైన "జనన – జర – మరణము" లను చూచి భయపడని వారు లేరు. కాని, అవి ఎవ్వరిని వదలవు. మరి యీ జటిల సమస్యకు పరిష్కారమే లేదా? ఇది యే "విచారము" దీని పర్యవసానమే "యోగము".

భౌతికంగాను, పారమార్థికంగాను, ప్రతి యొక్కరు అభిలషించేది “దుఃఖ నివృత్తి – ఆనంద ప్రాప్తి” – నాస్తికులు గాని, ఆస్తికులు గాని మరెవ్వరైనను సరే ఆనందమును కోరని వారు లేరు. జీవితమే సుఖోన్ముఖమైంది. కాని, దుఃఖము వెన్నాడుతూనే వుంది.

ఆనందము ఉపేయము. దానిని పొందు ఉపాయమే యోగము. దానిని జడములు సాధించ లేవు. బాహ్య విషయ సంయోగ జనిత దేహానందము కన్న, అంతర్ముఖ మైన ఆత్మానందమే, నిజమైనది.  మొదటిది “క్షరము”. రెండవది “అక్షరము”.

“క్రమ ముక్తి” అనగా ఉపాసనల వల్ల, బ్రహ్మ లోకమును పొంది, అందు బ్రహ్మాభ్యాసమున జ్ఞాన ప్రాప్తి ద్వారా, ప్రళయాంతమున పర బ్రహ్మలో ఇక్యమగుట.

“సద్యోముక్తి” - అనగా జీవన్ముక్తి. ఈ జన్మ మందే (బ్రదికి దేహముతో ఉండగనే) – అపరోక్షాను భూతి (బ్రహ్మ సాక్షాత్కారము) – అమరత్వ ప్రాప్తి.

దేహాత్మ బుద్ధి అజ్ఞాన కారణము ఆత్మ కనుపించదనుకొనుట ఆవరణము. జ్ఞానము వల్ల ఆవరణము తొలగు ననెడి నమ్మకం  -- విక్షేపము.

“గురు – శాస్త్ర” భోధల వల్ల జీవుడే దేవుఁడని పూర్ణ విశ్వాసం “పరోక్ష జ్ఞానం” భగవదనుగ్రహం వల్లను, శుభ ప్రారబ్ధ ఫలం గాను, గురు కరుణా కటాక్ష, పురుష ప్రయత్నముల వల్ల, జన్మ జన్మాంతర “కర్మ – భక్తి – జ్ఞాన యోగ”  సాధనల వల్ల అపరోక్ష బ్రహ్మ సాక్షాత్కార దివ్య మధురాను భూతి ప్రాప్తియే – కడ మాట! “సోపాధిక జీవుడు – నిరు పాధిక బ్రహ్మ కావడమే”

మృత్యు క్రియ ప్రతి యొక్కరిని, భయోత్పాతంతో చలింపఁ జేస్తుంది. ఘోర తర భీభత్స మానసికాందోళన స్థితి నాపాదిస్తుంది. బలంగా కృంగదీసి కూలదోస్తుంది. దేహమే తాననుకొన్న దేహాత్మ బుద్ధులకు మరణ భీతి అమాంతము.

“సృష్టి – స్థితి –లయ”ముల కా పరమేశ్వరుడే కర్త యని శాస్త్ర ప్రవచనం. కడపటి “లయ” సర్వనాశన కాండ మాత్రము ఘోరాతి ఘోర విషాధ క్రియగా కాన్పించడం సహజం. అనంత కోటి బ్రహ్మాండములను, తానే స్వయంగా సృష్టించి (తండ్రి వలె), పోషించి (తల్లి వలె) – ఒక్క క్షణంలో అంతం చెయ్యడం – పచ్చి ప్రాణాలు (అనంత కోట్లుకు కోట్లు) - తియ్యడం మహా పైశాచిక క్రీడగా సామాన్య దృష్టికి తోచక మానదు.

నిజంగా భగవంతుఁడు జీవుల నీలాగ నిలువున నులిమి త్రుంచి వేయడానికి, అంత కసాయి వాడా? కఠిన కర్కశ పాషండ శిలా హృదయుడా? ఏమిటీ దుర్భర – దౌర్భాగ్య - విషాద నాటక సూత్ర ధారత్వమున కర్థము?

దేహ నిర్మాణమొక దివ్య – చిత్ర విచిత్ర ప్రక్రియ. సూర్య చంద్రాదులు – పంచ భూతములు భగవంతుని కర్మాధికారులు. పరమేశ్వరుని దివ్య రహస్యములను తరచి చూచు వారి హృదయములు ప్రఫుల్లమై – దేహముప్పొంగి పులకరింపక మానదు.

భగవంతుడు దయామయుడే – ప్రేమసాగరుడే – దీన జనావనుడే – దివ్య గుణ భూషణుడే –జగ జ్జనకుడు – విశ్వ కల్యాణమూర్తి - -

ఇక నీ ప్రత్యక్ష విరుద్ధానుభవమున కేమి సమాధానము? భగవల్లీల లో యీలాటి కఠిన కర్కశ పాషండ పాతక లీలను భగవంతుని కంట గట్టడానికి మానవ బుద్ధి ఒప్పుకోదే! ఖండితముగా యిందేదైన దివ్య రహస్యేంగితముండి తీరాలి.

కాని, కించిద్ జ్ఞుల మైన మానవ సామాన్య దృష్టి – ఊహ – సంకుచితము, పరాత్పరుడు – పరంధాముడు – దీన దయా పర తంత్రుడు – అనాథ నాథుడు ఏమంత వివేచన – విచారముల నెఱుంగక యీ లాంటి ఘాతుక చర్యకు తలపడెనా?

సర్వ మంగళ మూర్తి – అఖండ శుభ ప్రదాత – పరమ పిత, అశుభముల ప్రసాదించి, శోచనీయ విమర్శల కాస్పద మివ్వడమన్న ఏలా నమ్మడం?. అతడు అనంతుడు – ఆది మధ్యాంతరహితుడు – సర్వజ్ఞుడు – కరుణా సాంద్రుడు – సర్వ శక్తిమాన్ - - - - మానవుడు, క్రిమి కీటకము –తృణప్రాయము - - కించిద్ జ్ఞత్వంతో విమర్శించడం మహా ప్రమాదము –

(ఈశ్వర విలాసము)

దేహ నిర్మాణమొక దివాద్భుత చేత. “వెల్ వెట్ లాంటి” – చర్మపు పూత – అత్యంతాకర్షణీయమైన స్పర్శ – సోయగము – అంద చందములు – ఇక మరు తెర “క్రొవ్వు” – తర్వాత మాంసపు ముద్దలు – రక్త జలము – ఎముకల గోడలు (ప్రాపు) – నరముల పగ్గములు - - - మలమూత్రముల కొంప – నవ రంధ్రములు మలములు క్రక్కుచునే వుండును.

గబ్బు దేహములోన – మబ్బు లోన బడి నీవు తబ్బిబ్బులందక మేలుకో – జీవా – మేలుకో. (జీవునకు మేల్కొల్పు – హెచ్చరిక)

రోగముల పుట్ట – షడ్భావ వికారి – కర్మ యంత్రము – మానవుని జీవితం లో సద్వినియోగము కావలసిన, తరణ సాధనముః ధర్మ కర్మక్షేత్రము – దేహ దేవాలయము - జీవ దేవుడుండు దివ్య నిలయము - - - అయితే జీవుడు నిష్క్రమించిన "లింగము లేని గుడి" యై, పాడు పడి పోవును.

పూడ్చి లేక కాల్చి - - - - మట్టిలో మట్టిగా కలసి పోయే అనశ్వర కంకాళమిది. దహనార్హమగును. "నేను" లేకున్న దాని గతి అంతే. "నేను"న్నంత కాలమే దానికి మన్నన – మర్యాద – పోషణ – రక్షణ – ఉనికి కలవు. తర్వాత ఎవరికి వారేః. ఈ ఉపాధి – దేహ చెర – ప్రారబ్ధ కర్మ ఫలముః జన్మ జరా మరణ చక్ర భ్రమణ భోగ శాల. ఈ జీవిత మజలీలో జీవుడు తలదాచు కొని, మన, నీడ నొసంగు గూడు – పంజరము. రెండు పక్షుల నివాస యోగ్య వృక్షము.

ఈ విధంగా "దేహి – దేహముల" సంసారము పునర్జన్మ సిద్ధాంతమును చాటుట వల్ల "నైరాశ్యమును" దూరీకరించు చున్నది. ఆధ్యాత్మ జీవనము – నవ జీవన స్రవంతి మహా ప్రవాహమైనది. ఇహ జీవన మొక సాధనా సదుపాయము.

బ్రహ్మ జ్ఞాన –
బ్రహ్మానుభవ –
బ్రహ్మానంద – పరిపూర్ణత్వములను ప్రసాదింప జన్మ మొక సాధనము. – శిక్షణ కేంద్రము – యోగ భూమిక – త్యాగ సీమ – ఆత్మ విజయ, స్వారాజ్య ప్రాప్తి – మానవ జీవిత పరమ – చరమ లక్ష్యము. మహోన్నత, దివ్య – ధన్య – పుణ్య పురుషార్థముల ప్రసాదించు మహా యజ్ఞ శాల.

ఈశ్వర నిర్మిత విశ్వమొక మాయా స్వప్నం కాదు. మిథ్యా కల్పన కాదు, పైశాచిక క్రియ కాదు. దివ్య సాధన కేంద్రము. జీవిత పరమార్థ పావన పరీక్షా నిలయము. భగవద్విరచిత ఆనంద దామము. "ధర్మ – కర్మ"ల ద్వారా మోక్ష ప్రాప్తికి అనుకూలించు సాధన రంగము.

ప్రవేశంః జననం – జన్మలో తొలి ఘట్టము. నిష్క్రమణ - మరణం. జన్మలో ఆఖరు ఘట్టం లేక తెర. కాదు, ఆ జన్మ లో ఘట్టం ఆఖర్ మాత్రమే.

మానవ దేహము పుట్టుక కు ముందు లేదు. మరణించిన తర్వాత కాన్పింపక, మధ్య మాత్రము కాన్పించు నవరంధ్రముల - తోలు తిత్తి. స్వేద – మూత్ర – పురీషములతో, క్రిమి సముదాయ సంకులము – పూతి గంధ హేయము – సప్త ధాతు

నిర్మిత – పాంచ భౌతిక – షడ్భావ వికార సమన్విత దేహమునకే "వర్ణాశ్రమా చార ధర్మ – కర్మాదులు" స్వధర్మ మంటే ఆత్మ ధర్మమని కాని, దేహ ధర్మ మని పొరఁబడరాదు.

స్వధర్మ మనగాః-

సత్య దృష్టి – శాస్త్రీయ కర్మా చరణ, నియమ జీవనము – త్రికరణ శుద్ధి - - గల్గి నట్టిన్ని - - - - జ్ఞానభాసితమై, మోక్ష దాయకమై - - భవ బంధ విమోచనకారి యైనదే "స్వధర్మము" – అనగా ఆత్మ ధర్మము.

మోక్ష కామికి ఫలాపేక్ష లుండవు, కేవలం అనాసక్త – నిష్కామ కర్మిష్టియై లోక సంగ్రహార్థమై, విశ్వ మానవ సేవా తత్పరత్వమున ధన్య జీవియై, భాసించును.

"స్త్రీ – పురుషు"లన్న దేహములే. పురుషుడన్న పరమాత్మ – స్త్రీయన ప్రకృతి. ఈ ఇరువురును వేరు వేరు కాదు. పురుషుని తెలియుట అనగా పర ధర్మమమగు ప్రకృతికి దూర మగుటయే! ఇదే స్వధర్మము.

మనలో మాట –

అద్వైత – విశిష్టాద్వైతములు, ముక్తి, క్రమ ముక్తులను క్రమముగా చాటును, కాని ద్వైతము జీవ బ్రహ్మైక్యమును నంగీకరించదు. జీవులు జీవులే – దేవుడు దేవుడే –

ద్వైత మతము కేవలం భక్తినే అవలంభించి అనందించును. భగవంతుని జగన్నాటక రంగ పరి సమాప్తి ని ఒప్పుకోదు. ముక్తి – మోక్షములన్న వారి నిర్వచనము వేరు. జీవ బ్రహ్మైక్యమును వారంగీకరించరు --

దేహాభిమానమే జీవత్వము – బంధము. ప్రాణి చచ్చు (నశించు) దేహమును చూచి చత్తునని అభిమానించి భయపడునేగాని, చనిపోయే దేహము (జడము) నకు చచ్చుట యన్న ఏమో తెలియదు.

శాశ్వితుఁడు – అమరుడు – అమృత స్వరూపుఁడైన "జీవ దేవుఁడు" – నశించు దేహమే తానను కొని (దేహాత్మ బుద్ధితో) మృత్యు భీతితో హడలి పోవును. కాని, పాంచ భౌతక – జడ – ఘటమునకు – చచ్చుటన్న యేమో తెలియదు. అది రోజు – క్షణ క్షణము మారుచు (చచ్చుచు)నే వున్నది కదా!!

ప్రాణ (మరణ) భీతియే పునర్జన్మకు పునాది. ప్రాతి పదిక. దేహాత్మ బుద్ధి (ద్వైతత్వము) భయ కారణము.

మృత్యువు X అమరత్వము

బొమ్మ – బొరుసు ల్లాగ  - మనిషి నీడల్లాగ – పుణ్య ఫల భోక్తలగు దేవతలు దుఃఖదూరమైన – లోప విరహితమైన – పరిపూర్ణ భోగ భాగ్య సుఖ నిలయమగు స్వర్గలోకానంద మనుభవింతురు. వారి కాకలి -  దప్పులు లేవు. దివ్య దేహులు. భోగ భూమిక.

శరీరము పతనమైనప్పుడు, దేహ వినుర్ముక్త (వుపాధిరహిత) జీవుడు కాంతిమయ తేజోధూమ రూపమున బయల్వెడలి, యమ పాలిత పితృ లోకమునకు పోవును. పాప ఫల కర్మానుభవ మచ్చట తీరును.

కేవలం -- స్వగతం -- సామాన్య దృష్టిః -

బాపురే! ఎన్ని సంవత్సరములు – ఎంత ఆప్యాయతతో "దేహమే నేను – నేనే దేహము" అని త్రికరణాలా విశ్వసించి, చేయరాని నానా పాప కర్మలు – అన్యాయాలు – అక్రమ విధానాలు – నీచ వ్యవహారాలు -- - - ఎన్నెన్నో దురాగతాలు, సాగించి, పోషించి, పెంచి, ఆశలన్నీ కేంద్రీకరించు కొన్న ఓ దేహమా! ఎమిటీ మోటు సరసము – నీవు హఠాత్తుగా నీల్గి నేల కొరిగి, శాశ్వతంగా తెగ తెంపులు చేసు కోవడం ఎంత ద్రోహం! పచ్చి మోసం, ఘోర ధగా - - - అబ్బబ్బ! యింకేమి గతి? ఎంత కృతఘ్నుత. భార్యా బిడ్డలు బంధు మిత్రులు, గుట్టలు గుట్టలుగా ఆర్జించిన ధన కనక వస్తు వాహనాలు – మిద్దెలు – మేడలు – అన్నీ యేం కావాలి? ఇక దిక్కెవ్వరు? ఎక్కడికి పోవాలి? యేమి చేయాలి? - - -  అని విలపిస్తూ దేహాన్ని వీడి జీవుడు వెళ్ళిపోతూ, దేహ వియోగ  దుఃఖ ప్రలాప – ప్రల్లదములతో – స్వస్వరూప జ్ఞాన శూన్యత – దేహాత్మ బుద్ధిని ప్రదర్శిస్తాడు - - - ఈ "అహందేహోకస్మి" గాడు.

ఈలా అజ్ఞానాంధకారమున మునిగి మూల్గు చున్నవాడు "జీవ బ్రహ్మైక్యానికి" ఒప్పు కుంటాడా? అందులకు గాను, అనుభవానుగ్రహ మూర్తి యైన గురువు – శుభ ప్రారబ్ధం – భగవదనుగ్రహం ---- అన్ని కలసి రావాలి కదా!! ఆత్మ సత్యం – దేహ మనిత్యం.

"బ్రహ్మ సత్యం – జగన్మిథ్య" అని నిరూపించి, విశ్వసింపఁజేసి తరణ ఫథముఁ జేర్చడానికి – గురువొక్కడే దిక్కు!

వేదాంత విచారము లేనందున - - - ఆత్మానాత్మ వివేకము లేమి వల్ల - - - సత్సంగాది పంచ శీలములు ప్రాప్తించనందున - - - శుభ ప్రారబ్ధం – అనుభవానుగ్రహ మూర్తి యైన సద్గురు కరుణ – దైవ కటాక్షములు లభించనందున, ఆత్మ

స్వరూపానుభూతి అభావమైనందున, సత్య జ్ఞానం శూన్యమై – మిథ్యా జ్ఞానం బలిసి పోయి నందున - - -

బ్రహ్మ జ్ఞానానికి బదులు - - -

భ్రమ జ్ఞానం నాటుక పోయింది,      కావున - -

రామ పథానికి మారు, కామ పథం దాపురించింది

ఆఃగీ||   ఏమి గొంచు వచ్చెనేమి తాఁగొని పోవు|

పుట్టు వేళ నరుఁడు గిట్టు వేళ|

ధనము లెచటి కేగు – తానేగు నెచటికి            ||విశ్వ||

ధన గత ప్రాణులైన మానవులు లోభులు కారాదు. నీతి నిజాయితీలు – న్యాయ ధర్మాలు – దయా దాక్షిణ్యాలు – సత్య దర్శనం చేయించి, చరితార్థుని చేయునది "సుజ్ఞాన" మొక్కటే.

సత్య దృష్టి మరుగునఁబడి, దేహ ధర్మములు విజృభించి, ఇంద్రియాదులు, విషయ లంపటత్వమున సొక్కి – మత్తెక్కి – స్వ స్వరూపమును మరిపించి "దేహమే నేను" "ఇంద్రియ క్రియలన్నియు నావే" – అను దేహాత్మ బుద్ధి బాగా బలిసి పోయి, కట్టకడపట మృత్యు ముఖమున, తారసిల్లు తరి, దరి దాపు తోచని జీవుని నట్టేట విడిచి, దేహేంద్రియాదులు, జవ సత్వ చైతన్యములఁ గోల్పోయి, నీల్గి నేల కొరిగి నశించును. ఇదే ఘట బంధ మాయ.

"నీవు" – నిజమైన నీవు – నిర్వాసివై వెట్టిగా – అగతికుఁడుగా – మోసగింపఁబడి వెలికి త్రోసి వేయబడిన వాడుగా చేతులు కాల్చుకొన్న వాని వలె, పశ్చాత్తాప తప్తుడై, పరితపించిన నేమి లాభం? అంతా మించి పోయింది నీ వ్యవహారం! - - -జన్మ జన్మాంతరములనుండీ నీకిది మామూలేగా! తిరిగి కర్మోచిత జన్మ తథ్యం. జనన మరణ చక్ర పరిభ్రమణ గాథ ఆద్యంత మెరుగనిది గదా!! పాపం - - రెక్కలూడిన పక్షివై పోయావే!!

భార్యా బిడ్డలు – బంధు  మిత్రులు  భూ, భవన – ధన – కనకాభరణ – కాంచన చేలాదులు.

ఆప్తులు – అభిమానులు – అనుచరులు – ఆరాధకులు – పదవులు – బిరుదములు – బ్యాంకు లెఖ్ఖలు - - -

ఈలాగు ఇంకెన్నెన్నో ఈ జగన్నాటక రంగంలో సంబంధ బంధములు! నస్మరంతి!! ఇక నీకు ఏదిక్కున్ను లేదాయె; తుదకు "నీవు నాది – నేనే" ననుకొన్న దేహమే నీకు లేదాయె!

"చనినా రెందరో చక్ర వర్తులు - - -" కాని, ఈ జగన్నాటక రంగం మాత్రం అట్లే సాక్షిగా నిల్చి - - నీవు బడా ఫకీర్ గా వెలి వేయ బడ్డావు.

1. కంసాలి పట్టెడ వలె –
2. నాటక దీపము వలె –
3. ప్రవాహము అడుగున బండవలె –

నిర్వికల్ప – నిర్వికార – నిస్సంగ – నిర్లిప్త సాక్షి వలె, ఉలుకక – ఒలకక, అచంచల సహజస్థితి లో స్వ స్వరూప స్థితిలో ఉండడం బ్రహ్మాభ్యాస ఫలమే.

కామ్య సిద్ధికి, సత్కర్మాచరణ మొనర్చు వారు, పుణ్యలోకము లందు, పుణ్య ఫల సుఖానుభవానంతరం, చర్విత చర్వణంగా తిరిగి "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి" అన్నట్లు భూలోకంలో అవతరించడం పరిపాటి. ఇదే జనన మరణ చక్రభ్రమణము.

దేహము కర్మ ధర్మ క్షేత్రము – తరణ సాధనముః యజ్ఞ గుండము. ఈ లోకము – యోగ భూమి – స్వర్గము –భోగ భూమి.

ఇక ఏది నిజం? సత్య జ్ఞానంతో ఆత్మ దర్శనం చేస్తావా? సావధానం!!

బ్రహ్మ భిన్న పదార్థమును ప్రేమింపకుము. ధన – దార – పుత్రాది - సమస్తైశ్వర్యాదులును "దృశ్యములే" – "యద్దృశ్యం – తన్నశ్యం" అన్నట్లు - - - తుదకు నీ దేహము – ప్రాణములు సహా నీకు - - - నహి నహి; జాగ్రత్త! అహంకార – మమకారములు - - ఐహిక బంధములన్నియు అంతే!! నీ వేషమే (దేహమే) నిన్ను నమ్మించి మోసం చేసింది. స్వ స్వరూప నాశనకారి.

నీవు "నేనే" నని నమ్ముకొన్న దేహమే నీవు కానప్పుడు – నీది కానప్పుడు – ఇక ఈ లోకంలో నీకు రక్ష – దాపు - ప్రాపు – హితమైంది ఏముంది. ఏమి మిగిలింది?

ఈ లోకంలొ సర్వం దేహ సంబంధమైనవవే కదా! గురు వొక్కడే యీ రహస్య కీలకం దెల్పి, తరింపఁ జేయ గల విమోచన కర్త! నిన్ను కాపాడి, రక్షించి, మోక్షప్రసాద భిక్ష నొసంగ గల ఏకైక అర్హుడు. నిజ స్వ స్వరూప దర్శన ప్రదాత!!

"సునో! ముసాఫిర్ భాజిత ఢంకా" ఓ బాటసారి, నీ ప్రయాణానికి ఘంట మ్రోగుతూంది. సిద్ధంగా బయలు దేరు. ఆలస్యం చేస్తే గమ్యం చేరుకో లేవు.

--- తుకారాం.

దేహధారి తన సమస్త ఐహిక అనుబంధాలను తెగ ద్రెంచుకొని, నిర్వాసియై, అగమ్య గోచరమైన పయనం సాగించడం భయానక – దుర్భర - సాహస క్రియగా భావింపక తప్పునా. (తప్పదు)?

ఈ శిథిల దేహ చెర – అలసట – విసుగు – రుగ్మత – అన్నీ తీరి పోతాయి. నీకు విముక్తి – శాంతి – నూతన చైతన్య ప్రాప్తి సిద్ధించు గాత. విజయీ భవ!!

మానవుఁడు విధి చేతులోని కీలుబొమ్మ. దేశ కాల పరిస్థితులకు వారసు. ప్రారబ్ధఫల భోక్త. ప్రారబ్ధానుభవం తీరిన వెంటనే భౌతిక దేహము –

--- పాము పొర వలె -

--- మాసిన చొక్కావలె -

--- ఎండిన ఆకు వలె - రాలి పోవును.

పునర్జన్మ వల్ల దేహము మార్పుతో, జీవుఁడు "నిద్ర నుండి మేల్కొన్నట్లు, శేష ప్రారబ్ధ కర్మ ఫల ప్రాప్త్యానుసారముగా పునః జీవ యాత్ర సాగించును. ప్రతి జన్మము ఒక ప్రత్యేక ఘట్టము. నూతన మజిలీ – క్రొత్త మైలు రాయి – యీ ప్రస్థానంలో - - -

పునర్జన్మలో పూర్వ జన్మల జ్ఞానము లేకున్నను, సాధించిన, సాగించిన కర్మ – భక్తి జ్ఞాన యోగాదుల సాధనల ప్రభావ సంస్కారములు మాత్రము జీవుని సకాలమున ఉద్దీపింపఁజేసి శుభ ప్రగతికి – విడిచిన చోటు నుండి, అందుకో ప్రోత్సహించి, భగవంతుని కృపా విశేషమున జగన్నాటక రంగ సీమ సాగిపోవుచుండును.

నిత్యానుభవ దృశ్య ప్రదర్శన భూమిక.:-

ఇదిగో – ఇదేనా నీమేడ చూడు – పై అంతస్థు మీద నీ దేహము హంస తూలికాతల్పము నుండి వీధి అరుగు మీద చేర్చ బడింది. లోకములో ఇది మామూలే కదా! అందరు సర్వ సామాన్య దృక్పథంతోనే, నిరామయంగా గుమి కూడి తమాష చూస్తూన్నారు. ఆప్తులు, ప్రియులు కళ్ళ నీళ్ళతో – తటస్థులు, స్థిత ప్రజ్ఞులు వలె

అచలంగా, నిర్మోహంగా వున్నారు – బహుశః అంతరంగ శత్రుమూక కాబోలు, దుఃఖం నటిస్తూన్నారు (లోన మనస్సు నవ్వుతూనేవుంది), ఇదే లోక పోకడ. జాగ్రత్త!!

అదిగో నీ శవం. ఊరి వెలుపల శ్మశానంలోకి మోయ బడుతూంది. వెంటపో! ఇంకా చూడు. కాష్టం మీద నీ దేహం నిర్జీవమై, ఎంత దీనాతి దీనావస్థలో – లోకం చేత పరిత్యజింపఁబడి హీనంగా, అసహ్యంగా – కర్రలు పిడకలు మధ్య – 'కిరసన్" ఆయిల్ తో చిలకరింపఁబడి - - - అదిగో! నీ కుమారుడే నిప్పు పెడుతూన్నాడు. నీ దేహం నీకే లేదాయె. ఎవ్వరు అడ్డుకొని – అభిమానించి - ఆదరించరే! ఇది నిజ మంటావా? ఒప్పుకోవా?

నీవు ఇంకెవ్వరికి కావాలి? మంటలు లేస్తూన్నాయి – ఎక్కడి వారక్కడ జారుకొని వెళ్ళి పూతూన్నారు. తోటి (కాటి కాపరి) మాత్రం నీ దేహ దహన క్రియా పర్యవేక్షణలో నిమగ్నుడై నిల్చి నాడు. నీ అమూల్యమను కొన్న "దేహ" నాశనానికి, లోకమంతా ఏకమైంది కదా!!.

నీ భార్యా బిడ్డలు – ఆప్త బంధువులు - మిత్రులు – ఆశ్రితులు – అనుమాయులు – వంది మాగధ స్తోత్ర పాఠకులు – పరిచారకులు – ఎవ్వరూ కాన్పించరే? ఏకాకి - - నిర్వాసీ – బికారీ!!

భూ, భవన – ధన – ధాన్యాదులు – అమూల్య వస్తు వాహనాదులు - పదవులు – బిరుదులు –బ్యాంకు లెఖ్ఖలు – సమస్త భోగ భాగ్య సరంజామా యిక నీకు శాశ్వతముగా రద్దు. ఇక నీకు దక్కునది – మిగులునది యే తృణము కానరాదు.

నిజంగా నీవు నిర్వాసివి – బికారివి – భుక్కా ఫకీరువు – అగతికుడవు – లోకంచే శాశ్వతంగా రూప నామ రహితుఁడవుగా చేయ బడ్డ దౌర్భాగ్యుడవు. ఒప్పుకోవా? బాధగా వుందా? ఇకను అర్థం కాలేదా? ప్రత్యక్ష సత్య ప్రమాణాన్ని కూడా అంగీకరింప, మనస్సు ఒప్పుకోదా? పాపం! మహా మాయా దేవి దివ్య ప్రభావమే జయిస్తుందా?

ఇక నైన కళ్ళు విప్పి చూడుః నీ విప్పుడు బూడిద మట్టివి –మట్టిలో మట్టివి. ఆఖర్!! నిజమే కదా! నీ విప్పుడెవ్వరు? ఎక్కడున్నావు? నీ కెవ్వరు దిక్కు? ఏది దరి – దాపు? ఆ దర్జా – గౌరవం – భోగం –బలం – రూపం – తెలివి తేటలు – డిగ్రీలు – చదువులు – హోదాలు ఏవి? ఎక్కడున్నాయి?

నీవే చెప్పు – లేకుంటే విను!! నీ దేహం అద్దెకున్న గృహం. నెల 1 కి రు 30/- నుండి 3000/- వరకు, వెచ్చించి, స్వయం సేవ – స్వయం పోషణ - రక్షణ భాద్యతలు, అనగా తినడం – త్రాగడం – స్నాన పానాదులు – వస్త్రధారణ – శృంగార భోగ పోకడలు - - - ఎన్నో - - - అన్నిటికి మీదుగా నిన్ను (దేహాన్ని) ఉంచిన్ని (సేవకులు స్వయం పోషణాదులకు పనికి రాదు కదా) – బాగా పోషించి – పెంచి – బలిపించి – రక్షించి – భరించి – పూర్తిగా విశ్వసించి నమ్ము కొన్న - - - - ఈ పాప భౌతిక దేహం ఎంత మోసం చేసింది? ఉన్నట్టుండి హఠాత్తుగా నేల కొరిగి నీల్గి నిష్క్రమించింది. కదలదు – మెదలదు – పలుకదు – ఉలుకదు – శాశ్వతంగా బైబై.

ఇక, ఈ దేహ ధారణ సుదీర్ఘ వ్యయ ప్రయాసలు – రోగములు – చికిత్సా టాక్సులు. రహస్యంగా ఎన్ని రకాల పాపాలు – శ్రమలు – ఆర్జనలు – నటనలు – మోసాలు –బొంకులు రంకులు – రాజకీయాలు - - - - బాపురే!! “నరశేఖరా?” - నిజం నిజ మంటావా? లేక . . . . మానవా! ఇక నీకెవ్వరున్నారు? నీవెవ్వరు? నీకు రూప నామములు లేవే! ఉపాధి – ఉనికి –ఊరు - పేరు . . . . నీవు దేహం కాదని గ్రహించి బ్రదికి ఉన్నప్పుడే జాగ్రత్త పడి మేల్కొని వుంటే . . . . . . . . . .కిం కర్తవ్యం??

పోయింది నీవు కాదు. లోకం “పీనుగ” అని బయట పార వేసే – పూడ్చి లేక కాల్చి వేసే – జడ – పాంచభౌతిక దేహం నీ వెన్నో జన్మల్లో ధరించి విసర్జించిన “దేహాల్లో” కడపటి తొడుగు ఇది. ఇదే ప్రత్యక్ష వేదాంత రహస్య సార సంగ్రహ స్వరూపం. తుది జ్ఞాన ఘట్టముః “నీవు దేహం కాదు” – నీవు వేరు – నీ దేహం వేరుః నశించినది నీ జడ స్వరూపం – నీవు చైతన్యాంశ – శాశ్వితుఁడవు – భగవదంశవు!!

“దేహి నిత్యం – దేహమనిత్యం”

ఈ సత్యా సత్య వివేక – వైరాగ్యము లేకున్న జీవితం వృధా! గురూప దిష్టపథమున పయనించి, విరాగివై సత్యా దర్శన సాధన కుపక్రమించి, సుముఖుడవై సాగి పొమ్ము! శుభ పథ గామివై - - - అదిగో మోక్షద్వారము నీకై తెరువబడి యున్నది – ఆహ్వానిస్తూంది.

అదే నీ నిజ గమ్య స్థానంః

“దుఃఖ నివృత్తి – ఆనంద ప్రాప్తి” –

జీవితార్థ సందేశ నినాదం – దివ్య ధ్వని – “ఈ జన్మమున మోక్ష సాధనకై తీవ్ర సాధనల సాగించి తరించని వాడు – ఆత్మ ద్రోహి” – ఆత్మ హంతకుడు!!

విచారము సాగించు - - -

నీ వెవ్వరు? కో అహం = నే నెవ్వరు? కుత ఆయాత = ఎక్కడి నుండి వస్తివి?

కథ మిదం జాతం? = ఈ జగత్తు ఎట్లు పుట్టెను? కోవై కర్తా = దీనికి కర్త ఎవ్వరు? ఉపాదాన మెయ్యది . . . .. ?.

"నీవు – నేను" – అనగా యీ దేహము లే అయితే విభజించి – విమర్శించి - - - నేను – నీవు ఎందున్నది చూపాలి కదా?

మాంసము - మూడు బకెట్లు

ఎముకలు - నాల్గు బకెట్లు

| | |
|---|---|
| రక్తము, మల మూత్రాదులు, క్రొవ్వు, ప్రేగులు,<br>ఉదరము, క్లోమము, ప్లీహము, యకృత్<br>మూత్రా శయము, జననేంద్రియాలు | నాల్గు బకెట్లు |
| ఊపిరి తిత్తులు – గుండె కాయ<br>మెదడు వగైరాలు | ఒక బకెట్టు |

ఇవన్నియు కేవలం భౌతిక వస్తు జాల దృశ్యములే, జడములు - - - కాని, వీటిని గుర్తించి గ్రహించే "సాక్షి – ద్రష్ట –తెలివి "మాత్రం" నేను".

మరణంతో ఇంత కాలం తాను వసించిన విడిది – వాహనం – నిలయం – అనగా "దేహము" (కళేబరము) ను గాంచి వియోగ దుఃఖము ననుభవించు "నీవు" మాత్రం "నీ" దేహం కాదు – అదొక తాత్కాలిక "లాడ్జి" – విడిది – ఎరవు నీడ.

జీర్ణ దేహమును విసర్జించి అమృత స్వరూపము – తేజోమయ – ద్వంద్వాతీత – సహజ సద్రూప శాశ్వత తత్వమైన "నీవు" జడమై, నశ్వరమై, శిథిలమై, నశించు పాంచ భౌతిక, సర్వ దోష దూషిత – వికార – వికృత – విషయోపభోగ (జడ) కంకాళము మాత్రము "నీవు" కాదు.

మధురానుభూతులతో కూడు కొన్న "దేహి – దేహ" చిరకాల సంబంధ సంసారము – తియ్యటి చెర - - - అంత వరకే . . . . కాని, తిరిగి జీవుఁడు ఆ "బోను - చెర – జైలు" లోనికి పోవెరచును. పునః ప్రవేశమన్న హడలి పోవును!!

"దేహాత్మ బుద్ది" ఎంతో సన్నగిల్లి నశించు వరకు "చిదచిద్గ్రంధి" – క్షీణించి, మోక్షార్హత లభించదు.

శ్లో|| భిద్యతే హృదయ గ్రంధి శ్చిద్యం తే సర్వ సంశయాః |
క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరా వరే||
--- ముండకోపనిషత్ . 2. 2. 18.

"When he that is both high and low is seen, the knot of the heart is untied; all doubts are solved and all his karma is consumed".

లింగ శరీరము భంగ మగు వరకు అంతః కరణ వృత్తులు నశించి, సర్వ సంకల్ప సన్యాసియై అమనస్క యోగ సిద్ధి – అపరోక్షాను భూతి ప్రాప్తింపవు.

--- ఆది శంకరులు

అపరోక్షానుభూతి నుండి మరణ మనగా – నాశనము కాదుః మార్పు శుభోదయం. ప్రగతికి మజిలీ. జీవుఁడు దేవుడగుటకు (దేవుని సాన్నిధ్యము చేరుటకు) పయనము.

పునర్జన్మ (ప్రత్యేక వ్యాసము కలదు) ప్రేత జన్మ (దయ్యాల బెడద) కూడా కావచ్చును.

ప్రాణి యీ లోకంలో జన్మించి జ్ఞానమార్జించి, ప్రత్యేక వ్యక్తిత్వము నంది, తిరిగి పరలోకములో (వేరుచోట) శాశ్వతత్వ ప్రగతికై అనుపఁబడును. అచ్చట కూడా క్రమ వికాసతను పొంది, తిరిగి పునర్జన్మఁబడయును.

చర్విత చర్వణంగా, సాగి పోతున్న యీ జనన మరణ చక్ర విషయ వలయ ప్రవాహ మొక ఘోర వాహినిగా భగవంతుని పేర వెలసినదనడంలో ఆశ్చర్యము లేదు. (శ్రుతి).

పునర్జన్మయే లేకున్న మరణమొక క్రూర వియోగ విషాద శాశ్వత శాపమై ప్రేమ జీవుల పాలిట అశనిపాతమగుట తథ్యము. కాని, భగవంతుడు దయామయుడు. ప్రేమ సాగరడు. పరమ కరుణామూర్తి. ఇది నిర్వివాదాంశము.

ఎంత క్రూరుఁడైనను, ద్వేష రోష కారణంగా ఒకరి నిద్దరిని చంపి సాధించ వచ్చును గాని, నిత్య నిరంతరము, శాశ్వతం గా అనంత కోటి హత్యలను సాగించి, విశ్వ విశాల విషాద కాండల కర్తృత్వాన్ని భగవంతుఁడు భరిస్తాడా? అంటే ఎవ్వరొప్పుకుంటారు, అబ్బ! భగవంతుని కటిక కసాయిగా చిత్రించే యీ సిద్ధాంతాన్ని ఏలా ఒప్పు కోవడం?

ఇక పునరుత్థాన (Resurrection) ప్రశంస అసంగతం. ప్రాణి నశింపక (వ్యక్తిత్వాన్ని కోల్పోక) పునర్జన్మ నందడం ఆనందకరమైన ఆశీర్వాదమే, శుభ ప్రదమే!! వ్యక్తిత్వం పోయి, పూర్వ జన్మార్జిత సంస్కృతి ప్రగతులు నశించి తిరిగి జన్మించడం వృధా!! ఇక కర్మ ఫల భోక్తృత్వం ఎక్కడిది? ఇది ఘోరం! అన్యాయం! మానవులే యీలాంటి చర్యలు హర్షించరే! ఇక భగవానుడా, యీలాంటి విషాద – వికట – వికృత నాటక సూత్రధారిగా రూపొందడం??.

పునర్జన్మతో, నూతన దేహమును ధరించిన ప్రాణి, తన పూర్వ జన్మ (ల) వృత్తాంతం మరచిపోవడం ఘోర మని పిస్తుంది. కాని, ఆలాంటి మరుపు చే పూర్వ జీవన సంబంధ బాంధవ్య పరంపరలు మభ్య పెట్టకున్న, జీవితాలు నరక యాతన సదృశమై, పరస్పర విద్వేషాగ్ని జ్వాలల్లో, లోకమొక భీకర కదనరంగముగా రూపొందక మానదని ఊహింపఁదగును. మచ్చున కప్పుడప్పుడు అసాధారణంగా, పూర్వ జన్మ స్మృతులఁ బడసిన కొందరి జీవిత గాథలు మనము చూస్తూన్నాము గదా! ఇక వారు, పూర్వ జన్మ స్మృతుల సంబంధ బాంధవ్య (విరోధ విద్వేష) ఆది, ఆవేశములతో లోక క్రీడారంగమున ప్రవేశిస్తే, ఎంత గగ్గోలు, అలజడి, అశాంతి, తారుమారు. విపరీత విషాద పరిమాణాలు రేకెత్త గలవో విజ్ఞులు వూహింపఁదగును!!

ఎందరో, జీవితంలో చిత్రహింసలు – కష్ట నష్ట అవమానాదుల సహించి అనుభవింపఁజాలక, తమ జీవితములకు తెఱవెయ్యమని భగవంతుని వేడుకొంటారు, మృత్యువును ఆహ్వానిస్తారు. నానా తరహాలుగా ఆత్మ హత్యలకు గురి అవుతారు. వీరి భవిష్య గాథలు "పునర్జన్మ" వ్యాసంలో విశదముగ వ్రాయఁబడినది.

"పునర్జన్మ" అనగా, యీ లోకం లోనే జన్మించాలని లేదు. వేరు లోకాల్లో కూడా మన వచ్చును. భగవత్సృష్టిలో జీవ కోట్లు అనంతము. జీవ సంఖ్యకు పరిమితి లేదు. అంతరిక్షమున అనంతకోటి బ్రహ్మాండములు, రస బుడ్ల వలె, నిరాధారముగా, మంత్రముగ్ధముగా (ఈ భూమి కన్నా ఎన్నో వేల రెట్లు పెద్దవి కూడా) నిల్చున్నవి కదా! భగవంతుడెంత గొప్ప వాడు? ఇక మానవుడెంత? అహంకార పరమాణు క్రిమి కన్నా మిన్నయా? జై భగవాన్.

దేహ త్యాగానంతరం, ఏముంది? ఏమౌతుంది? ఎవ్వరు చూచారు? ఏమని చెప్ప గలరు? అన్నీ సందేహాలే కదా! నిజా నిజాలు సర్వ సందిగ్ధం.

కాని, ఒక్క మాట మాత్రం నిజం. మృత్యువు యవనిక మాత్రం. తుది కాదు. మన ఉనికి – నామ రూపాలు మార వచ్చు. దిశలనంతం. - - - మృత్యువు మార్పు చేకూర్చునే గాని, ముగింపు లేదు. అస్తిత్వం వుంది, జీవుడు చిరంజీవి. జీవిత ప్రవంతి ఆద్యంత మెరుగనది. నడిమి మాత్రం కలది. కర్మ ఫల పరంపరలకు ఆద్యంతము లేదు!!

మరణకాలమున దేహము నుండి వెలువరింపఁబడిన "విముక్తాత్మ" సూక్ష్మ తేజోరూపమును (Bright and shining vapour form) పొంది, అనగా దేహ సంబంధమైన వికారము – మలిన సంస్కారములు – లేక, కాంతివంతమైన దివ్య తేజోరూపమున (మెరయు నీటి ఆవిరి వలె) బయట నిల్చి తానంతవరకు ధరించి, (పాము కుబుసము వలె – కత్తి వర వలె – కోటు వలె) అప్పుడే వదలిన ఉపాధిని (దేహమును) దీనావస్థలో నేల కొరిగి యున్న దానిని తిలకించి సుదీర్ఘానుబంధ భ్రాంతితో వ్యథ జెందుతూ; అందరి వలె తాను కూడా దుఃఖించును. స్థిర నివాసాను భవ బంధ విచ్ఛేధంతో, దుఃఖియై నిర్వాసి – అగతికుడుగ, వాపోవును. తాత్కాలిక పశ్చాతాప వైరాగ్యములు గోచరించి, తిరిగి అందు ప్రవేశించి మన యియ్య కొనడు. వమనము నెవ్వడు తిరిగి మ్రింగ జూచును? జీవికి, ఈలాగు దేహమును విసర్జించడం మొదలు కాదు, కడపటను కాదు. లక్షలాది జన్మ పరంపరలలో, నానా రకాల దేహములను, విడనాడి యుగ యుగాలుగా జీవుడు జీర్ణ మాలిన్య (విసర్జిత కంకాళములను) – శవములను చూచి దుఃఖించి యుండుట తథ్యము. కాని, జగత్పిత తన బిడ్డలకై "నూతన వస్త్రములను" – వారి వారి అంత్య కోర్కెల ననుసరించి ప్రసాదింప సిద్ధముగా నున్న, దివ్య రహస్యము నెఱుంగక పోవడమే దుఃఖ కారణము కావచ్చు.

కావున, "పునర్జన్మ" అనగా నూతన వస్త్ర ధారణ క్రియ లాంటిదే! ఒకడు ఒక శరీరమును విడచి, మరొక నూతన దేహమును పొందునప్పుడు, కొన్ని ప్రత్యేక భావములను – సంస్కారములను (పాతవాసనలను), తన సూక్ష్మ (లింగ) శరీరము నందుంచు కొని ప్రయాణమొనర్చును. అవే ప్రపంచమున "శుభా శుభ" అనుబంధ సంబంధములను, తదనుగుణ జీవిత విధాన సరళిని రూపొందించును. కావున, యీ విధానము, వారి వారి భావనా పరిపాకము యొక్క ఫలితమే గాని, వేరు గాదు.

"చేసు కొన్నంత వారికి చేసుకొన్నంత మహదేవా" --- లోకోక్తి.

వ్రాత వెంటగాని వర మీడు దైవంబు
చేత కొలదిగాని వ్రాతఁ గాదు!
వ్రాత కజుడు కర్త – చేతకుఁదాకర్త ||విశ్వ||

--- వేమన

"సంప్రాప్తే సన్నిహితే కాలే, నహి నహి రక్షతి డుకృఞ్ కరణే"

తా|| మరణ సమయ మాసన్నమై నపుడు ఈ వ్యాకరణ సూత్రాలు నిన్ను రక్షించవు గాక, రక్షించవు.

-- భజగోవిందము. శ్లో. 1. శ్రీ ఆది శంకరాచార్య

"మహిష గళ ఘంటారవము ---- మృత్యు సాన్నిధ్య సూచన - - - పిల్లిని చూచిన ఎలుక వలె, జీవుని భయోత్పాత మౌఢ్య మావహించును.

మరణానంతరము - - -

9 నుండి 13 లోకముల నుండి "అతి వాహిక" (దేవ దూత – Angel – Escort or Guide) జీవుని సహాయార్థమై వచ్చును. "పథము – పాంథుడు" – మొదటిది జడము. రెండవది అజ్ఞానము తో కూడి నందున, మార్గదర్శి (దూత) సాయము లేకున్న జీవుడు గమ్య స్థానము చేరు కోవడం దుస్తరమగును. అదే "అతివాహిక" (Divine guide) లేక, దేవ దూత ఆగమన కారణంః (ఇదే ఆత్మ గమనం)

మరణ కాలమున జీవుడు భయపడి నంత ప్రమాద ప్రమేయము లెవ్వియు లేవు. ఆత్మ పరమాత్మల కవినాభావ సంబంధమున్నది గదా! విముక్తాత్మ అక్షరాలా పరమాత్మాంశే. అనుభవానందము లందు సమానమే కాని, స్వేచ్ఛానుగ్రహ నిగ్రహాదులు –ఉండ వచ్చును, లేకను పోవచ్చును. కాని, సృష్టి స్థితి లయ కారకత్వ సామర్థ్యం ఆత్మకు లేదు.

శ్లో|| ఆబ్రహ్మభువనా ల్లోకాః పునరావర్తినోఽర్జున
మా ముపేత్యుతు కౌంతేయ పునర్జన్మ న విద్యతే

తా|| నన్ను పొందక యేయేలోకములకు పోయినను, ఆలోకముల లోక పాలురు, లోకములలో నుండు వారలు అందఱు మరల పుట్టువారలే. నన్ను పొందిన వారికి మాత్రమే జన్మ కలుగదు.

--- భగవద్గీత. అ. 8. శ్లో. 16.

జన్మ రాహిత్యం – మోక్షం మాత్రం తథ్యం"

--- బ్రహ్మ సూత్రములు. అ. IV. భా. IV.

పునర్జన్మ, కర్మల ఫలాఫల భోక్తృత్వం సమయకనే గతించిన వారికి, మరొక జన్మ (దేహధారణం) తప్పదు. పునర్జన్మ కిదే బీజము.

కర్మ ఫలాపేక్ష ⟶ పునర్జన్మ హేతువు –

కర్మ ఫల త్యాగము ⟶ మోక్ష ప్రదాయకం –

కావున, కర్మ ఫల త్యాగమే నిజమైన సన్యాసము. జీవుని ప్రవృత్తి బంధము నుండి రక్షించి నిర్మలినాత్ముని జేయు చున్నది. కాని, పూర్తిగా (కర్మలు) కర్మాచరణ మానడానికి మానవులు జడములు కాదు. కారాదు.

త్రివిధ శరీరములుః -

స్థూల - పాంచ భౌతిక – దృశ్య –విశ్వసంబంధమైన – జాగ్రద వస్థ –విశ్వ సంజ్ఞ – అన్న మయ కోశం – స్థూల శరీరం.

సూక్ష్మ - లింగ శరీరము –స్వప్నా వస్థ - తైజససంజ్ఞ } ప్రాణమయ, మనోమయ విజ్ఞానమయ కోశములు

కారణ - ఆత్మ చైతన్యము - ప్రాజ్ఞుడు – సుషుప్తి } కారణ శరీరము ఆనందమయ కోశము

అతి క్రాంతంబైన సద్వస్తువే - అనగా ఆత్మ సాక్షాత్కారమైన – అపరోక్షాను భూతి నందిన ధన్యుడు "అతివాది" అనఁబడును. బ్రహ్మము దశ దిశాత్మకంబు. శ్రద్ధా భక్తుల తోమనన మోనర్చుటయే "నిష్ఠ – తపస్సు – బ్రహ్మ ధ్యానము". తత్ఫలానుభూతియే బ్రాహ్మీ స్థితి అనఁబడును.

ఈశ్వర దత్తమైన మనస్సు యొక్క వివిధరూపములే "అంతఃకరణ చతుష్టయము" – చతుర్ముఖ బ్రహ్మ – సృష్టి కర్త – సంకల్ప స్వరూపుడు – సంకల్ప కారకుఁడుః

అంతఃకరణ చతుష్టయముః-

చిత్తము -- వృత్తుల రూపమున చలించును.

బుద్ధి -- నిశ్చయించి, నిలకడగా నిల్చునప్పుడు "స్థిరత"

మనస్సు -- సంకల్ప వికల్పాత్మకము – ఆలోచించుట – సంశయించుట.

అహంకారము – "నేను – నాది" అను స్ఫురణయే - -

మనస్సు – చతుర్ముఖుడు – ఇంద్రియాధినాథుడు – xxx వ తత్వము – ఇంద్రుడు.

జ్ఞాన దేవులు –జ్ఞానేశ్వరిలో

"శైశవ్ మే హీ సర్వజ్ఞతా బరతీ హై ఉన్హే|
సకల శాస్త్ర స్వయంహీ – ముఖ సే నికలే ||

-- ( అభంగం )

పూర్వ జన్మ లోని అలవాట్లు (సంస్కారములు) వానిని ఈడ్చు చుండును. కాని, అన్నీ సాధించి జయించి, చరితాత్ముడైన వాని మనస్సు విషయోప భోగముల దెస పోనే పోదు. మోహమన్న యెరుగడు.

"శుభకారీ కభీ కోయీ
పాతా కు గతి కోనహీ" ||

శుభ పథగామి శ్రమ వృథా కానేరదు, ఈ శ్రద్ధ చివర బోధ యైనది. అసంపూర్ణ మైనది సంపూర్ణమగును. ఈ భగవదుపదేశము జీవుల జీవితార్ధము సార్ధకమగు గాక!

-- కబీర్.

అసంఖ్యాక పూర్వ జన్మములందలి సమస్త జ్ఞాన విజ్ఞాన భాండారము మరియు, కర్మ (పాప - పుణ్య – మిశ్రమానుభవాది) సంచయమున్ను, మూలాధార చక్రమున – గోప్యముగా, బ్యాంకు లాకర్ల లో వలె పదిలముగా దాచబడి "సీలు" వేయబడి వుండును. సర్వం కుండలనీ శక్తి (యోగ మాయ) స్వాధీనములో వుండును. ప్రాణాయామ యోగ పరులైన వారు ఈ కుండలినీ శక్తిని (బ్రహ్మ గ్రంధిని) (Serpent power) జయించి (భేధించి) బహు జన్మార్జిత అనంతాను భవ జ్ఞాన భాండారమును అకస్మాత్తుగా లభింపఁ చేసుకొందురు. తద్వాతు సప్త కమలముల నెరింగిన ఘనులకు అణిమాది అష్ట సిద్ధులు ప్రసాదింపఁ బడును. వారే యోగ రాజులు.

ఈ విధముగా లోకములో, దేహధారుల పూర్వ జన్మ శుభ సంస్కారముల ప్రభావ మహిమా విశేషమును, వారి ప్రవర్తనలో దేదీప్యమానముగ ప్రకటితమగుచుండును. అత్యద్భుత లీలా మానుష విగ్రహములు.

స్వాప్నికానుభవం వల్ల కూడా సాధకునికి తన పూర్వ జన్మానుభవ రహస్యములు ద్యోత మగు చుండును. ఇక, యోగులు – సిద్ధులు – మహాత్ముల మాట చెప్ప నక్కర లేదు.

రాజ యోగులకు మనోలయముతో అమనస్క స్థితి ప్రాప్తించి, సమస్త వాసనలు – గుణములు – వృత్తులు – మనస్సంబంధమైన వన్నియు, మనస్సుతో నే లయించి అస్తమించును. మనో నాశమే మోక్షము. ( మోహ నాశమే మోక్షము)

సంకల్పము (మనస్సు) తలయెత్తైనా, తిరిగి సర్వం ప్రాప్తించును, అది అణిగెనా, లయించునుః --- శ్రుతి.

మరణానంతరము జీవుని స్థితి ---

యోగులు తమ దివ్య దృష్టితో, మానవుడు చనిపోవునప్పుడు, అతని సూక్ష్మదేహము యొక్క "గమన" (నిష్క్రమణ) గతిని, - చూడ గలరు. ప్రాశ్చాత్య "హిప్నటిస్టులు" కూడా, తమ "మీడియమ్స్" ను, మెస్మరయిజ్, చేసి వారి ద్వారా, "జీవ" నిష్క్రమణాది వివరముల పరికించి, ప్రవచించినారు. ఈ అనుభవములు ఉభయత్రా పోల్చి చూచిన ఏక భావాన్ని సూచిస్తున్నాయి.

చని పోయిన 4 వ దినమున, జీవుడు తన స్థూల దేహమందుండగా చేసిన పాప పుణ్యములకు సంబంధించిన సుఖ దుఃఖము లననుభవించుటకై, పైకి లేచి పోవును. పాప పుణ్యా కర్మ ఫలానుభవానంతరము, పూర్వ జన్మ వాసనలతో, తిరిగి మరొక "అర్హమైన" – స్థూల దేహమును పొంది, యీ లోకమున వ్యవహరించును.

ఈలాగు, జనన మరణ చక్ర శృంఖల మీరీతిని జీవుడు ముక్తావస్థ నొందు వరకును, సాగుచునేయుండును.

"నాల్గవ జ్ఞాన భూమిక యందున్న యోగులు తమ యోగ సిద్ధుల, నపవ్యయము చేసినప్పుడు, ఖనిజ స్థితికి పతన మొంది, కష్టముతో, పరిణామ క్రమమున, వృక్షస్థితిని, తిర్యక్పశు పక్ష్యాది స్థితులను దాటి, మానవ జన్మకు వత్తురు. అట్టి పతన కారణము లేకున్న, అధోగతి నందనవసరమే లేదు. అజ్ఞానుల పాపఫలముల కన్న, జ్ఞానుల పాప ఫలము చాలారెట్లుగుట తథ్యము.

స్థూల దేహములందు, మానవ దేహమే ఉత్తమోత్తమమైనది. భగవత్ సాక్షాత్కార మందు అర్హత – సాధన శక్తి – మోక్ష ప్రాప్తి – జన్మరాహిత్యము – నంద గల వాడు మానవుడు ఒక్కడే!!

ఒక్కొక్క జీవునకు ఒక్కొక్క దేహములో "జ్ఞానము – సంకల్పము" – మొ|| నవి, అదృష్ట కర్మాను గుణంగా కల్గు చుండును. జీవులు వేరు వేరు కదా!!

పంచాగ్ని క్రియ పూర్వ గాథః-

పాపులు, దుష్కర్ములు కాని వారు, పుణ్య లోకము లందు – "కర్మ – భక్తి" పుణ్య ఫలానుభవానంతరం, తచ్ఛేషాను భవార్థమై భువికి, (సాధన రంగ – ధర్మ కర్మ క్షేత్రము) సూక్ష్మ జల (మంచు) బిందు రూపమున, (నీటి ఆవిరి లేక మంచు తెర) గగన మండలమునకు దిగజారి (త్రోయఁబడి) వాయు – ఆవిరి – మంచు లేక మేఘాకృతిని పొంది వర్షజలమున కలసి, భువిపై ప్రారబ్ధానుసారముగా ధాన్యాదులందు ప్రవేశించి, ప్రాణి కోట్ల కాహారమై, భుజించినట్టి దేహమున, క్రమముగా, సప్త ధాతు పరిణామము నొంది, తుది రూపమైన "వీర్యము" (శుక్లము)గ మారి, స్త్రీ పురుష సంపర్కమున, యోని (వైతరణీ) మార్గమున, స్త్రీ గర్భస్థ మై, పిండ రూపము దాల్చి, నవ మాసములు క్రమ వృద్ధి గాంచి తదుపరి, పచ్చిన దారినే, అనగా యోని మార్గమున, శిశు రూపమున – బయల్వెడలి – భూ పతనంబగును. దీనినే "జనన" మందురు!

దీనినే –సప్త నరకములు –అనగా – సప్త ధాతు పరిణామ మార్గమందురు. ఒక ధాతువు నుండి మరొక ధాతువుగా మారడమే – "ధాతు పరిణామ"ము.

భుజించిన ఆహరము – జీర్ణమై ప్రథమ దశగా – అనగా, రసమై –తర్వాత క్రమముగా, రసము రక్తమై, రక్తము మాంసమై, మాంసము, మేదస్సు గాను, మేదస్సు అస్థి గను, అస్థి మజ్జ (Bone Marrow) గాను, అందుండి శుక్ల ముత్పన్నమై తదుపరి, స్త్రీ సంపర్కానంతరం గర్భస్థమై "శుక్ల శోణిత" – పిండ మేర్పడి – శిశు రూపము దాల్చును.

II. పాఠాంతరముః-

జీవుడు పోయిన దారినే – పుణ్య పాప ఫల భోగానంతరం – శేష ఫల భోగార్థం తిరిగి దివి నుండి ⟶ భువికి తిరిగి వచ్చును.

మార్గ వివరము :-

దివి నుండి ⟶ చంద్ర మండలం ⟶ అకాశం ⟶ ◀◀ వాయువు⟶ పొగ (మంచు తెర) ⟶ మేఘం ⟶ వర్ష జలం ⟶ భూమి మీద "ధాన్యాదు లందు" "జీవ" ప్రవేశము జరుగును. ధాన్యాదు లందు కూడా "జీవాంశ" కలదు కదా! దాని మీద యీ "జీవము" ఆవహించును (Possession) – ie – Super imposed or Super Set – తదుపరి ధాన్యం ⟶ ఆహారం ⟶ వీర్యం (సప్త ధాతు పరిణామానంతరం) – తర్వాత గర్భస్థ శిశు రూప ధారణ (ఇదియే

కడపటి దశ) - - - -  ఇక జననం – మరణం -  - - - "అధి రోహణ – అవ రోహణలు" ( i.e. Ingress and Engress ) యథాతథంగా, సృష్టి క్రియ సాగి పోవు చుండును -

జగత్ప్రళయంతో "జీవ కోటి" (హిరణ్యా గర్భుడు అనగా సమిష్టి జీవులు) (తైజస) – పరమాత్మ యంద్యైక్యమగును – ఇదే జీవ బ్రహ్మైక్యము లేక మోక్ష మన వచ్చును. కాని, ఈ పరిస్థితి పునః సృష్టి వరకేః తిరిగి చర్విత చర్వణమే!! పునః విశ్వ నాటక రంగా రంభమగును.

'యద్భావో తద్భవతి" ( As is his will, so is his goal) – అంత్యకాలమున జీవుడెయ్యది కోరు కొనునో, తలంచి కాక్షించునో, మరణానంతరము పునర్జన్మ యందు – అదే ప్రాప్తించును. జీవుడు దేవుని వారసుడుః కల్పకము క్రిందనున్నాడు.

శ్లో|| "ప్రయాణ కాలే మనసాఽచలేన భక్త్యాయుక్తో యోగ బలేన చైవ
భ్రువోర్మ ధ్యే ప్రాణ మావేశ్యసమ్యక్ స తం పరం పురుషము పైతి దివ్యమ్"

తా|| భక్తి, యోగము, చలించని మనస్సు, ఈ మూడింటి సహాయముతో నన్ను స్మరించిన వాడు ప్రయాణ కాలమున ముక్తి నొందును. నన్నే చేరగలడు.

-- భగవద్గీత. అ. 8. శ్లో. 10.

"భక్తి – యోగము – అమనస్కసిద్ధి (రాజ యోగము) – చలించని మనస్సు తో భగవంతుని ధ్యానించువాడు (మరణ కాలమున) – ముక్తి నొందును"

శ్లో|| అంతకాలే చ మా మేవ స్మరన్ముక్త్వా కళేబరమ్
యః ప్రయాతి సమద్భావం యాతి నా స్త్యత్ర సంశయః

తా|| ఎవడు మరణ కాలమున నన్నే చింతింపుచు దేహమును వదలునో వాడు నన్నే పొందును సంశయము లేదు.

-- భగవద్గీత. అ. 8. శ్లో. 5.
-- చాందోగ్య. భా. 3. ఖం. 18. సూ. 7-8.
-- శ్రుతి.

మరణ కాలమున నన్నే స్మరించుచు ఎవ్వడు దేహమును వదలునో, వాడు నన్నే పొందును.

శ్లో|| యం యం వాపి స్మరన్ భావం త్యజ త్యంతే కళేబరమ్
తం తమేవైతి కౌంతేయ సదా తద్భావభావితః”

తా|| మరణ కాలమునం దెట్టి భావన గలిగిన, దాని కనుకూలమగు జన్మము నే మరల జీవి ధరించును.

-- భగవద్గీత. అ. 8. శ్లో. 6.

మరణ కాలమునందెట్టి భావము ను కల్గియుండునో, దాని కనుగుణ్యామగు జన్మమును మరల జీవి ధరించును.

“యద్భావో తద్భవతి”

“As is his will, so is the goal”

-- బ్రహ్మ సూత్రములు. అ. 4. సూ.14.

మరణ కాల సంకల్పము, ప్రాణ వాయువు తేజస్సు, అనగా ఉదానముతో కూడి కోర్కె గల గమ్యము చేర్చును.

-- ప్రశ్నోపనిషత్. భా. II. సూ. 10.

III. వ పాఠానంతరము --

త్రిగుణ ఆహార సేవన రహస్యముః -

“ జీవుడు” (లింగ శరీరము) – జల బిందు రూపమున లేక మంచు తెర రూపమున . . . ఫల దాన్యాదులందు లయించి, సత్వ – రజ – స్తమో గుణ, మరియు మిశ్రమ గుణ ప్రధానముగా, తదను గుణముగనే రూపొందును. అందు వల్లనే సాధకులు – బ్రహ్మచారులు – యోగులు – ఋషులు . . . . . సాత్వికాహార ప్రియులుగ వెలసిరి, ఏ ఏ గుణాహారము, ఆయా గుణ ప్రభావమును – స్థూలముగను – సూక్ష్మముగను – భోక్త మీద ప్రతి ఫలింప చేయును. ఇదే ఆహార ప్రభావ రహస్య విచారము.

ఉ|| ఉల్లి –వెల్లుల్లి – మిరప మొ|| నవి రజో గుణ ప్రధానము లనియు – ప్రాణుల చే భుజింప బడి, క్రమముగా సప్త ధాతు (సప్త నరక) పరిణామ మంది, . . . . అన్నము → రసముగను, రసము → రక్త → మాంస → మేధస్సు → అస్థి → మజ్జ (Bone Marrow) → వీర్యం(శుక్లము) గా మారి, సంభోగానంతరము యోని మార్గమున, గర్భముఁజొచ్చి గర్భధారణము జరుగునుః లేదా, వెలికి త్రోయంబడి, పునరా వృత్తి పథమున, తిరిగి ధాన్యంబుల జొచ్చి, సప్త

ధాతు పరిణామమున (సప్త నరకములను) అనుభవించి - - - సప్త ధాతు పరిణామ చక్రభ్రమణమునఁబడి, ఆద్యంత మెఱుంగని చర్విత చర్వణముగ - - - గర్భధారణము వరకు ఈ పరిభ్రమణము తప్పదు. ఇక వేరు గతి లేదు. ఈ నరక యాతనల క్రూర శిక్షానుభవము జీవుడనుభవించును. ( -- గర్భోపనిషత్ ).

క్లుప్తముగా :- ( సారాంశము )

ధాన్య గత జీవాంశ ⟶ ఆహర రూపమున, భోక్త జఠరాగ్ని చే తప్తమై (తొలి ఆహుతి) ⟶ అన్న రసముగ మారి నానా గ్రంధుల రస వాహినులతో గలసి పక్వ పరిణామాదులవలన ⟶ రక్తం ⟶ అస్థి ⟶ మజ్జ ⟶ శుక్రం (వీర్యం) గా మారి, పంచాగ్ని కర్మ ఫలితంగా (స్త్రీ పురుష సంపర్కమున) ఆహుతిగా స్త్రీ యోని మార్గమున, గర్భస్థమై శోణితమున లీనమై – క్రమముగా 9 – 10 నెలల లో శిశు రూపమును దాల్చి ⟶ జనన ఘట్టమున ప్రవేశించును. ఇది సర్వానుభవము.

--- బ్రహ్మ సూత్రములు. అ. 3. భా. 1.

అనంత కోటి జీవ సృష్టి – చైతన్య ప్రసరణము. . . . . క్షణ క్షణమును, మట్టిలో, గాలిలో, నీటిలో, మురుగులో, చెమటలో, . . . . కోటాను కోట్లు జీవులుత్పన్నమై, నశిస్తూంటాయి, మరియు, మానవ దేహములోని, ప్రతి ధాతువునందును – సూక్ష్మాణువులందును (Cells) జీవ చైతన్యము ప్రకాశించును. జీవ కోట్లు అనంతము.

ఆలాగే, లతా – తరు – గుల్మాదులందు కూడా, వాటి ప్రతి సూక్ష్మ అణువు నందు కూడా చైతన్యముట్టి పడుచుండుట – సుస్పష్టముగ స్ఫురించును. దర్శనీయము కూడా.

-- Dr. J.C.Bose.

మరణ గ్రంధి (Death gland)

మెదడు నందమర్చబడనదని, అదునిక శాస్త్రజ్ఞులు అభిప్రాయ పడుతున్నారు. జీవన పరిమితి అంతమున, ఆ గ్రంధులు మరణప్రాప్తికి, దోహద మొసంగ ఉటంకించునని అంచనా? ఆ మరణ గ్రంధులను కని పెట్టి, అధీనములో నుంచు కొన్ననాడు, మానవుడు మృత్యుంజయుఁడగుట తథ్యము. (Indian

Express, D/ xxxxx ). ఆసన్న మరణ కాలమున, Time Bomb, వలె ఆ గ్రంధులు, (begin to operate), పెకలి, మృత్యువును ప్రసాదించును. భగవదిచ్ఛ.

మరణకాల ఘట్ట రహస్యముః- చిత్రగుప్తము. జన్మాంత్యదశయందు – మనఃఫలకము మీద (వూహా తెర) – నిష్క్రమించు జీవుని – పూర్వ జన్మ లందలి గాథలు - - జీవుడు దర్శించును.

చిత్రము 2 భాగములుగ నుండును.

a) అనంతమైన పూర్వ జన్మలందలి ముఖ్య ఘట్టములు – సంక్షిప్తముగ (క్లుప్తముగను) –

b) ప్రస్తుత జన్మయందలి ముఖ్య ఘట్టములు విపులముగను, మరియు

c) రానున్న (భవిష్యత్) ధరింపఁబోవు స్వరూప దర్శనము - - - ఎదుట కడపట నిల్చి – జీవుడు నిష్క్రమించును. ఇదే చిత్రగుప్త రహస్యము. గుప్తచిత్ర రహస్యము కూడా – యీ లోకానికి "గుడ్ బై"!! యింక ఎవ్వరితోను ఏ పనిన్ని లేదు? పురోగమ దృష్టే! పై చూపే, మన లోకం చూపు లేదంటారు. నిజమే కదా!!

ఈషణ త్రయం – ధనేషణ, దారేషణ, పుత్రేషణ - (ధనము, భార్య, పుత్రులపై వ్యామోహము) ఇదే *ఈషణ త్రయం*. ఇదే మనుష్యునికి బంధనం.

శ్లో|| సత్యం మాతా పితా జ్ఞానం, ధర్మో భ్రాతా దయా సఖా
శాంతిః పత్నీ క్షమా పుత్రః, షడేతే మమ బాంధవాః

తా|| సత్యమే తల్లి, జ్ఞానమే తండ్రి, ధర్మమే సోదరుడు, దయయే మిత్రుడు, శాంతమే భార్య, క్షమయే పుత్రుడు. ఈ ఆరుగురు నా ఆప్త భంధువులు. ఈ విషయాన్ని తెలిసికొని ఆచరిస్తే , ఈ ప్రపంచములో దుఃఖమనేదే లేదు.

--- హితోక్తులు (శివ షడక్షరీ స్తుతి)

చిత్రగుప్త రహస్యము ;- (వివరణము),

చిత్రగుప్తము -- గుప్త చిత్రము

జీవిత (మజిలీ) తుది ఘట్ట రహస్యమిది. యీ క్రమ విధాన మీ రీతి నుండును :- ఇంద్రియములు (స్థూల – సూక్ష్మ) క్రమముగా మనస్సున లయించును. మనస్సు పూర్తిగా (స్వప్నము నందు వలె) అంతర్ముఖమగును. అనగా బాహ్య ప్రజ్ఞ శూన్యము. దృఢ చిత్తము (చాంచల్య రహిత మనస్సు) – మనఃఫలకము (అంతః) మీద కేంద్రీ కృత మగును. సర్వేంద్రియములు "జడ" గోళకములుగ (defunct) అగును. మనస్సు

పరిపూర్ణ ఏకాగ్రతతో (అంతర్ముఖమై), ఆ సన్న మృత్యు జీవి, తన పూర్వ జన్మల గాథా చిత్ర పరంపరలను, క్రమముగా – క్లుప్తముగా, (సంక్షిప్తముగా) – ప్రత్యేక (విశేష) ఘట్టములను మాత్రము, చూచును. మరియు, ప్రస్తుత జీవిత గాథ – పటము – విపులముగా ప్రదర్శితమగును. జీవుడు ద్రష్ట – ప్రత్యగాత్మ సర్వసాక్షి; జీవ నిష్క్రమణకు ముందు తెర మీద (శుభం – నమస్తే లకు మారుగా) – ముందు రానున్న "జన్మ రూపము" (తీర్పు) రూప ఫలితముగా నిలిచి పోవును: న్యాయ మూర్తి సమక్షమున ధర్మ స్థానంలో, నేరస్థుడు, స్థబ్ధుడై, నిస్సహాయ స్థితిని, తీర్పు విని జీవుడు నిష్క్రమించునట్లు, దేహమును వీడును. ఇది సామాన్య పద్ధతి – ఆకస్మిక – హఠాన్మరణములందీ క్రమ విధానమున కవకాశము లేదు గదా!

శ్లో|| అంతకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కళేబరమ్
యః ప్రయాతి సమద్భావం యాతి నా స్త్యత్ర సంశయః

తా|| ఎవడు మరణ కాలమున నన్నే చింతింపుచు దేహమును వదలునో వాడు నన్నే పొందును సంశయము లేదు.

-- భగవద్గీత. అ. 8. శ్లో. 5.

అంత్య కోర్కెలను భగవానుడు మన్నించి, ప్రసాదింతునని ప్రమాణము చేసినాడు కదా! అడుగకున్న తప్పెవరిది? అలవాటు – చిర తరాభ్యాసము, అంత్యకాల సంకల్పానికి, దోహద మివ్వగలదు. "యద్భావో తద్భవతి"

ఇక, సర్వం యీశ్వరేచ్ఛ!! ఈశ్వర విలాసమే శరణ్యము!!

బండ లోపలి మండూకమున కెవ్వ డాహార మిచ్చే? అడవులందు మిన్నందు వృక్షలతల కెవ్వడు నీరంబు లిచ్చె? గర్భస్థ శిశు పోషణ పెంపకమ్, ప్రసవక్రియ లెవరివి? జనియించినంతనే, జనని పుత్తిళ్ళలో క్షీర మెవ్వడు ప్రసాదించె?

ప్రతి ప్రాణికి (జీవునకు) జన్మించు సమయమున - పూర్వ పుణ్య పాప కర్మ ఫలానుసారంగా, పూరి గుడిసెల్లో మొదలు మహారాజ ప్రాసాదాల్లో వరకు – తగు ఆహ్వాన – సన్మాన – పరిచర్యాది రక్షణలు కల్పింప బడ్డం ఎవరివల్ల? నిద్ర మెలుకవలు ఎవరి క్రియలు? దేహమందలి సర్వధాతువులందలి అణువులు (Cells, కణములు) పరిణామాదులు ఎవ్వరి సంకల్పానుగ్రహముల వల్ల జరుగు చున్నవి?

జాగ్రత్త! భగవంతుడెంత దయామయుడో అంతటి నియంత, చండ శాసనుడు.

సామాన్యముగా – సద్గురు దేవులు – తమ అత్యంత ప్రియాతి ప్రియ శిష్యులకు తమ అవసానదశయందు, అంత్యోపదేశముగ, భోధించ అనుభవాదేశమును అనుగ్రహింతురు. పరమ రహస్యమిది.

అభిరామునకు -- వేమన గురువు,
గాంధీజీకి -- తిలక్ మహరాజ్
వివేకానందునకు -- రామకృష్ణ,
మెహర్ బాబాకు -- బాబాజాన్, ఉపాసినీ బాబా

పాఠాంతరం –

మరణ కాలంలో, తొలుత ఇంద్రియములతో కూడా వాక్కు, మనస్సు లోను, మనస్సు ప్రాణములోను, ప్రాణం జీవాత్మ లోను, సర్వం అనగా జీవాత్మ ప్రత్యగాత్మ లోను ఐక్యమగును, ఈ అంతర్యామి, సర్వంతర్యామియైన సర్వవ్యాపక – సర్వాత్మక – సర్వాంతర్యామి - - - అద్వితీయ, అఖండ, అనంత, అవిచ్ఛిన్న, నిత్య, నిర్మల, నిర్వికార, నిరంజన సచ్చిదానంద స్వరూపమున లయము – సర్వం "నేనే"

అనగా – (పాఠానంతరం) :- మరణా నంతరం జీవుడు

సూక్ష్మ పంచ భూతములు
+ ఇంద్రియములు – (సూక్ష్మ).
+ మనస్సు + ప్రాణములుతో
} లింగ శరీరము తో

అనగా కర్మ, భక్తి, జ్ఞాన, యోగ తత్పరులు మాత్రం (బ్రహ్మ జ్ఞానము – ఆత్మానుభూతి లేని వారు) - చంద్ర లోకమున కేగి, అచ్చట దివ్యులను సేవించి, వారి వారి పుణ్య ఫలములను, ఇతర లోకములందు అనుభవింతురు. మిగిలిన "శేషానుభవము" నకై భువికి వత్తురు. ఇదే పునర్జన్మ అని గ్రహింప నగును. పూర్వ జన్మ ఫలానుభవమే పునర్జన్మకు బీజము.

కాని, పాపులు? యమలోకమున కష్టములనుభవించి – చంద్రలోకమున కేగి "తిరిగి – తిరిగి" – చర్విత చర్వణముగ, జనన మరణ చక్ర భ్రమణ గతమై – రౌరవాది నరకముల ననుభవిస్తూ (సప్త ధాతు పరిణామాది ఘోర హింసలకు గురియై) - - సుదీర్ఘ నరక బాధల ననుభవింతురు.

శ్లో|| శరీరం య దవా ప్నోతి యచ్చా ప్యుత్క్రామ తీశ్వరః
గృహీ త్వైతాని సంయా తి వాయుర్గంధా నివాశయాత్

తా|| వాయువు పుష్పముల నుండి సూక్ష్మాంకురములగు సువాసనలను ఎంత దూరమున కైనను తీసి కొని పోవునట్లు దేహమున ప్రవేశించునపుడు సూక్ష్మ శరీరముతో ప్రవేశించును. దేహమును వదలి పోవు నపుడు సూక్ష్మ దేహమును లాగు కొని పోవును. ఈ సూక్ష్మ శరీరము కన్పడదు. శుభా శుభ కార్యముల యొక్క సూక్ష్మాంశము లు గలది యగును. ఇది నశించిన గాని ముక్తి లేదు.

--- భగవద్గీత. అ. 15. శ్లో. 8.

గీ|| ఆత్మ ఏ శరీరమందుండి వెడలునో,
వెడలి యెందు దాబ్రవేశమగునో,
యచటి కెల్ల నింద్రియాదులఁగొని పోవు
వాసనలను గంధ వహుఁడు వోలె||

భిన్నత్వములు ఏకంగా అభిన్నత్వంలో లయ మొందునట్లు – నానా విధములైన పుష్ప జాత మందలి మకరందము తేనె పొరలో కలసి పోవునట్లు సమస్త నదులు సాగరంలో కలిసి తమ వ్యక్తిత్వాన్ని అందులో నశింపఁ జేయునట్లు – వివిధ పుష్ప సౌరభములు విశ్వ వ్యాపియైన గంధవహునిలో లయమగు నట్లు – జీవాత్మ లన్నీ పరమాత్మ అనంతత్వంలో లయించునట్లు -

కాని, జీవులు మాత్రం (వాసనామయ లింగ శరీరములు) తమ తమ వ్యక్తిత్వమును గోల్పోవు!!

--- చాందోగ్య

జనన – మరణ – పునర్జన్మలకు, కోర్టు విచారణలు – వాద ప్రతి వాదములు – సిఫార్సులు – అంతస్థులు – దయా దాక్షిణ్యాది ప్రక్క (దొడ్డి) దారులు ఏమిన్ని లేవు. భగవంతుడెంత దయామయుడో – కరుణా సాగరుడో, అంత నిష్కర్ష నియంత కూడా!!

భగవదిచ్ఛ – ఈశ్వర నియామకం – అంతః సాక్షికి సాక్ష్యమెందుకో? అంతర్యామికి తెలియని – అంతరంగమున లేని దెద్ది? ధర్మ కర్మ క్షేత్రమీ దేహం! దేవాలయమున జీవ దేవుడుండ, అతడే సర్వ సంరక్షకుడు – సర్వ సాక్షి –

సర్వేశ్వరుడు – సర్వ దాత –కల్పకము – కామధేనువు –

--- శ్రుతి

మానవుఁడు మృత్యుంజయ జప మొనర్చి, మృత్యుంజయుడే కావాలి!!

అమరులు కూడా అమృతము త్రాగి అమర (అమృత) దేహులైనారు. కాని, వారున్ను దేహ ధారులే కదా!! - విదేహులు కావాలి! అమృత దేహులగుట కన్నా, అమృత స్వరూపులు – అమృత మయులై – అనంత – ఆద్యంత రహిత అమృత వాహిని లో లయించి “సచ్చిదానంద” చిన్మయులవుటెంత శుభ దాయకము!!

-- అమృత బిందూపనిషత్.

# 8 పునర్జన్మ

## --- మున్నుడి ---

లింగ శరీరము ("అంగుష్ట ప్రమాణః పురుషః" - కఠం)

అనంత పూర్వజన్మల సంస్కారముల కుప్ప -17 లేక 19 తత్వ్యముల తోటిది

"లింగ శరీరం భంగం కావాలి" – ఇదే గ్రంధి మోచనం ---అద్వైతమతని నాదము మనో

(సంకల్ప – వికల్ప) మాలిన్యమే జీవత్వ్యము –

సంకల్పమే - బంధము – జన్మ కారణము

నిస్సంకల్పమే – మోక్షము – జన్మ రాహిత్య కారణం.

## పునర్జన్మ

పునర్జన్మ (Rebirth) జీవునకు పునరావాసము వంటిది. దేహ వినుర్ముక్త జీవులు (Liberated souls) చిరంజీవులని నిరూపించడముతో, అనగా పునర్జన్మ సిద్ధాంత సాధనతో, పరమ దుఃఖితులై, మ్రాన్పడి, కుమిలి, కృశించు ప్రియ బంధు మిత్ర జనాళికి అమృత సేచనమై, ఆనంద దాయకమై, ఓదార్పు – తృప్తి – శాంతి చేకూర్చడం సాధ్యమౌతుంది.

"మరణానంతర జీవుల" జీవిత గాధ (Life after Death & Life beyond Death) లనంతము – అత్యద్భుతము – అగణితము – అనూనము; సూక్ష్మ జీవులు తమ ఉనికిని నానా తరహాలుగా, పూనకము, అదృశ్యచేతలు, చిత్ర కల్పనల ద్వారా ప్రదర్శించడం, సర్వానుభవము. వీటికి పరిశోధనల ద్వారా శాస్త్రీయ విశ్వాస నిరూపణలను కల్పించడమే విజ్ఞుల పరమావధి.

స్థూల దేహ విసర్జనానంతరం, సూక్ష్మ దేహము, పూర్వ ప్రజ్ఞ ప్రతీకాదులతో, తన వ్యక్తిత్వాన్ని కోల్పోక, మనడ మన్న యనుభవం, వియోగ దుఃఖ సాగరమున క్రుంగి పోవు ప్రియులకు – సన్నిహితుల కెంతో ఆప్యాయత, మన శ్శాంతి, తృప్తి ని చేకూర్చడం సహజం. ప్రియ ప్రేమ జీవులు పరలోకాల్లో పునః కలిసికొని, సంతోషంగా, సహ జీవనం చెయ్యడం సూక్ష్మ జీవుల సందేశతరంగముల ద్వారా రూఢియై, విశ్వసనీయంగా ఆమోదింపఁబడి, పాశ్చాత్య ప్రఖ్యాత "స్పిరిచుయలిస్టు" లు ధృవ పరచడం సంతోష దాయకం. వారు "సియాన్స్" – ద్వారా Spirits (దయ్యముల)ను ఆకర్షించి, ప్రశ్నోత్తరముల ద్వార, సూక్ష్మ జీవుల ఆవాస – వివరముల రాబట్టుదురు.

మరణ మన్న పూర్ణాహుతి –బలి – సర్వనాశనము" – కాదనియు, కేవలం పునరావాస తుల్యమనియు, - వలస, పునరుజ్జీవనము మాత్రమేనని గ్రహించిన, దుఃఖము చాల వరకు ఉపశమించి, దుఃఖితులు, శాంతి నొందుట తథ్యము.

విగత దేహుడైన జీవుడు, మరణానంతరము, సూక్ష్మ దివ్య దేహమున, స్థూల దేహ రుగ్మతల'బాసి, తేజోమయముగ విలసిల్లు నట్లు, దివ్య దృష్టి తో వీక్షించగల మహానుభావులు, ఉపనిషద్ద్రష్టలు, ప్రవచించిన ప్రమాణములు గలవు.

ఇది కేవలం విశ్వాసమైనంత మాత్రమున మానవులకు దుఃఖరాహిత్యము – శాంతి చేకూర జాలవు. వేయి ప్రవచనములకన్న ఒక్క అనుభూతి లెస్స. ప్రత్యక్ష ప్రమాణమే కావాలి!

భగవంతుని అనంత సృష్టి చిత్రణంలో, “మానవు” డొక్క దివ్య చేత. భగవంతుడు దయామయుడు – ప్రేమ సాగరుడు – కరుణామూర్తి; తన దివ్య రచనయైన “మానవులను” - - - తన చేతులారా, దయా విహీనంగా, కఠిన కర్కశ కసాయి వలె, సర్వ నాశన కాండకు పూను కొనునన్న ఏలా నమ్మి భరించడం? కావున, ఇందేదో దివ్య రహస్య – పరమ గుహ్యం, తప్పక అంతర్భూతమై వుండాలని బుద్ధి మంతులూహించక తప్పదు.

పశ్చాత్తాప తప్తులైన మానవుల పాపములను మన్నించి, వారి పుణ్యములను మాత్రము అక్షయ మొనర్చి భగవంతుడు ప్రాణులను రక్షించి అభయమొసంగు ననెడి అశావాదుల సిద్ధాంతము, నిరాశా, నిర్వేద బాధితుల కమృతోపమానమని వేరుగా చెప్ప నక్కర లేదు.

మానవుడెంత గొప్ప వాడైనను, అనంత సృష్టి లో అణు మాత్రుడే. మానవుని ఘన ప్రజ్ఞ అత్యల్పము. భగవంతుని 'సృష్టి – దృష్టి' లో కీటక ప్రాయము.

మానవుడెంత గొప్ప వాడైనను, సర్వార్పణ – సర్వాంకిత – శరణాగత పథము నాశ్రయించ కున్న సర్వనాశనం గాక తప్పదు. అహంకారమే జన్మ జరామృత్యు విష చక్ర భ్రమణ కారణము.

భక్తి, భగవంతుని జయించుటకు – స్వాధీన మొనర్చు కొనుటకు, పరమ మంత్రము. భక్తులలో “అనన్య భక్తి, పరాభక్తులు”, మణిమయ కిరీటములు. ద్వేష భక్తి అత్యంత దుర్లభతరమైనది కాని, సులభ సూక్ష్మ గమ్యము.

జీవుడు చిరంజీవి. పరాత్పరాంశగా పరిగణింపఁబడి, భగవంతుని “సృష్టి – స్థితి – లయ” జగన్నాటక రంగ సీమల పాత్రధారిగా రాణించి రంజించడ మొక మహాదాశీర్వాదంగా వున్నది.

“జీవుఁడు – బ్రహ్మ – ప్రకృతి” – యీ అనాది త్రయమును వేదము ఉపపాదించడం మరువ రాదు. కాని, మరణానంతరము జీవుడు (Individual Soul) – ఏంత కాలం? ఎక్కడ? ఏ రూపంతో? ఏ విధంగా? ఉండడమనే ప్రశ్నకు తృప్తి కరమైన జవాబులు, శాస్త్ర పరిశోధనలందుఁ గాన్పించడమే గాని, ప్రత్యక్షానుభవ

నిదర్శనముల కందడం లేదు. "పూనకం" ( Possession or Obsession) సందర్భాల్లో సేకరించిన విషయములు ఒకటితో నొకటి పొత్తు కుదరటం లెదు.

ఈ అదృశ్య సూక్ష్మ దేహుల రాజ్యంలో క్రమ బద్ధమైన జీవనము, దుష్ట శిక్షణ, శిష్ట రక్షణాది, ఆదర్శ విధానాలతో భగవంతు నేలా తృప్తి పరచి, ధన్యులు కావడం అనే ప్రశ్నలు ఆలాగే నిల్చి పోయాయి. పవిత్ర గ్రంధములు – ప్రవక్తల ప్రవచనములు – అవతార మూర్తుల సందేశములు – కూడా, యీలాంటి యక్ష ప్రశ్నలకు సరియైన సమాధానా లివ్వక పోవడం శోచనీయం.

మానవుడు ఎంత విజ్ఞాన వంతుడు – మేధావి –విచార పరుడు – అనుభవి – నానా పరిశోధనలఁగావించిన ఘనుడైనను, యీ దృశ్య ప్రపంచంగాక, ఇంకెన్నెన్ని సూక్ష్మ ప్రపంచములు గలవో వాటి రహస్యము లేమిటో – అచ్చటి వారి ఆచార వ్యవహారములు – ఆవాస, జీవన విధానము – దైనిక చర్యలు – సంకల్ప సాధనలు – ప్రగతి పురోగతులు ఏలా తెలిసి కోగలరు?.

భగవంతుని అనంత కోటి బ్రహ్మాండ నాయకత్వంలోని, ఆద్యంత రహిత లీలాతరంగిణి ఏలా ఊహించ గలము? ఇవన్నియు మానవ మేధ కందని దివ్య రహస్యములు గనె నిల్చి పోయాయి.

భౌతిక సాధనలతో, ప్రకృతి రహస్యములను మానవుడు, అదృష్ట వశాత్తు కనుక్కోగలుగు తున్నాడు. కాని, సూక్ష్మ ప్రపంచము లలో, ఆయా ప్రకృతి రహస్యములను, సూక్ష్మ దేహం తోనే పరిశోధనలు జరుపడం సులభసాధ్యమే నేమో ననిపిస్తుంది. ఎందుకన, స్థూల సాధన పరికరాల ప్రాపకం అత్యంత పరిమితమే కదా!!. దీనిని బట్టి, అంతరిక్షమున మంత్ర ముగ్ధముగా నిల్చి యున్న దివ్య లోక వాసులు మనకన్న అత్యధిక శక్తి సంపన్నులై యుండ వచ్చును.

లేదా, ఆ నక్షత్ర - గ్రహ – మండలములు కేవలం, అగ్ని గోళములు గనో లేక మంచు ముద్దలు గనో –చైతన్య విహీనమై – జడములుగనో ఉండ వచ్చును.

అనంత కోటి బ్రహ్మాండముల ఆంతర్య రహస్య విచార – వివరణలు అగమ్య గోచరములే!!

చంద్ర మండలము రెండవతూరి చేరుకొన్న గగనగాముల కచ్చట, పిడుగు పాటున – బ్రహ్మాండమైన శబ్దములను వినిపించడం – ఆ ధ్వనుల దద్దరింపులు

భూలోక వాసులు (Earth Contact Control) శాస్త్రవేత్తలు విని, విస్తు పోయి వాటి ఆంతర్యమును నాటికి, నేటికి గ్రహింపక, ఊహాకందనివి గనే గుర్తించారు.

"చంద్రమండలమవాప్నోతి - - - "

-- గీత

చంద్రమండలము సూక్ష్మ జీవులకు ఉనికిగా మన శాస్త్రములు పేర్కొన్నవి గదా!! ఉపనిషద్ద్రష్టకిదేమిన్ని ఆశ్చర్యముగానేరదు!! పితృయాన – దేవయాన ప్రశంసలందీ విచారము సుస్పష్టము!!

మరణ గ్రంధులు ( Death Glands) సహస్రార కమలమున (Brain) లో గలవని నవీన శాస్త్రజ్ఞులు కని పెట్టినారు. మరణ కాల మాసన్నమైన తరి, అవి సుషుప్తి నుండి మేల్కొని మరణ కారణ కార్యక్రమాన్ని సాగించుననిన్ని, వాటిని ముందు తొలగించుట వల్ల మానవుడు మృత్యువు వాత పడకుండా, అమృత స్వరూపుడగుట సాధ్యమని, నిపుణుల అంచనా!!

మానవుడెన్ని బృహత్సాధనలందుత్తీర్ణుడైనను, మృత్యుంజయుడగుటకు ఇంకా ఎంత కాలము పట్టునో?

పునర్జన్మ - కర్మ సిద్ధాంతము.

"జనన – మరణ" చక్ర భ్రమణ విధి విలాసమే పునర్జన్మ రహస్య కథనము. అవతారముల సమస్య కూడా దీని నాశ్రయించినదే! సూక్ష్మ జీవులు – భూత ప్రేత పిశాచాదుల ఉనికి, దయ్యముల బెడద, పూర్వ జన్మ స్మృతుల గాధలు మొ|| ప్రదర్శానాను భవములు - - - పునర్జన్మ సిద్ధాతము మీద ఆధార పడినవే.

శ్లో|| బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున
తా న్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరంతప

తా|| అర్జునా! మన యిర్వురకు అనేక జన్మములు గడచిపోయెను. నీ జన్మలు, నా జన్మలు నే నెఱుంగుదును. నీ వెఱుగవు.

" ఓ అర్జునా! మనమిది వర కెన్నో మార్లు జన్మించినాము"

-- భగవద్గీత. అ. 4. శ్లో. 5.

శ్లో|| జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ
తస్మా ద పరిహార్యేఽర్థే నత్వం శోచితు మర్హసి

తా|| పుట్టుట గిట్టుట, ఈ రెండును అనివార్యమగు విషయములు. ఈ అడ్డు పెట్ట లేని విషయముల గురించి శోకింప పనిలేదు.

"జనన మరణ ములు తో బుట్టువులు. ఒకటి వెంట నొకటి వచ్చుట తథ్యం"

-- భగవద్గీత. అ. 2. శ్లో. 27.

"జాతస్య మరణం ధ్రువం"

శ్లో|| యం యం వాపి స్మరన్ భావం త్యజ త్యంతే కళేబరమ్
తం తమేవైతి కౌంతేయ సదా తద్భావభావితః

తా|| మరణకాలమునం దెట్టి భావన గలిగిన, దానికనుకూలమగు జన్మము నే మరల జీవిధరించును.

"మరణ కాలము నందెట్టి భావము కల్గిన, దాని కణనుగుణముగు జన్మయే మరు జన్మమున ప్రాప్తించును.

-- భగవద్గీత. అ. 8. శ్లో. 6.

శ్లో|| మా ముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్
నాప్ను వంతి మహాత్మాన స్సంసిద్ధిం పరమాం గతాః

తా|| నన్ను పొందు మహాత్ము లుత్తమ గతిని పొందుదురు. అట్టి వారికి మరల జన్మము లేదు. జన్మయేగదా దుఃఖమునకు కారణము.

"నన్ను పొందు మహాత్ములుత్తమ గతిని పొందెదరు"

- భగవద్గీత. అ. 8. శ్లో. 15.

శ్లో|| ప్రయత్నా ద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః
అనేకజన్మ సంసిద్ధః తతో యాతి పరాంగతిమ్

తా|| పాపఫలము లనుభవించుటకు కొన్ని జన్మలు పట్టును. అట్టి పాపములన్నియు శమింపచేసుకొని, కోట్లకొలది జన్మములలో సంపాదింప బడిన

సంస్కార బలములచే కడపటి జన్మమున యోగియై (100 గుణములు సంపాదించినవాడై) ముక్తిని పొందు చున్నాడు.

> "పాపములనుభవించుటకు, కొన్ని జన్మములు పట్టును. అనేక జన్మములందలి సంస్కారములచే మోక్షము"
>
> -- భగవద్గీత. అ. 6. శ్లో. 45.

శ్లో|| పూర్వాభ్యాసేన తేనైవ హ్రీయతే హ్యవశో పిసః
జిజ్ఞాసురపి యోగస్య శబ్ద బ్రహ్మాతి వర్తతే

తా|| ఈ జన్మమున తన కిష్టము లేక పోయినను, పూర్వజన్మమున చేయబడిన కర్మబలముచే మనస్సు ఆ వైపునకే యీడ్చును. ఇంత యేల? యీ విషయము నందు తెలిసికొన యిచ్ఛగలవాడును క్రమముగా ముక్తి నొందును.

దేహ (భౌతిక) సంబంధ మైన విద్యలు దేహాంతమున (మరణము) నశించును. కాని, ఆత్మ (ఆధ్యాత్మిక) విద్య ఆత్మ వలెనే నశింపక జన్మ జన్మ కు అంటి పెట్టు కొనును.

స్వప్నావస్థలో ప్రతి యొక్కరి సంస్కారములు – పూర్వ జన్మ వాసనలు బయల్పడును. సూక్ష్మ దేహానుభవాలు --

> "పూర్వ జన్మములందలి అభ్యాసముల వల్ల - - - - - - "
>
> -- భగవద్గీత. అ. 6. శ్లో. 44.

ఈ జన్మమున నిర్గుణోపాసన – బ్రహ్మ సాక్షాత్కార మివ్వకున్న,

1. మరణ సమయమున గాని,
2. జన్మాంతమున గాని,
3. బ్రహ్మ లోకమున గాని – ఫల మిచ్చి మోక్ష మొసంగును.

-- వేదాంత పంచ దశి. (Stanzas 136-137)

శ్లో|| సర్వ భూతాని కౌంతేయ ప్రకృతిం యాంతి మామికామ్
కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజా మ్యహమ్

తా|| నేనే సర్వభూతములను వాని వాని కర్మానుసారముగా పుట్టించుచున్నాను. లయము చేయుచున్నాను, బ్రహ్మ నిమిత్తమాత్రుడే! జీవులస్వతంత్రములై భగవానుని యందున్నవి.

"కల్పాంతమున లయమై, కల్పారంభమున తిరిగి వాని వాని కర్మానుసారంగా పుట్టించు చున్నాను"

-- భగవద్గీత. అ. 9. శ్లో. 7.

కర్మకు నమస్కారము - - -

-- భర్తృహరి.

వ్రాత వెంట గాని వరమీడు దైవంబు,
చేత కొలదిగాని వ్రాత కాదు
వ్రాత కజుడు కర్త – చేతకుఁదా కర్త ||విశ్వ||

శ్లో|| యత్ర కాలే త్వనా వృత్తి మా వృత్తించైవ యోగినః
ప్రయతా యాంతి తం కాలం వక్ష్యామి భరతర్షభ

తా|| ఏ సమయంబున మరణించిన ముక్తియో, ఏ సమయమునందు మరణించిన మరల జన్మ వచ్చునో ఆ కాలమును చెప్పెదను.

"ఏ ఏ కాలమందు జన్మించిన పునర్జన్మ వచ్చును"

-- భగవద్గీత. అ. 8. శ్లో. 23.

శ్లో|| అగ్ని ర్జ్యోతి రహ శ్శుక్లః షణ్మాసా ఉత్తరాయణమ్
తత్ర ప్రయాతా గచ్ఛంతి బ్రహ్మబ్రహ్మవిదో జనాః

తా|| ఉత్తరాయణ పుణ్య కాలమునందును, శుక్ల పక్షము నందును, పగటి వేళను మరణించు బ్రహ్మ వేత్తలు బ్రహ్మమును చెందుచున్నారు.

-- భగవద్గీత. అ. 8. శ్లో. 24.

శ్లో|| ధూమో రాత్రి స్తథా కృష్ణఃషణ్మాసా దక్షిణాయనమ్
తత్ర చాంద్రమసం జ్యోతి ర్యోగి ప్రాప్య నివర్తతే

తా|| దక్షిణాయనమునందున , కృష్ణపక్షము నందును, రాత్రి వేళను మరణించిన యోగి చంద్ర లోకమునకుపోయి, అచ్చట ఫలమనుభవించి, మరల జన్మ మెత్తును.

-- భగవద్గీత. అ. 8. శ్లో. 25.

ఈ ఉత్తరాయణ, దక్షణాయన కాల మరణ కారణ సమస్య "యోగి" (కర్మ, భక్తి, యోగుల) కే. జ్ఞాని ప్రసక్తి లేదుః ఉండ బోదు – జ్ఞాని సర్వాతీతుడు.

-- పునర్జన్మ సిద్ధాంత దర్పణం.

శ్లో|| శుక్లకృష్ణే గతీ హ్యేతే జగత శ్శాశ్వతే మతే
ఏకయా యా త్యనా వృత్తి మన్యయా౽౽వర్తతే పునః

తా|| శుక్లగతిలో మరణించిన వారికి ముక్తి, కృష్ణగతిలో మరణించిన వారికి మరల జన్మ కలుగును.

"పితృయాన – దేవయాన – పునర్జన్మ ప్రశంస"

-- భగవద్గీత. అ. 8. శ్లో. 26.

శ్లో|| పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం|
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే||

తా|| సాధువులను రక్షించుటకును, అ సాధువులను నాశనము చేయుటకును ధర్మమును స్థాపించుటకును ఆ యాకాలములయందు, దేశముల యందు, అవసరము కలిగినపుడెల్ల పుట్టుచుందును.

"సంభవామి యుగే యుగే ---"

-- భగవద్గీత. అ. 4. శ్లో. 8.

శ్లో|| జన్మ కర్మ చ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వతః
త్యక్త్వాదేహం పునర్జన్మ నైతిమా మేతి సో౽ర్జున!

తా|| అంతరంగిక దృష్టితో నాజన్మ కర్మముల నెఱింగినవాడు ముక్తుడగును.

-- భగవద్గీత. అ. 4. శ్లో. 9.

శ్లో|| తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం క్షీణే పుణ్యే మర్త్య లోకం విశంతి
ఏవం త్రయీధర్మ మనుప్రపన్నా గతాగతం కామకామా లభంతే

తా|| ఇట్లు స్వర్గభోగముల ననుభవించి, మరల జన్మమెత్తి, మరల స్వర్గమునకుపోయి మరల పుణ్యము నశించగా భూలోకమునకు వచ్చుచున్నారు. వారీ

రెండు లోకముల మధ్య తిరుగుచున్నారు. (గర్భనరకమును దాట లేక పోవు చున్నారు)

-- భగవద్గీత. అ. 9. శ్లో. 21.

శ్లో|| ఇష్టాపూర్తం మన్యమానా వరిష్ఠం
నాన్యచ్ఛ్రేయో వేదయన్తే ప్రమూఢాః|
నాకస్య పృష్ఠే తే సుకృతేऽను భూత్వా
ఇమం లోకం హీనతరం వా విశన్తి ||

తా|| ఈ మంద బుద్ధులు యజ్ఞ కర్మలు, పుణ్యకార్యాలూ మాత్రమే సర్వోత్తమమైన వనుకొంటూ అంతకు మించినది లేదనుకొంటారు. వీళ్ళు భోగాలకు పుట్టినిళ్ళయిన స్వర్గలోకాలలో తమ పుణ్యఫలాన్ని అనుభవించి మళ్ళీ ఆ లోకాలను వదలి హీనమైన లోకాల్లో ప్రవేశిస్తారు.

-- ముండకోపనిషత్. భా. 1 – 2 – 10.

శ్లో|| వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున
భవిష్యాణి చ భూతాని మాంతు వేద న కశ్చన

తా|| మరణించిన జీవుల విషయమును, పుట్టబోవు జీవుల గుఱించియు, బ్రతికియున్న జీవుల గుఱించియు నే నెఱుంగుదును. నన్నొక్క జీవియు తెలిసి కొనుట లేదు.

మరణించిన<br>పుట్టబోవు<br>జీవుంచుచున్న } భూతములన్నింటిని, నేను ఎఱుగుదును. నేను త్రికాల వేదిని.

-- భగవద్గీత. అ. 7. శ్లో. 26.

శ్లో|| ప్రాప్యపుణ్యకృతాన్ లోకా నుషిత్వా శాశ్వతీస్సమాః
శుచీనాం శ్రీమతాంగేహే యోగ భ్రష్టోऽభిజాయతే

తా|| యోగ భ్రష్టుడు పుణ్యలోకములలో కొన్ని సంవత్సరములుండి, అనంతరమున ఆచారము, యోగ్యులగు, సదాచారవంతులగు, ఇశ్వర్యముగలవారి యింట్లో పుట్టును.

-- భగవద్గీత. అ. 6. శ్లో. 41.

ఇది దుర్లభము, కాని, ఇట్టి వాని కొక ఉప దేశకుఁడు కావలెను.

శ్లో|| అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్|
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ య దీదృశమ్ ||

తా|| కాదా? బుద్ధిమంతులగు యోగులయిండ్లలో బుట్టును. ఇట్టి జన్మము కోటిమందిలో ఎవరికో యొకరికే లభ్యమగును; అందఱకు దొరకదు ie దుర్లభతరము. Why? అట్టి బిడ్డలకు అనాయాసముగ జ్ఞాన బోధ యగును.

"యోగ భ్రష్టులైన వారు, పుణ్యులు, ఇశ్వర్యవంతులైన వారి ఇండ్లలోఁగాని, అధవా యోగుల గృహములందు కాని జన్మింతురు"

-- భగవద్గీత. అ. 6. శ్లో. 42.

"జీవుని అమరత్వము , సూక్ష్మ దేహముల ఉనికికి ఆధారము"

-- గౌతమ సంహిత. భా. 10-1-4.

"నీ వెట్లు ఈ జన్మమున నభిలషించిన, మరు జన్మమున దానినే పొందెదవు."

-- ఛాందోగ్య. భా. III – 14 – 1.

"జీవులు తాము కోరుకోన్న చోట్ల కేగ గలరు"

-- బృహదారణ్యకం. భా. IV – 3 -12.

శ్లో|| కామాన్యః కామయతే మన్యమానః స కామభిర్జాయతే తత్ర తత్ర|
పర్యాప్తకామస్య కృతాత్మనస్తు ఇహైవ సర్వే ప్రవిలీయంతి కామాః||

తా|| ఇంద్రియ భోగాలను పదే పదే తలచుకుంటూ వాటి కోసం ఆరాటపడే వాళ్ళు ఆ కోరికలు తీరడానికిగాను అక్కడక్కడ జన్మ లెత్తుతారు. కాని ఆత్మ లాభంపొంది అన్ని కోరికలను ఆత్మలోనే లయం చేసిన ధన్యుడికి ఈ జన్మలోనే అన్ని కోరికలూ అదృశ్యమై పోతాయి.

"పునర్జన్మ నీయంత్య కాలము లో అభిలషించినట్లు చేకూరును"

-- ముండకం. భా. III - 2 - 2.

"అంత్య కాలపు కోర్కెలు మన్నించఁబడి ప్రసాదింపఁబడును"

-- బృహదారణ్యకం. భా. IV – 9 - 5.

"ఆసన్న మరణ జీవి ఇచ్ఛగించు రీతిని భగవంతుడు జన్మమును ప్రసాదించును"

-- బ్రహ్మసూత్రములు. అ. III – 1 – 34.

"కర్మ ఫలముగా ప్రాప్తించు పునర్జన్మ, మరియు తదనుగుణముగు ప్రారబ్ధఫల భవిష్యత్తు – విమర్శలనేకము"

-- శతపథ బ్రాహ్మణం. భా. X – 1 – 54, భా. XI – 4 – 4.

-- తైత్తరీయ బ్రాహ్మణం. భా. III – 11 – 86.

-- కౌషీతకి బ్రాహ్మణం. భా. 25 (1).

"హంస స్వరూపుడొక్కడే జనన మరణ చక్ర భ్రమణమునుండి ముక్తుఁడగును."

-- శ్వేతాశ్వతరం. భా. 1 – 15.

"జీవాత్మకు లింగము లేదు (నిర్లింగం), ఏ ఏ ఉపాదుల యందు ప్రవేశించినను, ఆయా దేహములచే రక్షింపఁబడుచుండును."

-- శ్వేతాశ్వతరం. భా. 1 – 10.

"దేహత్మ బుద్ధి (జీవత్వం) నా నా యోనులందు జన్మించును"

-- శ్వేతాశ్వతరం. భా. 1 – 6.

కాని, ముక్త జీవులకు భగవంతునిలోనే ఉనికి. వారు లోక సంగ్రహార్థమై – విశ్వ జన శ్రేయోభిలాషులై, వ్యక్తిత్వమును పరమేశ్వరత్వమున లయింపఁజేసి యుండుట వల్ల అట్టివారికి కోరదగ్గది – చేయవలసినదెద్దియు లేదు. పితృ లోక గతులకు వ్యక్తిత్వము – ఇహ పర భోగ కాంక్షలుండును. వాసనామయ దేహులు – ప్రారబ్ధ బద్ధులు – పుణ్య ఫలభోగానంతరం (భోగ భూములైన స్వర్గాదులందు) – తిరిగి భువిని జన్మింతురు. ముక్తులకు పునర్జన్మ లేదు. "భర్జిత" బీజము వంటి వారు.

--- "సహగమనం పునర్జన్మ సిద్ధాంతాన్ని ఆశ్రయించినది. ఆవిశ్వాసంతో అచరింపఁ బడేది". –

--- ఈ జన్మలోని ప్రేమికుల అన్యోన్యానురాగము. బలీయమైయున్న, మరు జన్మ మందు కూడా వారు దంపతులై ఒండొరుల నాకర్షించు కొందురు.

"Marriages are made in Heaven"

-- Shakespear (షేక్స్పియర్ కవి)

--- "కాశి, గయ, ప్రయాగ, బ్రహ్మ కపాలాది దివ్య క్షేత్ర (తీర్థ) ములందు పిండ ప్రదానాదికముల నాచరించు సనాతనాచారము కలదు. మరణించిన వారికి పునర్జన్మరాహిత్య మోక్షప్రాప్త్యర్థ మై పూర్ణ విశ్వాసంతో అపర కర్మల నాచరించెదరు".

---                    "పూనకము, మొ|| ప్రేతముల (దయ్యముల) చిత్ర విచిత్ర సంఘటనలు నిత్య జీవితంలో అనంతము గదా" –

---                    అవతారములు - - కారణ జన్మలైన మహాత్ములు – హరనాథ్, సాయి బాబా, మెహర్ బాబా, రామకృష్ణ పరమ హంస, గౌరాంగ ప్రభువు  మొ|| వారి గాధలు – ముఖ్యంగా బుద్ధదేవుని జాతక కథల సాక్ష్యమునకు మించినది గలదా?

ఈ లోకంలో ప్రాణి జన్మించి , జ్ఞాన మార్జించి ప్రత్యేక వ్యక్తిత్వ  మంది, తిరిగి పరలోకంలో శాశ్వత ప్రగతికై అనుపఁబడును. అచ్చట కూడా క్రమ వికాసమును పొంది, తిరిగి          పునర్జన్మఁ బడయును. చర్విత చర్వణంగా సాగి పోతూన్న యీ జనన – మరణ విష చక్ర వలయ ప్రవాహమొక ఘోర వాహినియై భగవంతుని పేర వెలసినది.

-- శృతి.

పునర్జన్మయే లేకున్న యెడల, మరణము ప్రేమ జీవుల పాలిట క్రూర, వియోగ, విషాదాఘాతమును శాశ్వతముగ రూపొందిచినట్లగును. కాని, భగవంతుఁడు దయామయుఁడు, ప్రేమసాగరుఁడు, పరమ కారుణ్యామూర్తి యను సత్యము నిర్వివాదాంశము.

ఎంత క్రూరుఁడైనను ద్వేష రోష కారణంగా, ఒకరి నిద్దరిని చంపి సాధించవచ్చునే గాని, శాశ్వతంగా అనంత కోటి హత్యలను సాగించి, విశ్వ విశాల విషాదకాండల కర్తృత్వ బాధ్యతలను భగవంతుఁడు భరిస్తాడా? అసంభవం. అనూహ్యం.

అబ్బా! మనమే ఒప్పుకోమే! ప్రేమ స్వరూపుని, దీన బాంధవుని, దయా సాగరుడైన భగవంతుని, జగజ్జనకుని, ఒక కటిక కసాయిగా చిత్రించే యీ వూహను ఏలా అంగీకరించేడం? అదిగో! విశ్వపిత విగత జీవుల కల్యాణార్థ మై, శుభ శ్రేయస్సుల కొరకై, దివ్య ధామములఁదెరచి యుండుట సహజ సత్యము.

ఇక పునరుత్థాన (Resurrection) ప్రశంస అసంగతం. విచారణ రోజు (Doom's Day) న లేచున దెద్ది? శిథిలమై – పంచీకరణమై – రూపుమాసిన పాంచభౌతిక (జడ) దేహమా? దేహాన్ని ఎప్పుడో విడచి పోయిన సూక్ష్మ దేహమా? ఏముందా ఆ గోరీలో? సరి, విచారణానంతరం, శిక్ష, (లేక బహుమానం) అనుభవం ఎప్పుడు?  ఎక్కడ? ఏ రూపమున? దానికేమి సాక్ష్యం (ఆధారం)? తిరిగి జన్మించిన గదా తీర్పుననుభవింప సాధ్యమగుట?

ప్రాణి వ్యక్తిత్వమును గోల్పోక (నశింపక) పునర్జన్మ నందడం నిజంగా ఆనందకరమైన ఆశీర్వాదమే. శుభదాయకం. కాని, వ్యక్తిత్వం నశించి, పూర్వ జన్మార్జిత సంస్కృతీ ప్రగతులు లేకుండ (ప్రారబ్ధ – కర్మఫల భోక్తృత్వం లేకుండ) – తిరిగి జన్మించడం అర్థము లేని క్రియ – సహేతుకంగాని, శ్రమ, వృధా! పాప పుణ్యాఫలముల ననుభవింప లేకున్న కాళీ విచారణ లెందుకో? (జీవితంలో) సృష్టిలో తర తమ భేదములెట్లు గల్గె. పునర్జన్మతో, నూతన దేహమును ధరించిన ప్రాణి, తన పూర్వ జీవిత వృత్తాంతమును మఱచి పోవడం ఘోర మనిపిస్తుంది. కాని, ఆలాంటి మఱపుచే పూర్వ జీవిత సంబంధ భాంధవ్య పరంపరలు మభ్య పెట్టబడకున్న, లోకంలో జీవితాలు నా నా నరకయాతనలకు లోనై , పరస్పర పూర్వ విద్వేషాగ్నుల స్మృతులు ప్రజ్వలించి, విజృభించి, లోక మొక భీకర కదన రంగముగ రూపొందక మానదని సులభ గ్రాహ్యాము. ఉదాహరణకు "భార్యా – భర్తలు" - "మారక ద్వేషులు" "తర తమ జీవనులు" - - వీరికి పూర్వ జన్మ స్మృతులున్న లోకం భీభత్స భయానక కదన రంగము గాక మానదు.

అప్పుడప్పుడు, అచ్చటచ్చట, అసాధారణంగా పూర్వ జన్మ స్మృతులఁబడసిన కొన్ని సంఘటనలను చూస్తూన్నాము గదా! ఇక ఆలాంటి వారు పూర్వ సంబంధ బాంధవ్య ప్రజ్ఞతో క్రీడా రంగములఁ బ్రవేశించిన, ఎంత గగ్గోలు, అలజడి, అశాంతి, విపరీత విషాద పరిణామములు రేకెత్తునోఊహింపఁదగును.

ఎందరెందరో తమ విషాద జీవితములలోని చిత్ర హింసలననుభవింపఁజాలక, తమ జీవితములకు తెర వెయ్యుమని, భగవంతుని ప్రార్థించి, మృత్యువునాహ్వానించడం యీలోకాని కేమి క్రొత్త గాదు. తుదకు విసిగి వేసారి ఎందరో ఆత్మహత్యలకు సాహసించడం కూడా సర్వ సాధారణమైన అనుభవం.

"పునర్జన్మ" అనగా యీలోకం లోనే జన్మించాలని లేదు. వేరు లోకాల్లోకూడా మన వచ్చును. జగత్తులో జీవ కోట్లనంతము. జీవ సంఖ్యకు పరిమితి లేదు. అంతరిక్షమున మంత్ర ముగ్ధముగా ప్రకాశించుచున్న అనంత కోటి ఖగోళములు, ఈ భూమికన్నా ఎన్నోవేల రెట్లు పెద్దవన్న సత్యాన్ని శాస్త్రజ్ఞులే ఒప్పుకొన్నారు. ఇక ఈ మానవుడెంత? "అహంకార క్రిమి" అంటే ఉలుకు వస్తుందా? జై భగవాన్!!

భగవంతుఁడు సర్వాంతర్యామి, - మాత –పిత – గురుడు –సఖుడు – సర్వం - - - కాని, ప్రత్యక్షానుభవం, సృష్టిలో మరణ భీతి మహత్తర భయానక సమస్య.

ఇందుకు సమన్వయోచిత పరిష్కార విధానమే యీ రచన ఉద్దేశ్యము. దీనికి పునర్జన్మ సిద్ధాంత స్థిరీకరణమే తగు సమాధానము. "యద్భావో తద్భవతి" –

జీవుడు దేవుడే. కల్పకం క్రింద నున్నాడు. "తట్టుడు తెఱువఁబడును" – అడుగుడు ఇవ్వఁబడును" – "పిలువుడు ఆదుకొనును"!

--- బైబిల్.

"జీవుల జన్మ సస్కార (వాసన) – ప్రారబ్ధ – సాధనాదుల మీదనే అంత్యకాలపు కోర్కెలు మరు జన్మముగా ఫలించి రూపొందు సమస్య పూర్తిగా ఆధారపడియుండును"

--- శ్రుతులు.

శ్లో|| వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోఽపరాణి|
తథా శరీరాణి విహాయ జీర్ణా న్యన్యాని సంయాతి నవాని దేహీ.||

తా|| ప్రాత బట్టలను విడిచి క్రొత్త బట్ట నెట్లు, మనజుడు ధరించుచున్నాడో అట్లే దేహి ఒక దేహమునువిడిచి మఱొక దేహమును ధరించుచున్నాడు

"తల్లి తండ్రులు తమ బిడ్డలకు క్రొత్త గుడ్డలు ఇచ్చు రీతిని, భగవంతుఁడు జీవులకు వారి వారి అర్హతలు – ఇచ్ఛలను, బట్టి క్రొత్త దేహముల నొసంగును!!

-- భగవద్గీత. అ. 2. శ్లో. 22.

"జీవ సృష్టిలో తర తమ బేధములకు కారణ కర్త భగవంతుఁడు కాదు. వారి వారి కర్మ ఫలాను సారముగ జన్మము సంప్రాప్తమగుచుండును.–

-- బ్రహ్మ సూత్రములు. భా. I – 1 -34.

"జీవుల జనన – జీవనాదులకు కర్మ సిద్ధాంతమే బలీయమైనదనియును, భగవంతున కేలాటి, జోక్యము – పక్షపాతము – రాగద్వేషకారణాదులు గాని లేవనియు, కర్మ ఫల ప్రసాద క్రియకు, నిష్క్రియా ధ్వర్యము వహించుట – సాక్షిగా మాత్రమే ననియు శ్రుతుల ప్రవచనము".–

"పునర్జన్మ" – "పునరపి జననం" – "పునరపి మరణం"

-- శ్రీ ఆది శంకరులు.

కర్మములు మేలునిచ్చును.
కర్మంబులు కీడు నిచ్చు గర్మలుదనకున్

కర్మములు బ్రహ్మకైననుఁ
గర్మగుడ్డై పరులుననగాఁనేమిటికిన్||

-- భాగవతము దశ. పూ. భా. 32.

వ్రాతవెంటగాని - వర మీడు దైవంబు|
చేతకొలదిఁగాని - వ్రాత కాదు
వ్రాతకజుఁడు కర్త – చేతకుఁ దాఁగర్త ||విశ్వ||

"కర్మకు మించిన దైవము లేదు
దేవతలు కూడా కర్మ బద్ధులే"

--- భర్తృహరి.

భర్తృహరి సుభాషితము లందలి కర్మ పద్ధతి, విధానము కర్మ సిద్ధాంతమునకు ప్రాణపట్టు. విశ్వసృష్టి స్థితి లయాదులకు కూడ భగవంతుని కర్మాధికారులే చోదకులు. గీత యందలి కర్మ స్వరూప నిర్ణయ మతి గంభీర అమర శిల్పము.

సారథి లేని రథము వలె ఈ జడ జగత్తు తనకు తానె స్వయముగా, క్రమ గతిని సాగి పోవుట కల్ల. ఏదో ఒక మహత్తర అద్వితీయ – అత్యద్భుత అజ్ఞాత "శక్తి" బలము ఆసరాలతో ఈ బృహత్ జగన్నాటకరంగ ప్రదర్శనము సాగు చుండుట సహజ సత్యము. దీనినే "పంగ్వంధ సంబంధ"ము

కర్మ సిద్ధాత రహస్యము – సృష్టి క్రమ విధానము – ప్రకృతి పురుషుల సంసార రహస్య నిజ స్వరూపము, జీవ బ్రహ్మల ఏకత్వ సత్య స్వరూపానుభూతి మొ|| నవి సామాన్య మానవ మేధాశక్తి కందరాని తత్వములు.

శుష్క వాదోపవాదములు – తర్క వితర్కములు – పాండిత్య పాటవ ప్రదర్శనాదులు, తార్కికులను, పట్లు తప్పించి ఆగాధ సుడిగుండముల లోతుల లోని కీడ్చుకొని పోయి, అయోమయత్వంలో దింపును.

"బలేనగాదు బాల్యేన" – ఈశ్వర చింతన మతి బలీయమైన దివ్య వాహిని! కావుననే మహామేధాశక్తి సంపన్నులైన, ముని పుంగవులు – పరమ హంసలు –

ఉపనిషద్ద్రష్టలైన మహర్షుల అనుభవ సిద్ధాంత విస్పష్ట ప్రవచనములు సత్యా దర్శన (అపరోక్షానుభూతి) బోధకములు మనకు సర్వ శరణ్యాము.

శ్రీ రామకృష్ణ పరమ హంస – శ్రీ గౌరాంగ (చైతన్య) ప్రభు చరిత్రల యందును, శ్రీ బుద్ధ భగవానుని జాతక కథలందును పునర్జన్మ సిద్ధాంతాన్ని బలపరుచు సాక్ష్యములనంతము.

కొందరు యోగులు – మహాత్ములు ధ్యాన స్థితియందు (బ్రాహ్మీ స్థితి నుండి), ఆయాచితముగ, దూర దేశములందలి పునీత సాధకులను గూడా ననుగ్రహించి ఆకర్షించి, ఆదరించి, తరింపఁజేసిన పూర్వ సంబంధ లీలా తరంగ గాధలెన్నోయో గలవు. ఉ|| పాశ్చాత్య దేశవాసియైన "పాల్ బ్రంటన్" దొరకు దర్శన మొసంగిన శ్రీ రమణ భగవానుని గాధ చరితాత్మకము.

మహాత్ములు అనుగ్రహ మూర్తులు – పరుసువేదులు గదా! తమ దివ్యానుగ్రహ దృష్టితో పరమ పాపులను సహా పునీతులను – బ్రహ్మర్షులను చేయగలరుగదా! భోగులెందరో యోగులైరి. ఉ|| వాల్మీకి, శతాంగుళీకుఁడు, జగాయ్ మదాయ్ లు, గిరీష్ చంద్రఘోష్, వేమన, బిల్వ మంగళుఁడు, ఈలాంటి యత్యద్భుత సంఘటన లొక బృహద్గ్రంథమగును. శ్రీ ప్రభు హరనాథ్, శ్రీ సాయి, శ్రీ మెహర్ బాబాల దివ్య లీలా తరంగిణి యీలాంటిదే!! భగవంతుడు గురు రూపమున స్వప్నోపదేశముల చేసి అనుగ్రహించిన అనంత గాధలు – ఆర్తులైన సాధకులను సత్పథమున నియమించి, అనుగ్రహించి, ధన్యజీవులను చేసిన పునీత గాధలనంతము.

వారికి మూడు లోకములు – (మూడు అవస్థలు) లేవు. ఏక ప్రవాహం. అంబ త్రిపురాసురుని (జీవత్వమును) వధించి, అనుగ్రహించుటనగా అనుగ్రహం కాదా?

ఆత్మ తీర్థమందు – (భ్రూమధ్య త్రివేణీ సంగము – అదే బ్రహ్మ తీర్థము) స్నానమాచరించు వారినే పాపములు అంటవు. ఇక అట్టి వారికి తీర్థ యాత్రాదులనవసరం. లక్ష బాహ్య తీర్థములకన్నను, ఒక్క అంతస్తీర్థము కోటి రెట్లెక్కువ.

శ్రవణాదులవల్ల, మూలాజ్ఞానము క్రమముగా నశించి, ఆత్మ తేజము భాసించును; దీనికి రేయి – పగలు లేదు. లోన బయట కూడా స్వయం ప్రకాశమైనది.

హరిః ఓం తత్సత్.

# 9. క్షేత్ర - క్షేత్రజ్ఞ ప్రశంస
# ప్రకృతి పురుషుల లీలా విలాస రహస్యము.
# స్థూల సూక్ష్మముల కథసం
# భగవద్గీత 13 అధ్యాయ వివరణము

క్షేత్ర – క్షేత్రజ్ఞులు (ప్రకృతి – పురుషులు)

సూక్ష్మ రూపమున సర్వత్ర నిండి యుండు నప్పుడు – "ప్రకృతి" యనియును , ఒక ప్రత్యేక ఆకారము (ఉపాధి) ఏర్పడినప్పుడు "క్షేత్రమ"నియు పిలువ బడును.

విశాల భూభాగము (విస్తార ప్రదేశము) ప్రకృతి అందురు. చిన్న చిన్న విభజిత (విభాగ)ములు – గుడ్డములు లేక కయ్యాలు అందురు.. . . . . "సమిష్టి" మరియు "వ్యష్టి" – అను వ్యావహారిక నామములు.

ప్రకృతి తో సంబంధం లేనప్పుడు -- (పురుషుడు) ఈశ్వరుఁడు

ప్రకృతి తో సంబంధం ఉన్నప్పుడు -- క్షేత్రజ్ఞుడు (దేహి)

తాను నశ్వరమగు భౌతిక (స్థూల) దేహం కాదు – శాశ్వతుఁడు పరుఁడు.

ప్రకృతి -- పురుషులు –అనాదులు (కపిల సాంఖ్యము).

క్షేత్ర -- క్షేత్రజ్ఞులు.

దేహం – దేహి

ఆశ్రయ -- ఆశ్రయీ

పురము -- పురుషుఁడు

ప్రకృతి -- మూల ప్రకృతి -- శక్తి

పురుష -- నిర్గుణ మూర్తి -- "పురవాసి"

అధ్యాత్మ – ఆత్మ – ప్రత్యగాత్మ – జీవాత్మ – (అక్షరం = బ్రహ్మ శరీరం ధరించుట చేత జీవాత్మ).

బ్రహ్మ = అక్షరం = పరమం = పరమాత్మ

ఆత్మ = ప్రత్యగాత్మ = జీవాత్మ –

కర్మ = భూత సృష్టి క్రియ = (పంచాగ్ని కర్మ)

అధిభూతం = సమస్త ఉపాధులు ( పుట్టి నశించునవి)
అధి యజ్ఞుడు = అన్నిటిని గ్రహించు వాడు
అధి దైవం = బ్రహ్మ దేవుడు –

క్షేత్రము – 24 తత్వములు గల ఉపాధి – శరీరం – జీవుని – సుఖదుఃఖములకు – మోక్ష సాధన మైన ధర్మా ధర్మముల సము పార్జన సాధనము – "కర్మధర్మ" సాధన క్షేత్రము – దర్శనము ప్రకృతి – దృశ్యం – మాయ యొక్క కార్యం ఉత్పత్తి నాశములు గలది. తాటస్థ్య పురుష సాన్నిధ్య యాజమాన్యము చేత శక్తివంతమై – వికసించి – ప్రకాశించి – విజృంభించి, చలించునది.

క్షేత్రజ్ఞుఁడు – దేహి – పురవాసి (పురుషుఁడు) – ద్రష్ట – అనుభవి – నిరాకార, నిర్గుణ, నిరంజన, నిత్య, సత్య, బుద్ధ, ఆనందరూపుఁదు – ఉత్పత్తి యగు జగత్తు కంటెను విలక్షణమైనది – ఆద్యంత మెరుగనది – నిర్గుణ బ్రహ్మము – కార్య కారణము కాదు – రెంటికిని అతీతమైన తటస్థము – "లేదు – లేదన్న" బుద్ధికి గోచరించనిది – అర్థము కానిది. "ఎటు చూచిన ఆత్మయే" జ్ఞేయము –

-- మహోపనిషత్. అ. 6. శ్లో. 16.

ప్రకృతి పురుష లనాదులు – పురుషుని యందలి శక్తియే ప్రదర్శిత ప్రకృతి. వారి యవినా భావ అనాది సంబంధతలా విలాసమే, వేద వేదాంత కథన కారణము.

ప్రకృతి (అచిత్) — ఈశ్వరుఁడు (చిత్)

పురుష (చిదచిత్)

ప్రకృతి పురుషుల లీలా విలాసము – అధర్వణాంతర్గత "ముండక" మున – (మూడు భాగములు) వర్ణింపఁబడినది.

శ్లో|| అప్రమేయ మనాదించే త్యత్ర శ్రుత్యేద మీరితం |
మనసై వేదమాప్త వ్యమితి ధన్యాప్యతాశ్రు తా||

-- అమృత బిందూపనిషత్.

తా|| బ్రహ్మము నిర్వి కల్పము – అనంతము –హేతు దృష్టాంతములు లేనిది.

అప్రమేయం – అనాది; అట్టి బ్రహ్మము నెఱుంగు పండితులు – ముక్తులు.

జగత్తు నకు నిమిత్త కారణం -- పరమాత్మ

ప్రకృతి -- జీవులు ఉపదాన కారణములు

పై మూడును అనాది "అజములు"

"జీవ – బ్రహ్మ"లు – చేతనత్వ – పాలన – వ్యాప్య వ్యాపక – సనాతన, అనాది, మూల రూప కారణమసమానములు.

ప్రకృతి మాత్రము స్థూల రూప విస్తరణము. ప్రళయమున నశించి విలయంబగును. వీటికి కారణము లేదు. జీవుఁడు అనుభవి. ద్వందములఁదగుల్కొని – "అహం" నామ ధారియై – భ్రాంతి జన్య (మాయాకృతి) కర్తృత్వ కారణమున అనుభవించు చున్నాడు.

ఈ "ప్రకృతి పురుష" – "దేహ దేహి" సంసార మనాది. ఈ సంసారము – బంధము – (చిదచిద్గ్రంధి) – అవిద్య – మాయ – భ్రాంతి – అజ్ఞాన జనితమే!! ఇదియు అనాది యె!!!

సంసారఁజనన మరణ చక్రమున కారంభమిది యది యని లేదుః జీవ బ్రహ్మల భేదము అజ్ఞానము చేతనే : బ్రహ్మ – "సాక్షి – కూటస్థుడు" – కాని అనాది ప్రకృతిని తగుల్కొని జీవుఁడై అనుభవించు చున్నాడు. స్వయంకృతాపరాధ ఫలమీ జగన్నాటక రంగ లీలా విలాసము.

అట్లు కాదేని, అనాదిగ నిర్మలమై నిర్వికారమైయున్న బ్రహ్మము నుండియు, తదభిన్నుఁడై సంసారిగ – హటాత్తుగ ఊడి పడెనన్న, కారణము కావలెను. ఆ జీవునకు పూర్వజన్మ కర్మ కారణము –సుఖ దుఃఖ హేతువు కావలెను.

"ఏకత్వమున బహుళత్వము"

"అనేకత్వమున ఏకత్వము" - ఎరుగుట బ్రహ్మత్వ కారణము. ఆకాశమంతటను వ్యాపించి యున్నను, దేనిని అంటదు కదా! అదే విధముగ ఆత్మ దేహముంతటా వ్యాపించి యున్నను, దాని నంటుట లేదు. ఇక అంటకున్న వానికి ఫలమెక్కడిది. దేహి వేరు – దేహము వేరు.

ప్రకృతి – పురుషుల సంసారమనాది. వీరిది అవినాభావ సంబంధ బాంధవ్యము – ఒకటి లో రెండు –రెండూ ఒక్కటే!!. "అను లోమన – ప్రతి లోమన"

(సృష్టి – లయ) – క్రమబద్ధమైన – ఆగని – జగ చ్చక్ర, భ్రమణ క్రియ – భగవల్లీలా విలాస రంగ నాటకం - ఆగదు, - ప్రభు ఆది సంకల్ప జనితం – ఆద్యంత మెఋంగని – సృష్టి లీలా నాటకం. ప్రకృతి – పురుషుల సంబంధం –పంగంధ్వ సంబంధము వంటిది.

పరస్పరాపేక్షా నిబంధనము – "సంసారము" (చిద చిద్గ్రంధి)

భోగ్యమగుటచే ప్రకృతి – భోక్త (అనుభవి) యగు

పురుషునపేక్షించును – ఫలం ⟶ దుఃఖ త్రయము.

నిర్వ్యాపారి యగు అయస్కాంతము సాన్నిధ్యమున – జడమగు లోహ మెట్లు చలించి – వ్యాపారి యగునో, తద్రీతిగనే నిర్వ్యాపారియగు పురుషుని సాన్నిధ్యమున జడమైన ప్రదానము (ప్రకృతి) శక్తి వంతమై – చలించి – వికసించి – విజృంభించు చున్నది.

తొలుత – ప్రకృతి – పురుషులు

తర్వాత క్షేత్ర -- క్షేత్రజ్ఞులు

(అచిత్) (చిత్)

వీరి కలయిక యే "సంసారము" - సత్ + అసత్ = సదసత్ లేక చిద చిత్ -- జీవనము "దేహి + దేహుల" = ఐక్యము. ⟶ దేహాత్మ బుద్ధి. –

అజ్ఞానమే -- బంధము -- జన్మ కారణము

ప్రజ్ఞానమే – మోక్షము – అమృత పానము

జీవత్వ (పతన) – త్రివిధ సోపానములుః -

పతనం (I) దేహ ప్రవేశం – దేవుడు పుర ప్రవేశం పురుషుడు, దేహి, క్షేత్రజ్ఞుడు –

బంధం దేహ ధారణ తో బంధం (చెర) – ఆవరణ స్థితి.

"- ప్రాజ్ఞత (కారణం) – (వ్యష్టి)" X ఈశ్వరాంశ (సమిష్టి), ఉపాధి లేదు.

ఉపాధికలదు, లింగ శరీరము నిరుపాధికం –తటస్థం – లీల మాత్రం

10 ఇంద్రియములు + 5 ప్రాణ + సుషుప్తి.-

మనో బుద్ధులు = 17

పతనం (2) దేహాత్మ బుద్ధి - అవిద్యావరణ కారణంగా స్వస్వరూప భ్రంశం.

అజ్ఞానం 10 ఇంద్రియములు + అంతఃకరణ చతుష్టయ క్రియలు తనవే నను కొను

"దేహాత్మ బుద్ధి" – స్వస్వరూపాజ్ఞానము" – వ్యష్టి – సూక్ష్మం(తైజస) X

సమిష్టి – హిరణ్యా గర్భాంశ. (తేజో) –స్వప్న స్థితి –చతుర్ముఖ బ్రహ్మ –

పతనం (3)    సంసారము  బాహ్యా ప్రపంచ సృష్టి – భోగ పదార్థములు –
సంసారం    (విషయములు)  సృష్టి – విషయాసక్తి – ఆకర్షణ – భోగము.
(లంపటత్వం) సంసారము – తగులు – త్రిపుటి –ఆవిర్భావము – వ్యష్టి – దేహం
(జీవా) జాగ్రత X సమిష్టి – విరాటాంశ – విశ్వత్వం జీవుని పూర్ణ పతనం
– భ్రష్టత్వం -

జీవత్వ మొక సంకల్పముల పుట్టః సంస్కారముల కుప్పః వాసనా మయ అనుబంధం (ముడి – చిదచిద్గ్రంధి) –

(1) విలాసార్థమై – వేడుకల నభిలషించి దేహ (పుర) ప్రవేశంతో – బందీయై – ఆవరణ (దేహ) చెర యందు తగుల్కొని – (2) క్రమంగా – బాహ్య (ప్రాపంచిక) విషయ బోగములఁను మరగి, "సంసారియై" దశేంద్రియములు + అంతఃకరణ చతుష్టయ కార్యములు తనవే ననుకొని – 'తాను వేరు – దేహం (ఆవరణ) - వేరను జ్ఞానం (స్మృతి) లేక, దేహమేనేననెడిః "భ్రమ – అజ్ఞానం – అవిద్య" వల్ల .... సత్య జ్ఞానం నశించి, వాస్తవ స్థితిని మరచి - - -(3) విషయ వేటల వల్ల . . .జన్మ జన్మాంతరముల లంపటత్వం (దేహ + దేహి) సంసారం బలసి, - - - - "ఆత్మయే దేహమను" – దేహాత్మ బుద్ధితో - - - పూర్తి భ్రష్టత్వం దాపురించింది.

ఈ సంసార పద్మవ్యూహ్యంలో చిక్కి – స్వ స్వరూప జ్ఞానం నశించి – (సంస్కార) వాసనామయ – "జీవత్వ" మావహించి . . . . భ్రమించి . . . మాయా మోహితుఁడై . . . . ద్వందముల తాకిడికి "సుఖ దుఃఖ" పరంపరల ననుభవించుచు - __- జనన మరణ చక్ర భ్రమణమునఁబడి . . . . దీనుఁడై . . . అగతికుఁడై . . . అల్లార్చు . . . గతి . . . దుర్భరము – దుస్సహము – ఇక దీని నుండి విముక్తి – మోక్షము – స్వ స్వరూపానుభూతి యే వాంఛనీయము. శరణ్యము.

దేహము దృశ్యము – ఆత్మ ద్రష్ట : వ్రేలి కొనను అదే తాక గలదా? కత్తి తనను తానే కోసు కోగలదా? దృష్ట తనను తానే చూచుటెట్లు? . . . సర్వ సాక్షికి సాక్షత్వం లేదు గదా!!

"దేహో దేవాలయః ప్రోక్తో జీవో దేవస్సనాతనః"

ధర్మ కర్మ - క్షేత్రము --    దేహి భవనము
బ్రహ్మ పురము -    పంచ వన్నెల చిలుక పంజరము
జోతిష్మతీ నగరము    జీవ రథము

నవద్వార పురము సప్త ప్రాకారపు కోట
ద్వారవతి - పంచ కోశ నిలయము
త్రిపురాసుర పురం - పురము - దేహము
ప్రవిమల జ్ఞానప్రాకారము

శల్య కీలకములు – చర్మము గోడ (వెల్ వెట్) పూత – రక్తమాంసముల నింపు – నవద్వారముల తో – అస్థి సంచయ పునాదులతో - . . . . మల మూత్రాదులు దుర్వాసన – క్రిమి సముదాయ సంకులము – పూతి గంధ హేయము – నఖ రోమాది జడ వికాసముతో - - - క్షణ క్షణము మారుచు - - తుదకు నశించును. పంచీకరణమై – మూల – పంచ ధాతువులందు విలీన మగును. లయం.

ఈ దేహము – పంచ కోశములు – మూడు అవస్థలు – సప్తధాతువులు మూత్ర పురీషాదులతో – నిర్మింపఁబడి – జీవునిచే ఆశ్రయింపఁబడి – 'పురుష" నివాసమైన "పురమ" ను పేర వెలసినది. దేహీ దేవాలయము. దశేంద్రియ (ద్వార)ములు – అంతఃకరణ (దుష్ట చతుష్టయ) సామంతులు – అంతా మాయామయ. కల్పిత, చిత్ర రచన.

మనస్సు X బుద్ధి - పరస్పర విరోధ భావములు గల మంత్రులు.

కామ క్రోదాది సప్త శత్రు వర్గముల దాడి నుండి కాపాడకున్న, సర్వనాశనం – లూటీ తప్పదు. జీవుడు దేవుడు పునరిద్ధరింప బడ వలెనన్న - - - జీవ పతన పద్మవ్యూహ రహస్యమును గుర్తించి - - - తిరోగమన (మోక్ష పథ) మార్గమును పట్టవలెను.

ఇంద్రియముల ద్వారా మనస్సు బాహ్య విషయముల వేట మానాలి } మనస్సు అంతర్ముఖమై - స్వచింత - ఆత్మధ్యానము లో — No Permission (1)

బాహ్య విషయా కర్షణలు వాసనల ప్రాబల్యము - విషయ చింతనములు అరికట్టబడాలి } ఇంద్రియముల ప్రభావము - నాసనల పీకట – లంపటత్వ సంస్కారములు నశించాలి — No admission (2)

ఈ రెండు "బోర్డులు" – మనఃఫలకమున వ్రేలాడ గట్టి – విచార, వివేక, వైరాగ్య, పురుష ప్రయత్నాదులను కావలి వుంచాలి. "భక్తి – జ్ఞాన – యోగాదులను" – పెంచి, క్రమ సాధనలందుత్తీర్ణుడు కావాలి. . . . . జై భగవాన్ . . . స్వారాజ్య ప్రాప్తిరస్తు.

దేహ దేవాలయంలో – భగవద్గృహంలో – ప్రభు సాన్నిధ్యంలో – సర్వేశ్వర దివ్య సన్నిధానంలో . . . . అరిషడ్వర్గాది అమంగళకర – అశుద్ధ – అపవిత్ర – భ్రష్ట సంకల్పములను, చొర నియ్య వచ్చునా? శ్రవణ, మనన, విచార, వివేకముల తర్వాత, దేవుని జీవుని చేసి, జీవుని రాక్షసుని గాను, తుదకు క్రిమి కీటకాది తృణపాయంగాను చేయగల్గిన, అశుభ – వృత్తులకు చోటిచ్చి. మరి మరి అధోగతికి దిగజారడం, ఆత్మ ద్రోహం – ఆత్మహత్యాతుల్యం కాదా? మంగళకర – అఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకుడు తనలోదండిగ గలడని తెలిసిన్ని, ఊర్ధ్వ పథగామిత్వము లేకున్న ఘోర పాపంకదా?

పృథ్విలో పార్థివ ప్రాముఖ్య దేహాలున్నవి –

యమలోకంలో యాతనాశరీరాలు – సూక్ష్మప్రాయంగా . . . అంతా స్వప్న (తైజస) అనుభవాల్లాంటివి - "క్షీణే పుణ్యే మర్త్య లోకం విశంతి" . . . పుణ్య ఫల భోగా నంతరం, తిరిగి కర్మ కారణంగా భూలోకమున జన్మించక తప్పదు. "ధర్మ కర్మ" దేహ ధారణ – పునర్జన్మ తథ్యము.

భౌద్ధులు యజ్ఞయగాదులందు జీవ హింసల నిషేధించిరి. యజ్ఞముల పవిత్రత - పూజ్యతలను పరిరక్షించిరి.

భౌద్ధుల కడపటి స్వర్గం "తుషిత స్వర్గం" - అనాగామి పథం . . . అనగా "ఆగామి' (పునర్జన్మ) లేని దివ్యదామం.

"త్రయస్త్రింశతీ స్వర్గం" – 33 మహానగర భాగములు గల స్వర్గలోకము కలదని భౌద్ధుల విశ్వాసం –

సహజంగా – పురుషుఁడు ఉపద్రష్ట, నిస్సంకల్ప సాక్షి, తాటస్థ్యం – ఉదాసీనత్వం – ప్రారబ్ధమువల్ల – జాగ్రద్దశయందు ఇష్టానిష్ట విషయానుభవముతో సుఖ దుఃఖాదులు లేని సమయమున -"జీవుఁడు" దాసీనుఁడై యుండును. ఈ విధముగా – నిస్సంకల్పుడై – నిర్మలోద్యోగమున ఏ చింతలు ను లేకుండు స్థితిని "సహజానంద – ఉదాసీన స్థితి" అందురు. ఇదే స్వరూపానంద స్ఫూర్తి - - - ఇట్టి ఔదాసీన్యమందు కూడా "నేను" (అహంకారము) అను అభిమానముండుట వల్ల – అనగా

"అహంకారానుభవం – (వాసన – స్పర్శ) ఉండుట వల్ల "బ్రహ్మానందము" – కలుగ నేరదు. అది యెట్లనగా – "కుండ యొక్క పై భాగపు చల్లని స్పర్శానుభవము వలె (లోపల నీరుండినట్లు) - - మరియు --- ఉ|| చంద్ర కిరణముల ప్రభావమున చంద్ర కాంత శిలలు ద్రవించునట్లుః

-- అయస్కాంతము యొక్క (అనాసక్త – నిష్క్రియ – నిరపేక్ష) సాన్నిధ్య ప్రభావమున లోహము చలించునట్లు.

-- సూర్యరశ్మి వల్ల కమలములు వికసించు విధముగా,

-- అగ్ని సాన్నిధ్యమున వేడి వెలుగుల విస్తరణ వలె,

-- పురుషుని సాన్నిధ్యం లో స్త్రీకి బల ప్రాబల్యములబ్బునట్లు,

-- పరమాత్మ సాన్నిధ్య ప్రభావము చే "ప్రకృతి" చైతన్యవంతమై క్రియా కలాపములు సాగించు చున్నది.

ఉపాధి ప్రాధాన్యంలోక ధర్మం కదా? బాహ్య దృష్టి బంధం – మోహ కారణం. అంతర్య – అంతరావలోకం సత్య దర్శన కారణం,

సర్వ వ్యాపక బ్రహ్మము హృత్పుండరీకమున (దహరమున) విజ్ఞాన ఘనమై, అంతర్యామిగా – అంతరాత్మగా – ప్రకాశించు చున్నట్లు ధ్యానించడం – సాధకుని – విధిః గుర్వాజ్ఞ :- మరియు,

- బుద్ధి వృత్తుల సంధులలో
- శబ్ద వృత్తుల సంధులలో
- రూప వృత్తుల సంధులలో

} తాత్కలిక సమాధి స్థితి వలె - అనగా హటాత్తుగా ఏర్పడు అద్భుత – మహాశ్చర్య – ప్రమాద – ప్రమోద క్షణములందును –

తొట్టతొలుత స్త్రీ స్పర్శ కల్గినప్పుడు మొ|| పరిస్థితులందు, ఆ మంత్ర ముగ్ధ – అత్యంతాద్భుతానుభవ (తాత్కాలిక సమాధి స్థితి) స్మరణీయము. "ప్రకృతి – పురుషుల" - అవినాభావ సంబంధ మంత నిగూఢ మైన మహాద్భుత చిత్రము –

ఈశ్వరునికి పార్వతి దేహార్థమున సమము గాను|
విష్ణువునకు లక్ష్మి ఉరమున తిరము గాను|
బ్రహ్మకు భారతి వాక్స్థానమున సర్వదా|

"ప్రకృతి –పురుషులు" – విడదీయరాని – స్పష్టాస్పష్ట – అవినాభావ సంబంధమతి చిత్రము – అనాది – ప్రత్యేక పుటునికి లేదు – శక్తి (ప్రకృతి) భగవానుని విడిచి యుండ జాలదు. ఇరువురు లేకున్న ఏ నాటకము లేదు.

పురుష ప్రకృతుల వ్యక్తావ్యక్త సంధి స్థితి రహస్యం నిగూఢము.-

మణి యందలి దీప్తి (కాంతి) వలె –

పూవు యందలి తావి – వర్ణముల వలె –

శక్తుని యందలి శక్తి వలె –

కాని, సత్పదార్థము నందు స్వయం సృజన శక్తి కలదు. పారమార్థికముగా సత్యా సత్యము లొక్కటేః ఒకే వస్తువు యొక్క రెండు ముఖములున్నట్లుగా!!

అర్ధనారీశ్వరుఁడు – నిర్గుణ మూర్తి నుండి పార్వతి (శక్తి) – సగుణాంశ – దేవి – ప్రకటితమై (బయల్వెడలెడి స్థితి) "సృష్టి – లయ" క్రియారంభమున ద్యోతమగును. ఇదే "సంధ్యవస్థ" – ప్రకృతి పురుషుల "సంయోగ వియోగా వస్థ" – "నిర్గుణ సగుణా వస్థ" - - "ద్వైతాద్వైత" ఏకస్థ రహస్య స్థితి. అత్యంతాద్భుత చిత్ర సంఘటన గమనార్హము.

"పరమేశ్వరుఁడు – అతని యందలి శక్తి" (మాయ) ఇద్దరు ఒక్కటే – అనాదులే, ప్రకటితమైనప్పుడు శక్తి – మాయ ప్రదర్శితమై స్పష్టముగ దర్శనమిచ్చును. లయించు తరి అభావము కూడ తథ్యము.

కావున, "మాయ – అవిద్య" అభావ స్వరూపమైనను సత్పదార్థమందణగి యున్నది. భగవంతుని – "సగుణ నిర్గుణ" భావములే జగల్లీలకు పునాదులు.

సంధ్య – సంధి – అనగా యోగము – రెండు మనోవృత్తులకు మధ్య గల కాలము. అనగా మనస్సు యొక్క గతిని బహు జాగ్రత్తగా, గమనించుచు, రెండు సంకల్పములకు మధ్య రూపొందు నట్టి విరామ కాలమే "సంధి" – నిస్సంకల్ప కాలమని గుర్తింప వలెను. "సంధ్యవార్చే విధము తెలియండి" - - తత్వము.

"అన్నం బ్రహ్మేతి వ్యజానాత్" -- అన్నమే బ్రహ్మము

"ప్రాణో బ్రహ్మేతి వ్యజానాత్" -- ప్రాణమే బ్రహ్మము

"మనో బ్రహ్మేతి వ్యజానాత్" -- మనస్సే బ్రహ్మము

" విజ్ఞానం బ్రహ్మేతి వ్యజానాత్"-- విజ్ఞానమే బ్రహ్మము

"ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్" -- ఆనందమే బ్రహ్మము

తుదకు మూలా విద్య – గాఢాంధకారమే పరమాత్ముడని వచింపుచున్నారు. సుషుప్తి యందేమియుఁదోపక, సర్వ శూన్య మాత్మ స్వరూపమని "మూలా జ్ఞానము చే" అదే కారణమని భ్రమసిరి – "శూన్య వాదము"

కాని, కలిమి లేములు గ్రహించు సాక్షి – సర్వ సాక్షి – ద్రష్ట – కూటస్థ చైతన్యుఁడను నేను.

"నన్నాశ్రయించి – విశ్వసించి శరణన్న వానికి, ప్రకృతి (చెర – బంధము) నుండి – విడిపించి, నాలో చేర్చు కొందును. లేదా – నన్ను మరచి, విడిచిన వారిని స్వేచ్ఛానుసారముగా "ప్రకృతి" కే వదలి వేయు చున్నాను. శరణన్న వారిని ఏలా మరచి అనాదరింప గలను?" -- ప్రభుహరనాథ్

సులభ సత్య దర్శన వివరణ - -

సూర్యోదయంతో అతని వెలుగులో అందరు తమ తమ నిద్ర నుండి మేల్కొని, వ్యాపారములందు ప్రవర్తించు చున్నట్లు - - -

| | |
|---|---|
| శుద్ధ చైతన్య స్వరూపుడనగు నా సంబంధ మైన<br>(చిత్ - ప్రకాశము)చైతాన్యాంశముయొక్క<br>వ్యాప్తి ప్రభావ సాన్నిధ్య బలమున--- | అంతఃకరణ<br>చతుష్టయము<br>జ్ఞాన + కర్మేంద్రియములు |

మేల్కొని (చైతన్యము నంది) – తమ తమ పనులందు నిమగ్నమై "తామే" ఆ పనులను చేయుచున్నామని అభిమాన (అహంకార) ముతో – శబ్ధాది విషయములందు ప్రవర్తించుటచే "ద్వంద్వముల" తాకిడి – "కర్తృత్వ" – భోక్తృత్వ" ఫలాఫలము సుఖ దుఃఖ భ్రాంతి – తీవ్ర + సుదీర్ఘ విచార మత్యావసరము.

| | |
|---|---|
| ఆత్మానాత్మ విచారము చేతను<br>గురు – శాస్త్రోక్తుల చేతను<br>యుక్తి- - స్వానుభవముల<br>సాయముతోను | సత్య–విలక్షణ, అఖండానంద చిద్రూపుని కను గొని -<br>"బ్రహ్మసత్యం – జగన్మిథ్య" ల రహస్య భోధను -<br>అనగా చతుర్వేద మహా వాక్యముల సారమును -<br>స్వానుభవమున తెలుసుకొన్న "బ్రహ్మ మూర్తులు"<br>కావలెను. |

సప్త భూమికలు -- జ్ఞాన పద సోపానములు.

శుభేచ్ఛ – మానవుని జన్మ – ఉత్తమ స్థాయిని – భవ రోగ నివారణేచ్ఛ – భగవద్దర్శనేచ్ఛ – దివ్య పురుషుల – మహానుభావుల దర్శన – సేవానుగ్రహ

భాగ్యకాంక్షలు – సద్భావాది పంచశీల భాగ్యం – ఊర్ధ్వగామిత్వం – జ్ఞానభానూదయం – అజ్ఞాన మేఘావృత అంధకార నిష్కృతికి పునాది.

స్థిత ప్రజ్ఞ – ఆశలు లేని (నిస్సంకల్ప) మనస్సు – దృఢ వైరాగ్య బోధోపరతుల తోటి – అభ్యాస సాధనల కలవాటు పడ్డది – ఆనందము – శాంతి – తృప్తికలది – ముక్త స్థితి. పుష్పములందలి మకరందమును, భ్రమరములు గ్రోలి, దాని వర్ణ వాసనలను లెక్క చేయవు. తద్రీతిగనే నాద బ్రహ్మ మందు లయింప బడ్డ మనస్సు విషయమలకై పరువెత్తదు.

"కదలని నివాతస్థ దీప శిఖ వలె" – మనస్సు అచంచలమై – ఉపనయన దృష్టితో – బిందు స్థిరత నొందవలెను". – గురూపదేశము -

అచల యోగం – స్థిత ప్రజ్ఞ – సహజ స్థితి – ఆత్మ నిష్ఠ – నివృత్తి – నిర్మలోద్యోగం – బ్రహ్మలోకా వాప్తి - -

"సర్వ సంకల్ప సన్యాసియే అమనస్క యోగీంద్రుడు"

తేజః పంచకం -- "వెలుగులు" –

సూర్య – చంద్ర – నక్షత్ర – అగ్ని – విద్యుల్లతాదులు (మెఱుపులు), ఇవన్నియు ప్రకృతి సంబంధమై స్వయంప్రకాశం లేక – పరంజ్యోతి స్వయంప్రకాశ ప్రభావమున ప్రకాశింపఁబడు చున్నవో, మరియు సర్వోపాధుల క్రియలను సాక్షిగా – (నిష్క్రియా పర) కనుగొనుచున్నామో – ఆ "నేను" – "నేతి – నేతి" న్యాయ విమర్శల వల్ల ఊహింపఁదగును.

"కాన నగు వాడనుఁగాను వినుము|
కాను, కానను, వానిని గాంచు వాడ|
గాంచు వానిని సతతంబుఁగాంచు వాడ|
నేను – గానను వికృతులు లేని వాడ||"

శుద్ధ జీవునకు సాక్షిని – ద్రష్టను – అట్టి కూటస్థ చైతన్యమునకు గూడా సాక్షిని. తుద కిట్టి వాడనగుదును. ఇవేవియు నేను కాను; అను వికారములు లేని –వృత్తి రహిత శుద్ధ భోధ స్వరూపుఁడను.

సూర్య ప్రకాశము వల్ల జగద్వ్యాపారములు జరుగు చుండునట్లు – నా చైతన్య వ్యాప్తి వల్ల - "అంతఃకరణము" – "సర్వేంద్రియములు" – "ప్రాణములు" వాటి క్రియలు ఆయా పనులందు "అహంకార" రూపమున ప్రవర్తించుచున్నవి.

సమస్త జ్ఞానము – మరల మఱుపు – వేదవిధులను – నిషిద్ధ కర్మలను – సర్వం తెలియు చున్న వ్యాపకుడను – సర్వం "నేనే"-

షడూర్ములు – ఆకలి, దప్పి, శోకము, మోహము, జనన మరణము లనెడి – అను దేహ ధర్మములు –

త్రిభేధములు – సజాతీయ – మనుష్యుల్లోనే భేధం –

విజాతీయ – మృగ, పక్షి, క్రిమి, కీటకాది భేధం

స్వగత -- చేయి, కాలు, నోరు, చెవి మొ||

Epiglottis = కాల మృత్యువు –

ద్వారక = చతుర్ద్వారములు (ఎఱుపు – తెలుపు – నలుపు – నీలం) లోని, "సునీలం" (పాప = Pupil) –

పంచ రంగుల (చిలుక) పంజరం కన్ను – విశ్వుడు – జీవకళ కంటి పాపలో కాన్పించు చైతన్యాంశయే "జీవ" (విశ్వ) తత్వం. ఇదే నేత్ర స్థాన మర్మ గురూపదేశ సత్య ప్రవచనము. అత్యంత నిగూఢ గురు కీలకంః అరచేతిలో వైకుంఠం చూపడం. . . . . బింబ ప్రతిబింబ రహస్యం – దర్పణ గతంః

సంధ్య అనగా – సంధించుట – కలియుట – యోగము (వియోగాంత్యము) – రెండు మనో వృత్తులకు మధ్య నున్న విరామము. వ్యవధి, యే "సహజ స్థితి" స్థూలార్థం – రేయింబవళ్ళు – ప్రాతఃసాయంకాలములు (రేయి పగలు సంధులు) – కాల సంధులు – (intervals విరామములు).

సూక్ష్మార్థం –జాగ్రత్స్వప్న సుషుప్తులు కలియు "సంధ్య" వస్థలు – అవస్థల సంధికాలము.

లేక, సృష్టిలయముల సంధికాలము – యుగ సంధి –మనస్సును – లక్ష్య బ్రహ్మమందు – చేర్చు – లయింపఁజేయు సంధి కాలము.

లేక, త్రివేణి సంగమం (ప్రయాగ) – గంగ యమున సరస్వతుల కూడలి - - -బాహ్య "సంధి" తీర్థ క్షేత్రము –

అంతః సంధి – భ్రూ మధ్య త్రికూటాద్రి – ఇడ పింగళ సుషుమ్నలు (చంద్ర సూర్య అంతః జ్ఞాన నేత్రముల) చేరు లక్ష్య స్థానము - - - మేరు శిఖరము, దహరము, బ్రహ్మ కపాలాంతర్గత "బ్రహ్మ" లోకం - - -

సంధ్యోపాసన –

1. ముఖ్యంగా గాయత్రీ జపము (అ + ఉ + మ్ = ఓం)

2. ఆదిత్యోపాసన – సూర్యనారాయణమూర్త్యుపాసన. (సప్రాణాయామ) - సూర్య నమస్కారములు – దిగ్దేవతా సంస్మరణము . . . కాల సంధి ముహూర్తములందు.

3. ఈశ్వర ప్రార్థన – గురు ధ్యానము – సంకల్పాదులు.

"నిస్సంకల్ప సంకల్పమే" యోగి పరమ లక్ష్యం – సంకల్ప రాహిత్యమే – నిర్మలోద్యోగము –మనస్సు ఇంద్రియముల ద్వారా బాహ్య ప్రపంచమందలి విషయముల వేటకై - సంకల్ప వికల్పముల – సాగించేకుండుట – సాక్షిగా – తటస్థ ద్రష్టగా – నిష్క్రియా పరుఁడై గమనిస్తూండడం. ఇదే "నిర్మలోద్యోగము" – "సదాచార" మందురు.

గీ|| పంచ విషయములనుఁ –బంచేద్రియములచే|
గాంచు తెలివి నేను – గపి వరేణ్య|
పంచకోశములనుఁ – బంచ భూతములను|
నెంచి చూచు నట్టి – "యెఱుక" నేను||

తా|| బాహ్యాంభ్యంతర సమస్త వృత్తులను తెలియుచు, వెలుగు చుండు, మరియు ప్రకాశింపఁ జేయుచుండు వెలుగు నేను. దృశ్యాదృశ్య వివేకదశను, - నేను "మనస్సు"ను గాను.

---

శ్రీ సీతారామాంజనేయ సంవాధము.



1. జాగ్రత్ - విశ్వుడు – దశేంద్రియములు + అంతఃకరణ చతుష్టయము- (10 + 4) = 14 తత్త్వములు – రంగము – స్థూలావస్థ – జగత్తు అనుభవం – అంతా "సత్యం – శివం - సుందరం" – మెలుకవ ఉన్నంత వరకే –

2. స్వప్నం - సూక్ష్మావస్థ – తైజస – లింగ శరీరము – (జాగ్రత్ స్వప్నముల మధ్య)

ద్వివిధ స్వప్నములు (జాగ్రత్ స్వప్నముల మధ్య సంధి క్రియ)
- శుభ – సుఖ – ఆనంద - పుణ్యులకు
- అశుభ- కష్ట –దుఃఖ – పాపులకు

మరియు స్వప్నములుః- సత్య –అసత్య – మిశ్రమములని 3 విధములు.

స్వప్న కారకుడు పరమాత్మ, ఆత్మ కాదు. ఆత్మకు ఆ స్వేచ్ఛాశక్తులు లేవు. ప్రారబ్ధానుసారముగా స్వప్నము లేర్పడి – జీవుని భోగింపఁజేయును. దేహ పంజరమున బంధింపఁబడిన "జీవాత్మ" స్వేచ్ఛారహితమైన – పరిమిత శక్తి గల – ప్రారబ్ధ భోక్త. సత్యాసత్య స్వప్నములు – (శుభాశుభ స్వప్నములు) రానున్న శుభాశుభముల సూచించును. నానా రకముల స్వప్నములు తారసిల్లును. జాగ్రత్, సుషుప్తులు లేవు.

ఆత్మ జీవ శక్తిని మభ్య పెట్టి మరుగు పరచును. అనగా, ఆత్మ ప్రభావ బలము వల్లను, జీవిని (పరిమిత శక్తి) ప్రారబ్ధాను సారముగను - స్వప్నములే గాదు, జనన మరణాదులు (తుదకు బంధ – స్థిత – మోక్షములు సహా) ప్రాప్తించును. లేకున్న, ఎవ్వరు కోరి "దుఃఖ – అశుభ" స్వప్నముల కోరు కొందురు? జాగ్రదవస్థలో వలెనే స్వప్నలోకం కూడా ప్రారబ్ధానుసారంగా సాగి పోవును.

--- బ్రహ్మ సూత్రములు. అ. III. – 3 భా.

స్వప్న "రోగము" జాగ్రత్ లో మాయ మగు నట్లు – జ్ఞానోదయంతో – మొదటి మూడవస్థలు నశించి – స్వ స్వరూప జ్ఞానము ప్రకాశించును.

ఆత్మ శక్తి "చిత్" (వెలుగు – జ్ఞానము) స్వప్న కారక మరియు ప్రకాశత్వములకు మూలము.

3. సుషుప్తి (నిద్ర) – ఇందు జ్ఞానానుభవం లేదు. కేవలం స్మృత్యనుభవం. ఇందు ద్వైత స్ఫూర్తి లేదు. సమాధ్యవస్థకు వ్యతిరేకం. స్వ స్వరూప జ్ఞానం లేదు. అలసిన జీవునకు రాత్రి నిద్ర – తర్వాత శక్తి (ఉత్తేజిత) నిచ్చువాఁడు ఈశ్వరుఁడు. మూలము

పరబ్రహ్మ. జీవుని యందడఁగి యున్న నిద్రా శక్తి నుండియే "స్వప్న – జాగ్రత" లు కల్గును. నిద్రలో అహంకారము లేదు. ఏగుణము వ్యక్తం కాదు. జాగ్రత్ స్వప్న జగత్తులు – మనస్సు కూడా లేవు. మేల్కొన్నంతనే జగత్తు దర్శనమిచ్చును. మనస్సే సమస్తము.- ఈ మూడు వింత లోకములును అందరికి ప్రత్యక్షా నుభవములు.

ఇవే "త్రిపురములు". – జీవత్వమే "త్రిపురాసురుడు" అనగా "మనస్సు". అంబ – ఈశ్వర శక్తి ఆరాధకులనుద్ధరించుటకై – త్రిపురాసురుని "మర్ధించి" – మోక్షము కటాక్షించును. అదే "త్రిశూల" చిహ్నము.

మనస్సు అంతర్ముఖమైన, ప్రజ్ఞా రూపముగను, వెలుపల బ హి ర్గ తమైన మనో రూపముగను మారుచుండును. సంకల్ప వికల్ప స్వరూపిణి యైన మనస్సు – ప్రపంచ రూపమై – సర్వవాసనామయ సంసార బంధమును –పదిల పరచును. అదియే కారణ రూపమై – సుషుప్తిగా – "అవిద్య – అజ్ఞానము – ప్రకృతి – మాయ" అనఁబడును.

అందు వల్లనే "కార్య – కారణ" రూపమైన మనస్సు లేక పోవుటయే అమనస్క యోగ మనఁబడును. సమస్త ప్రపంచమునకును, అధిష్ఠానమై, అఖండమై యున్న పరబ్రహ్మమును , దర్శింపఁగల్గి నప్పుడు, కల్పిత "మనస్సు" అందే లయించి, సర్వత్రా అఖండ చిద్విలాసము ద్యోతమగుటయే "అపరోక్షానుభూతి" అందురు.

జీవుడు ఆత్మ ప్రతిబింబము – నిరుపద్రవుఁడు, పరిమిత శక్తి గల్గిన ప్రారబ్ధ ఫలభోక్త – నిగ్రహానుగ్రహ శక్తులు – స్వేచ్ఛలేక – దేహావరణ బంధితుఁడు. ఆత్మ – కూటస్థుడు (అనగా యింద్రియ సమ్మేళన కేంద్ర వాసి) – తాటస్థ్య సాక్షి – ద్రష్ట – నాటక దీపము – నిష్క్రియాపరుడు – ఫలభోక్తృత్వ – కర్తృత్వ – రహితుఁడు

విజ్ఞానమయ మరియు మనోమయ కోశముల యొక్క విలయావస్థ యే నిద్ర. అజ్ఞానము నందు విలయమగు చున్నవి.

జాగ్రత్, స్వప్నములు బీజ ప్రాయమున నిద్ర యందుండి – వికసించును – విజృంభించును. వట (మఱ్ఱి) బీజము నందు గర్భభూతమైయున్న "బృహత్ వృక్షా విర్భావము వలె – మాయామయ శక్తి ప్రభావమిదియే –

జీవాత్మ పరమాత్మయందు (ఆత్మ తత్వమున) విలీనమగుటయే నిద్ర – జీవుని సుఖ దుఃఖము లాత్మనంటవు. సుషుప్తి అజ్ఞాన సమాధి.

"సుషుప్తి స్థాన ఏకీ భూతః ప్రజ్ఞాన ఘన మేవ" -- శ్రుతి

తా॥ సుషుప్తి యందు ప్రజ్ఞాన నిధియైన ఈశ్వరుఁడు ఆనంద మయ కోశ మందున్నాడు.

మరియు –

"సుషుప్తి సంబంధమైన మాయయందున్న బుద్ధి వాసనలయందు ప్రతిబింబించిన ఆనందమయ కోశమును" – ఈశ్వరుఁడని యే వేదముల వచనము. అందు నిద్ర మాయా రూపిణియన్న పిదప ఆనందమయ కోశమునకు "సర్వజ్ఞత్వ" మాపాదించుట అనుభవ విరుద్ధముగాదు.

ఏ జగత్స్వప్నాది రూపమగు ప్రపంచమును ఆనందమయ కోశము పుట్టించెనో ఆజగత్తును, ఇంకొకవిధముగా మార్చుటకు, సమర్థత మరెవ్వరికిని లేనందున, ఆయానందమయ కోశమే "సర్వేశ్వరుఁడ"ని ప్రవచింపఁబడెను. అనగా ఎవ్వరెవ్వరి పూర్వ కర్మాను సారముగా (సంచిత ప్రారబ్ధానుసారముగా), పుణ్యా పాప (సుఖదుఃఖ) ఫలములు జీవునకు ప్రాప్తమగునని యర్థము.

ఆ యజ్ఞాన స్వరూపమైన ఆనందకోశమనెడి "కారణము" నందు, జీవుల బుద్ధి వాసనలు – "గ్రామ ఫోన్ ప్లేట్ల" లోని పాటలు, మాటల వలె, చేరి లీనమై – లీనావస్థలో నుండి, సూదులు తగిలించినంతనే "పాటలు - మాటలు" బయటపడునట్లు – ప్రపంచమంతయు "బుద్ధి వాసనలతో" – అనుకూల విషయ సాన్నిధ్యమున – స్పష్ట ప్రదర్శనమగుట సర్వానుభవము. కనుక, ఆనందమయ కోశము "సర్వజ్ఞు" డనబడెను.

నిద్ర యనగా సూక్ష్మేంద్రియములు మనస్సు నందు లయించుట. కాని ప్రాణాగ్నులు మాత్రము సర్వదా మేల్కొనియుండును. (ఉదానము) స్వాప్నికానుభవములను సూక్ష్మేంద్రియములద్వారా యజమానుఁడగు మనస్సునకు దృశ్య పరచును. – దశవాయువులును శరీర యంత్రమునకు చక్రములు వంటివి. –

మూర్ఛ – గాఢ నిద్ర – మరణముల మధ్యస్థితి, అనగా మరణోన్ముఖమైన గాఢ నిద్రావస్థ – మరియు "తురీయ – నిర్వాణ (మహా)" మధ్య స్థితి – జీవ బ్రహ్మైక్యము స్పష్టానుభవము, జాగ్రదవస్థనుండి – దిగజారి (నేత్ర స్థానమున నున్న విశ్వుడు) – తైజస స్వరూపుడగున – అనగా ఆత్మ తేజమందు క్రమముగా విలీనమగును. ఐక్యతఁగాంచును. ఇది అనుభవవేత్తల కవగతమగు సాధారణానుభవము.

| | |
|---|---|
| 5 జ్ఞానేంద్రియములు<br>4 అంతఃకరణములు<br>6 తేజములు<br>5 ప్రాణములు | పరమాత్మ యందు లయించిన -<br>మృత్యూన్ముఖమన్నమాట - |

| | |
|---|---|
| దశ విధ ప్రాణములు | I. ప్రాణాపాన సమాన ఉదాన వ్యానములు -- 5<br>II. నాగ కూర్మ కృకర దేవదత్త ధనంజయములు -- 5 |

"సమాధి" అనగా జీవ బ్రహ్మైక్యము – బ్రహ్మాభ్యాసము వల్ల లభ్యమగు బ్రాహ్మీస్థితి – బ్రహ్మా కారము.

సమాధి – పూర్ణ జ్ఞానానంద మయావస్థ , తురీయ – సంపూర్ణ – స్వస్వరూపానుభవ – బ్రహ్మానందానుభూతి అఖండత్వ – బ్రాహ్మీస్థితి – (Cosmos – Super Conscious State) – బ్రంహాండమంతయు – సంపూర్ణముగా "స్వర్ణ ద్రవము" (కోటి సూర్య ప్రభా భాసముగ) – నిండి – అఖండ – అనంత – అపరిచ్ఛిన్న – పరమాత్మ చిద్విలాసానుభవమే!! త్రిపుటి ( Trinity ) కతీతమైన సద్వస్తు ప్రదర్శనము – "భూమ" – "బ్రహ్మము" – "నేను" అన్నట్టి అద్వైత స్థితి.

మనో వృత్తులు – అంతఃకరణము - - - మూడు అవస్థలకు పై స్థితిః తుదిమొదలేకమై నిల్చు నదే బ్రహ్మము. దేహేంద్రియాదులు జడములు. అవినాశి – సర్వాంతర్యామి యైన భగవంతుఁడే – సద్వస్తువే – క్షేత్రజ్ఞుఁడై సర్వ క్షేత్రము (దేహము) లందును, భాసించు చున్నాడు.

"దేహాత్మ బుద్ధి" దేహమే తానను కొనుట – భ్రాంతి జన్యమే "అజ్ఞానము" – అవిద్య – మోహము – మాయ - - - ఆత్మ జ్ఞానమే అవిద్యా రోగమునకు ఏకైక పరమౌషధము.

మోహము అవిద్యా కారణము. తన్నివృత్తికి జ్ఞానమే పరమా వధి. <u>"నీవు దేహం కాదు – ద్రష్టవు" ఇదే జ్ఞాన మంత్రం.</u>

విషయములు విషపు తీగలు. పెరుగుచునే యుండును. మహా వృక్షములై యుగములుగా దేవుని జీవునిగా బంధి చేసినవి. వివేక విచార ఖడ్గంతో ఛేదింపకున్న – శాశ్వత బంధము – పతనము – సర్వ నాశము తథ్యము.

"బ్రహ్మ జ్ఞాన – ఆత్మ దర్శనా" – నంతరం, భర్జిత బీజము వలె, 'మోహము" మొలకెత్తఁజాలదు. వాసనలు, వాటంతటఅవే నశించును.

క్షుద్రము – నీచము – తుచ్ఛము – నింద్యము – క్షణికము – అశుభము అయిన విషయ సుఖములను పామర జనులు సేవింతురే గాని, సాధు సాధకులు తృణీకరించి, నిరాదరింతురు –

త్రిపుటీ రహిత }
ద్వంద్వాతీత } స్థితి,

జీవన్ముక్తి:
- సవికల్పము -- సంప్రజ్ఞాత
  - 1). దృశ్యాను విధి
  - 2). శబ్దాను విధి.
- నిర్వికల్పము – అసంప్రజ్ఞాత - ఇది బాహ్యాంతర భేదముల చేత 2 విధములు (యోగ భాగమున విమర్శింప బడ్డది)

బ్రహ్మా భ్యాసము వల్ల బ్రహ్మాకార ప్రాప్తి – ధ్యానాభ్యాసము ఫలము – తన్మయత్వము – జీవ బ్రహ్మైక్యము – ప్రాప్తించును.

మంచు కొండ కరిగి సముద్ర జలమున తన్మయ మందు నట్లు – జీవాత్మ అఖండ బ్రహ్మము నందు లయించును.

సమాధిని దర్మ మేఘమందురు. ఉపనిషత్తులను మేఘములు "అద్వైతామృత కుంభ వృష్టి ని" కురిపించును. సమాధి స్థితి (బ్రాహ్మీ స్థితి) నుండి యే, వేద మూర్తులైన మహర్షులు, "వేద – వేదాంత ప్రవచనముల నుడివిరి. అవియే "శ్రుతి – స్మృతులు". "సమాధి" నుండియే ఉపనిషద్ద్రష్టల – అమృత తత్వ సుధా వాహిని – అమరగానముతో – ప్రవహించి – ఉపనిషత్తులు రూపొందెను.

సమాధి దృఢమైనంతనే, అనాదిగ పేరుకొని కరుడు గట్టిన (అంతఃకరణ) వాసనలు – (హృదయ గ్రంధులు – చిదచిద్గ్రంధులు) నిశ్శేషమై నశించి, ప్రతి బంధకములు త్రెళ్లి – యోగి నిర్మలినాత్ముఁడగును, మూలా విద్యాంధకారము అడగి, చతుర్వేద మహా వాక్యానుభూతి, (అపరోక్షాను భూతి) లక్ష్యార్థ సిద్ధి, ప్రసన్నత, ప్రవిమల శాంతి, జీవ బ్రహ్మైక్యము ప్రాప్తించును. ముక్తి కరతలామలకము.

"తత్వనిర్ణయము + స్థిర నిశ్చయము + అచంచల ధ్యానము" వల్ల చిత్తైకాగ్రత నుండి బాహ్యా విషయా కర్షణలు – వాంఛలు – పూర్తిగా నశించి – అంతర్ముఖుఁడై  ఆత్మ తత్వ స్వస్వరూపాను సంధాన మనుభవించును. అట్టి జీవన్ముక్తులు – మహత్ములు – దివ్యమూర్తులు పరసు వేదుల వంటివారు. వారి కరుణార్ద్ర దృష్టి – ఆశీర్వాదములు - - - - "దర్శన – స్పర్శన – ప్రశ్నాదులు – ఎంత పాపులైనను సరే,  విమలినాత్ములై, పునీతులై, క్షణములో తరింపఁగలరు. వారి జన్మలు చరితార్థమగును. పరమ పాపులు గూడా పరమ పావనులగుదురు.

ఉ||  వాల్మీకి  --  నారదుఁని వల్ల

శతాంగుళీకుడు  --  బుద్ధుని వల్ల.

బుద్ధ గయలో – బోధి వృక్ష చ్ఛాయను – సమాధి సమాప్తి సమయమున – పుణ్య చరిత "సుజాత" – పాల పొంగలిని శ్రద్ధాభక్తులతో సమర్పించి తరించెను. తపస్వి – యోగి జఠరాగ్ని తర్పణం – బ్రహ్మ యజ్ఞ సదృశం, సాక్షాత్పరమాత్మను సంతృప్తి పరచినట్లు. ఇదే బ్రహ్మ తర్పణం కదా!! కోటి క్రతు ఫలం!!!

నిర్వికల్ప సమాధి దశయందు – అంతఃకరణ చతుష్టయము, ముఖ్యంగా చిత్త వృత్తులుపరమించును, యోగి స్వస్వరూపానందాను భూతి తో తన్మయుండై సంతుష్టుఁడగును. నిరవధికమై – ఇంద్రియాతీతమై – ఆనంద దాయకమైన – విశుద్ధ చిత్తము చే తెలియఁదగిన బ్రహ్మానంద సుఖమనుభవించును. స్వస్థితి – స్థిత ప్రజ్ఞ – సహజానంద దాయక మగు అచల – అమృతమయ బ్రాహ్మీ స్థితి యందు అఖండానందాను భూతితో రమించును – ఇది సర్వ సాధనల శుభ ఫలిత సర్వాతీత స్థితి – అంత్య సాధన పరమావధి. నిర్మల – నిశ్చల – విగత కల్మష – ఘనుఁడైన యోగి, బ్రహ్మాత్ముండై బ్రహ్మ స్వరూపుఁడగును. శాశ్వతానంద – మోక్ష ప్రదాయక – నిరవధిక సుఖ శాంతిని బడయు ధన్యుఁడు.

1. సమాధ్యవస్థ యందు బ్రహ్మానంద సుఖావిర్భావము కల్గునని మైత్రేయ శాఖయందు శాఖాయన్య మహర్షి – బృహద్రథుడను రాజునకుఁజెప్పెను.

2. కట్టెలన్నియుఁదహింపఁబడినప్పుడు, అగ్ని తన కారణమగు తేజస్సు నందు లయించునట్లు, సమస్త (అంతఃకరణ) వృత్తులు, సమాధ్యభ్యాసము చేత లయించుట వలన (తమ కారణమగు) సత్యమునందు లయించును.

షరాః- అహంకార విశిష్టమగు అంతఃకరణ విజృంభణమే (సత్వ – రజ – స్తమః కారణ కార్యములగు – జాగ్రత్స్వప్న సుషుప్తు లను) మూడు అవస్థలకును, మరియు, కర్తృత్వ – భోక్తృత్వ – అభిమానత్వములకు హేతువు.

సమాధి పలితము – ప్రయోజనముః-

ఆత్మాభిమానియగు మనస్సు తనకు కారణమగు సత్యమందు (బ్రహ్మమందు) లయించి, శబ్ధాది విషయములు లేని దగును. అందుచే, కర్మాధీనములగు, సుఖ దుఃఖ పరంపరలు (ద్వందములు) – అన్నియును మిథ్యా భూతములుగ దోచును.

యోగికి -- అభిలషించిన – కోరకున్నను, అష్ట సిద్ధులు లభించును – ఈలాగు అష్టైశ్వర్య ప్రాప్తి.

జ్ఞానికి -- దృశ్య జగత్తు సర్వం – హేయం – తుచ్ఛం –నింద్యంగా తోచును. "క్రక్కు" – వమన వస్తువుగా "కాకవిష్టం" – "సూకర మలం" గా - గర్హించి మోహము, ఇచ్ఛలు, భ్రాంతులు – వాసనలు పూర్తిగా నశించి, నిస్సంగుడై, నిర్వాసనా నిత్య తృప్తుడై, పరమ శాంతి – సుఖ – ఆనందానుభవిగ రూపొందును.

చైతన్యమునందారోపిత మైన జీవులనే చిదాభాసులందురు. (తెర మీద బొమ్మల కేర్పరిచిన బొమ్మల వస్త్రముల వలె) - పరమాత్మ నిర్వికారి – నానా జనన మరణములు - షడ్వికారములు చిదాభాసు(జీవు) లైన వారికే గాని, కూటస్థ చైతన్యము నంటఁ జాలవు. జీవుని (ప్రతి బింబిత) సంసార (భోక్తృత్వ) జనన మరణాదులు శుద్ధ చైతన్య మందున్నట్లు పొర పడుచున్నారు.

చిత్రాధార(శుభ్ర) వస్త్రము నందు వర్ణములు లేనియట్లు, ఆత్మయందే వికారములును లేవు. చిత్తరువు నందలి నదీ పర్వతములకు వస్త్రాదులు లభించుట లేదు. అట్లే సృష్టిలోని, భూమి మొ|| వాటికి చిధాభాసులనెడి వ్యవహారంలేదు.

చిదాభాసులనగా, చిత్ప్రతి బింబములు – చైతన్య వ్యవహార మన్నమాట. కావున ఆత్మయందా రోపింపఁబడిన సంసారము జ్ఞానము చేత నివర్తించును. ఆభాసకు అవిద్య (అజ్ఞాన) మే కారణము. అవిద్య యనగా జననమరణాది సంసారము (జీవ ధర్మములు) ఆత్మకు ఉన్నదనుకొనుట – ఇది జ్ఞానము చే నివర్తించును.




1. అన్నమయ - శుక్ల శోణిత సంయోగ జనిత పిండ దేహం. జనన మరణ పర్యంతం – దృశ్యం –జడం – స్థూలం – పాంచభౌతికము – అన్న రసముతో పెరిగెడిది.

2. ప్రాణమయ – 5 ప్రాణములు – ప్రాణ, అపాన, సమాన, వ్యాన, ఉదానములు, 5,కర్మేంద్రియములు,వాక్పాణిపాదపాయూపస్థలు = 10 తత్వములు

3. మనోమయ - 5 జ్ఞానేంద్రియములు – త్వక్ చక్షుశ్శ్రోత్ర జిహ్వా ఘ్రాణేంద్రియములు, సంకల్ప వికల్పాత్మకమైన మనస్సు- 1 + చలన రూప చిత్తము 1 = 2. (5+2=7)

4. విజ్ఞానమయ - 5 విషయములు – శబ్ద స్పర్శ రూప రస గంధములు 5, నిశ్చయాత్మకపు బుద్ధి – 1, (5 + 1 = 6).

5. ఆనందమయ - చిత్త వ్యామోహ జనిత అభీష్ట పదార్థ సందర్శనాను భవ జనిత సంతోష రూప మగు "ప్రియము" కామితార్థ లాభ జన్మ హర్ష రూపమగు మోదము + ఇష్ట కామ్యార్థానుభవ ప్రీత రూపమగు ప్రమోదము + మరియు, చిత్త వృత్తులతో కూడుకొని, విపులముగ కనబడుచున్నట్టి, సృష్టికి హేతుభూతమైన, ఆద్యంత రహిత "మూలా జ్ఞాన" రూపమగు "చీకటి – అంధకారము" – అహం తత్వం – (1) = 10 + 7 + 6 + 1 = 24 తత్వములు.

-- గీత యందు 13 అధ్యాయము చదువ నగును.

"స్థూల – సూక్ష్మముల" – సంబంధ (అనుబంధ) గాథ.

క్షేత్ర మెంత మంచి దైనను, బీజములు నాటని యెడల అంకురింపవు. కావున క్షేత్ర బీజముల సంయోగము చేతనే వృక్షము లుత్పన్నములు గావలెను. తద్రీతిగా భగవత్సంబంధ బీజ మనెడు జీవ కళను – శరీర మనెడు క్షేత్రమందుచిన

యెడల --- అది అంకురించి పురోభివృద్ధిఁ గాంచును. కావున, "క్షేత్ర – బీజ" సంబంధ మిట్టిదని తెలియ నగును.




కురు క్షేత్రమనగా = కర్మ భూమి – దేహము అని అర్థము. మానవ దేహ మొక పాంచభౌతిక – (పంచాయతీ పాలిత) జీవుని క్రీడా రంగ స్థలము.

ప్రవృత్తి X నివృత్తు లిందు పోటీపడి పోరాడు (ప్రకృతి, పురుషుల) లీలా వినోద నాటక రంగము. అందు దేవుడుండమువల్ల "ధర్మ క్షేత్ర" మనఁదగును.

ప్రకృతి -- (దేహ + ఇంద్రియ) – ధర్మము నాశ్రయించి, బాహ్యా ప్రపంచ, సుఖ సౌఖ్య విషయ పరంపరల యాకర్షణల మాయా మహేంద్రజాల – ప్రాబల్యా తాడన వాహినిలో తగుల్కొని విషయ భోగ ప్రవాహ గమన గతిని, సులభ, సుఖ, సాధ్య మార్గమున . . . . . పశు ప్రకృతికి దిగ జారి, అధః (దక్షిణ) పథమున "జనన – మరణ" చక్ర భ్రమణమున తగుల్కొను పక్షము - - - .

పురుష -- (పర – శుద్ధాంతః కరణ) ధర్మము నాశ్రయించి దైవ సంపదలనభిలషించి, అన్వేషించి, సర్వస్వము ఈశ్వరార్పణ బుద్ధితో (భక్తి, జ్ఞాన, వైరాగ్య, ధ్యాన) సత్పథ – ఊర్ధ్వప్రగతి గామియై – దివ్యత్వము నంది – (దేవుడై) జనన మరణ క్లేశ పరంపరలఁదాటి అమరత్వ "జీవ బ్రహ్మైక్య" పదవి నందుటః ఇదే ఎదురీత – దుర్లభ – దుస్సహ – దుస్సాధ్య – కష్టతర మార్గము. కాని, భద్రపథము. అమృత మయము.

ప్రకృతి – పురుషుల సంసారమే – "జీవ + దేహ" సంబంధము. వీరి పరస్పర అనురాగ మధుర ప్రేమమయ శక్తి సామర్థ్యముల పోటీ పరీక్ష లాద్యంతము. విమర్శించి, విచారించి, వివేచించగల ఏకైక దిట్ట – సర్వ సమర్థుడు "గురువే".

వీరి పోటీ పరుగులే – యీ అమర దాంపత్య క్రీడా విలాసమే జగన్నాటక రంగసీమ. ఈ పురాణ దాంపత్య గాథలే "సృష్టి –స్థితి –లయ" – నిగూఢ చిత్ర విచిత్ర మధురాను భూతుల ప్రసాదించు సరళియే "విభూతుల" విచారము".

ప్రాణము – పుత్రాంశ – నిట్టూర్పు – ఆవిసంకల్ప కారణము –బ్రహ్మ జనన కారణము.

ప్రకృతి – పురుషుల సంసార గాథా ప్రదర్శనమే – సృష్టి – స్థితులుః వాటి నిగూఢ – లయ – అజ్ఞాతత్వమే "లయము" – స్వస్థితి – సహజ స్థితి – అద్వైతము. వీరి అవినాభావ సంబంధమనాది.

అర్ధ నారీశ్వర తత్త్వము – ప్రకృతి పురుషుల నాటక రంగ ప్రవేశ ప్రథమ దృశ్యారంభ సంధి సమయము.

ప్రణవోద్భవ పంచ తన్మాత్రల (త్రిగుణాత్మిక) నుండి పంచభూతములందు – "భూమాత" – కడపటి బిడ్డ – అచల యోగిని – సర్వ శక్తి ప్రదాయని. సృష్టికి ముఖ్య ఉపాదాన కారణము.

కాని , మృత్తికాధారణం – గంగా స్నానం – వీటి మహత్యమెందరు గ్రహింప గల్గారో అనూహ్యము.



# 10. కర్మ – యజ్ఞము.
## (ప్రవేశిక)

1. కర్మ – విహిత (చేయ తగిన) – సామాన్య కర్మ.
2. వికర్మ – నిషిద్ధ (చేయ రాని) కర్మ.
3. అకర్మ – సోమరి – కర్మ భ్రష్టత్వము.

పాఠాంతరం –

1. కర్మ – సామాన్య
2. వికర్మ – అరిషడ్వర్గ దూర – నిష్కామ, దైవార్పిత (జ్ఞాన సహిత) కర్మ.
3. అకర్మ – అనాసక్త నైష్కర్మ సిద్ధి. అనగా కర్తృత్వరహిత – నిష్క్రియా పరత్వము.

అనగా – కర్మయందు అకర్మను చూచుట

– అద్దము వలె తగులు లేని తాటస్థ్యరీతి కర్మ.

చ|| శిథిలత లేని భక్తినతి – సేయుదు వేల్పుల కానుపర్వులున్
విధి వశ వర్తులావిధియు – విశ్రుత కర్మ ఫల ప్రదాతయ|
య్యధిక ఫలంబు కర్మ వశ – మట్లగుటన్ బనియేమి వారిచే
విధి కధికంబు గర్మమని – వేమఱుమమ్రొక్కి భజింతుఁగర్మమున్

తా|| దేవతలకు నమస్కారము. వారు సయిత మా దైవమునకు లోఁబడిన వారు కావున ఆ దైవమున కే మ్రొక్కెదను. ఆ దైవము గూడా కర్మాను సారముగనే ఫల మొసంగును. కావున కర్మకే నమస్కారము. ఫలము కర్మాధీనము గావున దేవతలు – దైవము తో పని యేమి. దేవాది దేవతలే దాట శక్యము గాని “కర్మ” కే నమస్కారము. --- భర్తృహరి.

కం|| కర్మములు మేలునిచ్చును
గర్మంబులు గీడునిచ్చుఁ – గర్మలుదనకున్|
గర్మములు బ్రహ్మకైనను
గర్మగుఁడై పరులఁదడవఁగా నేమిటికిన్||

-- భారతము.

**తా|| కావుస బరులకు హింసలు, గావింపగ వలదు తసకు కల్యాణముగా భావించి పరుల నొంచిస బోవునె తత్ఫలము పిదప బొందక యున్నే**

ప్రతి జీవుడికి తన పుణ్య కర్మల వల్ల మేలు, పాప కర్మల వల్ల కీడు సంభవిస్తుంది. సృష్టికర్త దృష్టిలో శుభాశుభ ఫలాలకు కర్మలే కర్తలు. కనుక కర్మానుసారంగా ప్రాప్తించే సుఖదుఃఖాలకు ఇతరులు కారకులని భావించకూడదు. అంతేకాదు ఆ కారణంగా ఇతరులను హింసించటం ఏ మాత్రం తగదు. తనకు మేలు కలుగుతుందని భావించి ఎవరైనా సరే ఇతరులను హింసిస్తే, వారు ఆ పాప కర్మ ఫలాలను అనుభవించక తప్పదు. తెలిసి చేసినా తెలియకచేసినా తప్పు తప్పే. శిక్ష

తప్పదు. అందుకే కర్మలు ఆచరించేటప్పుడు అందులోని మంచిచెడులను సమీక్షించుకోవాలి. తెలియకపోతే పెద్దలను అడిగి తెలుసుకోవాలి. సాధ్యమైనంతవరకు సత్కర్మలను అచరించడానికే ప్రయత్నించాలి. అప్పుడు సత్కర్మ ఫలితాలను అనుభవించవచ్చు.... అని వసుదేవుడు కంసునితో

అంటున్నాడు.

గీ॥ వ్రాత వెంట గాని వరమీడు దైవంబు
చేతకొలఁది గాని వ్రాత కాదు
వ్రాఁత కజుఁడు కర్త చేఁతకుఁదాఁగర్త
విశ్వధాభిరామ వినుర వేమ॥

-- వేమన

ప్రారబ్ధంభోగతో నశ్యేత్తత్వ జ్ఞానేన సంచితం।
ఆగామి ద్వివిధం కర్మ తద్వేషి ప్రియ వాదినోం॥

-- ఆత్మ విద్యా విలాసము

సదాశివేంద్ర (**శ్రీ శుకబ్రహ్మాశ్రమము, కాళహస్తి**)

పరోపకారాయ ఫలన్తి వృక్షాః।
పరోపకారాయ వహన్తి నద్యః।
పరోపకారాయ దు హంతి గావః।
పరోపకారార్థమిదం శరీరం॥

-- భర్తృహరి.

తా॥ పరోపకారము కొరకు వృక్షములు ఫలిస్తున్నాయి. పరోపకారము కొరకు నదులు ప్రవహిస్తున్నాయి. పరోపకారం కొరకు గోవులు పాలిస్తున్నాయి. ఈ శరీరము పరోపకారముకొరకే అని కవి హృదయము.

మానవ జన్మ కర్మ చేసి తరించుటకేః దేహము "ధర్మ – కర్మ" క్షేత్రము. బంధీ యైన దేహికి (క్షేత్రజ్ఞుని) తరణ సాధన. భూలోక జీవనము – దేహ ప్రసాదము – మోక్షోపాయ సాధనలకు యజ్ఞశాల – సంఘ బద్ధ జీవనము – విధ్యుక్త ధర్మనిర్వహణావశ్యకత – వర్ణాశ్రమ ధర్మ సంస్థాపన – సమాజములో అశాంతి – అలజడి – అక్రమం – అరాచకం ప్రవేశింపకుండుటకై రూపొందింపఁబడినవి.

ఉత్తమోత్తమమైన – బహు ధుర్లభమైన – మానవ జన్మమును వృథాచేసి, బ్రహ్మ జ్ఞానమును పొందని వాడు బ్రహ్మాత్యాపాతక (బ్రహ్మ ద్రోహ) మొనర్చిన వాడగుచున్నాడు.

మానవ జన్మ – అందు పురుషుడై – శుభ సంస్కారములు గల్గి – పవిత్ర వాతావరణమున – ఆరోగ్య – ఇశ్వర్య – రూప – గుణ – విద్యాదులతోడను – అనుకూలవతి యగు భార్య – మంచి బిడ్డలు – సుహృదయులగు బంధు – మిత్ర – ఆప్త బృందముతో – బ్రహ్మ కులము – వేద మతము – విద్య – విజ్ఞానము – దీర్ఘాయువు – శుభేచ్ఛ – సదాచార సద్వాసనలు కల్గి – సాధన చతుష్టయ సంపద్విభూషణుడై – ప్రయత్న పూర్వకముగ (పురుష) – వివేక వైరాగ్య భోధోపరతులతో – సద్గురు కటాక్షానుగ్రహమును నోచు కొన్న ధన్య జీవి – చిరంజీవిః అమృత స్వరూపుడు –

పురుష ప్రయత్నమున ఫలాను భూతినివ్వని జ్ఞానం వృధా.

లోకంలో ముువ్వురు నిద్ర పోరుః-

1. "యోగి -- 2, భోగి -- 3. రోగి."

ముువ్వురు సుఖులుః-

1. బాలుడు అవివేకులలో సుఖి.

2. సార్వభౌముడు వివేకులలో సుఖి.

3. బ్రహ్మవేత్త (ఆత్మసాక్షాత్కార మొందిన) అతి వివేకులలో పరమ సుఖి.

వేదముల వల్ల "కర్మ" పుట్టినది. వేదములు భగవంతుని యందు పుట్టినవి. సర్వ వ్యాపక కర్మ – వేదములందలి యజ్ఞములందు ప్రతిష్టతము లైనవి. ఇవి యజ్ఞకర్త మనోరథములకు తాత్కాలిక ఉపశమనములను ప్రసాదించును.

మోక్ష కాములు "యజ్ఞ – దాన – తప" సర్వ కర్మలన్నిటి యందును "ఓం తత్సత్" అనవలెను.

ఉపనిషత్తులు – "కర్మలు ఫలముల నిచ్చును. తర్వాత కర్మఫలాపేక్ష (ఆశల) త్యజింప మని బోధించును. నిష్కామ కర్మ భక్తికి – భక్తి జ్ఞాన యోగాదులకు – పిదప శాశ్వతానంద పదవికై ప్రయత్నింప ప్రోత్సహించును. కర్మలు (ఆత్మ – హృదయ) రహితమై, యాంత్రికము కారాదు. తర్క దూరమైన చిర కాలము మన జాలవు.

కర్మ త్రిగుణాత్మకము – (భగవద్గీత. ఆ. 14. – గుణ త్రయ విభాగ యోగము)

1. సత్వ గుణము -- "శ్రద్ధయే" సత్. అది లేకున్న "అసత్"; పరహితార్థం, త్రికరణ శుద్ధిగా – ఫలాపేక్ష లేక – న్యాయ (ధర్మా) ర్జిత స్థిర చరాస్థులను – శాస్త్రీయ పద్ధతులతో

– దేశ కాల పాత్రుల నెఱింగి – అర్హులైన వారికి "ఈశ్వరార్పణ బుద్ధితో" సమర్పించుట సాత్విక యజ్ఞమండ్రు –

2. రజో గుణము -- కర్మ ఫలముల (అపేక్ష) నాశించి, పేరు ప్రతిష్ఠలు కోరి, డాంభిక, బాహాట ప్రదర్శనలతో - - - - "ప్రేమ – కోపము – ఇచ్ఛ – మొ|| వాటి ప్రేరేపణతో చేయు కర్మ. –

3. తమో గుణము -- పాప పుణ్యా విచక్షణ – పూర్వా పర విచారం లేక – పాత్రాపాత్రల అర్హతాదులు గమనింపక, దుస్సంకల్ప ప్రేరేపణతో, భయము, అలసత్వము, పాపేచ్ఛ ఆధారంగా గల కర్మలు.

"దంత శుద్ధికన్న అంత శుద్ధి కావాలి"
"పుస్తక జ్ఞానం కన్న మస్తక జ్ఞానం శ్రేష్టం"
"వేయి మాటల కన్న ఒక్క అనుభవం లెస్స"!!

కర్మలు నాల్గు విధములు –

1. కామ్యములు - కోర్కెలు (సంకల్ప ప్రేరేపణల)వల్ల – ధన, కనక, వాహన, పుత్ర, పశు సంతాన, స్వర్గాది ఫలము నిచ్చెడు – పుత్ర కామేష్టి చిత్ర యాగ, జ్యోతిష్టోమాదులు – వ్రతములు – పూజలు – దాన దర్మాదులు.
2. నిషిద్ధములు - నిరసింపఁబడినవి – సురా పాన, జూద, పరదారాగమన, విషయలంపటత్వాది భోగముల వేట.
3. నిత్య కర్మలు - సంధ్యా వందన, పూజ, అగ్నిహోత్ర, పంచశీలాద్యనుష్ఠానములు (సత్సంగ – సద్గ్రంధ పఠన – సచ్చింతన – సద్గోష్ఠి – సదాచార – సత్కర్మాచరణాదులు).
4. నైమిత్తిక – జాతేష్టి – గృహ దాహేష్టి – విశ్వజిద్యాగాది శ్రౌత కర్మలు – (శ్రుతులు) – గ్రహణ స్నానాది స్మార్త కర్మలు (స్మృతులు).

ఏ వైనను, భగవదర్పిత బుద్ధితో చేసి అనాసక్తుఁడై, ముందు ప్రగతి (మోక్ష) మార్గమును మరువ రాదు. నిరహంకార – నిర్మలినాత్ముడై – యోగి –"తామరాకు మీద నీరువలె – కుమ్మర పురుగు వలె – ధర్మకర్తగా మసలు కోవలెను. బ్రహ్మవేత్త – స్థిత ప్రజ్ఞతో ప్రశాంతత – ప్రసన్నత – నిశ్చలత – అభయ స్థితుఁడై – మర్యాద, దయ,

ఉదారత, కల్గి, ఆవేశోద్రేకములు లేక "విశ్వ మానవ సౌభ్రాతృత్వ"మును త్రికరణాల ప్రదర్శింపఁదగును.

విధ్యుక్త ధర్మములు – ఇహ జీవిత మొక ఆత్మతత్వ పరిశోధన పరిశ్రమ సాధన ఘట్టము. వేదోక్త ధర్మ కర్మాచరణవిధానమును ప్రతిపాదించు శాసనములు వేదములందు ప్రతిపాదింపఁబడినవి.

పుణ్య కర్మలు -- బంగారు సంకెళ్ళు – స్వర్గ సుఖముల ప్రసాదించును.

పాప కర్మలు -- ఇనుప సంకెళ్ళు – నరక ప్రాప్తి.

రెండును బంధ కారణములే !!

పుణ్య పాప ఫల భోగానంతరం, పునర్జన్మ – దేహ ధారణ – ధరణిని తథ్యము!! కావున సర్వకర్మల ఫలాఫలములు "పర బ్రహ్మార్పణమస్తు" అనడమే భద్ర పథము.

విధ్యుక్త ధర్మములుః - ఇహ జీవిత మొక ఆత్మ పరిశ్రమ – పరిశోధన శాల – సాధన ఘట్టము. కర్మలను ప్రతిపాదించు శాసనములే వేదములు. అందు వేదోక్త కర్మలు ప్రతిపాదితములు – ప్రసాదింప బడినవి. కర్మ ప్రవృత్తికి (బంధము) – నిష్కర్మ నివృత్తికి (మోక్షం) నిష్కర్మయే ➔ ధర్మము➔ మోక్ష హేతువు. బ్రహ్మాచర్య సమేతమగు మహా తపమే – ఉచితోన్నత మార్గము.

నిష్కామియై – సర్వ సమత్వ దృష్టితో వర్తించి రాగ ద్వేషాదులు వర్జించినట్టి – స్థిత ప్రజ్ఞుని – (ద్వందాతీతుని) బ్రహ్మాభ్యాసము కడు గొప్పది.

క్లుప్తంగా ; -

--- ఉపవాసము చేయుటకన్న – బిచ్చమెత్తుట మేలు-

--- బిచ్చమెత్తుటకన్న శ్రమించి (కర్మ చేసి) బ్రతుకుట గొప్ప.

--- పామర వ్యవహారము కన్న శాస్త్రీయ కర్మాచరణ మంచిది,

--- కర్మ కన్న నిష్కామ (అనాసక్త) కర్మ శ్రేష్టము.

--- నిష్కామ కర్మ (ఈశ్వరార్పిత ఫల) భక్తి (సగుణోపాసన)కి తీసికొని పోవును.

--- సగుణోపాసన కన్న నిర్గుణోపాసన ఉత్తమం.

--- నిర్గుణోపాసికి బ్రహ్మాజ్ఞాన ప్రాప్తి (ఆత్మ – బ్రహ్మ సాక్షాత్కారము) తథ్యము.

దేహధారి బ్రదికి ఉన్నంత పర్యంతము కర్మలు మానుట కల్ల. దేహాతీత స్థితిలో – ఇక దేహ ప్రసక్తి లేనే లేదు. కాయ మున్నంత వరకు – కాయ కర్మలు – దేహ ధర్మములు అనుల్లంఘనీయము.

ధర్మ మనగా – వస్తు చయము యొక్క సత్యస్వరూప జ్ఞానము.

ప్రకృతి సహజ స్వభావ ప్రభావము వల్ల సంతృప్తి – సుఖము లభించు నట్లుండును. క్షణిక – ఖండ – బుద్బుద – తాత్కాలిక తృప్తి; ప్రేయము ప్రకృతి స్వభావము. శ్రేయము ఆత్మ ధర్మము : కాబట్టి ప్రకృతి స్వభావ జనిత ఇంద్రియోద్రేక విషయ లంపటత్వం (తగులు) – ను నిగ్రహించి శాశ్వతానంద ప్రాప్తి కి హేతువగు బ్రహ్మ సాక్షాత్కారమునకు పరిపూర్ణ పురుషప్రయత్నము న శ్రమించి విజయ మందడమే – ప్రతి మానవుని ప్రాథమిక విధ్యుక్త ధర్మము –

జీవితాద్యంతము “ప్రవృత్తి- నివృత్తి” శక్తుల పోరాట (సురాసుర సంగ్రామ సీమ) రంగమే యీ దేహము – మోక్ష సాధన యంత్రము – ముక్తికి నావ – ఆనంద ప్రాప్తికి – అమృతత్వమును ప్రసాదింప సహకరించు “తరుణో” పాయము. “దేహి – దేహ” సంబంధ సాంప్రదాయ విచారమే వేదాంత శాస్త్రము.

ఆత్మక “దృశ్యం” – దేహము. త్రివిధావస్థలకు మూలము. దేహము “ధర్మ – కర్మ” క్షేత్రము : దేవత్వ సంప్రాప్తికి – జీవోద్ధానార్థమై శ్రమించి – సాధించ గల మహా యజ్ఞశాల!! “దేహ – దేహి” సంబంధ మొక చిత్ర గాథ. జీవత్వ త్రిసోపాన పతన విషాధ గాథ – “జీవ ప్రశంస”లో చూడ తగును.

దేహేంద్రియ విషయ చింతనము – భౌతిక ఆవరణల సంకుచి తత్వము – బంధముః

ఆత్మార్పణము – త్యాగము – వివేక వైరాగ్యాది సాధన క్రియలు వికాస లక్షణములు –

<u>పురుష ప్రయత్నము -</u>

1. పంజర బద్ధ కీరము స్వేచ్ఛా విహారమునకై రెప రెప లాడినట్లు –
2. గ్రుడ్డు నుండి పిల్ల బయల్వెడలుటకు ప్రయత్నించు నట్లు.
3. బోనులో చిక్కిన ఎలుక విడుదలకై ఆరాటము.
4. నీటిలో మునిగిన వాడు గాలికై తపించునట్లు.
5. తల్లిని పోగొట్టుకొన్న పిల్ల ఆవేదన వలె.
6. కమలములు కమలాప్తుని రాకకు – చకోరములు స్వాతి వానకు –

అభిమానము – మమకారము – (బంధము) కల్గిన "జీవుఁడ"గును. అది లేకున్న "శివుడు"

I. కర్మల సిద్ధి కొరకు 5 కారణములు కలవు.

1. దేహం – "ఇచ్ఛాద్వేషములు" – సుఖ దుఃఖములు మొ|| ద్వందముల తో కూడిన అధష్ఠానము. భోగ్య వస్తువు – దృశ్యం – ద్వందములు X మోక్ష సాధన కుపయుక్తమైన సాధనము – ఉపాధి.
2. భోక్త యగు జీవుఁడు – (అహంకారము) – చైతన్య ప్రతి బింబమగు – ఆభాసకుఁడగు – జీవుఁదు - (చైతన్య మను మరుపు).
3. కరణములు (సర్వేంద్రియములు) – కర్మ – జ్ఞాన – అంతరింద్రియములు సహా (5 + 5) = 10 + 4 = 14.
4. ప్రాణములు (దేహయంత్రమందలి చక్రములు) – (5 + 5 = 10) – ప్రాణాపాన సమాన ఉదాన వ్యానములు – 5,
   + నాగ, కూర్మ కృకర దేవ దత్త, ధనంజయములు -5 = 10
5. దైవము – సర్వేంద్రియాధిష్టాన దేవతలగు – వరుణాగ్ని సూర్య యమాశ్వినీ దేవతాదులు – కర్మాధికారులు – కర్మ ప్రేరేపకులు – కర్మలను కలింగించు వారు. (ఆత్మ సాక్షి – తటస్థ – ద్రష్ట – నియామక – కర్త) తటస్థుడు – సాన్నిధ్య ప్రభావ జనితములే పై "5" ను - ఇంత తతంగ కథలుండగా – తానే చేసినానని భ్రమించెడి అజ్ఞాన (అహంకార) మే – "మాయ" - - పై సత్య జ్ఞానము గల "వివేకి" – "తటస్థుడే" – జ్ఞాని – ముక్తుడు. కర్తృత్వ రహితుఁడేమి చేసినను చేయనట్లే. –"ఆత్మకు – కర్మకు" యే పరస్పర సంబంధము లేదు. – పై 5 కును "ద్రష్ట – సాక్షి" –

పై కారణములు 5 ను – కర్మను – కల్పించును – ఇంద్రియ - ప్రాణాది దేవతలు ఆత్మకు దృశ్యములు – ఆత్మ యొక్క సాన్నిధ్య బలముతో తమ తమ కార్యములను నడుపును. ఆత్మ సాన్నిధ్య ప్రభావ సత్తా లేకున్న – అవన్నియు శూన్యము - నిష్ప్రయోజనము – నిష్క్రియాదికములే. కావున ఆత్మ సాక్షి – నియామకుడు – చైతన్యమూలము – అధికారి – స్వంతదారు – సార్వభౌముఁడు -

"శరీర వాఙ్మనోభిర్య త్కర్మ ప్రారభ తే నరః" – మనో వాక్కాయ కర్మలను త్రికరణ చక్రం –

ఆత్మ అధికారి – ప్రొప్రయిటర్ – అతని సాన్నిధ్య (ఆసరా) బలము తో - - - - జీవుడు (ఫల భోక్త) మేనేజర్ (డ్రైవర్) – కరంటు –ఆవిరి - నీటి శక్తి – (విద్యు చ్ఛక్తి) వంటిది ఆత్మ –

తక్కిన పై పేర్కొన్న "5" సాధన యంత్రాంగ భాగములు – (క్రియా రంగ చక్రములు = మొరలు) – యందు ఏది లోపించినా కర్మ చక్రం ఆడదు.

మనో వాక్కాయ కర్మలనెడి త్రికరణ చక్రం ---

1. మనస్సు సంకల్పించి కర్మల ప్రోత్సహించును.
2. సంకల్ప బలమున "వాణి" (వాక్కు) ఢమరుక వలే ధ్వనించి – శాసించును.
3. శరీరము (జ్ఞాన + కర్మ ఇంద్రియములు) – కర్మల సాధించును.

మనస్సు – అజ్ఞాన (మాయ) పరిణామమే దీనికి మూలము. "అవిద్య" ః సర్వదా పై 5 కారణములందు గల "కర్త" (ఆత్మ)ను, అంట బట్టుకొని యుండి – త్రికరణముల ద్వారా (కార్య) కర్మ సాధన సాగించును. ఆత్మ సాన్నిధ్య బల ప్రభావమున (నిష్క్రియా పరుడైన బ్రహ్మ) కర్మలు క్రమముగా జరుగును. ఆత్మ "కరెంట్" వంటి వాడు. - - కరెంటు (చైతన్య శక్తి ప్రభావమున) – బల్బులు వెలుగును. – ఫ్యాన్లు తిరుగును – స్టౌలు మండును. స్పీకర్లు మాట్లాడును – యంత్ర చక్రములు చలించి పని చేయును.

ఆత్మాభిమానము చేత ప్రతి బింబించిన చైతన్య శక్తి కర్మలకు కర్తగా నున్నది. కర్మ కారణము. ఫలము ఆత్మ నంటవు.

మనుష్యుడు
- కర్త – బలము – సాక్షి- చైతన్య భాగము.
- సమస్త యంత్ర జాలము అనగా కర్మ – సాధన సామాగ్రి – (సమస్తేంద్రియములు + ప్రాణము + అగ్నులు) + సర్వం జడం –

అభిమానము (అహంకారము – మమకారాదులు) లేకున్న కర్మయే లేదు. కర్తృత్వము (ఆత్మాభిమానము) అవిద్యా జనితము. ఆత్మ నిర్వికారి. కూటస్థ – తటస్థ – సాక్షి – కేవలం "చైతన్యము" – నిర్వికార – నిష్క్రియా పరు "నాటక దీపము" – సాన్నిధ్య సహజ స్వభావ ప్రభావ జనిత "శక్తి" కి మూలము – అవిద్యారూపజ్ఞానాభిమానమే

"జీవ"సంజ్ఞ. ఆత్మకు బంధ – మోక్షములు లేవు. "అభిమానం – మోహం – అహంకారం" – బంధం = ముడి = "గ్రంథి" – కర్త – చైతన్యమాత్మ – శరీర బంధియై – కర్మల దోపించును. సమస్త దృశ్య జాలమును తన కాంతి స్వభావముచే కనబడునట్లు చేయును. కాని తాను చూడడు – చూచునది "మనము" (కన్నులు – విశ్వుడు – ఆభాసుడైన "జీవాంశ") –




**"అధిష్టానం తథాకర్తా కరణం చ పృథక్ విధం"** --

**సర్వ జీవులు** భగవత్స్వరూపులే ! సమస్తము ఆత్మకు దృశ్యముః

ఎవరి ధర్మమును వారవలంబించి – త్రికరణ శుద్ధితో – సంపూర్ణ శ్రద్ధాసక్తి – భక్తి యుక్తులతో – లోక హితార్థమై – ఆత్మోద్ధరణార్థమై – నిర్వహించుటకు స్వతంత్రులై వుండ వలెను. ఇదియే మానవుల యభివృద్ధికి కారణమైయున్నది.

ధర్మము ⟶ స్వ ----ధర్మ – కుల – మత – వర్ణ – సంఘు – ఆశ్రమ – జాతి – రీత్యా పలుముఖములుగాఁనుండును.

కర్మ వీరుడు – ప్రతి జీవుడు (దేహి) – తమ తమ విధ్యుక్త ధర్మ నిర్వహణ భాధ్యత ల తప్పించు కోరాదు – "కర్మకురు" – కర్మ చేయుము – నీవు నీ ప్రకృతికి తగిన చిత్త వృత్తుల రీత్యా స్వ స్వభావ జనిత – నియమిత – శాస్త్రీయ – సంఘు బద్ధ – కర్మలనాశ్రయించుము – ఉ|| ధర్మ వ్యాధుఁడు.

స్వధర్మ మనగా — స్వ కాలిక / స్వజాతీయ / స్వదేశీయ

శాస్త్ర భాషలో — వర్ణ (4), ఆశ్రమ (4) ధర్మములు

ధర్మము విశ్వ జీవనమునకు కర్ణధారి. ధర్మమును కాపాడినచో, తిరిగి అతనిని చేరి రక్షింస్తుంది – సర్వ లోక సుఖ సౌఖ్య ప్రధాయిని ధర్మము –

సందేహము విమర్శనీయములు } 1. రామాయణములోని శంబుక వధ – సమర్థనీయమా? అయితే, వాల్మీకి, విశ్వామిత్రుల నెందుకు చంపరాదు? సమర్థించే వన్నియు – ఆదర్శాలు – దివ్య సత్యాలేనా?

2. రామాయణ కాలంలో శరణన్న విభీషణుడు పరమ భక్తుడు – రాజ నీతిజ్ఞుడు – (రాక్షస కుల – వంశ – దేశ - వినాశ కారకుడు వారి దృష్ట్యా) –

3. మరి భారత యుద్ధకాలంలో – ధర్మ కోవిదులు సర్వజ్ఞులు – జ్ఞాన వృద్ధులైన, భీష్మ ద్రోణ కృపా శ్వర్థాములు - - - ధర్మ పక్ష మెఱింగియు – రాజ రాజు వీడ కుండడము కూడా - - - సమర్థించఁబడడం (2) కి విరుద్ధముగా ధ్వనించదా? “ఇవే నా ధర్మ సందేహాలు” --- (స్వగతం)

జగచ్చక్రం – కర్మ చక్రం –

భగవంతుని నుండి వేదములు → వేదముల నుండి → కర్మలు, కర్మల నుండి → యజ్ఞములు → యజ్ఞముల నుండి → మేఘములు (వర్షములు) → వర్షము నుండి అన్నము → అన్నము నుండి భూత జాలము, శరీరములు – అనగా మనుష్యులు తిరిగి → యజ్ఞములు ఆవశ్యకత.

కాని, జ్ఞాని కర్మ బద్ధుడు కాడు. అతనికి విధి నిషేధములు లేవు. అతడే బ్రహ్మామైనప్పుడు, అతడు ఎవ్వరి కొరకు, ఎవ్వరి ప్రార్థించి కర్మలు చేయాలి? . . . . కాని లోక కల్యాణార్థమై (లోక సంగ్రహార్థమై) – ఆదర్శంగా కర్మలఁజేయతగును.

ఉ|| జనక – కేకయ రాజు – అశ్వపతి – అంబరీషుడు – భగీరథుఁడు – ప్రియ వ్రతుఁడు – ధర్మజభీమార్జునులు – శ్రీ కృష్ణ పరమాత్మ సహా – కర్మ సిద్ధాంతమును పోషించి ఆచరించినవారే. –

"పరహితార్థ ప్రాపకుల్ సజ్జనుల్" -
గుణములే కర్మలకు ప్రాపకం –
-- భర్తృహరి.

| | | |
|---|---|---|
| పాప పుణ్య కర్మములకు రంగము | భూలోకమే "కర్మ క్షేత్రము" | దేవలోకాలు పుణ్య ఫల భోగ భూములు. |




2. నిష్కాముఁడవై యొనర్చు (ఈశ్వరార్పణ బుద్ధితో) కర్మలఁజేయు - - - కర్మ యోగులకు ఉత్తర (ఉత్తమ) గతులుండునే గాని, మోక్షము లేదు –




మరణ (పాప) భీతియే పునర్జన్మకు పునాది – బీజము – ప్రాతిపదిక. పూర్వ జన్మములందలి (సంచిత) సంస్కారముల బలము వల్ల మనోవృత్తులు (సంకల్పములు) ఉత్పన్నములగు చుండును. కొంత వరకు ప్రస్తుత జన్మ యొక్క పరిసర, సన్నిహిత, కుటుంబ, కుల, సంఘ, దేశ, మత, వాతావరణ పరిస్థితుల ప్రభావము కూడా, చాల వరకు మనోవృత్తుల మీద ప్రతిఫలించును.

ఇటు వంటి సూక్ష్మవృత్తుల నెదుర్కొనుటెట్లు?

సహజ వృత్తులు సంస్కార రూపమును పొంది నిద్రాణమై చిత్తమునందణగి యుండును. గ్రామఫోను ప్లేట్ల యందిమిడి (అణగి) యున్న పాటలు

– సూదుల స్పర్శ (సంఘుతము) తో బయల్పడునట్లు - - అనుకూల పరిస్థితులందు అవి విజృంభించి వ్యక్తమగును. కావున, ఆలాంటి సహజ చిత్త వృత్తులు వికసింపకుండ (తల యెత్తకుండ) నిరోధమునకు "ధ్యాన" మత్యంతోపకారి. దానికి, విచార, వివేక – వైరాగ్య బోధోపరతులు వెన్నెముక వంటివి.

సుర X అసుర; సత్ X అసత్; సద్వృత్తులు X దుర్వృత్తులు – సృష్టిలో సంఘర్షణ – ద్వంద్వముల తాకిడి – సర్వసహజము. మనస్సున కొక నిర్ణీత రూపము లేదు. ఏ రూపమును కూర్చి చింతించిన – ధ్యానించిన – "యధ్భావో తద్భవతి" గా – తద్రూపమును పొందును. కావున, నిరంతరం "ఆత్మధ్యానము" చేయుట వల్ల, మనస్సు విషయ చింతనము మాని, క్రమముగా - - - సంగ వివర్జితమై - - - ధ్యేయాకార మొందును.

ఆత్మ నిత్య సత్యజ్ఞాన – ఆనంద స్వరూపము. సంకల్పము కంటె ప్రపంచము వేరుగాదు. కాబట్టి, ఆత్మయే సంకల్పము. సంకల్పమే ప్రపంచము. అనగా :- "ఆత్మనుండి → సంకల్పము → ప్రపంచము" . . . . క్లుప్తముగా ప్రకృతి పురుషుల మధ్య (సంకల్పము = మనస్సు) – "సృష్టి లయములకు" (విలీనమునకు) – దోహదమొసంగును. . . . "ఈ మూడును ఒక్కటే" . . . . ఒక్కటినుండియే, మూడును ఉత్పన్నమైనవి. యీ రహస్యము విచారములేనందున . . .ఈ భ్రాంతి ద్యోతమగుచున్నది. ఆభ్రాంతి నశించిన . . . స్వస్వరూప (ఆత్మ) జ్ఞానము కల్గును. కావున, తక్షణమే ఆత్మ విచారము ప్రారంభించుము.

"ఏకంసత్ విప్రా బహుధా వదంతి"

– ఋగ్వేదము

తా|| ఉన్నది ఒక్కటే. బుధులు అనేక విధములుగా వర్ణించు చున్నారు.

మానవుడు = మనస్సు గలవాడు – దేహి "ధర్మ - కర్మ" క్షేత్ర (కురు క్షేత్ర) గతుఁడు.

పది రథములు (దశేంద్రియములు) } గలవాడు –
నాలుగు విమానములు (అంతఃకరణ చతుష్టయము) } మహాయోధ –

స్వేచ్ఛా ప్రియుడు, ఆనందమయుడు – కల్ప కల్పాంతరములనుండి – జన్మ జన్మాంతరములనుండియు – స్వస్వరూపచ్యుతి నొంది (తన్ను తాను మరచి) – దేహోపాధియై – బాహ్య వృత్తులకు మరగి – విషయ లంపటత్వమున - - - అల్ప

సుఖాపేక్షతో తృప్తి నొంది - - - బందీయై . . . దేహాత్మ బుద్ధిగా – (దేహమే తానని భ్రమ జ్ఞానంతో) . . . సతమతమవుతూన్న వాసనామయ జీవి, ఈలాంటి స్థితిలో కర్మలు చేయడం మానడం కూడా దుర్లభమే.

ఇంద్రియోద్రేక సహజ సంచలనము (బాహ్యా విషయ ప్రవృత్తి) నరికట్టి – నిగ్రహించి మనస్సును (ఇంద్రియములను గుఱ్ఱముల కళ్లెములను గట్టిగా లాగి పట్టినట్లు చేసి) అంతర్ముఖమొనర్చడం - - - మహా ప్రవాహమున కెదురీత వంటిది. ఇందుకు అమోఘమైన ధైర్యము – చిత్త స్థైర్యము నిగ్రహ శక్తి – బుద్ధి కుశలత – “శాస్త్ర జ్ఞానము – గురు అనుగ్రహము – దైవ కృప” – అత్యావసరము.










మానవుఁడు కర్మ జీవి, కర్మలెప్పుడును కాపాడ బడుగాక!!
దైవ మార్గమందున్న వాడెన్నడును అపమార్గమునఁబోడు.
మోక్ష సిద్ధి ప్రాప్తించు వరకు పునర్జన్మలు కలుగుచుండును.

మరణానంతరము (స్థూల దేహము పతనమైన పిదప) – లింగ శరీరము (సూక్ష్మ – అంతఃకరణాదుల తోడి - 19 తత్త్వములతోనున్న) – పూర్వ జన్మ ఫలా పలములను – సంస్కారములను బట్టి (తొడుగు కొని – ధరించి) – దేహాంతర ప్రాప్తి – (పునర్జన్మ మొందును) –

పాపులు పోవు మార్గములు 3 — లోభ, కామ, మోహ — ఇదే త్రిద్వార నరకము

శ్లో|| యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగ సేవయా
యత్ర చైవాత్మనాత్మానం పశ్య న్నాత్మని తుష్యతి.

తా|| ఎప్పుడు మనస్సు బాహ్య దృష్టికిదూరమై, లోదృష్టియందే లగ్నమై ఆత్మయందే నివసించునో –

శ్లో|| తం విద్యా ద్దుఃఖసంయోగవియోగం యోగసంజ్ఞితమ్
స నిశ్చయేన యోక్తవ్యోయోగో నిర్విణ్ణచేతసా

తా|| ఇంతవఱకు చెప్పబడిన ఆనందస్థితికి యోగమని పేరు. ఎట్టికష్టములు వచ్చినను(పుత్రవియోగ కళత్ర వియోగ మిత్రవియోగ ధనవియోగాదులు) వదలక పట్టుదలతో పొందవలసినది. ఏలనన? దానిగొప్పదన మట్టిది! అనుభవించినవారి కెఱుక!

శ్లో|| ప్రశాంతమనసం హ్యేనం యోగినం సుఖ ము త్తమమ్
ఉపైతి శాంతరజసం బ్రహ్మభూత మకల్మషమ్.

తా|| కోరికలు చచ్చి, అంతయు భగవన్మయమని చూచువానిని, మోక్ష లక్ష్మి తనంత తానే వరించును.

ముఖ్యముగా "జిహ్వ & గుహ్యము" లు పూర్తిగా స్వాధీన మైన చాలును.

శ్లో|| యుంజ న్నేవం సదాఽఽత్మానం యోగీ విగతకల్మషః
సుఖేన బ్రహ్మసంపర్శ్య న్నత్యంతం సుఖ మశ్ను తే.

తా||పాపములు పోగొట్టుకొనవలయును: భగవంతుని సేవ చేయవలయును. ఆయనతో నిత్య సంబంధము నేర్పాటు గావించుకొనవలయును. మనస్సు తన్మయము గావలయును. అపుడు శాశ్వతానందమన నేమోఅ నుభవమునకు రాగలదు.

-- భగవద్గీత. అ. 6, శ్లో. 20,23,27,28 మొ||

విభిన్న భావములు – సంస్కారములు – గల వైజ్ఞానులకు – సర్వ సామాన్య – సర్వాంగీకార – ఉచిత ధర్మములను "గీత" ప్రసాదించినది: ముఖ్యముగా "శ్రద్ధ" – ఇంద్రియోద్వేగ విజృంభణ పరంపరలను అరికట్టి – నిశ్చల – నిర్మల – ప్రశాంత ప్రసన్న దృష్టిని భగవంతునిపై (లక్ష్యముపై) – లగ్న మొనర్చుట వల్ల – అంతర్వాణి వినిపించి, బాహ్యా బంధములు క్రమముగా సడలి – నశించును. తనకు తానై నిల్చును –

కాని, ఇంద్రియోద్వేగముల నెదుర్కోని నిగ్రహించి, రాగ ద్వేషాదులకు లోనుగాక "ప్రకృతి" ప్రవాహమునకెదురీది – రొమ్మొడ్డి – మాయా మహేంద్రజాల అఘటనాఘటన – చిత్రవిచిత్ర కల్పనలకు సమ్మోహితుడు గాక – వివేక వైరాగ్య భోగోపరతుల సాయమున – సత్య దర్శనానంద స్థితప్రజ్ఞుడై – "సర్వసార్వభౌమత్వ పట్టాభిషేకము"నకు నోచుకొనుట ఎంత శ్రేయస్కరమో ఊహింపనలవిగాదు.

సావధాన! ఇప్పుడు నీవెవ్వడు? సమస్త చరాచర – అనంతకోటి బ్రహ్మాండముల కెల్ల వారసుడవు. అమలు జరిపి నీవే అఖిలాండేశ్వరుఁడవని ప్రకటింపలెమ్ము!! అమృత స్వరూపుఁడవైన నీవు "జీవుడవు కాదు – సాక్షాత్ దేవుఁడవు సుమా!! ముమ్మాటికి సత్యం. విజయీభవ - మహర్షుల ఏకైక ప్రవచనము – (వేదాంత ఢిండిమము – సిద్ధ గీత)

కర్మ
- ప్రవృత్తి (1) ఫలేచ్ఛగలది- కామ్య – స్వర్గ సుఖ భోగ ప్రాప్తి – పునర్జన్మ తప్పదు -
- నివృత్తి (2) ఫలేచ్ఛ లేని – నిష్కామ (అనాసక్త) – మోక్షమునకు దారి తీయును –

(1) స్వర్గము – భోగ భూమి – పుణ్యఫల భోగ రాజ్యము. దివ్యసీమ. ఫలభరిత వృక్షములున్న నందనోద్యానవన జీవనము. "క్షీణే పుణ్యే మర్త్య లోకం విశంతి" – పుణ్య ఫలభోక్తృత్వానంతరం. . . . భూమిమీద పడద్రోయుదురు. పునర్జన్మ తప్పదు. తపస్సు – ధ్యాన – యోగ – జ్ఞాన – సాధనల కనువుగాదు. సూక్ష్మరూపమున స్వర్గమునుండి దిగజారి మంచు

బిందువులతో కలసి – ధాన్య ఫలాదులందు లయించి – అన్న రూపమున – పురుషులందు సప్త ధాతు పరిణామానంతరం (7 నరకముల ననుభవించి) – వీర్యరూపమున స్త్రీ యోని (వైతరణీ నరక ద్వారమున) జొచ్చి “శుక్ల శోణిత” సంయోగ జనిత పిండాకృతిని దాల్చి – గర్భ వాసమున గర్భస్థ శిశువుగా – పూర్ణ జ్ఞానముతో నవ మాసములు గర్భ చెర (యుగములుగా) ననుభవించి, తపించి – విలపించి – పరి పరి విధముల పశ్చాత్తాప తప్తుడై – యాతనలఁజెంది – భగవంతుని వేడికొని – భూ పతనమై – (జన్మ నొంది) అన్నీ మరచి, తిరిగి చర్విత చర్వణముగ యధా విధంగా “పూర్వ వాసనల ప్రాబల్య వశమున మామూలు గతి ప్రాప్తించును.

(2) మోక్షము –ఫలించనిది. (భర్జిత బీజ న్యాయవత్) – పునరా వృత్తి లేనిది.

ద్వంద్వాతీత - - నివృత్తి పథ – జన్మ రాహిత్య – అపరోక్షానుభూతి – కర్మ ఫలములను వదలక – కర్మలనే వదలువాడు – కర్మ దూరుడు – కర్మ భ్రష్టుఁడగును (10 + 4 ఇంద్రియముల క్రియలన్నియు కర్మలే) – నిష్క్రియా పరుఁడు – నిర్వికల్ప సమాధి యందు గాని – అతీత (తురీయ) జ్ఞాని గాఁ నుండ వలెను. కర్మ చెయ్యని వారు లేరు. కర్మ చెయ్యకను ఉండ లేరు.

పురుషుడు – పురము(దేహము) నందున్నవాఁడు.

మానవుఁడు – దేహి – దేహగతుఁడు – దేహ ధారి – ధర్మకర్మ క్షేత్రజ్ఞుడు.

“దేహి – దేహ” సంబంధమే సంసారము –

ఆత్మ - { అంతర్ముఖ స్థితి – బ్రాహ్మీ స్థితి – జ్ఞాన ఫలము-<br>ఇదే ధ్యాన మార్గమందురు.<br>అంతర్ముఖ గమనం – పరమాత్మ సాన్నిధ్య ప్రాప్తి

మానవుఁడు –

దేహము - జగత్తు (బాహ్య) విషయాకర్షణలు – లోక బంధము –<br>జనన మరణ చక్ర భ్రమణ.

యోగము ⟨ మనోబంధము – జ్ఞానము – / ప్రాణ బంధము –యోగము ⟩ ప్రాణ + మనో బంధము = రాజ యోగము

(తారక – సాంఖ్య అమనస్కములని 3 భాగములు)

సమస్త కర్మల ఫలములు నాకర్పించి (నిష్కామ – అనాసక్త కర్మాచరణ వల్ల) నచో సన్యాసి వగుదువు.

కర్మలు చేయుచో "యోగి వగుదువు" - ఈవిధమున భగవర్పిత బుద్ధితో కర్మలొనర్చిన – పాప పుణ్యము లంటవు – నన్నే పొంద గలవు –

త్యాగము - కర్మ ఫల త్యాగము –

సన్యాసము – కర్మలనే విడుచుట –

భోగమున కన్న త్యాగమే మధురమైనది.

జ్యోతిష్టోమాది కామ్య కర్మలను వదలుట - సన్యాసము.

నిత్య నైమిత్తి కాది కర్మలను – ఫలాపేక్ష లేక చేయుట – త్యాగము.

1. కర్మ ఫల త్యాగము –
2. నిషిద్ధ – అనగా – రాజస, తామస కర్మలు మానుట.
3. తుదకు ఆ త్యాగాన్ని కూడా త్యజించి – అహంకరించకుండుట.

"నిగర్వి నని కూడా గర్వింపరాదు. –

" త్యాగ మొనర్చినానన్న అహంకారము (ప్రజ్ఞ) కూడా నశించాలి!!

| | | |
|---|---|---|
| కర్మలు విభజన క్లుప్తంగా | సాత్విక | యజ్ఞ |
| | రాజస | దాన |
| | తామస | తపస్సులు |

ఓం = సాతత్వము
తత్ = నిర్లిప్తత
సత్ = సాత్వికత

హింసాత్మక, అసత్య – చౌర్య - దుర్భాషణాదులు – నిషిద్ధ కర్మలు.

"దేహమే దేవాలయం – జీవుడే దేవుడు"

అన్ని కర్మలు, ఆత్మ పరంచెయ్యి – నిర్భయంగా వుండు!! శాస్త్రీయ (వేదోక్త) కర్మలు చెయ్యడం మంచిది – ఆ కర్మల ఫలం – నిష్కాములై ఈశ్వర (ఆత్మ) పరం చెయ్యడం భద్రపథంః తద్ద్వారా సతతం ఈశ్వర (ఆత్మ) ధ్యానం లభిస్తుంది గదా! అందువల్ల నిరంతర భగవచ్చింతనం వలన భక్తి యావర్భవించి, క్రమముగా సగుణోపాసన నుండి నిర్గుణోపాసన లభించి – తద్వారా ఉపాసనా సిద్ధి – ఏకాగ్ర లక్ష్య చింతన - - ఆవర్భించును. మనస్సు అంతర్ముఖ స్థితి నంది – యోగ సిద్ధి కల్గును.

శ్లో|| ప్రారబ్ధం భోగతో నశ్యేత్ తత్వ జ్ఞానేన సంచితం|
ఆగామి ద్వివిదం కర్మ తద్వేషీ ప్రియవాదినోః||
హరిణాపి హరేణాపి బ్రమ్హాణాపి సురైరపి|
లలాట లిఖితా రేఖా పరిమార్జుంనశక్యతే||

త్రివిధ కర్మ
- ప్రారబ్ధం – (1) ఈ జన్మమున అనుభవవించ వలసినది.(Budget)
- ఆగామి – (2) ఈ జన్మమున ఆర్జించినది – (During this life)
- సంచితం –(3) పూర్వ జన్మములందు ఆర్జించిన(పుణ్య పాప) కర్మ ఫల సముదాయము – నిల్వ మొత్తం – (B/O – Assets & Liabilities)

i). ప్రారబ్ధం – ఈ జన్మ జీవనానికి కేటాయింపు (బడ్జెట్) – "చేసుకున్నవారికి చేసుకొన్నంత" అన్నట్లు – ప్రస్తుత జన్మమునందు – అనుభవానికై ప్రత్యేకింపఁబడిన "కర్మ ఫలానుభవం" –ఇది మూడు విధములు –

ప్రారబ్ధం (భోగము)
- ఇచ్ఛ – స్వయంకృతం – స్వేచ్ఛగా భోగ విషయ కాంక్షలు –
- అనిచ్ఛ – ప్రమాదములు – రోగములు –
- పరేచ్ఛ - పరుల వల్ల – జంతుజాలముల వల్ల -

"ప్రారబ్ధం భోగతోనశ్యేత్" – భోగం (అనుభవం వల్లనే సమయును) వివరములు – సోదాహరణంగా తర్వాత వివరింపఁబడినది. – Author

ii) ఆగామి --- ప్రస్థుత (వర్తమాన) జన్మమందు ఆర్జించు (సంక్రమించు) -
(ప్రాయశ్చిత్తముచే) "పుణ్య –పాప–మిశ్రమ" కర్మల ఫలము – జన్మాంతమున –
సంచితముతో కలియును. మరు జన్మమునకు "బీజము" –
మరు జన్మమున, భోగార్థం కొంతో, అంతో – కేటాయింపఁ బడ వచ్చును. కాని, జ్ఞాని విషయంలో (ఆత్మవేత్త – జీవన్ముక్తుడు)

అతనిని భూషించి – పూజించిన వారికి పుణ్య ఫలము –

అతనిని దూషించి - హింసించిన వారికి పాప ఫలము చెందును:

జ్ఞాని కి ఏమిన్ని చెందదు: అతడు "భర్జిత బీజ న్యాయవత్" – పండి పోయినవాడు: అమృత మయుడు – పునర్జన్మ లేదు.

iii) సంచితము – బహు జన్మార్జిత కర్మ ఫల శేష రాశి. ఇదే ఉత్తర జన్మలకు
(జ్ఞాన యజ్ఞ సమితగా) పునాది - బీజము. కారణము- ఇది మూలాధార చక్రమున బంధింపబడి "కుండలనీ శక్తి" యధీనమున నుండును. యోగులు ప్రాణాయామ సాధన శక్తితో యీ ప్రథమ చక్రమును జయించి . . . అందు "నిధి" లాగు దాచ బడి యజ్ఞాతమున నున్న "అనంత" శక్తులాతనికి దాసోహమగును.

"జ్ఞానా గ్నినా సంచితం" –
"జ్ఞానాగ్ని స్సర్వ కర్మాణి భస్మసాత్కురు తేర్జున"
"జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణమ్" -- శ్రుతులు.

కర్మ నివృత్తి 1) భోగము చేతను,
2) ప్రాయశ్చితము చేతను,
3) జ్ఞానాగ్ని చేతను - - - - సమయును.

అగ్ని కణము చేత దూది గుట్టలు దగ్ధ మైనట్లు, జ్ఞానాగ్ని లేశము చేత సంచిత పాపరాసులు నశించి – మోక్ష ప్రాప్తి చేకూరును.

పంచ దేవతలు – అగ్ని, వాయు, యమ, వరుణ, ఇంద్రులు మరియు సూర్య చంద్రులు – భగవంతుని కర్మాధికారులు. నిష్కామ కర్మచే యీ భగవంతుని

సృష్టిజాలమును సేవింప నియోగులైరి. కర్మ రహస్యము ను దేవతలు కూడా ఎఱుంగరు.

కర్మలలో మర్మ మెఱింగి – చిద్రూప తత్వ జ్ఞాన పరమావధిని౽ జేరక – ద్వైత బుద్ధితో భయమున పరువులు దీయుచు . . . . కర్మ యోగులైరి.

"తన రూపమును తనలోనే యెఱుంగుట తన్మయత్వం" ముక్తి – మోక్షము. దృశ్యా దృశ్యాను భవాతీతమే బ్రాహ్మీ స్థితి.




"కామము" -- మోక్ష కామిత్వంగా రూపొందించడం శ్రేయస్సు.

అరి షడ్వర్గమును – "హితులు –మిత్రులు" గా మార్చుట గురు పుత్రుని లక్షణము. విధ్యుక్త ధర్మము. – ఎట్లనగాః-

a. మోక్ష కామిత్వంగా

b. క్రోధం - ద్వేష భక్తిగా (పరా భక్తి) – షిబ్లీ వలె – "బ్రహ్మ – సత్య" దూరమైన శక్తుల మీద – దైవ తత్వము మీద. బ్రహ్మ భ్యాసాని కడ్డు తగులు వాటన్నిటిమీద.

c. లోభం - సర్వ కాల – బల – శక్తి – ధన – పూర్తిగా దైవ ధ్యాన – జ్ఞానార్జనానుభవాదులందు పూర్తిగా అంకితమొనర్చి - - "లోభి వలె" – పిసిని గొట్టు వలె – తహ తహ లు జనించాలి.

d. మోహం- మధుర భక్తి – త్రికరణములా "భగవంతుని" యందు మోహం సుప్రతిష్ఠితం కావాలి.

e. మద - జ్ఞాని, యోగి, తపస్వి – భక్తుడు "తానే సర్వం" – భగవంతు౽డు తన వాడు అనే "గర్వం – అహంకారం –మదం - - - - " నిర్భయంగా మద మత్తేభేంద్రము వలె గర్వంగా. . . సంచరించడం.

f. మత్సరం – ఈర్ష్య –ఆసూయ –కన్న గొప్పది . . . . భగవంతుడు “సర్వం” తనకే – తన వాడు కావాలిః ఎవ్వరికి ఏ మాత్రం దక్కరాదుః

సర్వం ఈశ్వరపరం చేసినవారికి – శత్రులు మిత్రులై అశుభం శుభంగా మారి శ్రేయోదాయకమగును.

గృహస్థ ధర్మములుః-

శ్లో|| దానందమో దేవపూజా భక్తిర్గురౌక్షమా|
సత్యం శౌచం తపోస్తే యంధర్మోయం గృహమేధినాం||

కర్మ యోగి – కోటలోపలనుండి పోరాడు యోధుని వలె భద్ర పరుడు –
సన్యాసి – లేక యోగి – కోట వెలుపల నుండి పోరాడు ప్రమాద భరిత స్థితుఁడు.
కర్మ సిద్ధాంతము – జీవితమొక మహా ప్రస్థానము – ప్రయాణము – యాతన “సుఖ దుఃఖ” రంగము – ధర్మ కర్మాంకితమైనది.

“మనుష్యుడే యజ్ఞము – జీవితమే సమిత”
“లోక మొక వేదిక – ఫలము బ్రహ్మము”

విత్తు కొలది పంట – శ్రమ కొలది ఫలము – అక్షయము.

దేహము కాల క్రమమున (వయో వృద్ధి వల్ల) పెరిగి – ముడుతలు వారి – పండి – వాడి పోయి – తుదకు మృత్యువు వాత బడి నశించి పోవ నున్న “జీవో పాధి” – జీవునికి తాత్కాలిక విడిది – ఎరవు గృహము – పాంచభౌతిక దివ్య భవనము – ప్రారబ్ధఫలము – ఈశ్వర ప్రసాదము.—

మానవుని సత్పథమున ముందుకు కొంపోగలదే నిజమైన కర్మః కర్మయే నిర్మాతః ఇహ సాధన. పరసుఖ క్రియ. బ్రహ్మ భ్యాసము కూడా “కర్మయే” –

దుష్కర్మ చే దుర్మార్గుడు (రాక్షసుడు)
సత్కర్మ చే సన్మార్గుడు (దేవత)
→ బృహదారణ్యాకం (36 – 2 -13)

మానవుడు సంకల్పమునకు బంటు – ఇహపర (ప్రవృత్తి) విశ్వాసముచే - మరణానంతర పరిణామ ఫలం → “పునర్జన్మ” – -- చాందోగ్య 3. 14. 1.

"సత్సంకల్పము → సత్కర్మ →కర్మరుజ్జువులు → సుఖ దుఃఖానుభవం" –
"నీకు – దేవతలకు ప్రారబ్ధమే ప్రభువు – కర్మ ఫల బలం"

\- యురీపిడెస్ –

కాని శీలము (సంస్కారము) శాశ్వతమైనది.

మోక్షమునకు చుక్కాని . . . . ధృవ తార!!

-- జన్మాంధునకు (పుట్టు గృడ్డికి) స్వప్నములు గలవా?

-- మానవాత్మ (జీవుడు) – పశు పక్ష్యాదులందు పునర్జన్మ మందునా?

సన్యాసి (త్యాగి) – సర్వసంగ పరిత్యాగ మొనర్చిన నివృత్తుడు – నిర్మలాత్ముడు – నిత్యానందమయుడు – జీవన్ముక్తుడు – లోక కల్యాణార్థమై – త్రికరణాల సర్వార్పణ (సర్వాంకిత) బుద్ధితో లోకమునాశీర్వదించు – బ్రహ్మ స్వరూపుడు.

గృహస్థుడు – తన్ను తాను పోషించు కొనుచు, సాధు సత్పురుషుల (అతిథి అభ్యాగతుల నాదరించి – ఆశ్రయమిచ్చి) – పోషింపగల ధన్యజీవనుడు. భద్రజీవి : పుణ్యాత్ముడుః యజ్ఞయాగాదిక నిత్య నైమిత్తిక అగ్నికర్మల సుసమర్థంగ నిర్వహించి, దేవతలను తృప్తిచేసి – సంఘు (మానవ) జీవితమును పునీత మొనర్చి సార్థకత చేకూర్చు ధన్యుడు.

భగవంతుని కర్మాధికారులుః- సూర్య భగవానుడు – భగవంతుని ప్రియ నందనుఁడు. నిష్కామ కర్మాధికారులలోఁ నొక్కడు. పితృవాక్య పరిపాలనార్థమై – లోక కల్యాణార్థమై – "వేడి - వెలుగు" ల నిచ్చి, ప్రాణ ప్రదుఁడై, యుగ యుగాలుగా, నిర్విరామ నిష్కామ కర్మ సాగిస్తున్నాడు. అదే విధంగా వాయు, అగ్ని, చంద్ర, నక్షత్రాదులు – అనగా పంచ దేవతలు – తదితరములు (తత్వములు) కూడా ఈశ్వర శాస నోల్లంఘున మొనర్ప సాహసింపక, అపార కరుణామయ ధీరోదారతను చాటడం లేదా? భగవంతుని (దైవ) ఋణం ఎవ్వరు తీర్చుకోగలరో?

దివ్య దేహమునందు- < దశేంద్రియములు (10 రథములు) / అంతః కరణ చతుష్టయము (4 విమానములు)

గల్గి – జ్యోతిష్మతీ పుర పట్టాభిషేక మొనర్చి – జీవనోపాదికి వలయు – సమస్త శుభ – సౌకర్యములను ప్రసాదించి – (ప్రతిఫల మాశింపక) – అజ్ఞాతమున – (అంతరంగమున) దాగుడు మూతలాడు తేజో మూర్తికి జోహారులు!!

తత్వ గ్రంధములు క్రొత్తవి గావచ్చు గాని తత్వ మనాది! సూర్య భగవానుని వలనే భగవంతుని కర్మాధికారులందరు, స్వార్ధ రహిత, నిగర్వి, నిష్కామ, సేవా పరులుః భగవంతుడు విశ్వ తోటమాలి, ఎంత ఉదారుడో అంత నియంత! కర్తృ త్వాభిమానములు లేవు!

కర్మ రహస్యమును గూర్చి భర్తృహరి కవీంద్రుడు –

"సర్వ శక్తిమంతమగు కర్మ నారాధించి –ఆచరించుము. దేవతలు దైవమునకు – ఆ దైవము కర్మానుసారము ఫల మిచ్చుటకు బద్ధులై యున్నందున కర్మకే నమస్కారము"!!

పాప పుణ్యా ఫలము కర్మాధీనము కదా!!

బ్రహ్మ బ్రహ్మాండ మధ్యస్థుఁడగుట |
విష్ణువు పది అవతారములెత్తుట |
శివుడు కపాలహస్తుఁడై శ్మశాన వాసి యగుట |

పంచ దేవతలు విశ్రాంతి లేక భయముతో నిర్విరామముగా సంచరించుట. .. . . . . కర్మ ఫల కారణం కాదా?

వ్రాత వెంటఁగాని వరమీడు దైవంబు |
చేత కొలదిఁ గాని వ్రాత గాదు |
వ్రాతకజుఁడు కర్త – చేతకు తా కర్త || ||విశ్వ||

సన్యాసము – త్యాగముః -

పునర్జన్మకు కారణమగు కర్మలు మానడం – సన్యాసం – ఇది దుర్లభం. కర్మలు చేయకుండ దేహి దేహ ధారణం చెయ్యడం అసంభవం! ఇంద్రియ క్రియలు – ప్రాణ క్రియలు కూడా కర్మలేకదా!!

ఇక తెలివిగా "కర్మ ఫల త్యాగం చేస్తూ" మనడం శ్రేయస్సు. కర్తృత్వ రహిత – నిష్కామ కర్మలు (కర్మ ఫల త్యాగం – భగవర్పిత బుద్ధితో) చెయ్యడమే త్యాగమందురు. ఇట్టి వారిని పాప పుణ్యములంటవు. ద్వంద్వములు దూరమగును.

స్వర్గ నరకముల బెడద – జనన మరణ చక్ర భ్రమణ గతి కూడా ఉండదు. కాని, జ్ఞానం కర్మకు తోడైన, ముక్తి తథ్యమేః "త్యాగి + యోగి" ద్వంద్వాతీతుఁడు.

ధనుర్ధరుడైన అర్జునుఁడు -- కర్మ స్వరూపుడు
యోగీశ్వరుడైన కృష్ణుఁడు -- జ్ఞాన స్వరూపుడు.

"జ్ఞాన కర్మలు" కలయిక ప్రయాగ తీర్థమై, మోక్షము తథ్యము -- కర్మ నివృత్తియై జ్ఞానము కూడా – అందే లయించాలి!! - - ముక్తి.

కర్మము జ్ఞానికి దవ్వగుఁ
గర్మము నకు జ్ఞానిదవ్వ – కల నిజమిదియే
కర్మ జ్ఞానములుడిగిన
నిర్మలునకుఁ గల్గు ముక్తి నిజముగ వేమా||

కర్మ ఫలము లన్ని కపటంబుగాఁజూచి
ధర్మ ఫలములన్ని దగిలియుండి
ధర్మ మర్మములను దాటుటే ముక్తిరా || విశ్వ ||

"కర్మ సమసి నపుడె – ధర్మంబు స్థిరమౌను
దైవ రూప మిదియె తలచి చూడ"
--- కర్మ రహస్యము.

ప్రారబ్ధము –

1. హరిశ్చంద్రుఁడు పదవీ భ్రష్టుడై, మాలవాని సేవించి శ్మశానమున కాటి కాపరిగా పిండముల భుజించెను.
2. నలుఁడు జూదమాడి, రాజ్యముతోఁగూడ సర్వస్వమును గోల్పోయి, భార్యను నట్టడివిని వీడి, వికృత రూపుఁడై అడవులఁబడి, తుదకు వంటల వాడుగాఁ బ్రదికెను.
3. శ్రీ కృష్ణ భగవానుని ప్రియులు – మరుదులు – ఆప్తులు – అయిన పాండవులు రాజ్య భ్రష్టులై, అడవులఁబడి, అజ్ఞాతమున విరాటుని పర రాజ్యమున సేవా జీవనంచేసి, అష్ట కష్టములకు లోనై, అల్లాడి అలమటించిరి.
4. ఈశ్వరుఁడు మన్మథుని భస్మం చేసి తపో భంగమై కామానికి లోనై పార్వతినిచేఁ

పట్టెను. కోపోద్రేకమున బ్రహ్మ తల (5 వది) గిల్లి వేసి, కపాల హస్తుఁ డయ్యేను. సర్వేశ్వరువంతటి వాడే నిలువ నీడ లేక, శ్మశాన కాపరి యయ్యేను.

5. విష్ణుమూర్తి దశావతారములెత్తి, దిక్కుమాలిన శాపానుభవముల ననుభవించె నని, పురాణములు వెలసినవి.
6. శ్రీ కృష్ణ పరమాత్మనుఁ గన్న తల్లి తండ్రులు చెరశాలను జీవించి, తుదవరకు పుత్ర వియోగమున దుఃఖితులైరి.
7. శ్రీ రామ చంద్రుని తండ్రి దశరథుడు పుత్ర వియోగ దుఃఖంతో (శాప – ప్రారబ్ధ కారణమున) మరణించెను. తల్లులు (దేవేరులు) విధవలైరి. కట్టు కొన్న భార్య సుఖించి యెరుగదు. తుదకు ప్రాణతుల్యుఁడైన సోదరుడు లక్ష్మణుడు విసిగి సరయూ నదిలో బడి ఆత్మహత్యా చేసు కొనెను. తనగతి కూడా అంతే కదా!
8. శ్రీ రామ కృష్ణ పరమ హంస గొంతులో కాన్సర్ వ్యాధితో బాధ పడెను.
9. శాంతి దూత – విశ్వ మిత్రుడు – లోక కల్యాణ మూర్తి భారత పిత ఖూనీ చెయ్య బడెను.
10. ఆర్య మత స్థాపకుడు – వేదమూర్తి – దివ్య జ్ఞాన తేజో విరాజితుఁడైన దయానంద సరస్వతి కి విషమిడిరి.
11. శ్రీశ్రీశ్రీ భగవాన్ రమణ మహర్షి కంప వాతముతో తన వృద్ధాప్య దశను కడప వలసి వచ్చెను.
12. బానిస వ్యాపారమును మాన్పించి, మానవ జాతికి అమూల్య సేవ యొనర్చిన అభ్రహామ్ లింకన్, కాల్చి చంపఁబడెను.
13. నీగ్రో జాతి – తోడి మానవ శ్రేణికి స్వేచ్ఛ – సమాన హక్కులను ప్రసాదించు కారణమున కెన్నడీ హత్యా చెయ్యఁబడెను.
14. లోకానికి వెలుగు – ఆనందము – చలువను ప్రసాదించు చంద్రునకు క్షయ రోగ ప్రాప్తి తప్పదయ్యెను.
15. సనాతన మత ప్రచారకుడు – సర్వ సంగ పరిత్యాగి యైన శ్రద్ధానాథుడు “రషీద్” అను తురక కిరాతకుని కత్తికి బలి యయ్యెను.

యజ్ఞము అనగా ఇచ్చుట (ప్రసాదించుట) - త్యాగము – అని అర్థము. మరియు – పూజ – ఆరాధన అని కూడా అందురు. మరియు హృదయపూర్వకపు సమర్పణ (భోద), విశృంఖల భక్తి ప్రకటన యని కూడా ఊహింపఁదగును.

బ్రహ్మ యజనము (శాల) అనగా బ్రహ్మ జ్ఞానమును ప్రసాదించు – (ప్రవచించు –భోదించు) ప్రత్యేక నిర్ణీత స్థలమని అర్థము. అజమేధ –అశ్వమేధ – గోమేధ – నర మేధాది క్రతువులనగా అంతేః వాటిని బలి నిచ్చి భుజించుట (పశు) రాక్షస కృత్యము. దేవతలు అమృత జీవనులుః జరా మరణ రహిత (అమృతత్వ) మయులుః మాంస భుక్కులు గారు.

మేధ అనగా జ్ఞానము – మేద అనగా క్రొవ్వు –

అజ = ఆడు మేక, ప్రకృతి యని కూడా అర్థము గలదు.

అజ = పుట్టుకలేని అనగా అమరత్వ

| | |
|---|---|
| మేధ = జ్ఞానము = ప్రజ్ఞ, గాఢమైన జ్ఞాపక శక్తి – ధారణ శక్తి – మరపు లేమి మొ॥ అర్థములు. | అజమేధము = అమరత్వ తత్వ జ్ఞానమనిః = బ్రహ్మ జ్ఞాన ప్రసాదము = వేగమునకు పేరు గన్న గుఱ్ఱమును – శీఘ్ర – తీవ్ర – ప్రజ్ఞా ప్రసాదమని అర్థము. |

శ్లో॥ పరం బ్రహ్మ పరం ధామ పవిత్రం పరమం భవాన్
పురుషం శాశ్వతం దివ్య మాదిదేవ మజం విభుమ్

అ॥ భవాన్ = మీరు, పరంబ్రహ్మ = బ్రహ్మకన్నపరులు, ( గొప్పవారు); పరంధామ = గొప్ప తేజస్సు గలవారు, పరమం పవిత్రం = పవిత్రులలోనగ్రగణ్యులరు, పురుషం = పురుషులలో, శాశ్వతం = శాశ్వతమైన వాడవు, దివ్యం = గొప్ప వాడవు, ఆది దేవం = దేవతలకు మొదటి వాడవు, అజం = పుట్టుక లేనివాడవు, విభుం = సర్వ లోకేశ్వరుడవు.

– భగవద్గీత. అ. 10. శ్లో. 12

"అజం విభుమ్" – అజమేధము – బ్రహ్మ జ్ఞానమని – "అజ" శబ్దము (పర బ్రహ్మమనియే) = పుట్టుక లేని లేక అమరత్వమని -

అట్లు గాక "అజ" శబ్దార్థము – మందలోని మేకల మీదకు పోవడం దురదృష్టంకాదా! భగవంతుడు – దేవతలు మేక మాంసం – మేక మేదస్సు (క్రొవ్వు) కై నోరు తెరచు కొని తహ తహలాడుచున్నారా? ఈ లాంటి అమానుష (రాక్షస – పైశాచిక) ఘోర కృత్యాలకై – అనర్థ పరిభాషల ప్రవచించి ప్రోత్సహించడం కేవలం దైవ దూరమైన పని—

చాలా చోట్ల వేదములందు మేఘములను – పశువులు – పక్షులకుపమానించినారు. ఉ|| మేఘములనే ఆవులను వాయు (వీచికలనే) కోతకత్తులు – ఇంద్రుడు యాగ కర్త (గుహ మేఘము) = (గుహల్లోని గోవులు = మేఘములలోని జల బిందువులు) –
సంకల్పం వర్ష కాంక్ష - - - ఈ లాంటి అలంకార ప్రయోగములు గలవు –

సామ వేదంలో – "ఓ దేవతలారా! మీకు మేము బలుల నివ్వము! జంతు వధ చెయ్యము. కాని, మంత్ర (స్తోత్ర) పఠన మొనర్తుము. అని వ్రాయడం (ఋగ్ + యజర్ వేదముల పైది సామం) – విప్లవ ధోరణిని సూచిస్తుంది: దేవతలు అమృతాహరులు – మాంస భుక్కులు గారు. ఆ విధంగానే, జైనులు, భౌద్ధులు, పశు వధ (జంతు హింస) ను గర్హించిరి. అహింసా పథము నాశ్రయించిరి. సూక్ష్మార్థములనే గుర్తించి గ్రహించి పాటించిరి.

ధర్మ సాధక మార్గములు 3.

1. యజ్ఞములు 2. దానములు 3. అధ్యయనము, లని

యజ్ఞములు 6 విధములు: -

1. ద్రవ్య యజ్ఞము – భూ, శ్రమ, ధాన్య, సంపత్, అన్న, విద్యా, వైద్య, వస్త్ర, గృహ, కన్య మొ|| దానములు – సత్కార్యములు – గ్రంథ, ధర్మ సంస్థలు – సత్ప్రచారములు – మొ|| పాత్రాపాత్రల అర్హోచితము నెరింగి చేయు ధర్మాదులు.

2. తపో యజ్ఞము – తపస్సు – నామ (మంత్ర) జపాదులు – ధర్మ సాధన కొరకై ఇంద్రియములను (10 + 4) ను తపింప జేయుట . . . . ఉపవాస దీక్షలు (శివ రాత్రి, ఏకాదశి, పర్వ దినాదులందు – చాతుర్మాస్య వ్రతాదులందు ముఖ్యము. నిరాహార దీక్ష ఉత్తమోత్తమమైన – ఊర్ధ్వ పథ గతికి – దోహదము నివ్వ గలది.

3. యోగ (ప్రాణాయమ) సాధన – ప్రాణ వాయువును, అపానముతో ప్రేల్చుట (ప్రాణ యజ్ఞము) – అనగా రెంటిని కుంభకమున అడ్డగించి – నిల్పి (బంధించి) , , , , సర్వదా చేయుట వల్ల ప్రాణ జయము – సర్వార్థ సిద్ధిత్వం. (షణ్ముఖ ముద్రతో అను సంధాన ప్రాణాయామము శ్రేష్ఠ తరము – ఉత్తమోత్తమ మార్గము – పంచ ముద్రల పైకి –

4. స్వాధ్యాయ యజ్ఞము – సద్గ్రంధ పారాయణ (పఠన – శ్రవణ –మనన) శబ్దార్ధ – భావార్ధ . . . . భక్తి ప్రపత్తులుండిన శీఘ్రముగ జ్ఞానోదయము తథ్యము.

5. జ్ఞాన యజ్ఞం – అన్నిట గొప్పది. మోక్ష ప్రదాయని: మహా పురుషులే వేద వేదాంత జ్ఞాన సముపార్జన – దానము చేయ సుసమర్ధులు – అర్హులు: ఇది అందరికి అబ్బదు. జ్ఞాన దానము – లోక మందలి సమస్త పాపముల పోగొట్ట గల – పునీత శక్తి: పరమ పావన "జ్ఞాన" గంగ; . . . జ్ఞానాగ్ని జ్వాలలు – సంచిత పాప పర్వత పంక్తులను ధగ్ధ మొనర్ప జాలును. "ఆత్మ విచారం – జిజ్ఞాస – గురుభోద" - - - అపరోక్షాను భూతికి – పరోక్ష జ్ఞాన ద్వారమే రక్ష!!

6. ఇంద్రియ నిగ్రహము – (10 + 4) ఇంద్రియ క్రియలను నిగ్రహించి, మనః స్రవంతిని అంతర్ముఖ మొనర్చి – (విషయ విముఖత్వము వల్ల) అందే లయింపఁ జేయుట – విషయ హవిస్సులను ఇంద్రియాగ్నులలో – "రాగ ద్వేష రహితమున" - - - - క్రమముగా ఆహుతి నొసంగుట . తీక్షణమైన (కఠోర) నియమములను గూడా యజ్ఞము చేయుదురు: సాహసోపేతమైన తీవ్ర విధానములు ఆరాధ్యములు గావు: అమోద మందఁజాలవు- .

యజ్ఞ శిష్టామృతం – యజ్ఞ శాల లందలి శేషాన్నము మహా ప్రసాదము – అమృత తుల్యము: దానిని భక్తి ప్రమత్తులై భుజించువారు సనాతన బ్రహ్మ పదమును పొందుచున్నారు. పునీతులైన "పుణ్యాత్ములు" : ఆలాగు యజ్ఞమాచరించని వారు, యజ్ఞ శేషముని భుజింపని వారు ఇహ పరంబులకు దూరులు.

శ్లో|| యజ్ఞశిష్టామృత భుజో యాంతి బ్రహ్మ సనాతనమ్

నాయం లోకో ౭ స్త్యయజ్ఞస్య కుతో ౭ న్యః కురు సత్తమ

తా || కావున భగవంతున కర్పించిన వెనుక ఏదైనను స్వీకరించిన వారు బ్రహ్మ పదవిని పొందుదురు. ఒక మంచి పనియు చేయని వానికి ఇహ పర లోకములు రెండును దొరకవు; వాని కధోగతియే యని యూహించ వలయును.

-- భగవద్గీత. అ. 4. శ్లో. 31.

శ్లో|| యజ్ఞశిష్టాశిన స్సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః
భుజంతే తే త్వఘం పాపా యే పచంత్యాత్మకారణాత్

తా || దేవతలకర్పించి తిన్నవారు పుణ్యాత్ములగుదురు. వారి పాపములు దేవతలచే వారింపబడుచున్నవి. ఎవరికొఱకు వారే వండుకొని తినువారు పాపమునే తిను చున్నారు.

-- భగవద్గీత. అ. 3. శ్లో. 13.

ఇదే విధముగా విజ్ఞులు, బుద్ధి, బలము, ధనము, జ్ఞానము, భూస్థితి, . . . సంపదలు . . . ఉదాత్తులై – నిరహంకార, నిరభిమాన, నిష్కామంగా త్యాగ మొనర్చిన ధన్యాత్ములై శోభించెదరు. ముక్తికి సర్వార్హులు.

భూ, శ్రమ, ధన, ధాన్య, సంపత్, అన్న, వస్త్ర, విద్యాది దానము లన్నియు దేహ పోషణ (ధారణ) కే గదా!! కావున, నశ్వర ఫలమివ్వ గలవిః కాని – బ్రహ్మ విద్య – జ్ఞాన –ఆత్మ – పర తత్వ విద్యాదానం "ఆత్మ" సంబంధమై నందున, ఉత్తమ – శాశ్వేత ఫల మివ్వగలదిః అనశ్వర దేహోద్ధారణ కన్న – శాశ్వత ఆత్మోద్ధరణ మనంత ఫల ప్రదాయిని. బ్రహ్మోపాసన (బ్రహ్మాభ్యాసము) కన్న మించిన మరొక్క సాధన మెద్దియు లేదు.

కర్మకాండ యందు – యజ్ఞ యాగాదులలో దాన ధర్మాదులు విస్తారంగా చేసిన వారు స్వర్గాది పుణ్యలోకాల యందు సమస్త భోగముల ననుభవించి, పుణ్యము సమసిన వెంటనే "క్షీణే పుణ్యే మర్త్య లోకం విశంతి" . . . . భూమిపై తిరిగి పునర్జన్మ మందక తప్పదు. మోక్షము నివ్వ జాలవుః

స్వర్గాది లోకములు భోగ భూములే గాని, యోగ భూములు – కర్మ భూములు కావు – "ఝునక్ ఝునక్ పాయల్ బాజే" లాగ అమర నృత్య గాన – జలసాల్లాంటి భోగ విలాస కేంద్రాలే కాని మోక్ష ప్రాప్తికి దోహద మివ్వఁ జాలవుః "త్రై విద్యాం" . . . భూలోకమే సాధన శాల – మోక్ష ప్రాప్తికి నానా యోగ సాధనల కాస్పద మిచ్చు పవిత్ర ప్రయోగశాలః తరణ రంగము –

ఆది లోమి ఋషి – "ధనముతో, ధ్యాన – యజ్ఞ ఫలం పౌరోహితుల ద్వారా పొందవచ్చు నన్నాడు.

మానవుఁడు స్వస్వరూప (స్వారాజ్య) బ్రహ్మారాజ్య కిరీటము ను ధరించుటకు . . . అఖిలాండేశ్వరత్వ పదవిని దోచుకోవడానికి - - - చెల్లించ వలసిన

కప్పము దీర్ఘ దుఃఖానుభవము – అనంత త్యాగము - - దుఃఖము దేవుని దూత - - - పరమ పదవీ ప్రాప్తికి, ప్రాప్తించు నానా విఘ్నములు – ఆటంకములు మానవాత్మను వికసింపఁజేసి (ఎంత చీకటి అధికమైన నక్షత్రములంత ప్రకాశవంతములగును గదా!) – "మర్దనం గుణ వర్ధనం" అన్నట్లు, పునీత మొనర్చి, కృతార్థత చేకూర్చును. "ప్రజ్ఞానం బ్రహ్మ" – ధన్యోస్మి . . .

కర్మలన్నియు – యజ్ఞ యాగాది క్రతువులు –సర్వం "శ్రద్ధ – భక్తి – జ్ఞానం – విశ్వాసం" మొ|| వానితో కూడుకొన్న అత్యంత ఫల – బల – ప్రయోజనకారులగును. జ్ఞానులు కూడా "ఉభయ తారకంగాను – లోకాదర్శ సంగ్రహార్థంగాను – వేదోక్తాది కర్మల నాచరించడం సమంజసం – కాని ఫలాశ "బంగారు సంకెళ్ళు" –

సమస్త జీవకోట్ల హృదయాంతరంగుడు – సర్వాంతర్యామి – సర్వేశ్వరుఁడు – విశ్వనాథుడు – విశ్వేశ్వరుడు - - విశ్వదాత – విశ్వజనకుఁడు – వేదమూర్తి యగు నిరుపాధిక బ్రహ్మమును తెలుసు కోవడమే వేదాంత జ్ఞాన పరమావధి.

కాని ఢాంబిక – బాహాట – విపుల ప్రచారమున చేయు కర్మకాండలు స్వల్ప ఫలమిచ్చును. అనగా, ఫలా పేక్ష మేరకు స్వర్గ సుఖములను ప్రసాదించి, తిరిగి పునర్జన్మ నివ్వక తప్పదు. భోగాపేక్ష గల స్వార్థ పండితులకిది ప్రాపు ,చిత్తైకాగ్రతను – మోక్షమును యివ్వ జాలవు. "క్షీణే పుణ్యే మర్త్య లోకం విశంతి" – తథ్యము.

యజ్ఞ యాగాదులందు పశు వధ – జంతు హింస, హింసాత్మకములని బుద్ధుడు నిరసించెను. నిషేధించెను. మనశ్శుద్ధి కొరకు కర్మాచరణ కాండలు నిర్ణయింపఁబడినవి. అవి కర్మ లక్ష్య సాధనము లే గాని, ముక్తి నివ్వ జాలవు.

శాస్త్రీయ వైదిక కర్మలు, యోగ (వేదాంత) విజ్ఞాన శాస్త్రమున – ప్రాథమిక విద్యగా పేర్కొనఁబడెను. అది అంత్యము గాదు – ప్రారంభమే. కావున, మున్ముందు సాగి – కర్మలు నిష్కామ్యములై ⟶ భక్తికి ప్రోది చేసి; సగుణోపాసకులు ⟶ నిర్గుణోపాస్తులుగ మారి - - క్రమము గా ⟶ జ్ఞానపథమున నడిపింపదగును. కాని, జ్ఞానికి కూడా కర్మలు వర్జితములు గావు – జ్ఞాని కూడా ఆదర్శ కర్మి గా మన వలెను.

కామ్య కర్మల ద్వేషింపక – మోక్ష కర్మలు – నిత్య కర్మల ప్రేమింపకుండడం – మోక్ష సాధనమగు సాత్విక త్యాగమందురు. ఇందు కర్మ బంధంలేదు. మోక్ష దాయిని. దుర్లభ పథం –

కర్మ యోగి లక్షణములుః -

1. కర్మఫలాసక్తి రాహిత్యము.
2. నిత్య సంతృప్తి – ఆశ – ఆసక్తి – తగులు లేని.
3. నిరాశ్రయత్వం – భగవంతునియందు శరణాగత బుద్ధి.
4. జితేంద్రియుడు.
5. అపరిగ్రహుడు.
6. ద్వంద్వాతీతుడు.
7. స్థిత (సత్య) ప్రజ్ఞుడు.
8. పరహితార్థము (భగవత్ప్రీతిదై) కర్మలు చేయుట.

సమస్త కర్మలు - } అహంకారము – వాసనాబద్ధ మైన "ఇంద్రియములు – మనస్సు" లకే గాని,

మనస్యులు – కేవలం బాహ్యేంద్రియ నిగ్రహమును మాత్రం ప్రదర్శించి, అకర్ములని చాటి నంత మాత్రమున ప్రయోజనం లేదు. ఆత్మ వంచన – లోకాన్ని మోసం చేయ్యడమే మిగులును.

త్రికరణ శుద్ధిగా, తగులు లేక, అహంకార మమకారములు వదలి, కర్తృత్వరహితమైన స్థిత ప్రజ్ఞతో, నిష్కామాచరణమే, గణ నీయము. తద్వ్యతిరేకమే మిథ్యాచారము.

"కామ – సంకల్ప" రహిత కర్మ పథమే జ్ఞాన మార్గమున నడిపింపఁగలదు. "జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణి" - - - అట్టివాడే పండితుడు – (పండా) గా చెప్పఁబడు చున్నాడు. అతడే ద్వంద్వాతీతుడు – నిత్య తృప్తుడు – జీవన్ముక్తి నందు సర్వార్హుడు.

# 11. గీతా సారము

శ్లో|| సముపే తేష్వనీకేషు కురు పాండవ యోర్మృదే |
అర్జునే విమనస్కేచ గీతా భగవతా స్వయం ||

-- (మహా భారత. శాంతి -348 -8.)

కం|| తనవారిఁ జంప జాలక
వెనుకకుఁ బోనిచ్చఁగించు – విజయుని శంకన్
ఘన యోగ విద్య బాపిన
ముని వంద్యుని పాద భక్తి – మొనయున్ నాకున్ ||

-- భాగవతము.

18 అధ్యాయములు – 700 శ్లోకములు – భారత కురుక్షేత్రంలో – కురు పాండవ సంగ్రామారంభంలో – అర్జున విషాద కారణంగ – జననం.

జనన కాలం - మార్గశిర శు|| ఏకాదశి – గీతా జయంతి మహ పర్వ దినం.

జన్మ స్థానము -- కురు క్షేత్రములో, జ్యోతి సరస్సు తీరమున – వట వృక్షము క్రింద కురు పాండవ సంగ్రామారంభమున.

సందర్భము -- అర్జున విషాద – ధర్మ సందేహ కారణంగా

శ్రీ కృష్ణ భగవానుఁడు చెప్పినది – అర్జునుడు విన్నవాడు.

ప్రత్యక్ష సాక్షులు -- టెక్కెము మీద మారుతి, ప్రక్కన జ్యోతి సరస్సు – దాపున వట వృక్షము. సమీపమున సరస్వతీ నది – కురు క్షేత్ర రణ రంగ భూమి.

పైగా : -

పరోక్ష సాక్షులు – హస్తినాపుర రాజాంతఃపురమున, కురు రాజు (అంధుడు) ధృత రాష్ట్రుడు.

-- “రన్నింగ్ కామెంటేటర్” – సంజయుఁడు.

-- టేప్ రికార్డింగ్ వ్యాసమునీంద్రుడు.

(ట్రాన్స్ మిట్టింగ్) -

గీత విభజన – 18 అధ్యాయములు – 700 శ్లోకములు.

1. ప్రథమ షట్కము -- కర్మ - గుహ్యం - త్వం పదార్థ వివరణ.
2. ద్వతీయ షట్కము -- భక్తి – గుహ్యతరం – తత్పదార్థ వివరణ.
3. తృతీయ షట్కము -- జ్ఞానం – గుహ్యతమం – జీవేశ్వర బేధము.

"వరుసగా ఉపదేశింపఁ బడినది."

గీత -- భగవంతుని ఆత్మ కథ.

సర్వోపనిషత్సారము.

బ్రహ్మ జ్ఞాన భాండారము.

సర్వ వేదాంత సారామృత సాగరము.

ఈశ్వర సామ్రాజ్య సింహాసనమునకు ఆహ్వాన ముఖ ద్వారము.

అష్టాదశాధ్యాయిని –

భారతామృత సర్వస్వం

భవ ద్వేషిణి – అద్వైతామృత వర్షిణీ –

గీత వికసిత హృదయ - వేద మాత - సుజాత - దివ్య జ్ఞాన సంజాత - భువనైక మాత

వేయేల - జీవ బ్రహ్మైక్య విజయ ధ్వజ సంస్థాపనమే గీతా శాస్త్రము యొక్క ఏకైక లక్ష్యం.

| ఇక -- | చెప్పినవాడు | విన్నవాడు |
|---|---|---|
| | పరమాత్ముడైన శ్రీ కృష్ణుఁడు | మహాత్ముడైన పార్థుడు |
| | పురుషోత్తముడు | నరోత్తముడు |
| | దేవ దేవుఁడు | వీరాధి వీరుఁడు |
| | లోకేశ్వరుఁడు | రాజ శేఖరుఁడు |
| | సూత్ర ధారి | పాత్రధారి |
| | జ్ఞాన దీపం | కర్మ కౌశల రూపం |
| | దేవుఁడు | జీవుడు |
| | నారాయణుడు | నరుఁడు |
| | యోగేశ్వరుఁడైన కృష్ణుడు | ధనుర్ధారియైన అర్జునుడు |
| | అవతార మూర్తి - గురువు | అధికార మూర్తి - శిష్యుడు |
| | యుక్తి – బుద్ధి – జ్ఞాన బలం | శక్తి – సిద్ధి - కర్మ కౌశలం |

సుజ్ఞాన – నిష్కామ కర్మల కలయిక గంగా యమునల సంగమము (ప్రయాగ) వంటిది.

ఇతి వృత్తము :-

శరీరము నందలి "ప్రకృతి – నివృత్తుల" నిత్య నిరంతర సంగ్రామ సంఘర్షణాదికమే కథా రూపముగ భారతమును వ్యాసులు వ్రాసిరి. దాని సార సంగ్రహమే గీత – భారత అంతరార్థం.

ఈ మహత్తర గ్రంథరాజము, కేవలం సన్యాసుల భజన కీర్తనల సంపుటి కాదు.

గీత భవ రోగాలకు ప్రథమ చికిత్స –

వేదాంత విద్యకు ప్రవేశిక –

బ్రహ్మ తత్వ సరస్సునకు ప్రథమ సోపానము –

ఆత్మ విద్యకు గీత ఉపోద్ఘాతమయితే –

అసలు సత్తా – ఉత్తర గీత

భరత వాక్యం –ఉద్ధవ గీత.

భవతరణకు గీతా ధ్యానము మూల మంత్రము. గీత ఉపనిషద్గోక్షీరము – చెప్పిన వారు – మరియు విన్నవారు – ఉత్తమోత్తమ గృహస్థులైన నర – నారాయణులు.

సామాన్యముగా, జన వాడక ఏమనగా, వేదాంతము – బ్రహ్మ జ్ఞాన విద్య – "గీత" వలెనే, వీధి భిక్షకులు – సాధు సన్యాసులకు, విరక్త విరాగులకు చెప్ప బడినదనెడు అపోహ.

కాని నిజంగా అట్లు కాదు –

ప్రవచించిన వాఁడు –

యోగి విరాట్, యోగ భోగీంద్రుఁడు – షోడశకళా ప్రపూర్ణుఁడు – అద్వైతార్ణవ పూర్ణ చంద్రుఁడు – సచ్చిదానంద మూర్తి, పరమ పురుషుఁడు, పరమాత్మ, సర్వేశ్వరుఁడు, సర్వదాత, నారాయణుఁడు, - - - శ్రీ కృష్ణ భగవానుఁడు.

విన్నవాఁడు –

రాజశేఖరుఁడు, వీరాధి వీరుఁడు, నరేంద్రుఁడు, నరోత్తముఁడు, పాండవ మధ్యముఁడు, గాండీవి, సవ్యసాచి, నరావతారుడు – ఫల్గుణుఁడు – అర్జునుడు.

ఈ దేహ రథమున – నర నారాయణులు – జీవ దేవులు – అదిష్టించినారు. ఆ రథమునకు నాల్గు గుఱ్ఱములు అనగ అంతః కరణ చతుష్టయము – వాటి కళ్ళెములు ఈశ్వరుని హస్త గతమైనవి – ఇక భయం లేదు – నివృత్తి ప్రవృత్తుల మధ్య సహజ సంగ్రామం జరుగుతూంది – కర్మ – భక్తి – జ్ఞాన – యోగ తత్వముల కరుణామృత కుంభ వృష్టి కురిసినది. తడియని వారిదే దురదృష్టం. కాని, నాటికి, నేటికి ఆ మోహన మురళి అమర గాన సుధ వినిపిస్తూనే వుంది. వినని వారిదే తప్పు.

గీతా తత్వ (రహస్య) విమర్శన మత్యంత "గుహ్యం – గుహ్యతరం – గుహ్యతమం" "ఆత్మ విద్య" – బ్రహ్మ శాస్త్రము నిగూఢ గుప్తమగు "నేనే" సర్వోపనిషత్సార సంగ్రహము – ఉత్తమోత్తమ సుభోధిత – సులభ గ్రాహ్య సంపుటి – ప్రతి శ్లోకము పూర్ణ గర్భీభూతమైన అద్వైత భావార్థ మధుర గుళిక.

శుభ శాంతులకు మూలమగు జ్ఞాన యజ్ఞము నకు మహోపకారి – ఉపనిషద్ద్రష్టల దివ్య ప్రసాద ఫలమిది. కల్ప తరువు. సమస్త శ్రుతి, స్మృతి, ఇతిహాస, పురాణాదుల చేవకు నిలయము.

ఈశ్వర చింతనం మన సహజ ధర్మము. గీత ఒక్కరి సొత్తు గాదు – అందరు, అన్ని మతముల వారు చదువ వచ్చును. (దీనికి) విధి నిషేదములు లేవు. విశ్వ మత గ్రంధము.

"ఏకం సద్విప్రా బహుధా వదంతి"

తత్ + త్వం + అసి = తత్త్వమసి. (3 షట్కములు – 3 x 6 = 18 Chapters)

6 + 6 + 6 = 18 Chapters.

మదర్థ – మత్కర్మ కృత్ – మత్పరము. భవ రోగ దుఃఖ నివారిణి –

"Spring of spiritualism" Substratum of Eternal Existence.

వేదాంతమునకు బుగ్గ.

1. భగవంతుని ఆత్మ కథ.
2. వేదార్థ సార సంగ్రహం (ఉపనిషత్)
3. పరబ్రహ్మ జ్ఞాన ప్రదాయిని. కావున, బ్రహ్మ విద్య.
4. ఆత్మా నాత్మ వివేక వివేచని కావున సాంఖ్య దర్శని,
5. కర్మ యోగ రహస్య భోధిని, కావున కర్మ యోగ శాస్త్రమని,

6. కృష్ణార్జున  సంవాదమని
7. అద్వైతామృత వర్షిణీ – కుంభ వృష్టి – ధర్మ మేఘం.
8. అమృత తత్వ సాగరం – శేష శాయి నిలయం.
9. భవద్వేషిణీ – మోక్ష ప్రదాయని – మృత్యుంజయత్వము ను ప్రసాదిచునది. “గీతా గంగోదకం పీత్వా.
10. “శోక మోహ” – నివారిణి. – సత్య ధర్మ ప్రభోధిని – సత్య జ్ఞాన ప్రదాయని.

Gateway for Heaven.

Celestial Song.

భవ సాగర తరణ నావ.

సర్వోపనిషత్సార సంగ్రహ సత్య దర్శన శాల.

# 12. భక్తి

## (తదను భంధములు)

పవిత్ర – దివ్య – మధురానుభూతులతో పులకించి – తన్మయత్వమున – భగవంతునియందు –పరిపూర్ణముగ లీనమై – ద్వైతము నశించు స్థితి –ఐక్యమే – భక్తి – పరమావధి

భక్తుని హృదయంలో ఆద్యంతరహిత పవిత్ర సంచలనం – సంక్షోభం – ఆరాటం – విరహజ్వాలాది మథనం –భక్తి స్వరూపం –

నశ్వర దేహ పోషణకు ఆహార పానీయాదు లెంత ఆవసరమో, ఆత్మోద్ధరణకు దైవ ధ్యానము ప్రాణ తుల్యము – అత్యావసరము.

మానవ జన్మ దుర్లభమైనది. క్రిమి కీటక సర్ప, ఖగ, జంతు జాలాది ఉపాధులందు బడక, శుభ సంస్కారములతో, జ్ఞాన – సద్గుణ – రూప – ఆరోగ్యైశ్వర్యాదులతో మానవుడుగ మనడం ప్రత్యేకత కాదా!

కాని, మెదడు గల మానవుడు చేయ జాలని పాపం లేదు. సామాన్యంగా ప్రతి ప్రాణికి కర్మ ఫల భోక్తృత్వం  అనగా పునర్జన్మ జరా మరణ చక్ర భ్రమణం తథ్యమని సులభ గ్రాహ్యం.

"మనస్సు" – మానవుని మభ్య పెట్టి పెడ త్రోవలఁ ద్రిప్పుతూంది. ఒక ప్రక్క శుభ సంస్కారములుత్తేజితమై  పురోగతిని  ప్రోత్సహిస్తూంటే, మరొక ప్రక్క, జన్మ జన్మాంతరముల నుండి పేరుకొని, కరుడు గట్టిన అశుభ (అసుర – విషయ) వాసన ల కలవాటు పడ్డ "మనస్సు" దశేంద్రియముల, సాహచర్య – సాన్నిధ్య – సహకార –సంగ దోషములతో, విజృభించి, విశృంఖల వీర విహారం చేస్తూ, జీవుని అధో(తిరో) గతికి లాగుతూండడం సర్వానుభవం!  మానవుడు సహజంగా సంస్కారముల కుప్ప ః కావున, ప్రగతికి భక్తి, జ్ఞాన, యోగాది సాధనలత్యావసరము. నిష్కామ కర్మ భక్తికి దారిదీయు ప్రాతి పదిక. కర్మ వీరుడుగాని వాడు, ఏ సాధనలను చేయఁజాలడు.

భక్తి – నిర్వచనము.

భగవంతుని యెడ అనిర్వచనీయమైన – నిర్హేతుకమైన – నిరతిశయమగు – దివ్యానురాగమే భక్తి.

భక్తుని హృదయాంతర్గత రహస్య అనాసక్త ప్రేమారాధనమే భక్తి.
"భగవంతుఁడు – భక్తుడు"  వీరి పరస్పర ఆంతర్య మధుర సంబంధ బాంధవ్యమే భక్తి.
మానవుని పునీత హృదయావేశ, ఆవేగ, దివ్య వాహిని భగవంతుని దెస ప్రవహించుటే భక్తి.

భక్తుని హృదయమే భక్తి యోగమునకు బుగ్గ. అకలుషిత – అహంకార రహిత –అనాసక్త హృదయాంతరంగ దివ్యావేశమే భక్తి.

భగవంతుని పట్ల, సర్వార్పణ – సర్వాంకిత – శరణాగత, దివ్య మధుర, (అనాసక్త) ప్రేమానుభూతియే భక్తి. భక్తుడు అహంకార రహితుఁడు. నిగర్వినని కూడా

గర్వింపడు. ప్రశాంత చిత్తుడు. “నా” అన్న దేదియు లేశమైన లేని, అహంకార, మమకార రహిత, అగతికుఁడు.

జ్ఞాన సహిత భక్తుడు, సత్య దర్శనుడు, స్థిత ప్రజ్ఞుడు, ద్వంద్వాతీతుడు, సర్వసముడు. ప్రేమమయుడు. తన్ను తామరచి, భగవంతుని సహా మరచి, తన్మయుడై, “భగవద్భక్తి” నిషాలో మునిగి పోయేరకం. అలాంటి పరిస్థితుల్లో వాని రక్షణ, పోషణ బాధ్యతలు సర్వం భగవంతుడే వహించాలి!

భక్తి యోగమునకు (ద్వాదశ – పారణ) ధర్మామృత యోగమని శ్రీ కృష్ణ వచనము (12 chapter). సగుణ, నిర్గుణో పాసనల తార తమ్యము, భక్తి ప్రవేశించుటకు సోపానములు, భక్తునకుండ వలసిన గుణములు మొ|| చెప్పఁ బడినవి.

సహజ, నిరపాయ, అలౌకిక, దివ్యా వేశమే భక్తి. భక్తుని హృదయమే ప్రేమ నిలయము – దివ్య ధామము. ఆరాధనమే ప్రేమ లక్షణ త్రయము – అనగా, ఫలా పేక్ష లేకుండుట, నిర్భయత్వం (అభయం). తను విశ్వసించి ప్రేమించిన మూర్తి స్వరూపమే మహోత్తమ మని నమ్ముట - -

స్థల, కాల, పథ, అధికారాది విధి నిషేధములు లేక అందరికి అందుబాటులో నుండు, సులభ, సుకర, భద్ర పథము భక్తి. నిర్మల, నిరపాయ, ఆనందమయ, దివ్యతర, ఏకైక మధుర పథము భక్తి.

శ్లో|| తస్మాత్స ర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున

తా|| అర్జునా! నీవిక ముందు నిష్కామ బుద్ధితో సర్వ కర్మలు నాచరించు చుండుము. నే నే కర్తనని నన్ను స్మరించు చుండుము. అర్చిరాది మార్గమున పోగలవు.

-- భగవద్గీత. అ. 8.శ్లో. 27.

అవ్యభిచార, అచంచల, అనాసక్త, నిత్యా నిరంతర, ఏక (తైల) ధారా ప్రవంతిగా చేయు దైవ ధ్యానమే, భక్తి (ధ్యాన) మార్గమని. నారద, శాండిల్యా భక్తి సూత్రము లందు ప్రవచింపఁబడినది.

ధన, దార, పుత్రేషణాదులు –
ఆధ్యాత్మిక, ఆధి భౌతిక, ఆధి దైవిక, విపత్తులు –
స్థూల, సూక్ష్మ కారణ శరీరములు –
మనో వాక్కాయ మాలిన్యములు

అరిషడ్వర్గ, స్థూల సూక్ష్మేం (అంతరిం) ద్రియముల దాడి, మొ || వాటి నెదుర్కొని జయ మొందుటకు భగవ ద్ధ్యాన మత్యవసరము. భక్తి యే విజయ కవచము.

"బలేన గాక – బాల్యేన", మార్జాల కిశోర న్యాయమున, గోవత్స తుల్యముగ, నిర్భీతిగా తరింపఁజేయగల భద్రనావ భక్తి.

"ఉపాసన" అనగా అనేక మార్గు ఒకే విధముగా భావించి, ద్యానించుట :

ఉ || ఇష్ట దైవోపాసన, ప్రణవో పాసన.

భక్తి (ఉపాసన) రెండు విధములు.

1. సగుణ – సోపాధిక –సాకార భక్తి

2. నిర్గుణ – నిరుపాధిక – నిరాకార భక్తి.

సాపేక్షునకు అనగా –ఆర్తుడు, జ్ఞిజ్ఞాసువు, అర్థార్థి – ప్రవృత్తి పర – సగుణోపాసన మే శ్రేష్ఠము. ఈ రెండును, రెండు రైలు కమ్ముల వలె, ఒకే దిక్కు, ఒకే మార్గము, ఒకే గమ్యము గలవి.

అర్తులు క్రమముగా, భక్తులై, జ్ఞిజ్ఞాసువు లగుదురు. తర్వాత క్రమముగా ముముక్షువులై, తదుపరి జ్ఞానులై, సాధకులు, సిద్ధులు, యోగులు, స్థిత ప్రజ్ఞులు, అవ ధూతలు, హంసలు, పరమ హంసలు - - సర్వాతీతులగుదురు.

శుద్ధ భక్తియే, శుద్ధ జ్ఞానము,

భక్తికి – ప్రయత్నము, విశ్వాసము, అభ్యాసము, ఆర్తి ముఖ్యాంగములు –

భగవదారాధనము రెండు విధములు : -

1. పుణ్య క్షేత్ర దర్శనము, తీర్థ యాత్రాదులు, ఆలయ ప్రతిష్ఠలు, ఉత్సవములు, ఊరేగింపులు, ఆశ్రమ జీవనం, యజ్ఞయాగాదులు, వ్రతములు, అర్చనలు, నానా ఆరాధనాది కైంకర్యములు - - ఇది పరోక్షారాధనయే.
2. మానవరూప మాధవారాధనము, విద్య, వైద్య, ఆరోగ్య, బోజన, తీర్థ, వస్త్ర, నీడల నొసంగుట, అగతికులకు గతులు కల్పించి, ప్రాణి కోట్లను సేవించి "మానవ సేవే మాధవ సేవ" గా ప్రత్యక్షారాధన మొనర్చుట. –

భక్తుడు భగవంతుని దప్ప మరెద్దియు అభిలషింపడు, కన్నెత్తి యైనఁజూడడు – ఎట్లనగా : -

- హంస క్షీర పాన మొనర్చునే గాని నీరంటదు.

- సింహము మత్తేభ మస్తిష్కమునే వాంఛించునే గాని, వేరెద్దియు భక్షింప కోరదు.
- చకోరము వర్ష బిందువులకై నోరు తెరచుకొని తపించుచు వేచి యుండునే కాని, నదులు, సరస్సులు, సాగరముల యందలి జలములను కన్నెత్తి యైన చూడదు.
- కమలములు కమలాప్తుని రశ్మినే కాంక్షించును గాని, వేయి మణులఁజూపినను కళ్ళు విప్పి వికసింపవు.
- భ్రమరము మందార మకరందమును గ్రోలునేఁ గాని తుదకు దాని వాసన – రంగు - రమ్యములతో దాని కవసరము లేదు.

వివేక, వైరాగ్య జనిత అభ్యాస ఉపరతి నున్న యోగి (భక్తుని) మనస్సు ఈశ్వర చింతనము తప్ప మరెద్దియు సహించి భరింపఁ జాలదు. భక్తుడు భగవంతుని దక్క సమస్త లోకములను, పాదముల చెంతఁ నిడినను తిరస్కరించునే గాని, తృప్తిఁ జెందడు. భక్తుని హృదయమే భగవంతుని ప్రియ నివాసము. భక్తుడే భగవంతుడు, భగవంతుడే భక్తుడు. వీరి పరస్పర అవినాభావ సంబంధమే భక్తి యోగ దివ్యాను బంధము.

అణిమాది అష్ట సిద్ధులు, అష్టైశ్వర్యములు, తుదకు, సర్వ సామ్రాజ్య సార్వ భౌమత్వమును కూడా, కోర సహించడు.

ద్వైతి (భక్తుడు) అద్వైతికాగోరడు. భగవంతుని నుండి వేరుగా నిల్చి, ఆనందానుభూతినే కోరునే గాని, ఐక్యము కోరడు. “నేను చక్కెరను తిని ఆనందింతునే గాని, చేక్కెర గా మాత్రం మారనిచ్చగించను” – ఇదే భక్త ధోరణి.

కాని, అద్వైతి ఆలాంటి ద్వైత స్థితిని నిరసించి, జీవ బ్రహ్మైక్యాన్ని లక్షించి, సాధించి, “జన్మ జరా మృత్యు” చక్ర భ్రమణము నుండి విముక్తి పొందును.

భక్తి యోగమునకు శాస్త్రీయ, సాంకేతిక, వ్యాఖ్యలు, భాష్యములు, విధి నిషేదములు దురూహ్యములు.

భక్తి పరిధులు లేని ఏకార్ణవము, మహోన్నతమై, విచారమున కందని, అఖండ దివ్య మధురానుభూతి. భక్తి ఉపాయము – జ్ఞానము ఉపేయము.

హృదయాంతర్గత, రహస్య భగవత్ప్రేమారాధనమే భక్తి. ఇదియే భక్తుని, హృదయాంతర్య నిజ తత్వము.

నీవు ఈశ్వరుఁడవే - - - - - - ?

ఈశ్వరుడిచ్చయించునదే నీవును ఇచ్చగింతువు – మీ యిరువురును ఆనందస్వరూపులే – కాని, నీవు నీయాంతరంగిక తత్త్వము లోనికి దిగి లోతున శోధించి (దృష్టిని దీర్ఘముగ అంతర్ముఖ మొనర్చి) ఈశ్వర దర్శన మందకున్న ధన్యత లేదు.

హరి ఓం తత్సత్ !!.

బ్రంహ్మాండమే అతని రూపము –
తద్రూపధ్యానమే అతని పూజ -
అహింసాది అష్ట విధ పుష్పములే పూలు –
హృదయ నవనీతమే నైవేద్యము –

అఖండ, అనంత, అద్భుత, అసమాన, అప్రమేయ, అమృత, ఆనందమయ, చిద్విలాసమే, సర్వ శరణ్యా పరతత్వ పరమావధి.

అఖండ పరబ్రహ్మలో, జీవాంశ, సర్వ లోక సాక్షి యైన సూర్య భగవానుని అనంత కిరణ జాలము లో నుండి ప్రత్యేకింపఁ బడు ఒక “రశ్మి రేఖ” వంటిది.

-- శ్రీ భగవాన్ రమణ మహర్షి.

శ్లో || మచ్చిత్తా మద్గతప్రాణా బోధయంతః పరస్పరమ్|
కథయంత శ్చ మాంనిత్యంతుష్యంతి చ రమంతిచ||

-- భగవద్గీత. అ. 10. శ్లో. 9.

తా || నా యందే మనస్సు – ప్రాణము – ధ్యాన భక్తు లుంచి, బాగా నన్ను తెలుసుకొన్న జ్ఞానులు నాయందే ఆనందించి క్రీడించు చున్నారు.

సర్వకాల సర్వావస్థలందును, భగవచ్చింతనము, సంకీర్తనము, గానము, ధ్యానము, శిల్పము, చిత్రలేఖనము, జపము, ఆరాధనము, అలంకారము, వినోద కాలక్షేపము, శృంగారము, నాట్యము, - - - - సర్వాంకిత, సర్వార్పణ, శరణాగత భక్తుడు, జ్ఞాని, చరితార్థుడు, ధన్యుడు. ఆదర్శ మానవుడు.

అనన్య భక్తి, అతుల వైరాగ్యము, అనాసక్త సేవా తత్పరత్వము, జీవన్ముక్తిని ప్రసాదించును.

భగవంతుని పట్ల అఖండ విశ్వాసము, అంతరారాటము, భక్తికి రెండు రెక్కలు. జన్మ జరా మృత్యు సంసార సాగర తరణము – "అన్యధా శరణం నాస్తి త్వమేవ శరణం మమ" - - - - శరణాగత సర్వార్పణ బుద్ధితో భగవంతునుపాసించు భక్తునకు తరింపు తథ్యము. ఇది భగవంతుడు స్వయంగా ప్రమాణం చేసి చాటిన వాగ్దానము – శాశ్వత ఫర్మానా. ఇంకా, ఎన్ని ఆధారాలు – దాఖలాలు కావాలి?

"సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకంశరణంవ్రజ"
"అనన్యా శ్చింత యంతోమాం - - - - "
"తమేవ శరణం గచ్ఛ - - - - - "
"మన్మనాభవ మద్భక్తో - - - - "
"తచ్చింతనం తత్కథనం - - - - "
"మచ్చిత్త స్సర్వ దుర్గాణి - - - _- గీత

ఓహ్!! ఇంకెన్ని కావాలి - - - ?

భక్తికి చరమ దశ తన్మయత్వం, అనగా తనువు మరచుట : అమనస్క స్థితి – ఇదే జ్ఞాన యోగ పరమావధి కూడా. నారద మరియు శాండిల్య భక్తి సూత్రములే భక్తి యోగమునకు ప్రాణ పట్టు.

భక్తి త్రిగుణాత్మకము కూడా :

భక్తి నవ విధములు – శ్రవణం, కీర్తనం, స్మరణం, పాద సేవనం, అర్చనం, వందనం, దాస్యం, సఖ్యం, ఆత్మ నివేదనం.

భక్తి పథములు – వివరణ : -

| | |
|---|---|
| అనన్య --- | ప్రహ్లాద, క్రైస్తు, మొహమ్మదు |
| వాత్సల్య --- | యశోద, కౌసల్య, మీర, సక్కు |
| సఖ్య --- | విభీషణ, సుగ్రీవ, అర్జున, ఉద్ధవ, కుచేలాదులు |
| మధుర --- | రాధ, గౌరంగ, (చైతన్య ప్రభు) |
| దాస్య --- | ఆంజనేయ, గుహుడు, శబరి, కుబ్జ |
| శాంత --- | అక్రూర, విదురాదులు |
| ద్వేష --- | కంస, శిశుపాల, రావణాదులు (దుర్లభం) |
| పరాభక్తి --- | స్షిబ్లీ, వృద్ధ బ్రాహ్మణుడు మొ \|\| వారు, |

వారి పుణ్య పురాణ గాథలు, గమనార్హము

– పరాభక్తి నిరుపమానము.

అగణిత, సర్వాతీత, మహాద్భుత, ప్రేమ వాహిని "పరా భక్తి".

మనస్సు – శరీర పక్షము చేరిన – ఆత్మకు ద్రోహము!

ఆత్మ పక్షము చేరిన – దేహమునకు మోసం.

కాని, ఏది క్షేమం – శ్రేయస్కరం, శుభం, అనిన దివ్య సత్యాన్ని ఎవరికి వారు బాగా యోచించి, బాగు పడ్డం భావ్యం!

రామ పథం – ఆత్మారామ విద్య –అలౌకికం – (జ్ఞాన మార్గం) – ఊర్ధ్వగామిత్వం.

కామ పథం – విషయేంద్రియ సమారాధన పథం – అజ్ఞాన ధోరణి - లౌకికం – అధోగామిత్వం.

"తినగ తినగ వేము తియ్యనుండు "జ్ఞాని – యోగి" మోక్ష మపేక్షింతురు, భక్తుడు ఏమిన్ని కోరడు. భగవంతుని పరంగా సర్వం సన్యసించి – భగవంతుని సుఖ క్షేమములనే అర్థించును. అతనికంతే చాలును!!

1. సగుణోపాసన (సాకార) – ఆరాధ్య దైవమైన ఇష్ట దేవతా రూప చింతనం – ధ్యానం –సాపేక్షునకు ఇది శ్రేష్ఠ పథము. ( భగవద్గీత అ. 12. శ్లో. 2 నుండి 8 వరకు)

శ్లో|| మ య్యావేశ్య మనో యేమాం నిత్యయుక్తా ఉపాసతే
శ్రద్ధయా పరయోపేతాస్తే మే యు క్తతమా మతాః

తా|| ఎవరు భక్తి శ్రద్ధలతో (11 – 55) లో చెప్పినట్లు నన్ను సగుణ రూపముతో ధ్యానింతురో వారుత్తములు; వారు నన్ను పొందుటలో సందేహము లేదు.

-- భగవద్గీత అ. 12. శ్లో. 2.

శ్లో|| మత్కర్మకృ న్మత్పరమో మద్భక్త స్సంగవర్జితః
నిర్వైర స్సర్వ భూతేషు యస్స మా మేతి పాండవ

తా|| ఎవడు నాకర్మలు చేయునో (కర్మ), ఎవనికి నేనే పరమగతిగా నుందునో (జ్ఞానం), ఎవనికి విషయ వాంఛాసంగమమే లేదో (స్థిత ప్రజ్ఞ, విరాగి, సన్యాసి), ఎవడు నన్నే నమ్మి యున్నాడో (భక్తి), ఎవడు సర్వ భూతములను ప్రేమించు చున్నాడో(ప్రేమ), వాడు నన్నే పొందును.

శ్లో|| యేత్వక్షర మనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే
సర్వత్రగ మచింత్యం చ కూటస్థ మచలం ధ్రువమ్

శ్లో|| సన్నియ మ్యేంద్రియగ్రామం సర్వత్ర సమ బుద్ధయః
తేప్రాప్ను వంతి మామేవ సర్వ భూతహితే రతాః

తా|| నిర్గుణో పాసకులును సర్వత్ర సమ బుద్ధి గలవారలై సర్వ భూత హితమును గోరు వారలై ఇంద్రియ నిగ్రహము గలవారలై యున్న వారు నన్నే పొందుదురు. శక్త్యుపాసకులును నన్నే చేరుచున్నారు.

-- భగవద్గీత ఆ.12 . శ్లో. 3 -4.

ఉపాసన :- ఉపాసకునకు శాస్త్ర విచార మనవసరం. ధ్యేయ (లక్ష్య) ము మీద నిరంతర (ఏక ధారగా) మనో వృత్తి ప్రవాహమును ప్రవహింపజేయుటే. "గురువు – భోధ" కూడా అనవసరం. సులభ – సుకర –అమృత పథము. భక్తుడు సర్వ భద్రుడు. "మార్జాల కిశోర న్యాయం".

శ్లో|| క్లేశోऽధికతర స్తేషా మవ్యక్తాసక్త చేతసామ్
అవ్యక్తా హి గతి ర్దుఃఖం దేహవద్భి రవాప్యతే

తా|| దేహ ధారులకు (దేహాభిమానము గల వారలకు), నిర్గుణోపాసనా విధి లేక శక్త్యుపాసన మిక్కిలి కష్టమైనది.

-- భగవద్గీత ఆ.12. శ్లో. 5.

శ్లో|| యే తు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః
అనన్యే నైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే

శ్లో|| తేషా మహం సముద్ధర్తా మృత్యు సంసారసాగరాత్
భవామి స చిరా త్పార్థ మ య్యా వేశిత చేతసామ్

తా|| ఎవరు నన్నే నమ్మి నేనే పరమగతిగా విశ్వసించి, నన్నే యుపాసన చేయుదురో వారిని నేనే సంసార బంధము నుండి త్వరలోనే (కొలది జన్మము లలోనే) లేవ దీసెదను.

-- భగవద్గీత ఆ.12. శ్లో. 6 - 7.

శ్లో|| మ య్యేవ మన ఆథత్స్వ మయి బుద్ధిం ని వేశయ
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వంన సంశయః

తా|| నీ మనస్సును బుద్ధియు నాయందే యుంచుము, మరణానంతరము నా యందే యుండ గలవు. ఇందు సందియము వలదు.

-- భగవద్గీత ఆ.12. శ్లో. 8.

– సగుణమే సుగుణము. క్షేమ దాయకము – “సులభ – భయ రహిత – భద్రపథము” నిరపాయకర “మార్జాల కిశోర” న్యాయము. ఇదే క్రమముగా నిర్గుణమునకు తీసికొని పోవును. “మూర్తి ధ్యానము – మంత్ర జపము” రూప చింతన ధ్యానాదులు ప్రాణ పట్టు. బ్రహ్మాండమే అతని రూపము, తద్రూప ధ్యానమే పూజ. మంత్ర పుష్పము – అష్ట పుష్పార్చన – ఆత్మ పూజకు దారి తీయును. నిర్గుణోపాసన శీఘ్ర ఫలదాయని.

2. నిర్గుణోపాసన – దీనికి సగుణమే ఆలంబనము – మాతృక – సగుణ సాధన ఫలమే నిర్గుణము. జ్ఞాన సహిత నిరుపాధికము – బ్రహ్మము జ్ఞానముచే అగ్రాహ్యము. అవేద్యము – అవాఙ్మనస గోచర బ్రహ్మము నుపాసించుట.

అఖండ, అద్భుత, అనంత, అమృత, ఆనందమయ చిద్విలాస ధ్యాన చింతనమే పరమావధి. పరతత్వ అపరోక్షానుభూతి యే అనన్య శరణ్యము. బ్రహ్మ సాక్షాత్కారమునకు సన్నిహితము.

నిర్గుణోపాసన కనధికారులైన వారు మిశ్రమ బ్రహ్మోపాసన మొనర్చవలెను. అనగా తొలుతే – (1) కళ్ళు తెరచి యిష్ట దేవతారాధన మొనర్చుట. (2) కళ్ళు మూసుకోని “అదే రీతిని మానసిక పూజఁగావించుట. – తదేక (ఏక ధారా) ధ్యానం, సులభంగా నిర్గుణమునకు . . . . ఆలాగే . . . . తీసుకొని పోవును. (3) సృష్టికర్త – సర్వేశ్వరుని అనంత, అద్భుత – అఖండ - - విశ్వ నిర్మాణ, పోషణ, లయాది విలాసాల చింతనమే చాలును. . . . ఆలాగే . . ఇంకా పో. . . అదియే ఆత్మ ధ్యానము – బ్రహ్మాభ్యాసము. భగవంతుని అనంత శక్తి – జ్ఞానం – ఔదార్యం –

శ్లో || శ్రేయో హి జ్ఞాన మభ్యాసాత్ జ్ఞానాద్ధ్యానం విశిష్యతే
ధ్యానాత్కర్మ ఫలత్యాగ స్త్యాగాచ్ఛాంతి రనంతరమ్

తా|| యోగాభ్యాసముకన్న జ్ఞానయోగమును, జ్ఞానముకన్న ధ్యానయోగమును, దానికన్న, సర్వకర్మ ఫల త్యాగము గొప్పది. త్యాగమునకు మోక్షమే ఫలము.

-- భగవద్గీత ఆ. 12. శ్లో. 12.

సగుణ భక్తులు నిర్గుణోపాసన చేయఁజాలరు. అట్టివారు, నిష్కామ భక్తులై సర్వము నాకర్పించి(అంకితమొనర్చి) – నాయందే సంపూర్ణ –విశ్వాస మొనర్చి, భజించి తరించెదరు -

సగుణ భక్తి సోపాధికము –

| | | |
|---|---|---|
| 1. ఆర్తుడు | } | సకామ్య, ప్రవృత్తి, ద్వైతము – |
| 2. జిజ్ఞాసువు | | సాపేక్షునకు (కోర్కెలు గలవానికి) |
| 3. అర్థార్థి | | భ.గీ. అ 12.శ్లో 2 నుండి 8 వర్కు – సగుణోపాసనయే శ్రేష్ఠము. |

నిష్కామ భక్తుడు, అహంగ్రహోపాసకుఁడు – చతుర్వేద మహావాక్యానుభవి – వీరికి ఉపాసనాదైవంగాని, ప్రత్యేక ఉపాసనలు గాని లేవు. రూప నామ రహిత, అఖండత్వ జ్ఞాన మే ధ్యేయము. మిథ్యా ప్రపంచమున కధిష్టానము నిర్గుణమే. నిరుపాధిక సచ్చిదానంద అఖండ చిద్విలాసము, వీరే ఆత్మ నిష్ఠులు – సత్య దర్శకులు – ఆత్మ పూజానిరతులు. బ్రహ్మ ధ్యాన నిత్య నిరంతర నిమగ్నులు. సర్వ స్వతంత్రులు, భయ రహితులు, నిజేచ్ఛారతులు – అమృతమయులు – ఆత్మారాములు – ఆరూఢులకు సాధనలనవసరంః ఆరు రుక్షులకు అవసరం. సందేహ నివర్తకులు – ద్వైతాతీతులు – బ్రహ్మ్యే భ్యాసనాపరులు సర్వాతీతులు.

సగుణమే క్రమముగా నిర్గుణమునకు తీసుకొని పోవును.

సగుణం ⟶ నిర్గుణం ⟶ సవికల్పం ⟶ నిర్వికల్ప సమాధి లేక బ్రహ్మ సాక్షాత్కారము లభించును (నిర్గుణ సమాధి) – వేదాంత శాస్త్రములందలి ఆత్మ ధర్మములు – "నిర్గుణ – నిర్వికార – అసంగ – నిత్య – నిర్మల - స్వయం ప్రకాశ - అద్వితీయ, పరిపూర్ణత్వాదులు – బుద్ధియందు సులభముగా - శీఘ్రగతిని ప్రభవించును. అట్టి వాడే బ్రహ్మ విదుడు. అదే యోగ సాధన ఫలము. చతుర్వేద మహావాక్య ఫలానుభూతి.

ఆత్మ ధ్యానము – బ్రహ్మోపాసన – అనగా భగవంతుని అనంత – అత్యద్భుత – శక్తి – జ్ఞానం, ఔదార్యాదుల చింతనమే నిజమైన ధ్యానం – తపస్సు – ప్రపంచమంతయు అతని చేతమే – అతని రూపమే - - - ఇంకేం? భగవంతుని సామాన్య జ్ఞానం నుండి విశేష జ్ఞాన మేర్పడును.

సంసార తరుణోపాయమే యోగము } 1). ఆత్మ జ్ఞానము.
2). ప్రాణ నిరోధము.

"జపము – ధ్యానము – ఆరాధనము" – భక్తి కి అంగములు.

"మంత్రో – లయో – హఠో – రాజ యోగ శ్చేతి – చతుర్విధః" – నాల్గు రాజ యోగ మార్గములు.

జప యోగము – నామ జపము – సంకీర్త నాదులు –

శ్రీ హరనాథ్ – గౌరాంగ – సాయి బాబా – మెహర్ బాబా – వీరు "జప" ప్రాధాన్యమును భోధించిరి.

బీజాక్షర జపము – జపమాల – ఏకాగ్ర ఏకధారా జప యోగము - . . . . ఓం – హ్రీం – క్రీం – క్లీం –హ్రీం - హ్రూం - - - మొ || ఏకాక్షరం – ఓం – ప్రణవ – గాయత్రీ మంత్రము. ద్వ్యక్షర – "హంస" – సోహం.




(ఏక ధార) (అంచ లంచలుగా) –

ఇక, శ్రీ రామ, శ్రీ కృష్ణ ,

పంచాక్షరీ – "ఓం నమశ్శివాయ"

అష్టాక్షరీ - "ఓం నమో నారాయణాయ"

తారకం - " రామ తారకం"

శ్లో|| మహర్షీ ణాం భృగు రహం గిరా మస్మ్యేక మక్షరమ్

యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః

తా|| ఋషులలో శాంతము గల భృగు మహర్షిని, అక్షరములలో "ఓం" కారమును, యజ్ఞములలో భగవన్నామ యజ్ఞమును, కొండలలో హిమవత్పర్వతమును నే నే యని భావించుము.

-- భగవద్గీత అ.10. శ్లో. 15.

"యజ్ఞానాం జప యజ్ఞోస్మి" – భగవద్గీత.

"యజ్ఞము లలో కెల్ల జప యజ్ఞము ను నేనే"

రోమన్ కాథలిక్స్ – ముస్లిం భక్తులు – జపమాల – జప యోగ సాధకులే. –

శ్లో || ఏకాక్షరం ద్వ్యక్షరం వా షడక్షర మ థాపివా |
అష్టాక్షరం వామంత్రాయ మంత్రయోగే సదా జపేత్ ||

నాదలయం – "మనో + మారుతం" (మనస్సు + ప్రాణము) తండ్రి తనయుల ఐక్యము.

ధ్యానము - 3 విధములు – సాత్వీక, రాజస, తామసికము లని.

1. సాత్వీక వృత్తులందు బ్రహ్మము యొక్క "సచ్చిదానందము" (సత్యం –శివం – సుందరం) లను ధ్యానించుట.
2. మృచ్ఛిలాది జడ పదార్థము లందలి సద్రూపమును సామాన్యముగా ధ్యానించుట.
3. రాజస – తామసములందలి సచ్చిద్రూపముల, నంత కన్న నెక్కువగా ధ్యానించుట.
4. పై త్రివిధ ధ్యానముల తీవ్ర సాధనల తర్వాత అనగా, వృత్తులు ప్రశమించిన పిదప, (వాసనా క్షయానంతరం) – బ్రహ్మ ధ్యానము (బ్రహ్మోభ్యాసము) ఉత్తమోత్తమము.

సచ్చిదానంద చింతన రూప ధ్యానము చేత – చిత్తైకాగ్రత గల్గుచుండగా – అట్టి చింతనమందు "బ్రహ్మ విద్య" ఉదయించి – స్థిరముగా నిల్చును – ఇదియే "విద్య"

-- జ్ఞాన దశయందు బ్రహ్మ లక్షణములైన "సచ్చిదానంద"ములు – సజాతీయ – విజాతీయ – స్వగత భేద శూన్యమై (అపరిచ్ఛిన్నమై) కేవల వస్తు మాత్రముగా ప్రకాశించుటయే :

-- అజ్ఞాన దశయందు భేదమునకు కారణములైన ఉపాధులు (నామరూపాదులు) లేక పోవుట వలన, బ్రహ్మ లక్షణములు (సచ్చిదానందములు) వేరుగా ప్రకాశింపవు –

-- త్రిగుణములే ఉపాధి భేదములకు కారణములు. "జ్ఞానము – యోగము" (ఆత్మా నాత్మావివేకము – విచారము) ల వల్లనే ఉపాధులు పరిహరింప నగును.

-- స్వయం ప్రకాశ సత్యరూప మై సదాభాసమానంబగు నిరుపాధికాద్వతీయ బ్రహ్మ తత్వమున – "జ్ఞాతృ –జ్ఞాన – జ్ఞేయము" లనెడు "త్రిపుటి" లేదు. ఇట్టి స్థితి యే "భూమానంద" మనబ౦డును.

కర్మ ⟶ నిష్కామ కర్మ ⟶ **భక్తి** (సగుణ ⟶ నిర్గుణ) ⟶ జ్ఞాన ⟶యోగం ⟶ మోక్షం - - - - ఇది క్రమ ముక్తి పథము – ఇందు కనంత జన్మలు కావాలి –




| సామన్య భేధములు | విశేష భేదములు | విధములు | పంచ విధ భక్తి ముక్తి సోపనములు (విశిష్టా ద్వైతము) |
|---|---|---|---|
| ↓ | ↓ | ↓ | |
| సకామ్య | అనన్య (1) | శ్రవణం | సాలోక్యం |
| వ్యభిచార | దాస్య (2) | కీర్తనం | సామీప్యం |
| అభేధ | వాత్సల్య (3) | స్మరణం | సారూప్యం |
| నిష్కామ | మధుర (4) | పాద సేవనం | సాయుజ్యం |
| | శాంత (5) | అర్చనం | బ్రహ్మైక్యం |
| | సఖ్య (6) | వందనం | |
| | ద్వేష (7) | దాస్యం | |
| | పరా (8) | సఖ్యం | |
| | | ఆత్మ నివేదనం | |

1. అనన్య భక్తి -- పండరి భక్తులు – ప్రహ్లాద – క్రీస్తు – ముహమ్మద్ – షిబ్లీ
2. దాస్య భక్తి -- శబరి – గుహుఁడు – విదుర – ఆంజనేయుడు.
3. వాత్సల్య భక్తి -- యశోద – కౌసల్య – మీరా – సక్కుబాయి – జట ధారి
4. మధుర భక్తి -- శ్రీ చైతన్య (గౌరాంగ) ప్రభు – రాధ – వళ్ళి.
5. శాంత భక్తి -- అక్రూర – విదురుఁడు.
6. సఖ్య భక్తి -- సుగ్రీవ – విభీషణ – ఉద్ధవ – గోపాలుడు – కుచేల – అర్జున.
7. ద్వేష భక్తి -- కంస – శిశుపాల –శతాంగుళీమాలుడు – రావణ.
8. పరా భక్తి -- షిబ్లీ – వృద్ధ బ్రాహ్మణుడు – ఇద్దరు మిత్రులు.

(1). గాంధీజీని అనాచారుఁడని, హరిజన ప్రియుఁడని దూషించి సనాతనులు ధన్యులైరి.

(2). షిర్డీలో దైవ ద్వేషియైన ఒక స్త్రీ యింట – ఒక విగ్రహమును ప్రసాదించి "సాయి" అనుగ్రహించెను.

(3). మూగ వాడలో తలను గాయపరచిన మూగ వానికి "వాక్శక్తి"ని ప్రసాదించి "పుండరీశ్వరుఁడు" అనుగ్రహించెను.

(4) జయ విజయులు "ద్వేష భక్తి"నే అభ్యర్థించి తరించిరి.

(5) విషము గ్రక్కిన సర్పము కాళియునకు కృష్ణ పరమాత్మ మోక్షమిచ్చెను.

(6) చంప వెన్నాడు శతాంగుళీకుని బుద్ధ భగవానుఁడు ఆశీర్వదించి అనుగ్రహించెను.

ఈశ్వరుఁడు జగత్సంసారి – కర్త – యజమాని - సమస్త ప్రాణుల యోగ క్షేమముల భాధ్యత భారములను భరించి, వారి వారి ప్రాప్త్యనుసారం – కర్మ ఫల యోగ్యతాను సారం ఫలముల ప్రసాదించు ప్రభువు. దీన దయా పరతంత్రుడు, పరమ పావనుడు, భక్త జనావనుఁడు.

మానవుని హృదయ మొక సంస్కారముల కుప్ప, స్వభావము సంస్కార బల జాతము. కాని, అవి (సంస్కారములు – వాసనలు) పరిస్థితులనుకూలించినప్పుడు (సూది తాకినంతనే గ్రామ ఫోన్ ప్లేట్ల లో అణిగి అజ్ఞాతముగా నున్న పాటలు పాడునట్లు) మొలకలెత్తి - వికసించి – విజృంభించును. ఊరకనే విత్తనము మొలవదు. నీట తడసెనా, యిక నిలువదు. మొలకెత్తి చిగుర్చును. కాని, భర్జిత (వేయించిన విత్తనము) బీజము వలె సాధకుఁడు, నిర్వాసనాపరుఁడై, పండి పోయి యుండిన భయం లేదు, లేకున్న పునర్జన్మ తథ్యము.

"ఎల్లలోకములందు నే వస్తువున్నదో |
తల్లి పిల్ల సందు తగులునదియె |
నిస్తరంగవార్ధి నియతిని జూడుము | || వి ||

తా || జన్య జనక భావము, ప్రేమ తత్వమే! నిర్గుణ పరమేశ్వరుఁడే, ప్రేమ రూపుడై కనఁబడును. -- వేమన

"సగుణ – నిర్గుణ" ఉపాసనలు రెండును రెండు రైలు కమ్ముల వలె – దిక్కు – మార్గము – గమ్యము ఒక్కటే. -- ప్రభు హరనాథ్.

"భక్తి ఉపాయము – జ్ఞానము ఉపేయము " -- శంకరులు

"శుద్ధ భక్తి – శుద్ధ జ్ఞానము" లొకటె -- శ్రీ రామ కృష్ణ పరమ హంస.




1. సాత్విక భక్తి. మహా శుద్ధమై – గోప్య మైనది. తుదకు భార్యా బిడ్డలకు – ఆంతరంగికులక్కూడా తెలియని "రహస్యారాధనము". ఆంతర్యధ్యానము. బహు నిగూఢ బ్రహ్మాభ్యాసము లాంటిది. శీఘ్ర శుభ ఫల ప్రదాయిని. పదిలముగా బిరడా బిగించిన "సెంటు" బుడ్డి వలెను, పైకి ఏమాత్రము పొక్కనీయక లో లోపలనే ద్రవించి, ప్రవహించు "లావా" ను తన గర్భమందు దాచుకొన్న అగ్ని పర్వతము వలెను గంభీరముగ దాచబడిన భగవత్ప్రేమ అది. ఉదాహరణమునకు –

ఒక రాజు తన రాణికి, నిత్య పూజ, వ్రత, దాన, ధర్మాదులకు విస్తారముగ, సమస్త సదుపాయ సామగ్రుల చేకూర్చునట్లు శాసించి, జాగ్రత్తగా గమనించియు, తాను మాత్రం ఆ దెస నైన కన్నెత్తి చూడడు. అందు పాల్గొనడు. తన భర్త తటస్థ –ముభావ ధోరణికి ఆమె (రాణి) కించ బడి పరితపించి తన భర్త యొక్క ఉత్తరగతులకై వాపోవు చుండెడిది. కాని, ఒకనాటి రాత్రి నిద్రలో రాజు తన యిష్ట దేవతా ధ్యానమును పలవరించుట విన్న రాణి. మహదానందభరితమై, రాజును మేల్కొల్పి, అతని భక్తి ప్రమత్తతను అభినందించి పరవశమొందెను.. రాజు నిశ్చల చిత్తుఁడై, "ఓహో, ఆలాగ! నేను భగవంతుణ్ణి స్మరించడము నీవు విన్నావన్నమాట? నిజమేనా?" అని భార్యను ప్రశ్నించి, సత్యా మరసి "ఈ నాటికి నా భక్తి రహస్యం బయట పడ్డదా" – అని నిర్ఘాంత పడి హఠాత్తుగా ప్రాణముల విడచెను. ఇది సత్వ గుణ భక్తికి తార్కాణము. మహోత్కృష్టమైనది :

2. రజోగుణ భక్తి – డాంబిక – ఆడంబర – వేషార్భాటాలు – మడి మగట – రుద్రాక్షమాలలు –త్రిపుండ్రములు – విభూతి పట్లు – అలంకరణలు – వాయిద్యాలు – అందరు చూడాలని – మెచ్చు కోవాలనే అంతర్యేచ్ఛ తమ భక్తి తాత్పర్యమును నానా రీతుల ప్రకటించు వేష భాష – చేష్టలు రజస్తత్వమును సూచించును.

3. తమో గుణ భక్తి – వీరాలాపాలు- ఆవేశోద్రేక కేరింతలు – నర్తన – సంకీర్తన – వాయిద్యాలు – ఊరేగింపులు – జాతరలు – తిరునాళ్ళు – "ఓం – హర హర ఓం" – రాం రాం రాధే శ్యామ్ – తాళాలు – తప్పెట్లు – గానా భజాన – అంతా సంగ్రామ సంబర సరళి – అన్నీ సత్పద పథములే.

శిథిల కుటీరమున, వర్షము, చొచ్చుక పోయి నట్లు – అస్థిమత - ద్వంద్వాతీతము గాని–పరిపక్వము గాని – "మనస్సు" న – కామాదులు జొరఁబడును.

"సుహృత్" – ఇహ పరంబుల సుఖుడు – సంతోషి – నిర్భయుడు – "ఆత్మవిత్" మాట ఇంకేమని చెప్పాలి?

వాచా వేదాంతి – ఆచరణ లేని వాడు, ఇతరుల మందలను లెక్కించునట్టివాడు; వాని కేమి లాభం? కాషాయ వస్త్ర ధారణ కనర్హుడు.

వేదాంత ప్రవచన గంభీర భాషణములు లేకున్నను – సదాచార – సత్ప్రవర్తనాది సుగుణములు గల నిరాడంబర జ్ఞాని "కాషాయము" నకర్హుడు. ధన్యతముడు.

చేపను జలాశయమునుండి తీసి భూమిన పడ వేసినట్లు, మనస్సును ఇంద్రియ లేక మోహ ప్రవాహమునుండి లాగి వేసిన శుభము!

ఇంద్రియ జయం – జితేంద్రియత్వం – భద్ర పథము.

బ్రహ్మాండమే అతని రూపము –

తద్రూప ధ్యానమే అతని పూజ –

అహింసాది పుష్పములే పూలు –

హృదయ నవనీతమే నైవేద్యము –

అఖండ, అనంత, అద్భుత, అసమాన, అప్రమేయ, అమృత, ఆనందమయ చిద్విలాసమే సర్వ శరణ్యా పరతత్వమే పరమావధి.

అఖండ పరబ్రహ్మ (పరబైలు)లో జీవాంశ, లోక సర్వసాక్షియైన సూర్య భగవానుని అనంతకోటి కిరణజాలములలో ప్రత్యేకింపఁబడు "ఒక రశ్మి రేఖ (కిరణము) వంటిది.

-- భగవాన్ శ్రీ రమణ మహర్షి.

ఆ పరంధాముడు, ఎంత పాపులైనను దండించేడు. మన్నించి పునీతులంజేసి బ్రోచి ఉద్ధరించుట చేతనే గదా "పతిత పావనుడను" బిరుదు

సంపాదించుకొన్నాడు. అవతారములెత్తి సాధు సముద్ధరణ – దుష్ట శిక్షణ (క్రమ శిక్షణ అనగా ఉద్ధరణయే) మొ|| ఆదర్శముల( జూపి – అద్వైతామృత కుంభ వృష్టిని కురిపించి –భారతామృత సర్వస్వం పంచి పెట్టినాడు - - - సత్ప్రయత్నంలో పూర్ణ జయమందక, మధ్యనే ఆగిపోయిన వారిని సహా కరుణించి – ముందు గతులు కల్గించి – పూర్ణ సహకార మొసంగి పునీతులను చేయును. అందరికి “అభయం – ఆనందం” – అతని ఫర్మానా. జగన్నాటక రంగ మొక మహాయజ్ఞశాల; పాత్రలందరు అతని వారే గదా! యింకెవ్వరాతనికి xదయ పరులు? శత్రువులు? – అందులకతని జగత్సృష్టి యే సాక్ష్యము.

“పరోపకారాయ ఫలంతి వృక్షాః |
“పరోపకారాయ వహంతి నద్యః |
“పరోపకారాయ దుహంతి గావః |
“పరోపకారాయ సతాం శరీరం ||

భగవంతుని యావ ద్దృష్టిన్ని లోకోపకారార్థమే! లోక కల్యాణమే అతని యిచ్ఛ! ఆ దయామయుడు – పరంధాముడు – దీనజనావను(డు – మానవుల గోరంత సుకృతం కొండంతలు జేసి – తుదకు అక్షయం గావించి – ప్రతిఫలంగా ప్రసాదిస్తూన్నాడు. పుణ్యము – పూజ – యోగము – అంతే! అందులకాయన సృష్టే నిదర్శనం. ఒక విత్తు నాటిన – వృక్షమై, ఏటేటా వేలు, లక్షలు ఫలముల నిచ్చే “ఆతని కడపట సంతానం ”పృథ్వి” – మరియు గాలి, వర్షం, సూర్య చంద్రాదుల అమూల్య లోక సేవ అగణితముః అద్భుతము – అమూల్యము గదా!! అందరు అతని కర్మాధికారులే.

జడ జగత్తే యీలా ఉదారంగా వుంటే, యిక జగత్కర్త – జగద్భర్త మరెంత ఉదారుడో ఊహింప(దగు. సేవకుల కంటే యజమాని అత్యధికుడు గదా!

కాలింగుడు, కంసుడు, శిశుపాలుడు, రావణ కుంభకర్ణాదులకే మోక్ష మిచ్చిన భగవంతు(డు – ఎంత దయార్ద్రహృదయుడు – పతితోద్ధారకు(డు – పావనచరితు(డు – సచ్చిదానంద స్వరూపు(డు – జగత్పిత; బిడ్డల తప్పులు తల్లి తండ్రు లేమన్నించి ఆదరింపకున్న యిక దిక్కెవ్వరు? మొక్కెవ్వరు?

“భక్తికి చరమ దశ తన్మయత్వం” - అనగా తనువు ను మరచుట – అమనస్క స్థితి.

ప్రణవం + ప్రాణం ⟶ సంధాన యోగం

ఓం + హంస ⟶ సోహం . . . హంసోం - - -

ఆలాగే నామ జపం + ప్రాణం + మనస్సు ⟶ అనగా నామ జపంతో - మనః ప్రాణ సమ్మేళనం.

వేదములందలి 32 విద్యలు మొత్తము ప్రణవ ప్రతిపాదితములే –

ఇదే మంత్ర రాజం – దివ్యాతి దివ్య గురు రహస్యం.

"నా చే ఒసంగ బడినశక్తుల ననుసరించి ఆయా దేవతలు తమ భక్తులకు ఫలముల నిత్తురు. కాని, నన్ను నమ్మిన వారిని నాలో చేర్చుకొందును" – అనన్య భక్తి.

నా సర్వస్వం వారిదే – నే నే వారి కంకితమై – వారు లేక నాకు ఉనికి బ్రదుకు లేవు.

"దేవాన్ దేవ యజోయాంతి మద్భక్తా యాంతి మామపి"

-- భగవద్గీత. ఆ. 7. శ్లో. 23.

చిల్లర దేవతలు కమిషన్ ఏజంట్లు లాంటి వారు. నా క్రింద వారు మీరు నేరుగా నన్నే ఆశ్రయింపవచ్చును. ఎవ్వరి ద్వారా రానక్కర లేదు.

"మన మొక చేయి జాపిన అతడు విశ్వమూర్తి తన వేయి చేతులు జాపి – తన దరి చేర్చుకొనును. విశ్వరూపుడు సర్వాంతర్యామి, మనకు లోపల బయట కూడా ఉన్నందున, వెదుక నక్కర లేదు.

బిడ్డ ఏడ్పును తల్లి ఏలా సహిస్తుంది? హృదయార్పణ బుద్ధితో- త్రికరణ శుద్ధిగా – పిలిస్తే భగవంతుడు సులభ లభ్యుడు – ఆర్తత్రాణ పరాయణుఁడు –

ఒక్క తూరి "మనసారా" భగవంతుని స్మరించిన పాప పుంజములు నశించును. రెండవ తూరి ఉచ్చరించిన మోక్షము తథ్యము. మూడవ తూరి పిలిచిన భగవంతుడు మనకు ఋణపడి వెంటఁ దగులును.

"మూఢ భక్తి యే గాఢ భక్తి"

భక్తి పథంలో "విశ్వాసము"న కున్న ప్రాధాన్యం మరే అంగానికి లేదు. విశ్వాసమే దేవుఁడు, దేవుఁడే విశ్వాసం.

"పార్వతీ! ప్రాణి కోట్ల ఆనందమునకై సృష్టించిన ప్రకృతి పుష్ప సౌరభ సౌందర్యాలను – లాగి – త్రుంచి – పాడుచేసి నా తల మీద వెయ్యడం నేను హర్షించను. నా దివ్య రచనను దులిపి – తుడిచి వేసిన వారిని చూచి నేను

దుఃఖింతును. అది అసహజ – అక్రమ – చర్యగా నే భావింతును” – అన్నాడు పరమ శివుఁడు.

-- మహేశ్వర సూత్రాణి.

ఆండాళ్ తాను ధరించిన పూల మాల లిచ్చెను –
కరిరాజు కమల మర్పించెను –
శబరి ఎంగిలి పండ్ల నొసంగెను –
కుబ్జ సుగంధ ద్రవ్యముల నిచ్చెను –
ద్రౌపది అవసియాకు తృణ మర్పించెను –
కుచేలుడు పిడికెడటుకులతో తృప్తి పరచెను –
జటధారి రామలాలాకు భిక్షాన్న మిడెను –
ఉడుత సేతు భంధన క్రియకు చిటెకడు ఇసుకను చిందెను –
కణ్ణప్ప మాంస భోజన మిడెను –
శ్రీ – కాళ –హస్తులు అర్చించి మెప్పించెను –
పండరి భక్తులు నామ జపంతో తరించిరి.

గుహుడు గంగను తెప్పలో దాటించినందున, శ్రీరామ చంద్రుడాతని కొక బంగారు నాణె మిచ్చెను –

గీ || కేలు మోడ్చి గుహుడు – నీల మేఘ శ్యామ |
చిన్న నదికె ఇంత – చేతిత్తురె |
బ్రదుకు సంద్రమీద –పడవ నీ స్మరణమ్ము
ఏటి యివ్వగలను – యినకులేశ ||

-- ఒక కవి.

“జ్ఞాని” – “యోగి” మోక్షమపేక్షింతురు, కాని భక్తుడు ఏమియు కోరడు. భగవంతుని పరంగా, సర్వం సన్యసించి – త్యజించి – భగవంతుని క్షేమ సుఖము లర్థించును. సేవించును. ఆతనికంతే చాలును.

వ్రాత వెంటఁగాని – వరమీఁడు దైవంబు |
చేత కొలఁది గాని – వ్రాత కాదు.
వ్రాత కజుఁడు కర్త - చేతకుఁదాఁగర్త | || విశ్వ ||

మనస్సు

శరీర పక్షము చే రిన   ఆత్మకు ద్రోహము

ఆత్మ పక్షము చేరిన   దేహమునకు మోసము.

కాని, ఏది క్షేమం – శుభం – శ్రేయస్కరం – ఎవరికి వారు యోచించుకోవడం భావ్యం! ఆత్మ పక్షం చేరిన మోక్షం – ముక్తి – శాశ్వతానంద పదవి ప్రాప్తించును: దేహ పరం చేరి జీవించిన – జనన మరణ చక్ర భ్రమణం తప్పదు: దేహ చెర-ద్వందముల తాడన – శాశ్వత ఘోర యాతన తథ్యము.

బాష్ప మౌక్తిక మాల (Chain of Pearls of Tears) – ను రోజూ భగవంతుని మెడ లో నలంకరింప సంసిద్ధుఁడవు గమ్ము | భక్తి – ప్రేమాశ్రు తర్పణ ప్రియుడు భగవంతుడు.

"చిత్త మానందమయ మరీచికల గోల |
హృదయమానంద భంగ మాలికలఁదేల |
కనుల నానంద జనితాశ్రు కణములూర | - - -
-- దేవుల పల్లి

భక్తికి మూలము జ్ఞానము – కాని
"మూఢ భక్తి యె గాఢ భక్తి" -- పురాణ గాధలు

ఉ|| వాల్మీకి, ధ్రువుఁడు, మార్కండేయుడు, శబరి, కుబ్జ, గుహుడు –

భ్రూ మధ్యమున ఆకాశ సంధి కలదు. ఉపనయన తేజః(ద్వారక) పథమున, ఖండ మఖండమై, ప్రియ ధ్యేయమును, నీల మేఘ శ్యాముని చిద్విలాస అనంత తేజోరాశిని, పరాత్పరుని యాలింగన తన్మయత్వమున సొక్కు శుభ యోగికి యిక కోరదగినది, కోర మిగిలినది యేమిన్ని లేదు :

"ఘటాకాశము మఠాకాశమై, మఠాకాశము మహాకాశమయ్యో" నని యోగులు బ్రహ్మతత్వముల ప్రవచింతురు : దాని యర్థమును చవి చూచు ధన్యజీవులెందరు గలరు?

మన్మనాః – నా యందే మనస్సుంచి – యోగము / జ్ఞానము

మద్భక్తో - నా యందు భక్తి గల్గి భక్తి యోగ మార్గంగా — సగుణ / నిర్గుణ } ఉపాసనలతో

శ్లో || మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మా మే వైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే

తా|| నా యందే మనస్సుంచి, నన్నే పరమ గతి గ నమ్మి, నేచెప్పినట్లు జేసినచో నన్నే పొందగలవని నా మాటలు యథార్థములని నీ నిమిత్తము ప్రమాణము జేయుచున్నాను.

-- భగవద్గీత. అ. 18. శ్లో. 65.

మద్యాజీ - నన్నే పూజించి, నమస్కరించి, ఆరాధించి, నా మాటలు నమ్మి, నాకు ప్రియుడవై - నిష్కామ కర్మ మొనర్చి, స్వ ధర్మ నిర్వహణార్థమై – మేల్కొని – లే లెమ్ము స్వభావేన – ఏ విధమైన ప్రియ పథమునవైనను సరే నన్నే శరణు పొందుము –

శ్లో|| ఇతి తే జ్ఞాన మాఖ్యాతం గుహ్యా ద్గుహ్యాతరం మయా
విమృ శ్యైత ద శే షేణ యధేచ్ఛసి తథా కురు

తా|| రహస్యములలో రహస్యమగు జ్ఞానము నీ కుపదేశించితిని. నీ యిష్టము వచ్చినట్లు చేయుము.

-- భగవద్గీత. అ. 18. శ్లో. 63.

"యధేచ్ఛసి తథాకురు" – నే చెప్ప వలసిందంతా చెప్పినాను – అన్నీ విన్నావు – ఇక నీ యిష్టం – నీకు ఏలా నచ్చితే, ఎట్లుంటే అట్లే చెయ్యి –(ఎంత స్వేచ్ఛ, ఏమి ఉదారత్వం)

భక్తి - అచంచల - అవ్యభిచార - అనన్య - అఖండ - అసమాన

| అచంచల | అవ్యభిచార | అనన్య | అఖండ | అసమాన |
| --- | --- | --- | --- | --- |
| ↓ | ↓ | ↓ | ↓ | ↓ |
| అర్జున లక్ష్యం ఏకాగ్రత ఏకధారా ప్రవంతివలె | పతివ్రత వలె పరాయత్తముగాని త్రికరణ శుద్ధి తోడి భక్తి | అన్యధా శరణంనాస్తి (ప్రహ్లాదుని వలె) | జ్ఞానభూమికలు "తత్వమసి" | భక్తి ప్రమత్తులు అనంత కోటి |

బ్రహ్మ విచారం ⟶ మమకార శూన్యం ⟶ వైరాగ్యం ⟶ యోగ నిష్ఠ ⟶ జ్ఞాన పరమావధి "జీవన్ముక్తి" –

ఉత్తమ మానవ జన్మ + ఇంద్రియ పాటవం ఉన్న వాడు – బ్రహ్మ జిజ్ఞాస చేయకున్న "ఆత్మ ఘాతకుఁడగును" –

పరోక్షం = పుస్తక జ్ఞానం ⟶ విచారమ్, వివేకం, వైరాగ్యం.

అపరోక్షం = మస్తక జ్ఞానం ⟶ అనుభవం (అను భూతి) (గురు అనుగ్రహం)

ప్రకృతి ——— పురుషుల } రహస్యం గ్రహించిన అనుభవి

క్షేత్ర ——— క్షేత్రజ్ఞుల } అమరుఁడు :

అమృత పానం అమరత్వ సిద్ధిని ప్రసాదించును –

"హిత ప్రవృత్తి X అహిత నివృత్తి" -- సత్య జ్ఞాన ఫల దాయిని.

"తినగ తినగ వేము తియ్య నుండు"

అలౌకికం ↑ రామ పథం – ఆత్మారామ విద్య – జ్ఞాన పథం – ఊర్ధ్వగామిత్వము ↑

లౌకికం ↓ కామ పథం – విషయేంద్రియ - అజ్ఞాన పథం - అధోగామిత్వం ↓

సమారాధన

గాయత్రి + అజప గాయత్రి = జపాజప గాయత్రి –

↓ ▲ ↓

ఓం + హంస = సోహం - హంసోం

ఆగ్నేయాస్త్రము + వాయవ్యాస్త్రము ⟶ బ్రహ్మాస్త్రము

శ్లో || మచ్చిత్తా మద్గత ప్రాణా బోధ యంతః పరస్పరమ్ |
కథయంత శ్చ మాం నిత్యంతుష్యంతి చ రమంతిచ ||

తా|| నా యందే మనస్సు –ప్రాణము – ధ్యాన భక్తులుంచి బాగా నన్ను తెలుసుకొన్న జ్ఞానులే నా యందే ఆనందించి, నా యందే క్రీడించు చున్నారు.

-- భగవద్గీత. అ. 10. శ్లో. 9.

సర్వకాల సర్వా వస్థల యందును – భగవచ్చింతనము సంకీర్తనము, గానము –ధ్యానము – శిల్పము – చిత్ర లేఖనము – జపము –ఆరాధనము – వినోద కాల క్షేపము – అలంకారము – శృంగారము – నాట్యము – భజనము - - - - సర్వాంకిత, శరణాగత జీవనము – (త్రికరణ) సర్వార్పణ శరణాగత భక్తుడు – జ్ఞాని – చరితార్థుఁడు – ధన్య జీవి – ఆదర్శ మానవుఁడు.

అనన్య భక్తి – అతుల వైరాగ్యము – నిష్కామ కర్మాంకిత సేవా తత్పరుఁడు – జీవన్ముక్తుఁడు.

నీవు ఈశ్వరుడవే.

ఈశ్వరుఁడిచ్చయించునదే నీవును ఇచ్ఛగింతువు. మీ యిరువురు ఆనంద స్వరూపులే!! కాని నీవు నీ యాంతరంగిక తత్త్వములోని కిఁదిగి లోతును శోధించి (దృష్టిని దీర్ఘముగ అంతర్ముఖ మొనర్చిన) ఈశ్వర దర్శన మందినఁగాని ధన్యత లేదు. కష్టే ఫలే!!

"హరిః ఓం తత్సత్"

It looks, the greatest hurdle for "భక్తి మార్గం" is "జ్ఞానం". While the goal of Jnana is merger of Jiva with Bramhan, Bhakthi teaches "ద్వైతం". Merger of "Jiva" is undesired. Vice versa is also true.

# 13. జ్ఞానము
## ప్రవేశిక

"ఏకంసత్ విప్రా బహుదావదంతి"
-- ఆత్మ యొక్క స్వరూపమే జ్ఞానముగ నున్నది.

"య ఏష వాం తర్జ్యోతిః పురుషః"
= హృదయ మందు స్వయం ప్రకాశ రూపుఁడైన పురుషుఁడున్నాడు.

"ప్రజ్ఞానం బ్రహ్మ"
"సత్యం జ్ఞానానంతం బ్రహ్మ".

"Four fold wealth"
<u>చతుస్సాధన సంపత్తి</u>

1. నిత్యా నిత్య వివేకము
2. ఇహాముత్రార్థ ఫలభోగ విరామము
3. శమదమాది షట్క సంపత్తి
4. ముముక్షత్వము

"జ్ఞాని – ఇతరుల జ్ఞాన జ్యోతిని వెలిగించు కోవడానికి సహకరించాలి"
----------------?

శ్లో|| నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే|
త త్స్వయం యోగ సంసిద్ధః కాలేనాత్మని విందతి||

తా|| జ్ఞానము పవిత్రమైనది. శుద్ధ మైనది. ఉత్కృష్టమైనది. దానితో సమాన మింకొకటి లేదు. అట్టి జ్ఞానమును బహు కాల శ్రద్ధతో పొంద గలడు.

-- భగవద్గీత. అ. 4.శ్లో. 38.

"సువర్ణమేకం బహు భూష ణాని"
"ఏక సత్ విప్రాబహుధా వదంతి"

అవాంఛనీయమైన జరామరణములను చూచి భయపడని వారు లేరు. కాని, అవి ఎవ్వరిని వదలవు. మరి యీ జటిల సమస్యకు పరిష్కారమే లేదా? ఇదే విచారము . దీని పర్యవసాన మే "యోగము సారాంశము" : -

భౌతికంగాను, పారమార్థికం గాను, - ప్రతి ఒక్కరు అభిలషించేది, ఆశించేది – "దుఃఖ నివృత్తి, ఆనంద ప్రాప్తి" –

ఆస్తికులు గాని, నాస్తికులు గాని, మరెవ్వరైనను సరే ఆనందము కోరని వారు లేరు. జీవితమే సుఖోన్ముఖమైంది. కాని, దుఃఖము వెన్నాడుతూనే వుంది గదా! ఆనందము ఉపేయము, దీనిని పొందు ఉపాయమే యోగ మార్గముః దీనిని జడములు సాధించ లేవు. కావున, బాహ్య విషయ సంయోగ జనిత దేహానందముకన్న, అంతర్ముఖమైన ఆత్మానందమేనిజమైనది. మొదటిది "క్షరము" రెండవది "అక్షరము".

<u>క్రమ ముక్తి</u> అనగా ఉపాసనల వల్ల బ్రహ్మ లోకమును పొంది, అందు బ్రహ్మాభ్యాసమున జ్ఞాన ప్రాప్తి పొంది, ప్రళయాంతమున, పర బ్రహ్మ లో ఐక్యమగుట.

<u>సద్యోముక్తి</u> – జీవన్ముక్తి : బ్రదికి యుండగనే, యీ జన్మయందే బ్రహ్మ స్వరూపానుభూతి

దేహమే తానను కొనుట అజ్ఞానము.

ఆత్మ కాన్పించదనుకొనుట ఆవరణము. జ్ఞానము వల్ల ఆవరణ తొలగునని నమ్మడం – విక్షేపం. ఆచార్య – శాస్త్ర భోధల వల్ల జీవుడే దేవుడని పూర్ణ విశ్వాసం కలగడం పరోక్ష జ్ఞానం.

సప్త భూమికలు జీవుని ప్రగతి (అవస్థలు), సోపానములని గ్రహించి – స్థిర బుద్ధి (జ్ఞానం) తో అక్షర శబ్దము బ్రహ్మ వాచకమగు ఓం కారమే (శబ్ద –

సగుణ బ్రహ్మము) – ఆశయ (సంకల్ప) సిద్ధి నొందకున్న, జన్మ లన్నీ వృథాయేగా. యోగుల మార్గము భోగుల కేలా రుచిస్తుంది? వారిది యేదారి – మనది కోదారి (గోదారి) – ఇందుకే జనన మరణ రహస్యముల విచారించిన గాని, మన లక్ష్య గమ్యము సుస్పష్టంగావు. గమ్య స్థానం తెలియక పోతే నీకు భగవంతుడు "Ticket" ఎక్కడి కియ్యాలి? భగవంతుని రైలు టిక్కెట్లు, ఎక్కడికి కోరితే అక్కడి కిస్తాడు. అది నీ యిచ్ఛ – ప్రయత్నము – ల మీద ఆధారపడి వుంటుంది. "అడుగుము" – ఇవ్వ బడును". "తట్టుము" – తెరువఁ బడును. (బైబిల్)

రైలు రాక మునుపే నిశ్చయించి టికెట్టు బుక్ చేసు కోవాలి.

పరీక్షలకు మునుపే బాగా చదివి సంసిద్ధం కావాలి.

వర్షమునకు మునుపే కాలావధి లో విత్తనాలు చల్లాలి.

భోజనానికి ముందే అన్నీ వండి సిద్ధ పరచు కోవాలి.

ఇదే మరణ మాసన్న మైనప్పుడు, మృత్యువు ఎదురుగ నిల్చున్నప్పుడు - - యోచించి ఏమి ఫలం? భగవత్స్వరూప నిర్ణయం – అనుభవం కావాలి!

రోగమునకు తగువైన ఔషధం పడాలి. "నేను, నీవు, వాడు" - ఈ త్రిపుటి పోయి, ఏకార్థం (ఏకార్ణవం) కావాలి –

సోపాధికం = ఉపాధినాశ్రయించినది

నిరుపాధికం = ఉపాధి లేనిది

సోపాధిక జీవుడు నిరుపాధిక బ్రహ్మం కావాలి!!

కర్మ యోగి నిష్కామ కర్మాచరణ పథమున నిర్మల చిత్తుడై, జ్ఞాన సిద్ధికి అర్హతను పొందును. "జ్ఞాన – యోగ" మార్గమున మోక్షము సులభ లభ్యము.

ఈ విద్యను భగవంతుఁడు సూర్య భగవానునికిని, తద్వారా, సూర్య వంశాది రాజ శ్రేష్ఠులకు పార్యంపరముగా లభించి, ప్రచారము నందినది. వీరే రాజర్షులు లేక రాజ యోగులు.

జనకుడు, కేకయ రాజు, ద్యుమత్సేనుడు, అశ్వపతి మొదలగు వారు సుప్రసిద్ధ రాజ యోగులు. పరమాత్మ స్వరూప ప్రాప్తి నందిన వారు.

ఈ విధంగా, జ్ఞాన మార్గ – అధ్యాత్మ విద్య – అనుభూతినందిన ఎందరో గృహస్థులు "అజ్ఞాత" రాజ యోగులుగా భువిఁ జీవించు చున్నారు. ప్రకటన –

ప్రచారములకు విముఖులై, స్థిత ప్రజ్ఞులైన గోప్య జీవను లెందరో నేడు మన మధ్య జీవించు చున్నారనిన, పాఠకులాశ్చర్య పడనవసరం లేదు.

వీరు గృహస్థ ఋషులు – వీరి నివాసములు పరమ పవిత్ర ఋష్యాశ్రమములుః వీరి రహస్య జీవిత గాథలే దివ్య చరితములు.

ఈ పరమార్థ విద్య, పరమ రహస్యము, మహోత్కృష్టము. అతి దుర్లభ మైనది.

హృదయ నిర్మలత్వమునకు "జ్ఞాన తపస్సు" – అనగా – 1) అరిషడ్వర్గ జయం.

2) ద్వంద్వాతీతత్వం.

3) భగవదర్పిత – సర్వార్పిత – శరణాగత – తన్మయత్వ స్థితి.

కర్మ ఫలమాశింపని (నిష్కామ కర్మ యోగి) కర్మ బంధ విముక్తుడు, నిగూఢమైన కర్మ రహస్యము నెఱింగిన, ధన్య జీవి ః సర్వ యజ్ఞ ప్రియుడై విరాజిల్లు చరితాత్ముడు.

జ్ఞాన పరమా వధి – మానవుని సమస్యలఁ దీర్చి, సందేహములఁబాపి దివ్య జ్ఞానముతోఁ బాటు, శాంతి, సుఖానందముల ప్రసాదించుటయే గాక, సత్య దర్శనములను ప్రసాదించుట.

సచ్చిదానంద – పురుషోత్తమ ప్రాప్తి.

"అజ్ఞానం + అశ్రద్ధ + అవిశ్వాసం" - మానవుని ఇహ పర దూరు నొనర్చి, నరకముఁజేర్చును. కర్మ లెవ్వని బంధింపవు? ⟶ కర్మ ఫల త్యాగం (ఈశ్వరార్పణం),

కర్మ యోగ (నిష్కామ – అనాసక్త) సిద్ధిని పొందిన వాడు జ్ఞానమును తనయందే పొందగలడు.

ప్రపంచములో, విద్యలలో, జ్ఞానములలో కెల్ల శ్రేష్ఠ మైనది, "ఆత్మ జ్ఞానము" -

- "జ్ఞాన (యోగ) ఖడ్గముతో అవిద్యా హృదయ గ్రంథిని ఛేధించి, సంశయ రహితుఁడవగుము"!!

చేతనం – ఆనంద స్వరూపం – (బ్రహ్మ)

జడం – దుఃఖ దాయకం – (ప్రకృతి)

చేతనాచేతనం – మిశ్ర ఫలం – జీవ(మానవ)

"అవిద్యో పాధికో జీవో –మాయోపాధిక ఈశ్వరః"

అనగా అవిద్యో పాధికుడు జీవుడు – మాయో పాధికుఁడు ఈశ్వరుడు. ఉపాధులఁ దొలగించిన జీవుడే దేవుఁడు – "జీవో దేవస్సనాతనః" –

అవిచారదశ యందు – జగత్సత్యం

విచార దశయందు –బ్రహ్మ (ఆత్మ) సత్యం.

వేద వేదాంత బృహద్గ్రంథములు – ప్రస్థాన త్రయం –చతుర్వేద మహా వాక్యముల సారాంశమిదియే!! ఇది తెలిసి – అనుభవించిన – విశ్వాసపరుఁడు – ఘనుఁడైన ఆత్మ జ్ఞానికి మోక్షము తథ్యము.

సమదర్శనులగు పండితులు – రూప నామ ఉపాధుల భేధములను దూరీకరించి, ఆధ్యాత్మదృష్టితో "ఏకత్వ దర్శనమును" సాధించు ధన్యులు –

సచ్చిదానంద హృదయ సాగరమున – తరంగ సదృశములగు సంకల్ప (వికల్ప)ములు పుట్టి – ఆత్మాంశను చేరి "జీవు"డని పించుకొనును. ఆత్మానందానుభవానందము, ఆత్మ తత్వము వలె నిత్య నిర్మలినమైనది. అవ్యయం – అక్షయం, అఖండం, అవినాశి - - - పరిపూర్ణం – అందుకే "సచ్చిదానంద" మందురు.

ఆత్మ స్వతః శుద్ధుడే, కాని అనాదిగా ప్రకృతి బద్ధుడగుట వల్లన్ను, - ఆమె (శక్తి) తనలో నే లీనమై సర్వదా అణిగి యుండుట వల్లన్ను - - - సహచర సహజ ప్రభావ ప్రదర్శనము - - - అనగా - - - తన్ను తాను మరచుట (పూనక గుణం) – అనగా, తాదాత్మ్య గుణం : - - - సంకల్పించుట - - - కాక్షించుట (ఇచ్ఛ పొడముట) . . . . సృష్టి, బంధము, సంసారము, - - - తిరిగి విరక్తి (స్వస్వరూప స్మృతి విచారాదుల ప్రభావమున) – తిరిగి స్వస్థత – సహజ స్థితి – ఆరాటము . . . . మోక్ష కామిత్వము – "సృష్టి స్థితి లయ" చక్ర రహస్య మిది . . . దీనికి ఆఖరు ఎప్పుడో ఎవ్వరెరుఁగ గలరు? వారిద్దరే తీర్మానించి చెప్ప గలరు. అది వారి (సంసార – ఆంతరంగిక) స్వవిషయం! మన కెందుకు?? "పురుషోత్తముడు – ఆది పరాశక్తి";

నిజంగా అనుభవంలో –దైనందిన జీవితములో – సుఖం –సంతోషం – ఆనందం - - ఉన్నదనుకొన్న వారికి విరక్త వచనములు – వివేక – వైరాగ్య – మోక్షకామిత్వాది సాధనలు రుచించపవు గదా! ఆర్తుఁడు – విరాగి – విరక్తుడు – అర్థార్థి, జిజ్ఞాసువు – అట్టివారికి లోక జీవనము గిట్టదు – రుచింపదు. వీరు జిజ్ఞాసువులు – ముముక్షువులు - - వీరికి వివేక – వైరాగ్య భోధోపరతులు పరమానందదాయకము కదా! ఎవరి కర్మ వారిది! ఎవరి దారి వారిది : ఎవరికెవ్వరు?

విచారము లేకున్న మానవుఁడు పశు ప్రవృత్తిని అధిగమించుటెట్లు? అజ్ఞాన తిమిరాంధకారము నశింపకున్న జ్ఞాన ప్రకాశమసంభవము –

-- దేహము తానను కొనుట
-- జగత్తు నిజమనుకొనుట
-- దేవుఁడెక్కడో నున్నాడనుకొనుట

} ఇది అజ్ఞాన (భ్రాంతి జన్య) కార్యము.

భ్రమ, అజ్ఞానం తొలగకున్న - బ్రహ్మ జ్ఞానం రాదు !!

కోహం? (నేనెవ్వరు?) : ఎక్కడ నుండి వచ్చినాను? తిరిగి ఎక్కడికి పోవుట? ఎట్లు? ఎప్పుడు? ఎందుకో???

కథమిదం జాతం? – ఈదృశ్య ప్రపంచం, ఎక్కడినుండి? ఎట్లు? ఎవరివల్ల? వచ్చినది? "కోవైకర్తా? " –ఎవ్వరు కర్త? దీనికి ఉపాధాన కారణ మెద్ది? ఇదే ఆత్మాన్వేష విచారం (Self search – Analysis) –

ఈశ్వరుడెవ్వఁడు? నాకీ బంధ మెట్లు వచ్చినది? సుఖ దుఃఖములు ప్రాప్తించుటకు (ద్వందాదులకు) మూల కారణమేమి? - - - ఈలాంటి సందేహ "గ్రంధులు" (ముళ్ళు) విచ్చిపోవునప్పుడే జ్ఞాన భానూదయమై, ఆత్మ ప్రకాశ మావిర్భ వించును. ఇక అస్తమింపని జ్ఞాన సూర్యుడు – నిరంతరం హృదయాకాశమున ప్రకాశించు చుండ మోహాంధకారము మరి తల చూప నగునా?

నేను దేహము కాదు. దేహం నాది. ఇక నేను దేనిని నమ్మకున్నను "నన్ను" నేను ఏలాగు నమ్మకుందును? నా ఉనికిని నేనే శంకింప సాహసించుటెట్లు? ఈ దేహము నాకు ఆశ్రయ సాధనము. జడము; దృశ్యము, నేను ద్రష్టను – సాక్షిని – ప్రజ్ఞను, తెలివిని – అధికారిని :

స్వస్వరూప విస్మృతియే – భ్రమ, బంధము, అజ్ఞానము, మనో మాలిన్యము అందురుః అది నశించుటే "జ్ఞానము" ⟶ మోక్ష లాభము.

<u>సత్యస్వరూప నిరూపణము</u> -- <u>సాక్ష్యము</u> -- <u>వివరణము –</u>

| | |
|---|---|
| మనము స్వయంగా చూచి – అనుభవ రీత్యా తెలుసు కో గలది –తెలుసు కొన్నది | -- 10% |
| తల్లి తండ్రులు – స్నేహితులు – పెద్దలు – గురువులు తమ స్వానుభవ నివేదనం | -- 20% |

వేదాది శాస్త్రములు – దివ్య పురుషులు – మహర్షులు –
ఉపనిషద్ద్రష్టలు - --- 60%
ఆకాశవాణి – అశరీర వాణి – దివ్య వాణి – అంతర్వాణి - - -
పూర్వులు కూడా నమ్మిరి. - 10%

ఉ|| 1. తుదకు కంసుని లాంటి రాక్షసుడు కూడా ఆకాశ వాణిని నమ్మెను.
2. భాగవత (ఆంధ్ర) కర్త పోతన – భక్త వర కవి – శ్రీ రామ చంద్ర రూపమున ఆంతర్వాణి చే ఆదేశింపఁ బడెను.
3. దేవకి – వసుదేవులు – ఆకాశ వాణి ఆదేశము చే బాల కృష్ణుని గోకులమునకు తరలించిరి.
4. సత్యకాముడు – గోవు – నిత్యాగ్నిహోత్రముల ద్వారా జ్ఞానోపదేశము బడసెను.
5. మహాత్మా గాంధీజీ తన అంతర్వాణిని (Inner voice) కూర్చి పదే పదే ప్రస్తావించి ప్రశంసించెను.
6. పాశ్చాత్యుల "డెల్ఫీ ఆరెకల్" (Delphi oracle) (అశరీర వాణి) గాథ సుప్రసిద్ధము.

ఆది లేనిది అనాది. ఒక సంకల్పముతో (ఇచ్ఛ –కోర్కె) ఆత్మ (భగవంతుడు) చెరలో పడ్డాడు : ఆ చెరశాల యే దేహము – బంధము. ఇక ఆ దేహ సంబంధమైన బంధము లే "ధన – దార – పుత్రాదులు" ఆత్మకు అనుబంధములుః ఒక (ఆది) సంకల్పమే, యీ విషాద – దీనాతి దీన – ప్రమాదమును ప్రసాదించి నప్పుడు - - క్షణ క్షణ సంకల్ప ప్రవాహమున పడిన – ప్రవృత్త జీవనుడైన – మానవుని గతి ఏమి కావాలి!! హరోహర!!!

జన్మ సుఖ సౌఖ్య దాయకమా? . . . సరి! చిరంజీవ! తదాస్థు!! సంసార బంధ ప్రియ ధోరణి కి మోక్షం కల్ల!! సుఖీభవ!!!

అబ్బబ్బ! చాలురా తండ్రీ "యీ జన్మ మిక దుర్లభమురా" – విముక్తి – మోక్షం – విరుగుడు కావాలి – తథాస్థు!! చిరంజీవ!! ఇదే ముముక్షుత్వ ధోరణి! బుద్ధి మంతుని లక్ష్యం!

"యద్భావో తద్భవతి" – తప్పక తరిస్తాడు! అభయం!!

కథ. ఒక నవాబు మంచి వంకాయల మసాలా కూర తిని – ఆనందంతో – సభ చేర్చి, వంకాయను వర్ణించి పొగడమన్నాడు. ఒక బుద్ధిమంతుఁడు "ఆహా! వంకాయ కూరగాయల్లోకెల్ల రాజు – సార్వభౌముడు – మణి. అందుకే దాని తల మీద కిరీటం మరి "తురాయ్" అన్నాడు. మెచ్చి, వానికి ఒక అగ్రహారం జాగీర్ జారీ చెయ్యఁబడింది : వెంటనే నవాబు ఇంతతో తృప్తి పడక – ఇక రోజు తన నగరులో వంకాయల కూర తప్ప మరేద్దిన్ని చెయ్య కూడదని శాసించెను. పైగా, తన రాజ్య మంతటా, ఆలాగే వంకాయలు తప్పా మరే కూరగాయలు పండించడంగాని – అమ్మడం గాని – వండడం కాని నిషేధించి, భారీ శిక్షలు, అపరాధం చాటించెను. ఇక లోకంలో ముబ్బిడిగా వంకాయలు చలామణీ అయ్యె! ప్రజలందరికి – నవాబుకు సహా – బేదులు – రక్త విరేచనాలు తగుల్కోంది. రాజ వైద్యులీ విపరీతం గుర్తించి, ఔషధ మివ్వడమేగాని, వంకాయ పథ్యాన్ని నిషేధింప సాహసించరైరి. నవాబు పరిస్థితి ఘోరమయ్యెను. ప్రజలెందరో చని పోయిరి. ఒక వైద్యుడు మాత్రం సాహసించి, ఆ యౌషదములకు వంకాయ పథ్య వస్తువని నిషేధించెను. నవాబు రోగం కుదిరి సత్యం గ్రహించెను. వెంటనే, తిరిగి సభ కావించి, వంకాయను దూషింప ఆజ్ఞాపించెను. ఆదే (జాగీరు పొందిన – వర్ణించి పొగిడిన) వ్యక్తి యీలా దూషించెను – "వంకాయ ద్రోహి – కూరగాయలలో కెల్ల పరమ చండాలి! కావుననే భగవంతుడు దాని తల మీద "గూటము" (తొడిమ) కొట్టి దండించెనని ముగింప, నవాబు సంతోషముతో వానికి మరొక జాగీరు ప్రసాదించెను. ఏ దృష్టితో చూచిన లోకం అదే రూపము దాల్చి దర్శన మిచ్చును. దృష్టి ప్రధానం గదా!!

నీవే పరబ్రహ్మావు – బంధ మోక్షములు నీ చేతి లోనే వున్నవి. కోరుకో – సిద్ధపడి ప్రయత్నించి త్రికరణాల – ఏ కోన్ముఖంగా – దూకు! కోరిక ఫలిస్తుంది. లాభిస్తుంది. నీవు కల్పవృక్షం క్రింద నున్నావుః కోరుకో!!

కథ. ఒక బాటసారి మార్గ మధ్యమున, అలసి, ఒక వృక్షము క్రింద విశ్రమించెను. అది నిర్జనారణ్యము. చల్లని గాలి – నీడ - అతనికెంతో హాయి నిచ్చెను. ఆహా! ఎంత బాగున్నది. ఇచ్చట ఒక దివ్య భవనముండి, అందు తన భార్య బిడ్డలు, అతులాష్టైశ్వర్యములతో, నివసించిన ఎంత బాగుండెడిది" – అంతే! తక్షణం అన్నీ మాంత్రికంగా రూపొందెను. పాంథుడు, ఆనందాశ్చర్యములతో పొంగి పోయెను. తక్షణమే, దురదృష్ట వశమున అతని మనఃపథమున "అయ్యో! ఇది కీకారణ్యము

గదా, ఏ దైనా ఒక పులి వచ్చి తన్ను భక్షించిన ఎంత ఘోరమను కొనెను.ఆలా తలచినంతనే ఒక పెద్ద పులి తారసిల్లి అతనిని భక్షించెను. "యద్భావో తద్భవతి" - అతడు తాను కల్ప వృక్షం క్రింద నున్నాడ నని ఎరుగడయ్యెను. – కావున, "మానవుడు తాను మాధవుఁడే" నని గ్రహింప జాలనందున మాయా మోహ జాలమున - అజ్ఞానంతో కన్న యిడుములుకు లోనవుతున్నాడు.

"తెలుసు కున్నావా? నాయనా! నీ వెంత గొప్పవాడవో!

ప్రకృతి జీవనం
నివృత్తి బ్రహ్మత్వం.

రెండున్ను నీ చేతి లోనే వున్నవి – నీ యిష్టం. నీవే సర్వమునకు కర్తవు, క్రియవు – సర్వం "శివోహం"

అహంకార – మమకారములు –
కర్తృత్వ – భోక్తృత్వాభిమానములు
} అజ్ఞాన జనితములు – జ్ఞానమే దీనికి పరమావధి –

ఇహమందు – శాంతి – సుఖము
పరమందు నిర్వాణ ప్రాప్తికై
} సర్వ కర్మ ఫలత్యాగము - -- సన్యాస మావశ్యము –

పండితులు బ్రతికిన వారికి – చచ్చిన వారికి కూడా దుఃఖింపరు – "పుట్టినది గిట్టును – గిట్టినది పుట్టును" ఇది అనివార్యము, ప్రకృతి సహజ ధర్మముః కాని మృత జీవి, చిరంజీవి, లోకాంతర వాసిః పునర్జన్మ తథ్యముః నశించుట దేహ ధర్మము. అవినాశత్వము ఆత్మ ధర్మము . రూప నామాదులు క్షణికములుః కాని ఆత్మ నిత్యుడు – అవధ్యుడు –

శ్లో|| నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః|
న చైనం క్లేదయం త్యాపో న శోషయతి మారుతః||

తా|| ఆత్మను శస్త్రములు ఛేదింప జాలవు, నిప్పు కాల్ప లేదు, నీరు తడప లేదు, గాలి శోషింప చేయ లేదు, పంచ భూతములకు లోబడునది కాదు.

-- భగవద్గీత. అ. 2,శ్లో. 23.

"సదేవ సోమ్యేద మగ్రఆ సీత్"

సత్ + ఏవ = సదేవ = నిత్యత్వం అనగా ఆత్మానాత్మ విచారము వల్లనే జ్ఞానోద్భవం.

నే నొక్కడే సత్యం – సూక్ష్మం – ద్రష్ట – సాక్షి – సత్ – అవ్యయం - - - అనే "నేను" నిస్సందేహం. ఆత్మ ఒక్కటే, దేహములనేకములు. వివిధ నామ రూపములు – విభిన్న భాగముల తో కూడినవి. ఇక "దేహము" – "ఆత్మ" అనుకోవడం (దేహాత్మ బుద్ధి) అజ్ఞానం కదా!!

ఆత్మ బాహ్యాభ్యంతరనియామకుఁడు. ఆత్మ జ్ఞాన మయం. దివ్యం – శుద్ధం – నిత్యం – నిర్మలం – స్వయం ప్రకాశం – స్వచ్ఛం – సద్రూపం – అఖండం – అవ్యయం – ప్రకాశింపఁజేయ జాలును కాని ప్రకాశింపఁ బడ జాలదు.సర్వవ్యాపకత్వం కలది. అంధకారమును కూడా తెల్పును. కాని, దేహం అశుద్ధం – జడం – సప్తధాతు – మల సంయుక్తం – అనిత్యం – అసద్రూపం – అశుభం.

అజ్ఞానము
సంకల్పము

ల రెంటికిని ఉపాదాన కారణం సూక్ష్మం ఒక్కటే!
అదే ఏకం - సత్ – అవ్యయం – ఆనందం.

అజ్ఞానం వల్ల ప్రభవించిన జగత్సర్వం  జ్ఞానం వల్ల విలీనమగుము. సంకల్పము వల్ల నానాత్వం – అనేకత్వం – విభిన్నత్వం – ప్రభవించును – కావున సంకల్పమే, విభిన్నత్వమునకు కర్త: సంకల్పమనగా "మనస్సు" (అంతఃకరణము) యొక్క పరిణామమే!!!

ఘటమును చూచి తానే ఘటమను కొన్నట్లు  నా యొక్క దేహమనిన – నేనే దేహమనుకొనుట – ఆజ్ఞానం – మమకార హేతువు.

నా కుమారుడు – నేను కాదు – అట్లే
నా దేహము కూడా – నేను కాదు కదా!

"శాస్త్ర జ్ఞానము – గురు బోధ" – మోక్ష మార్గ దర్శక ద్వారములు . . . సాధకుడు త్రికరణ శుద్ధిగా – తీవ్ర వివేక వైరాగ్య భోగోపరతులతో – పూర్ణ పురుష ప్రయత్నేన – బ్రాహ్మాభ్యాసాది సాధనలతో సాగి పోవాలి. "గనులలో బంగారమున్నది – సాగర గర్భమున మణి ముత్యాల రాసులు – మొదలగు నిధులున్న వనెడి విశ్వాసం మాత్రం తోనే "అనుభవం లాభం" చే కూర్ప జాలనట్లు – "Cheque – చెక్కు – డ్రాఫ్టు" చేత ఉంచు కొన్న – అక్కరకు రాక పోవచ్చును : Cash చేయాలి ; అపరోక్షానుభూతి – అనుభవ జ్ఞానము పరమావధి –

(Intellectual soul Science Experts)




(3) దెబ్బలు తిని, సంకుల వ్రణ దేహము తో – కృశించి, కాల్విరిగి, కన్నులు గానని, కుక్క, మెడలో (పగిలి) విరిగిన కుండ కంఠము తో సహా - - - వెంటి కుక్క వెంట ఆప్యాయముతో . . . . తగుల్కొని తచ్చాడుతూ . . . (నోట క్రిమి సముదాయ సంకులము పూతి గంధ హేయము నిరామిషంబగు ఎముకతో సహా) –

అబ్బబ్బ! మన్మథుడు . . . . అట్టి దౌర్భాగ్యపు ప్రాణులను గూడా వదలడే!! చచ్చిన వారిని సహా చంపు వాడు గదా!! మరణోన్ముఖుడైన శత వృద్ధులను గూడా కామ, వాసనా యతులుగఁజేసి, పునర్జన్మ నాపాదించు చున్నాడే!!

--- భర్తృహరి.

"విధ్యుక్త ధర్మములను మానుట"

"నిషిద్ధ కర్మలనాచ రించుట" – పాప హేతువు.

అందుకే – యుద్ధమున మరణించిన వారికి వీర స్వర్గము,

యుద్ధమున జయించిన వారికి ఇహ సామ్రాజ్య పట్టాభిషేకము!!

<u>బ్రహ్మాభ్యాసి</u> – సాధకుడు నియమ నిష్ఠలతో అత్యంత జాగరూకుఁడై, మెలకువతో – సదాచార – మిత సాత్వికాహార – భక్తి శ్రద్ధలతో మసలుకోవలెను.

జ్ఞానము – వివేక విచారముల వల్ల ఉదయించును

"జాత్యా శ్రయ నిమిత్తా దుష్టా దన్నాత్కాయ శుద్ధిర్వివే కః"!!

తా|| ఉల్లి మొ|| నవి జాతి రీత్యా దుష్టములు – చోర, చండాలాన్నాదులు ఆశ్రయ దుష్టములు – ఎంగిలి, మలిన, క్రిమి కీటకాద్యన్నములు నిమిత్త దుష్టములు. (బ్రాహ్మణుడు చోర ధన భోజనం)

"ఆహారము శుద్ధముగ నున్న అంతఃకరణ శుద్ధి గల్గును." తద్వారా అవిచ్ఛిన్న స్మృతి – అనగా –స్థిర ధ్యానాదులు ప్రాప్తించును.

విమోకః - కామాదులందాసక్తి లేక అనగా రాగ ద్వేష రహితుఁడై (ద్వంద్వాతీతుడై) ఉపాసించ వలెను.

వైరాగ్య – బోధోపరతులు –

వైరాగ్యము – ఇహ పర లోక సమస్త భోగ భాగ్యములందును సంపూర్ణ (త్రికరణ) తీవ్ర విరక్తి – వైరాగ్యము ఇచ్ఛా రహిత నివృత్తి – సామ్య స్థితి.

బోధము – తానే (నేనే) బ్రహ్మ మనెడి –స్థిర – పరిపూర్ణ – నిశ్చయాత్మకపు బుద్ధి – విశ్వాసం.

ఉపరతి – చిత్తలయము – ఇదియే బ్రహ్మ విద్యా ప్రాప్తికి ఫలం – ధ్యేయాకార చిత్త స్థితి – బ్రాహ్మీ స్థితి.

ఇంద్రియ వ్యాపారాదులనుడుగుట చే సౌఖ్యము గాంచేనిచో బ్రహ్మ జ్ఞానము వ్యర్థము. కాని, విజ్ఞానము చేత, దేహేంద్రియముల నిగ్రహించి, మనస్సును వెలికి నిగుడ కుండు నట్లు, అంతర్ముఖమొనర్చి, నిర్వికల్ప సమాధి యందే నిల్చియుండునట్లుచేయుట దుర్లభముః చిత్తేంద్రియ ఉపరతి మహత్కార్యము – వేదాంత విద్యకు "శ్రద్ధ – భక్తి - సాధనలు" ప్రధానాంగములు –

ఇంద్రియాశ్వములకు సంకెళ్ళు తగిలించి – సహజముగ బహిర్ముఖమగు వానిని అంతర్ముఖమొనర్చుటయే – "సంయమము" (సంయమ యజ్ఞ) మందురు.

-- కఠోపనిషత్.

"త్రయ మేకత్ర సంయమః" – అనగా ధ్యాన, ధారణ, సమాధుల చేత "సంయమ" ప్రాప్తి.

-- పతంజలి.

శ్రవణం – శాస్త్ర – గురు – పెద్దల (లోక) అనుభవము.

మననం – పై ప్రభోధములను – పలుమారు (శ్రవణ విషయములను) చింతించి, స్థిర పరచుకొనుట.

నిధి ధ్యాసము – పై నిశ్చ యార్థములకు విరుద్ధముగ (విపరీతముగ) ప్రవర్తింపకుండుట.

సాక్షాత్కారము – "తత్వ మస్యాది" చతుర్వేదమహా వాక్యముల అనుభవం.

"దేహ శుద్ధికై రుద్దుకొను సబ్బును కూడా తుదిని కడిగి శుభ్ర మొనర్చుకొను నట్లు – జ్ఞానము కూడా, ఆత్మ జ్ఞానము నందించి, తాను కూడా అందే లయించును"

"దుష్ట సంహారానంతరము – అవతారం కూడా అంత మొందాలి కదా!"

"ముల్లు తీసిన తర్వాత – సూదిని పార వేస్తాము గదా!"

"కట్టెను దహించి, అగ్ని కూడాఅందే బూడిదయై నశించును"

"ఏరు దాటి తెప్పను వదలివేస్తాం" - జ్ఞానము అంతే –

"జ్ఞాన – అజ్ఞానముల"కు పై సాక్షి "ఆత్మ – బ్రహ్మ"

↓ ↓

బంగారు ఇనుము ⟶ సంకెళ్ళు —— రెండు తుదకు పోవాలి.

ప్రవృత్తి నివృత్తుల (సంగ్రామ) సమర విజయ|

కాంక్ష ముప్పిరి గొన – కమ్య కర్మ యె|

అగ్ని కర్మలను గాల్చి పిదప తానును ధగ్ధ మై|

తుదకు రెండును నశించునట్లు!!

అజ్ఞానమును నశింపఁజేసి జ్ఞానము కూడా అందే లయించి నశించిన గాని "ఆత్మ తేజము" ప్రకాశించి శేషింపదు –

యోగాభ్యాసము – నిర్మల దృష్టి యనందగు "వివేక"మును గల్గించి – మనో నేత్రముల గప్పియున్న "అజ్ఞానాంధకార" తెరల తొలగించును. వస్తు తత్వము యొక్క సత్య స్వరూపము గోచరించును.

ప్రకృతి తన మాయా మయ మహేంద్రజాల చిత్ర విచిత్ర ప్రదర్శనములను – ఘటనా ఘటన చాతుర్యమును – పురుష సంయోగ – సాన్నిధ్య బలముచే విజృంభించి, పురుషుని ఆనందమునకై – సంతోషపరచుటకై – ప్రదర్శించుచున్నది. కాని ప్రకృతి పురుషుని స్థాన మాక్రమింపఁజాలదని గ్రహింపఁదగును. హృదయ సింహాసనాసీనుఁడైన పురుషుని వినోదార్థమై, ప్రకృతి ఈ మాయా మహేంద్రజాల

జగద్రంగ భూమిని తీర్చి దిద్దుచున్నది. ఆమె యే సూత్రధారిణిః ఆనంద స్వరూపుడైన పురుషుని గిలి గింతలు పెట్టి తానే అలసి ఆతని పాదాక్రాంతురాలు కావడమే వేదాంత విద్య పరమావధి.

సుధీర్ఘ శాస్త్రీయ యోగ సాధనానుభవములచే పండిన "వివేక వైరాగ్యాదుల" తో భయమనునది మన వద్ద నుండుటకే భయపడి పారిపోవును. అంతట "చిత్తము" ఆత్మ తాదాత్మ్యమునొంది – కైవల్య ప్రాప్తి తథ్యము – అభయం!!

శ్లో|| "క్షణమ పి సజ్జన సంగతి రేకా భవతి భవార్ణవ తరణే నౌకా||

-- భజ గోవిందం. శ్లో. 13.

తా|| ఒక క్షణమైనను సజ్జనుని చెలిమి నీకు లభించినచో అది ఈ సంసార సాగరమును దాటుటకు నౌకవలె నుండును కదా!

ముముక్షత్వము – మోక్ష కామిత్వము – దృఢ –తీవ్రమోక్షేచ్ఛ.

అగ్నితప్తుడు జలమునకై –
రోగి ఔషధమునకై –
తీవ్ర పిపాసి జలమునకై –
నీట మునిగినవాడు గాలికై –
దారి తప్పిన(తల్లిని పోగొట్టుకొన) పసిపాప తల్లికై -

పరితపించునట్లు ఆరాటము - అజ్ఞాన వ్యాధి గ్రస్థుడు – బ్రహ్మ వేత్త యైన సద్గురువు నాశ్రయింపఁ దగును – చిదచిద్గ్రంధి (బంధ) విచ్ఛేధనమునకై ఆరాటము –

ఈ మోక్షేచ్ఛ 3 విధములు - i. మంద -
ii. మధ్య
iii. తీవ్రము లని 3 తెరంగులు –

1. నదులు సముద్రము నకు పరువులు తీయునట్లు
2. పిల్ల తల్లికై ఆరాటపడి ఒడిలోచేర్చ బడినట్లు
3. అయము అయస్కాంతమును తగుల్కొను నట్లు
4. అగ్ని తప్తుడు జలమున కై పరువిడు నట్లు
5. నీటమున్గినవాఁడు గాలికై తహ తహ లాడునట్లు
6. భక్తుడు భగవంతునికై విరహముఁజెందును
7. యోగి – జ్ఞాని –మోక్షార్థమై తద్రీతి గనే "విల విల" తన్నుకొని తపింతురు –

1. సూర్యోదయంతో ప్రపంచము నలుముకొని వున్న నిభిడాంధకారము - పటాపంచలై మాయమగునట్లు – 2. "వెలుగున్న చోట చీకటికి చోటు లేదు"

3. "నిప్పునకు చెదలంటదు" –

4. చెట్టు మొదలు తొఱ్ఱ (తొరట) యందు అగ్ని యుండిన చెట్టులోని తడి పూర్తిగా అంతరించి – ఆరి – ఎండి పోవునట్లు

5. జ్ఞానమున్న చోట అజ్ఞానమునకు చోటు లేదు. బ్రహ్మ విదుని (తత్వజ్ఞుని) యందలి జ్ఞాన జ్యోతి ప్రకాశము వల్ల ఆజ్ఞానాంధకారము మాయమై స్వస్వరూపానుభూతి – మోక్షము లభించును.

అమరత్వముకన్న – అమృతత్వము శ్రేయము.

జన్మ = జడ + జీవ    ఫంగ్వంధ సంసారము "చిద చిత్"

(గ్రుడ్డి) + (కుంటి)    బంధమిదియే - "గ్రంధి" బంధము

మనస్సు – దశేంద్రియముల ద్వారా విశ్వ విశాల విషయాసక్తమై "జీవ" రూప బంధమై దేవుని జీవుని చేసినది. అంతర్ముఖ మనస్సు బ్రహ్మ ధ్యానము న బ్రహ్మమై "బ్రహ్మ" మిగులును.

సంసార దవానలాగ్ని మధ్యమున – (తాపత్రయము – యీషణ త్రయము) – జిక్కి మోక్ష శాంతికై, ఆవేదనతో అఱ్ఱులుఁజాచి – జనన మరణ చక్రమునుండి విముక్తికై – "జ్ఞాని" ఆరాట పడును. తరించుటే బుద్ధిమంతుఁడైన మానవుని ఉత్తమోత్తమ ధర్మము – ప్రథమ కర్తవ్యము –

ఱేపు మాపనక – ప్రతి క్షణమును – జీవిత కాలమున – సద్వినియోగమొనర్ప దృఢ సంకిల్పితుఁడు కావలెను. ప్రపంచమొక (కోర్కెల) విషవలయము. దశ దిశ లనుండి మానవుని సహజ (వాసనామయ – సంస్కారబల) కోర్కెలు లాగుచునే యుండును. కాల సర్పము క్షణ క్షణము ఆయువును మ్రింగుచుండును. పోయిన ఘడియలు తిరిగి రావు, పూర్వ పుణ్య విశేషముతో సద్గురు నాశ్రయించి - భక్తి జ్ఞాన వైరాగ్యాదుల సాయమున – తరింప స్థిర నిశ్చయుడై – సాగి పోవలెను.

| | |
|---|---|
| పరిపూర్ణ సత్య జ్ఞానము<br>నిశ్చల భక్తి<br>అతుల వైరాగ్యము<br>నిష్కామ కర్మాచరణము<br>నిరంతరాభ్యాసము | యోగ విజయమునకు, శీఘ్రఫల ప్రాప్తికి<br>అత్యంత సులభ – సుఖతర సాధనకు<br>వలయు అంగములివి : వీటితో<br>అంతర్దృష్టి – ఇంద్రియ జయము -<br>ఆనందము – శాంతి – తృప్తి - |

పురుష ప్రయత్నము – స్థిర దీక్ష – శ్రద్ధ - } మరియు ద్వందాతీత స్థితి – నిగ్రహానుగ్రహ - సామర్థ్యము – ఇష్ట దేవతా దర్శనము - అష్ట సిద్ధులు – సర్వార్థ సిద్ధి –“దుఃఖ నివృత్తి – ఆనంద ప్రాప్తి” –
ఓం తత్సత్

దేహి మాయా వృతుఁడై – దేహాత్మ బుద్ధి తో “జీవత్వ – దేవత్వ” అభేదమును మరచి, సద సద్వివేచనాహీనుఁడై, మూలా జ్ఞానమును ఛేదింప, బ్రహ్మ జ్ఞానము నాశ్రయించి, చతుర్వేద మహవాక్యముల బోధ గురు ముఖతః పొంది – ఉపాధులయందభిమానమును వోనాడి – నిరుపాధిక పర్మాత్మ తత్వ జ్ఞానోదయమున “బ్రహ్మము” తానెయై నిల్చును – శేషించును :

ఇంద్రజాల శక్తి – క్రియలు – ఇంద్రజాలికునేమియు చేయఁజాలవు! పరతత్వ దివ్యానుభూతి వాగింద్రియమున కందనిది. “పసిపాప సముద్రమును – జవ్వని తన తొలినాటి సుఖమును” – మూగగానే తలవంచి చిరునవ్వుతో మౌనము దాల్చును : ముని మౌని గదా!!

జ్ఞాని – అచలుఁడు – స్థిత ప్రజ్ఞుఁడు – సర్వాత్మ బుద్ధిగల సర్వ సముఁడు – మహా మహుఁడు – నిరపేక్షుఁడు – శుద్ధ సత్వ ప్రసన్న చిత్తుఁడు – సహజ స్థితి గలవాఁడు.

సంచితము దహింపఁబడి – నిర్భయముగ నిర్లక్ష్యముగ – ప్రారబ్ధమును సహించి – అనుభవించి – దేహ చెర శాశ్వత ముక్తికై “తహ తహ” లాడుచు – సత్య దృష్టిని వీడక – “భర్జిత బీజవత్” – అఖండ పరమానందాను భవ భాగుఁడై – నిష్కాముడై – శాంత చిత్తుఁడై – దిగంబరుఁడై – సుజ్ఞాన కైపున సొక్కి తన్మయత్వమున జాగ్రత యొక దీర్ఘ స్వప్నమువలె “సాక్షి” గా చూచుచు జీవిత శేష పరిసమాప్తి కై (దేహ విసర్జనాతురతతో) “అలలు లేని మహా సముద్రము” (నిస్తరంగ వార్ధి) వంటి మనస్సుతో – (ఎన్ని మహా నదులు – సుడి గుండములు – తుఫాన్లు – జల ప్రళయాలు – సంభవించినను – చలింపక – ఒలకక – ఉలుకకున్న సాగరము వలె) - - దివ్య సాన్నిధ్య ప్రభావ మహిమోత్కృష్టతతో” అజగర మహర్షి వలె - - - భాసించుచుండును.

విషయము + ఇంద్రియములు కలియకున్న అనుభవంలేదు. సంధాన కర్త మనస్సు – అనుభవి జీవుడు.

వేదాంత విద్య ఆవశ్యకత యేమిటి?

| భేద జ్ఞానము | అభేద విజ్ఞానం |
| --- | --- |
| అజ్ఞానం | జ్ఞానం |
| బంధం | మోక్షం |
| మోహం | బ్రహ్మత్వం |
| సంసారం | ముక్తి |
| జీవ – జగత్తులు | ఏకత్వ – అద్వైత స్థితి |
| ద్వంద్వతాడన తరంగాలు | సచ్చిదానంద పదవి. |
| జనన మరణ చక్ర భ్రమణం | అఖండాద్వైతానంద స్థితి. |

"దుఃఖ నివృత్తి – ఆనంద ప్రాప్తి" - "అజ్ఞాన నివృత్తి - జ్ఞాన ప్రాప్తి."

వేదాంత విద్య సామాన్యులకు రుచింపని చేదు సరుకు. కాని, "తినగ తినగ వేము తియ్యనుండు" అన్నట్లు వినను, వినను, రాను, రాను, పఠన, శ్రవణ, మననాదుల తో – అత్యంత మధురాతి మధురమై – ఆనందదాయకమై – దివ్యామృత వాహినియై - - - భవతరణకుపయుక్త సాధనమగును.

బంధితుఁడు విమోచనము కోరును. తన బంధ కారణమును జ్ఞాన సాయమున గ్రహించిన, సులభముగా విముక్తి నందును. మహానుభావులు ఇంతకన్న కోర దగిన దెద్దియును లేదు.

శ్లో|| న త ద స్తి పృధివ్యాం వా దివి దేవేషు వా పునః

సత్త్వం ప్రకృతి జైర్ముక్తం య దేభి స్స్యా త్త్రిభిర్గుణైః ||

తా|| మూడులోకముల యందున్న ప్రాణులు మూడు గుణములకు లోబడియే యున్నవి. గుణముల భాగములలో హెచ్చు తగ్గులుండు గాక.

-- భగవద్గీత. అ. 18.శ్లో. 40

పృథ్వి –స్వర్గ – సమస్త చరాచర సృష్టి (పిపీలి కాది బ్రహ్మ పర్యంతం) – ప్రకృతి నుండి యుత్పన్నమైన "త్రిగుణముల" నుండియే ప్రభవించెను.

స్వధర్మమనగా "ఆత్మ ధర్మమని" వేదాంతార్థము. కాని, సాధారణంగా "నియోగత్వమ్" – వర్ణాశ్రమోచిత విధ్యుక్త ధర్మ నిర్వహణమని ఊహింపఁదగును.

కర్మ ⟶ దోషము, అగ్ని నుండి ⟶ పొగ వలె తప్పదు.

నైష్కర్మ్య సిద్ధి – "నిర్వాసనామయ – అనాసక్త – అసంగ – త్రికరణ శుద్ధిని, త్రిదశలందును ప్రదర్శించు ద్వంద్వాతీత జితాత్మునికే చెల్లును – బ్రహ్మాత్వమే జ్ఞాన పరాకాష్ఠ!!

కాని, మనది ఆచరణ లేని ఆక్రందనమే! ఆచరింపకున్న అనుభవము లేదే! నిష్ఫల రోదనం – శుష్క వేదాంత వాగాడంబరమే!!

విషయేంద్రియ సంయోగము క్షణికము – తాత్కాలికము: ద్వంద్వములన్నీ అంతే! కాని వివేకి, సహనంతో, సహించి, స్థిర చిత్తుఁడై, ధీరుడై, అమరత్వాధికారి కావాలి – తత్త్వవేత్తయై తరించాలి!!

రాజ యోగము = "సాంఖ్య + తారక + అమనస్కము"

-- శ్రీ సీతా రామాంజనేయ సంవాదము.

సాంఖ్య దర్శనము – "సంఖ్యను తెల్పునది"

"సమ్యక్ ఖ్యాయతే ప్రకాశ్యతే పరమార్థ తత్త్వం అనయాఇతి సంఖ్యా"

అనగా పరమార్థ తత్త్వమును తెల్పునది. జ్ఞానము చేత ప్రకాశిత మొనర్పఁబడు తత్త్వము సాంఖ్యము. (Anatomy in 3 planes) –

కపిలుఁడు (కర్దమ –దేవహూతుల పుత్రుడు) – సాంఖ్య కర్త.

సాంఖ్యము
- సేశ్వర (ఆస్తిక) – కపిల భగవాన్
- నిరీశ్వర (నాస్తిక) – ఎవ్వరో తెలియదు.

సాంఖ్యము – మానవుని "స్థూల + సూక్ష్మ + కారణ" దేహముల విపుల విస్తార విభజన రహస్య శాస్త్రము –

రాజ యోగమునకు = వేదాంత శాస్త్రమునకు ప్రాణ పట్టు:

సాంఖ్యము = బుద్ధి (రామానుజులు): తత్త్వం పదార్థ విచారము (కపిల & పాతంజలి): సన్యాసం (బాల గంగాధర తిలక్)-

"శబ్ద స్పర్శ రూప రస గంధాది' విషయానుభవమే (జ్ఞాతము) – తన్మాత్రలని యందురు. గుణత్రయానుభవ జనిత విషయానుభవమే (ఇంద్రియముల కార్యములు) ద్వంద్వముల యుత్పత్తికి మూలము. అనగా బాహ్యా విషయముల

సంపర్కము వల్ల (ఇంద్రియముల ద్వారా) అంతఃకరణ వృత్తులు చలించి – స్వస్థితి – సహజ స్థితి – స్వస్వరూప స్థితి మరుగు పడును. –

ఈషణ త్రయ - "ధన దార పుత్ర"

దుఃఖ త్రయ - "ఆధ్యాత్మిక – ఆధి భౌతిక – ఆధిదైకములు"

వాసనా త్రయ - దేహ – శాస్త్ర – లోక వాసనలు –

అరిషడ్వర్గములు – కామ క్రోదాదులు . . . . . . . మొ|| వాని తాకిడి వల్ల

సర్వేంద్రియములు (5 + 5 + 4) – విచలితములై – నానా విధ సంసార సాగర తరంగోద్ఘష లంబడి – జన్మ జరా మరణ చక్ర భ్రమణంబున "దేవు(డు – జీవు(డై" స్వస్వరూపచ్యుతినంది – దేహాత్మ బుద్ధియై – మాయామోహిత భ్రమ యందు చిక్కి - -

"కర్త్రుత్వాద్యహంకార సమ్కల్పో బంధః" – కారణంగా

-- నిరాలంబోపనిషత్.

సాంఖ్య మూల సిద్ధాంతము

1. త్రిగుణ సామ్య స్థితి యందు → స్వస్థితి – నిర్గుణ – నిరాకార – నిష్క్రియత్వం.
2. త్రిగుణ అసామ్య (చలిత) తారు మారు స్థితి యందు } → విశ్వ నిర్మాణ క్రియ ప్రభవించును
3. "అచల – చల" నములకు కర్త, కారణము, ఎద్ది? జడములగు భూతములకు (Matters) – బుద్ధి, చైతన్యం, జ్ఞానం లేదే?

ప్రధానం (matter) స్వేచ్ఛగా – యధాతథంగా విశ్వ రూపము దాల్చును.

ఎట్లనగా :- "ఆవుల పొదుగులనుండి పాలు దూడల నోట చేప(బడునట్లు"

"మేఘములు వర్షించు నట్లు" -- సాంఖ్యము.

కాని అచేతన భూతములు (Blind matter) జడములు – చైతన్య సాయము – (సాన్నిధ్య – సానుకూలత) లేకున్న సృష్టి జరుగదు. దీనికి ఆంతర్యం "సజీవ – చైతన్య" పాత్ర – ప్రత్యక్ష లేక పరోక్షముగనో ఉండి తీరాలి! జడ ప్రకృతే స్వయం కర్త యగునన్న –

"ఆవు తిన్న గడ్డి పాలుగా మారును"

కుక్క – ఎద్దు తిన్న గడ్డి పాలుగా మారదు గదా!

సృష్టి – "పంగ్వంధ సంబంధం" వల్ల ప్రాప్తించును.

అయస్కాంత సాన్నిధ్య బలం వల్ల యినుప ముక్కలు చలించును.

విద్యుచ్ఛక్తి ప్రాపున – వెలుగు - తిరుగు - వేడెక్కు - చైతన్య వంత మగును.

బల్బులు ఫ్యాన్సు స్టౌలు

పురుషుని సాన్నిధ్యం స్త్రీకి శక్తి – బలము – చైతన్యం – ఉత్సాహం లభించును.

" + -- "

"పురుష + ప్రకృతు" ల కలయిక చే చైతన్య వంతమైన జడ ప్రకృతి విజృంభించి – విశ్వ వినోద ప్రదర్శనమాపాదించును.

త్రిపుటి స్వరూపము

జ్ఞానం = సామాన్య జ్ఞానం .

విజ్ఞానం = శాస్త్ర జన్య – విశేష జ్ఞానం.

ప్రజ్ఞానం = అనుభవ జ్ఞానం. – ఏది తెలుసుకొన్న – మరి తెలుసుకొన వలసిన దెద్దియు మిగిలి లేదో – అది.

1. పరమాత్మ వలన పుట్టిన బుద్ధ్యుపాధిక జీవుడు – (విజ్ఞాన మయ కోశము) – జ్ఞాతమగును.
2. మనస్సు నందు ప్రతిబింబ రూపమును బొంది – మనోమయ కోశమై శబ్ధముచే చెప్పఁదగిన చైతన్య జ్ఞానము.
3. శబ్ధాది విషయము లైదును – జ్ఞేయములగును,

ఈ 3 ను – జగత్తు తో పుట్టినవి – తత్పూర్వం లేవు.

"త్రిపుటి" స్వరూపమిదియే – "ద్రష్ట – దృక్ – దృశ్యము" లు.

కర్మ రహస్యము :-

ఈశ్వరుఁడు ప్రేమించిన వారిని పరీక్షించును – దండించును – బెదరించి – కదలించి – "మర్ధనం గుణ వర్ధనం" – అన్నట్లు – భక్తుని యందలి వాసనా మాలిన్య శేషమును (జీవత్వ బంధమును) – ప్రక్షాళిత మొనర్చి, సంపూర్ణ పునీతత్వమును ప్రసాదించు వరకు వదలడుః కావున, మహాత్ములు – సత్పురుషులకు – లోకానుభవంలో కఠిన, కర్కశ పరీక్ష లకు గురి కాక తప్పదు.

మానవ జీవితంలో సుఖ సౌఖ్య భోగ భాగ్యాదు లెల్ల పూర్వజన్మార్జిత పుణ్య కర్మ పరిపాక ఫల భోగమనియును, కష్ట పరంపరలు పూర్వ పాప ఫల ప్రసాదితములనియు జ్ఞాని గ్రహించ గలడు.

డబ్బు ఆర్జించుట కష్టం గాని, వ్యయము సులభంగా సాగిచ్చ వచ్చును – భౌతిక సుఖానుభవములు కూడా అంతే.

అదే విధముగా జ్ఞాని – కష్టములనుభవించుట చే తన పాప సంచయము సమసి పోవు చున్నది గదా యని సంతసించును: ఓర్చి సహించును: ఉలకడు, తొలకడు, పలుకడు: సర్వం ప్రారబ్ధ కర్మ, ఋణ విముక్తుడగుచున్నానని మురిసి పోవును. తద్వతు, సుఖములఁబొందు నప్పుడు – ఉబ్బి పోక – తబ్బిబ్బుగాక ఒక విధముగా "తన పుణ్య రాసి సమసి పోవు చున్నది గదాయని" సత్య దృష్టితో "విదేహుని వలె" కలత నొందక సాక్షిగా నుండును.

మానవ జన్మ ప్రారబ్ధకర్మాను భవ సాధన యంత్రమనియు – పూర్వ జన్మము లందలి సంచితము సహా, యీ జన్మ యందే – ప్రారబ్ధముతో సహా- సమసి పోజేయ గల "జ్ఞాన" సముపార్జనకై భగవంతుని, యాశీర్వదించి – తరింపఁజేయ ప్రార్థించుట బుద్ధిమంతుని లక్షణము.

అహంకార – మమకారాదులు – వాసనా గ్రంధులు – (దేహ – శాస్త్ర – లోక వాసనలు) పూర్తిగా సమసి పోయి – భగవంతుని యంద్యైక్యమగు అర్హత ప్రాప్తించు వరకు సాధకునకు అపార స్థైర్య – ధైర్యములు కావలెను. మహాత్ములు – భక్తులు – జ్ఞానులు అధికముగా కష్టముల పాలగుట కిదే రహస్య కారణము. ఈ విధముగా పరీక్షితులు కాకున్న తరించుట దుర్లభము.

సూర్యోదయ ప్రకాశముతో చీకట్లు మాయ మైనట్లు, యథార్థ (సత్య) జ్ఞానము చేత భ్రాంతి జన్య జ్ఞానం నశించును. అపరోక్షానుభూతి అనగా ఆత్మ జ్ఞానానుభవం మఱువెట్లు వచ్చును? "తనకు తానే సాక్షి గాగల ప్రత్యక్షానుభవం" అనుమానించుటెట్లు? దృఢ విశ్వాసం – గల సత్యజ్ఞానానందమయునకు, హఠాన్మరణం లేక తబ్బిబ్బయి గతించియో – ప్రారబ్ధ కర్మ ప్రాబల్య ప్రత్యేకాకర్షణలో - - - - తిరిగి పునర్జన్మ యేనా? ఈశ్వరా? ఏమిటీ ఘోరం? దయామయా! నీవే గదా అంత్య శరణం – పరమ గతి – రక్ష – ప్రాపు – ఓ! ధర్మ గోప్తా!! శరణు! శరణు!!

శ్లో|| తచ్చింత నంతత్కథన మన్యోన్యం తత్ప్రబోదనం|
ఏ తదేక పరత్వంచ బ్రహ్మాభ్యాసం విదుర్బుధాః||

ప్రత్యగాత్మ  పరమాత్మల ఏకత్వ ధ్యాన – చింతన – సంభాషణ – ఇదే బ్రహ్మాభ్యాస మందురు.

ప్ర|| బాధితాను వృత్తి? – సత్య జ్ఞానానంతరం కూడా –"మేల్కొన్న పిదప స్వప్నాను భవంనశించు నట్లు" – మాయామయ జాగ్రత్ప్రపంచం ఎందుకు నశింపదు?

జ|| దుస్స్వప్నం పోయినను – మేల్కొన్న పిదప కూడా – "భయ కంపనాదులు" కొంత కాలం ఉండిగాని శమింపవు: బలమైన స్వప్న ప్రభావం మేల్కొన్న తర్వాత కూడా కొంత కాలం పని చేయును.

1. రజ్జు సర్ప భ్రాంతి – దీపంతో నశించినను" – సర్ప భీతి జనిత భయోద్వేగ హృదయ స్పందనం – స్వేదాదులు . . . . కొంత కాలం అట్లే యుండును గదా!

"జాగ్రత్ప్రపంచం – అనిత్య మను జ్ఞానోదయ మైనను" –

జగన్మిథ్యా జ్ఞానంతో- జగం మాత్రం మాయం కాదు.

ఎందుకనగా, యుగ యుగాలుగా, జన్మ జన్మాంతరముల నుండి యుంటూన్న భ్రాంతి గదా!!

2. ఎండమావుల లోని "జలం" భ్రాంతి జన్యమని తెలిసి కూడా, ఆ దృశ్యం అదృశ్యం కాదు గదా!! దీర్ఘకాలము నమ్మివున్న భ్రాంతి, నిశ్చితార్థ బుద్ధి జనించినంతనె, మరు క్షణం లోనే అంతరించడం అసంభవం!! ఇదీ "భాధితాను వృత్తి"

శాంతుడనగా – మనస్సు బ్రాహ్మీ స్థితి చే ఉపశమించిన వాడు కాని , కల్పాంతమున "కార్యం" – "కారణము" నందు విలీనమై "ఏకత్వ" సిద్ధి – సర్వైక్యం – అద్వైత స్థితి రూపొందును.

జి + జ్ఞా + సువు = ముముక్షువు = మోక్షకామి

జ్ఞః = ఆత్మ : జ్ఞప్తిః = చైతన్యము : జ్ఞేయం = ఇంద్రియ దృశ్యం

జ్ఞాన మనగా అనాదిగా వచ్చిన సంసార – విషయ వాసనలు నశింపఁజేయుటే "జ్ఞాన" పరమావధి. హృదయ (గ్రంథులు – వాసనలు) "చిదచిద్గ్రంథులు" విచ్ఛేద మొనర్చు నది విజ్ఞానము : దీనికి ప్రతి ఫలాను భవమే "ప్రజ్ఞానం బ్రహ్మ"

త్రివిధ జ్ఞాన వివరణము: - "న జ్ఞానం వినా మోక్షం" – అనగా ఆత్మ జ్ఞానం లేనిది మోక్షం లేదు.

1. సామాన్య జ్ఞానం – మానవ జన్మ దుర్లభమైనది. అశాశ్వత మైనది. సర్వమునకు భగవంతుడే కర్త.: ఇది విషయ జ్ఞానం – లౌకిక – ప్రాపంచిక – సామాన్య జ్ఞానం.

2. విజ్ఞానం – విశేష లేక శాస్త్ర జన్య జ్ఞానం. భగవంతుడెవ్వ(డు? ఎక్కడ ఉన్నాడు? అతని క్రియ లెట్టివిః మృత్యువన నేమి? సృష్టి జాల రహస్య కథన మెట్టిది? మొదలగు విశేషాంశాల ప్రశంసాదులె ప్రత్యేక జ్ఞానము. అనగా పరతత్వ విపుల విమర్శ.

3. ప్రజ్ఞానం – అనుభవ జ్ఞానం – భగవంతు(డు, ప్రకృతి – జనన మరణ రహస్యం – సృష్టి స్థితి లయ విపుల విమర్శః ప్రకృతి – జీవేశ్వర – మనోమయ మహేంద్ర జాలదుల విచారముః తత్వ విచారముః అనుభవ జ్ఞానము; -

జ్ఞానము 2 విధములు

- (Cheque) పరోక్ష → చతుర్వేద మహా వాక్యములు – గురు భోధ – శ్రవణ - మననాదుల విచారము – బ్రహ్మ జ్ఞాన ప్రాప్తి -
- (Cash) అపరోక్ష → పై శాస్త్ర జన్య – గురు భోధాదులను – తీవ్ర దీర్ఘ – శ్రవణ మననాదులతో – వివేక వైరాగ్య భోధోపరతుల వల్ల "ఆ బ్రహ్మ మే నేను' అను అభేద జ్ఞానానుభూతి

మరియు జ్ఞానము 2 విధములు

- శాస్త్ర జన్య -- పుస్తక జ్ఞానము – పంచ శీల వాతావరణ జనితం
- అనుభవ -- మస్తక జ్ఞానము – గురు అనుగ్రహం – సుకృత జన్మ – శుభ ప్రారబ్ధము

మహాత్ముల – "దర్శన – స్పర్శన – ప్రశ్నాదులు" – సేవాదిక శుశ్రూష ల వల్ల పూర్వ జన్మ వాసనలు నశించి – బోధ ప్రకాశించును. వారు పరస వేదులుగదా?

శ్లో| గతి ర్భర్తా ప్రభు స్సాక్షీ నివాస శ్శరణం సుహృత్
ప్రభవం ప్రళయః స్థానం నిధానం బీజ మవ్యయం

అ|| గతిః = గమ్య స్థానమును వారు వారు చేయు కర్మలకు గాని, భక్తికి గాని, జ్ఞానమునకు గాని, వైరాగ్యమునకు గాని, ఫలమును నేనే. అందరు నన్నే పొంద వలసి యుందురు.

భర్తా = భరించు వాడను, పోషించువాడను నేనే. స్వతంత్రుడను. జీవులు భార్యల వలె అస్వంత్రములైనవి. భార్య భర్తను పూజింప వలెను. వారి వారి సంసారములను వారు గాక నిజముగా పోషించు చున్నది నేనే. కావున, వారికేల కర్తృత్వాభిమానములు?

ప్రభుః = చక్రవర్తిని శిక్షించువాడను నేనే.

సాక్షీ = ఎవ రెవ రెక్క డెక్కడ ఏ యే పనులను చేయు చున్నను వారి లోపలను, ఆయా స్థలములయందు నుండి, సాక్షిగా చూచుచున్నవాడను నేనే. సృష్టి స్థితి లయ వ్యాపారములు నా యెదుటనే జరుగు చున్నవి.

నివాసః = ఉనికిపట్టూ నేనే, అందరి యందును నివసించువాడను నేనే. నే నెక్కడనో యున్నానని తలప వలదు. నేను లేని స్థలమే లేదు.

శరణం = అందఱకు శరణ్యము నేనే. మీ బందువులు, ధన ధాన్యములు శరణ్యములు గావు.శరణు జొచ్చినవారిని రక్షించుటే నా స్వభావము. అతడు శత్రువైనను సరియే, శత్రువుల బంధువులైనను సరియే. (విభీషణ, కాకాసుర దేవతలాదిగా శరణాగతి నొంది ధన్యులైరి) సంసార తాపములకోర్వ జాలని వానికి నేనే శరణ్యము.

తా|| గమ్యం – భర్త – ప్రభువు – సర్వ సాక్షి – ఉనికి – శరణం (దిక్కు) - సుహృత్ – సృష్టి లయాధికారి –ఆలవాలం – భవిష్యన్నిధి. అవినాశి బీజం – సర్వం ”నేనే”.

-- భగవద్గీత, అ. 9. శ్లో. 18.

ఆత్మ విజయమునకు 3 సోపానములు. (Four fold wealth)
- మనో నిశ్చయము(సత్య దర్శనము)
- విజ్ఞానము (గురు – శాస్త్రభోధ)
- ప్రేమ సాధన (పురుష ప్రయత్నము)

సాధన చతుష్టయ సంపత్తి : - (నవ సాధన సంపత్తి) చతుస్సాధన సంపత్సయుక్తుఁడైన వానిని జ్ఞానమునకు అధికారి అందురు. జ్ఞానము వల్ల "జగన్నివృత్తి – బ్రహ్మ ప్రాప్తి" తథ్యముః నిష్కామ జ్ఞానార్జనాపేక్షయే – నిజమైన తత్త్వ జిజ్ఞాస. –

1. నిత్యా నిత్య వస్తు వివేకము – వివేకము.
2. ఇహముత్రార్థ ఫల భోగ విరాగము. – వైరాగ్యము.
3. శమ దమాది షట్క సంపత్తి – సదాచారము.
4. ముముక్షత్వము -- ప్రేమ

1. వివేకము – "బ్రహ్మ సత్యం – జగన్మిథ్య" జ్ఞానము

"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ"

"సర్వ ఖల్విదం బ్రహ్మ"

క్లుప్తంగా – నీవు ఆత్మవు. నీ శరీరము నీకు ఉపాధి – ఉపకరణము మాత్రమే.

దేహము స్థూల – పంచ భూతాత్మ – దహింపఁబడుట వల్ల దేహమని పిలువఁబడును. అది క్షేత్రము – నీవు క్షేత్రజ్ఞుఁడవు.

సత్ - అసత్

దృక్ - దృశ్యము

ఆత్మ - అనాత్మ

నిత్యం - అనిత్యం

బ్రహ్మము - జగత్తు

ప్రత్యక్ష దృశ్య ప్రపంచమెల్ల (రూప నామాత్మక మైన) అనిత్యమనియును, రూపనామ క్రియా రహిత విలక్షణ చిద్విలాస పరబ్రహ్మము నిత్యమని గ్రహించు టే వివేకము – సర్వదా సత్య దృష్టి – దర్శనమే పరమార్థ జీవనము. స్థిత ప్రజ్ఞ. వివేకము – సత్య జ్ఞానానందమయులు అమరులు.

"నేనే బ్రహ్మము – వర్షం – మృత్యువు – అమృతం – సర్వం" మరియు.

"ద్వేవిద్యే వేదితవ్యే శబ్ధ బ్రహ్మ పరం చమేత్"

- అమృత బిందూపనిషత్.

తా|| శబ్దం, పరబ్రహ్మ విద్య, రెండును నేనే –

బ్రహ్మ సత్యమని – బ్రహ్మను పొందుటే జీవిత కర్తవ్య మనియు – జగత్తు అశాశ్వతమనియు – దుఃఖ దాయకమనియు తెలుసు కొనుట.

1. వివేకము – a) "నేతి – నేతి" – ఇది కాదు – ఇది కాదని త్రోసి వేసి – ఏమి మిగుల లేదని గ్రహించెడు సాక్షియే "నీవు" –

b) కార్యకారణ సంఘాత విలక్షణమైన – పర బ్రహ్మ మే "నేన"ను తెలివితో- ఇంద్రియాది మనస్సు మొ|| వాని యొక్క సమస్త క్రియలు – మనమే చేయు చున్నట్లు అనుకొను భ్రాంతి – చిరకాలాభ్యాస సుస్థిర భ్రాంతి జన్యమని గ్రహింపఁనగును.

c) మనస్సు బంధ మోక్షములకు కారణం. – అవిద్యకు పెద్ద కొడుకు.

d) జనన మరణాది షడ్వికార రహిత సచ్చిదానంద ఘన ప్రకాశము నేనే.

e) "నేను – నేన" నెడి అహంకారానుభవ విషయమును గ్రహించు సాక్షి

– తటస్థుడ – బ్రహ్మము – త్రికాలభాధ్య చిద్రూప సత్యమును "నేనే".

2. వైరాగ్యము – వివేక జనిత వైరాగ్య ప్రాబల్యము వల్ల – ఐహికాముష్మిక రూప ప్రపంచమెల్ల – అజ్ఞాన (మాయ) కల్పిత మగుటచే వినశ్వర మైనదనెడు దృఢ నిశ్చయమున, సమస్త విషయ (విష) భోగము లందును – కక్కిన కూటి యందు వలె (లేక కాక విష్టాయాం – లేదా సూకర మలం వలె) - - - - ఇచ్ఛ (అభిలాష)ను వదలి - - - జడమైన దేహమును ను కాను - - సర్వకాల సర్వావస్థలయందును "నేను – నేను" – అను స్థిత ప్రజ్ఞ యందు స్ఫురించుచున్న అఖండైకరస చిన్మాత్ర పర బ్రహ్మమే "నేన" ని యెంచి – త్రికరణాలా అహంకార మమకార రూప సంసార (సంగ) మును విసర్జించుము. సద సద్వివేక దృష్టి చే పరిశీలించి, ఉండక యే యున్నట్లు తోచు, మాయా మహేంద్రజాల సృష్టి యగు "దృశ్య జగత్సర్వమును" మిథ్యా భూతమని తెలుసుకొని, బ్రహ్మ జ్ఞాన జ్యోతి ప్రకాశ సాయమున "సచ్చిదానంద" రూపమగు స్థిత ప్రజ్ఞత్వమున భద్రుఁడ వగుము –

అనగా, ఇహపర లోక భోగము లందు త్రికరణ విముఖత్వం –

అష్ట సిద్ధులు – సహా! మరియు సమస్త సుఖ సాధనలు అనగా – ధన, దార, పుత్ర, మిత్ర, వస్త్రాభరణ, పుష్పమాల్యాద్యలంకారములు – షడ్ర సోపేత భోజన మజ్జనాదులు – పదవులు – బిరుదములు – స్తోత్రములు – నానా ఆకర్షణీయ మైన విషయ భోగముల పట్ల జుగుప్స - -

3). శమాది షట్క సంపత్తి –

a). శమం = వాసనా త్యాగం – అంతరింద్రియ (మనో) నిగ్రహం.

b) దమం = భాహ్యేంద్రియ (కర్మ + జ్ఞాన) – నిగ్రహం – విషయ విరక్తి.

c) ఉపరతి = ఉపవాసము – ఆత్మ క్రీడ – విషయ విముఖత్వం, ఆత్మలోరమించుట.

d) తితిక్ష – సర్వ దుఃఖములందు – సహనం - ద్వంద్వా తీత స్థితి – స్థిత ప్రజ్ఞ.

e) శ్రద్ధ – గురు – శాస్త్రములందు దృఢ విశ్వాసము – ఆత్మ విశ్వాసం.

f) సమాధానం – సలక్షణమందు చిత్తై కాగ్రత ధారణను పాలించుట.

శమము – వాసనాత్యాగం – పూర్వాను భవ సంస్కార జనిత విషయ భోగాసక్తత నుపేక్షించి – వాసనల విజృంభణ – స్వేచ్ఛావిహారము నరి కట్టుట – అనగా అంతరింద్రియముల నిగ్రహముః బాహ్య వృత్తుల నడ్డగించి అంతఃకరణ చతుష్టయము (బుద్ధి – మనస్సు – చిత్తము – అహంకారమును) – వాసనలు (పూర్వ విషయానుభవ స్మృతులను – తద్రూప సంకల్పములను) రూపు మాపుట, మనస్సును సద్విషయ చింతనమున నియోగించి, సంస్కారముల నిరోధము.

శ్లో|| యతోయతో నిశ్చరతి మనశ్చంచల మస్థిరం |
తత స్తతో నియమ్యైత దాత్మన్యేవ వశం నయేత్||

తా|| చంచలమైన మనస్సును ఆయా విషయములనుండి జాగ్రత్తగా "వివేక వైరాగ్యముల" చే ఒప్పించి ఆత్మ పరము చేయుట.

-- భగవద్గీత. అ. 6. శ్లో. 26.

పంచ శీలముల సాయమున –

1. సచ్చింతనము. 2. సద్గ్రంథ పఠనము 3. సత్ప్రవర్తనము. 4. సత్కర్మము (సదాచారము). 5. సత్సంగము . . . . . ఇవి జ్ఞాన సముపార్జన కత్యంత సాధనకారులు.

అంతఃకరణ స్వరూపము ; -

1. మనస్సు – సంకల్పించును – కోర్కెలను రేకెత్తించును.

2. బుద్ధి – విచారము సల్పి – నిశ్చయించును.

3. చిత్తము – చలించును. స్థిరతను తప్పించి – స్వస్థత నుండి చాంచల్యమును కల్గించి – సందేహముల సృష్టించి, పతితత్వమాపాదించును : చపలకారి.

4. అహంకారము – "నేను – నాది" – అనెడి మమకారము (తగులు) – భ్రాంతి జన్య కర్తృత్వము (మాయా జనిత మౌర్ఖ్యము) – ఇదే సర్వ కార్య సాధనలకుటంకించు "జీవ తత్త్వము" - (జీవత్వము) – "అంతఃకరణ చతుష్టయము" ఊర్ధ్వగామి యైన మనస్సు – "శుభ – నిర్మాణ" రూపమును దాల్చి, బ్రహ్మ మందు లయించి "బ్రహ్మయై" – చతుర్ముఖుఁడగును – "బ్రహత్వ ప్రాప్తి" – అథవా వినాశకర – అశుభ –ఆధోముఖ పథగామిత్వమనుసరించిన "అంతఃకరణ చతుష్టయము" దుష్ట చతుష్టయమై, జనన మరణ చక్ర భ్రమణమునఁ జిక్కి – పతితమగును. (మనస్సు ప్రకరణము చూడఁదగును). -

విషయమనగా ఇంద్రియముల ద్వారా భిన్న భిన్న భోగములని అర్థము. బాహ్యాంతర శౌచము (శుచిత్వము) చే – సత్వ శుద్ధి – ఉల్లాసము – ఏకాగ్రత – జితేంద్రియత్వము – ఆత్మ దర్శన ప్రాప్తి లభించును. దేహాభిమానము నశించును.

ద్వంద్వములు గుణములందు పుట్టుచున్నవి. త్రిగుణాతీత స్థితి యే – ద్వంద్వాతీత స్థితిః ద్వంద్వముల సృష్టి మాయా జనితములు – విపరీతములుత్పన్నం బగుట మాయ యొక్క చేతయే.

దమము – ఇంద్రియ (5 + 5) నిగ్రహం – విషయ విరక్తి, బాహ్యాకర్షణలకు (విషయాను భవాసక్తిని నిగ్రహించి) లోను గాక, మనస్సు అంతర్ముఖమై పంచశీలములందు నిమగ్నమగుటః "శమ – దమములు" పరస్పర – అవినాభావ సంబంధము గలవి. వేరు గాదు. అంతరంగమున – అంతఃకరణము యొక్క "వాసనలు – సంస్కారములు" – బయట విషయముల ప్రేరేపణ (ఆకర్షణ) – "ఇంద్రియముల ద్వారా" – ఈ ఝంఝూటము – సంపర్క తీవ్ర కాంక్ష – సంసారము - - "ఉభయ తారక సమస్య" - - బంధము – (బయట స్థూలఁజడ) విషయములు – లోన సూక్ష్మ (చైతన్య – జీవ) తత్త్వము యొక్క "కామ్య – ఇచ్ఛ – కోర్కెల" పరంపరలు విజృంభణ :

శ్లో|| యదా సంహరతే చాయం కూర్మోఽంగానీవ సర్వశః|

ఇంద్రియాణీ న్ద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితాః ||

తా|| తాబేలు ఏ విధముగా తన కర చరణాద్యవయములను లోనికి ముడుచుకొనునో, తద్రీతిగనే మనస్సు చే ప్రేరేపితమైన ఇంద్రియములను విషయ సంపర్కము నకు పోనీయక మరల్చి, ఆత్మ యందే చేర్చి రమింపఁజేయువాని బుద్ధియే "స్థిత – స్థిర ప్రజ్ఞ" యనఁబడును. -- భగవద్గీత. అ. 2. శ్లో. 58.

కార్యకారణ ఉపకరణాదులు

జనన మరణాది షడ్వికారములు -

రూప, నామ, వర్ణ, వయో మొ|| వికృతులు

జాతి, గుణ, అహంకారాది ప్రకృతి గుణములు –

బ్రహ్మకు లేవు – అన్నట్టి సుస్థిర జ్ఞాన విశ్వాసము లత్యవసరము – ఇవి అనగా సత్య జ్ఞానము స్థిత ప్రజ్ఞను ప్రసాదించి – ఇంద్రియ నిగ్రహము – ద్వంద్వాతీత స్థితి నిచ్చును. ఆభ్యాస – వైరాగ్య – భోధోపరతులతో – "జ్ఞాని – బ్రహ్మ" సుర గుణ గణాన్వితుఁడైన మహాధీరునకు "నేను" అను స్పృహ – అఖండై కరస చిన్మాత్ర పర బ్రహ్మమే – "నేను" అను ప్రజ్ఞ కరతలామలకము!!

ఉపరతి – "ఉపరమేత్" – విషయ పరాఙ్ముఖతః బ్రాహ్మీ భావము – ఏక లక్ష్య చింతనము. భిన్న రుచుల సహనము. ఏకత్వము – ఏకాంతము – అంతః సన్యాసము – సర్వ సంగ పరిత్యాగ – ధ్యాన శక్తి చే విషయ విరక్తి గల్గిన చిత్తమును సర్వదా లక్ష్యము నందు లగ్న మొనర్చి – ధ్యానానందమున రమించుట : ఉపరతి యనగా (భౌతికార్థము – ప్రాపంచిక) –స్త్రీ చేయు సంభోగము. మనస్సు "స్త్రీ" గాఁనెంచఁబడును. – ఆత్మ పురుషుఁడు గాను – మనస్సు "స్త్రీ" గా తలంచి, అధోగామియైన మనస్సును ఊర్ధ్వముఖ వ్యాప్తి చే, క్రమాభ్యాసమున, "జీవుని – దేవుని" యందు – జీవత్వమును దేవత్వ మందు లయింపఁజేయు బ్రహ్మాభ్యాస క్రియ యే "ఉపరతి" అన్నారు. దీనినే గురు అనుగ్రహమున - - - హృదయస్థ (అనాహత చక్ర మందలి) మనస్సును, సుషుమ్నాగ్రమునకు (ఆజ్ఞా చక్ర పీఠమునకు) చేర్చి బ్రహ్మాభ్యాస దివ్యాను భూతి నందడమే "ఉపరతి" పరమావధిః

అరిషడ్వర్గ జయము – అంతః శత్రు వినాశము, అనగా

శ్లో॥ కామః క్రోధశ్చ లోభశ్చ దేహే తిష్ఠంతి తస్కరాః।
జ్ఞాన రత్నాపహరాయ తస్మాత్ జాగ్రత జాగ్రత ॥
---బ్రహ్మ పురాణము. అ. 137. శ్లో. 6

తా॥ కోర్కె, కోపము, పిసిని గొట్టుతనము, కామినీ కాంచనముల మీద ఇఛ్ఛ – కుల,ధన, బల విద్యా రూపముల వల్ల అహంకారము (మద, మాత్సర్యాదులు) ఈర్షాదులు – 6. వీరు తస్కరులు, మనలోని "జ్ఞాన" రత్నమును తస్కరించునవి కావున జాగ్రత్త!!

మౌర్ఖ్యము, వితండమునకు మాతృక, అవిచారము – అజ్ఞానముల వల్ల కల్గును. ఆది వ్యాధులకు మూలము. ఇది దురాగ్రహము – దుస్సహవాసము, దురుద్ధేశ్యము – దురాచారము, దుస్సంకల్పము, దురాశ, దుర్గతి, దురదృష్టము ల వల్ల ప్రాప్తించును: కోపోద్రేకత మొ॥ కారణముల వల్ల కల్గును. దీనికి పై వన్నియు తోడ్పడిన యిక అంతే!! "మర్కటస్య మధు పానం - - - - " అంతా గందర గోళమే.

ఇంద్రియములే కామము నకు నెలవులు – ఆశ్రయము. కామ చోరుఁడు తెరచి యుండు దేవ గృహమున (ప్రమత్త ఇంద్రియముల ద్వారా) ప్రవేశించి జ్ఞాన దీపము నార్పి అజ్ఞానాంధకారమును సృష్టించి, యజమానుని బంధించి, బాధించును.

తితిక్ష – సర్వ దుఃఖములయందు (ద్వంద్వములందు) –సహిష్ణుత – సహనము: ద్వంద్వాతీతస్థితి – నిత్య తృప్తి – స్థిత ప్రజ్ఞత్వము – తాలిమి – అచల – నిస్సంగత్వ – అనగా, "కృంగక – పొంగిపోక" స్వస్వరూప ధ్యాన స్థితి సమస్త పాపములకు – చీకటి (రాత్రి) అనుకూలము (పతనమునకు అజ్ఞానాంధకారము వలె) – కావున – అశుభకర – అక్షేమంకర అజ్ఞానాంధకారమునకు చోటివ్వక – అప్రమత్తుఁడవై – సత్య దృష్టి – స్థిత ప్రజ్ఞను మరువ రాదు – ఇందుకు ఇంద్రియ నిగ్రహము –జయము ఉత్తమ మార్గము.

శ్రద్ధ – నిగమాచార్య వాక్యము లందు అచంచల మైన (ధృడ) విశ్వాసము – వేద శాస్త్ర – గురు – ఈశ్వరులందు భక్తి (ఆస్తికత): ఏ విధముగ సామాన్య మానవుఁడు (పామరుఁడు) దేహ పోషణార్థమై – మరి మరి తీవ్ర ప్రయత్నమున ధనార్జనమునకు కడంగునో, తద్రీతిగనే, బ్రహ్మత్వ ప్రాప్తికి వేయి రెట్లధిక శ్రద్ధా సక్తులఁ జూపుట, అచంచల భక్తి, దేహ (ఇంద్రియ) ధర్మములు – వృత్తులు ఇంద్రియ సహజములని గ్రహించి – నిగ్రహించి – ఆత్మ (స్వ) ధర్మ నిర్వహణ –

స్వస్వరూపాను సంధాన సాధన లో – పూర్ణ నిమగ్నుఁడవై – ముభావంగా, తటస్థ ద్రష్టగా – సాక్షిగా మన వలెను.

సమాధానము (క్షమ) – లక్ష్యము నందు ఏకాగ్రత – ఏక లక్ష్యము – సంశయాత్మక బుద్ధి లేకుండుటః ఉపవాస – యజ్ఞయాగాది – ఏకాంత – జితేంద్రయత్వాదులు – యాత్రలు – మోక్షము నివ్వ జాలవుః సర్వ ప్రతిబంధముల – విఘ్నముల నిగ్రహించి – స్థిర విశ్వాసమున బ్రహ్మోపాసనమున బ్రహ్మ నిష్ఠా గరిష్ఠుడై యుండుట.

గీ || తనిసి రే వేల్పులు దధి రత్నముల చేత|
వెఱచిరే ఘోర కాకోల విషము చేత||

బుద్ధి మంతులు తాము తల పెట్టిన కార్యములు సఫలమగు వరకు వదలరు.

తత్వజ్ఞానానికి "పుణ్య – పాప" చింతనమే లేదు. "ఒకరి విందు, మరొకరికి మందు" (One's food is another's poison) – వేదాంత విద్య యందు, అధికారి, అర్హత – శక్తుల ననుసరించి, గురువు భోధించును "ఏక మూలికా ప్రయోగం" ప్రమాద హేతువు.

సత్సాంగత్య – శ్రవణ – ధ్యాన సద్గుణా భ్యాసము ల వల్ల అధికారియైనంత మాత్రమున – పారాయణ ప్రవచనాదుల తో తృప్తిఁజెందక - - - తీవ్రాభ్యాసాదుల చే జీవితమున – తన్మయమై – విలీనం కావలెను.

"ప్రత్యగాత్మ యే పరమాత్మ యనెడు" పూర్ణ విశ్వాసం లేని (ద్వైత బుద్ధి వల్ల) పంచ దేవతలు భయమున పరువులు దీయు చున్నారు!

ధ్యానము చేయు వాడెప్పుడును ధ్యానము చేయుచునే యుండ వలెను. మానిన ధ్యాన నిష్ఠ పోవునని వాని భయము. తాను విష్ణువునని ధ్యానము చేసి నప్పుడు విష్ణుత్వమెట్లు కల్పితమో – బ్రహ్మత్వము కూడా అట్లే కల్పితమని తలంచును. కాని, బ్రహ్మ సాక్షాత్కారము లేక పోవుటయే యీ భయావిశ్వాసాలకు కారణం.

ధ్యాన కల్పిత వస్తువు, ధ్యానము లేనప్పుడు నశించును. జ్ఞానము చే గ్రహింపఁ బడిన "సత్పదార్థము" వృత్తి జ్ఞానము (కల్పిత – ఊహించిన) పోయినను పోనేరదు. బ్రహ్మాకార పరోక్ష వృత్తి నశించిన బ్రహ్మము నశింపదు.

బోధ – జీవునకే సంసారము – ఆత్మ కెంత మాత్రము లేదు. అట్టి విజ్ఞానమే భోధ – ఇది గురు – శాస్త్ర యుక్త్యనుభవముల వలన లభించును, ఇదియే "విద్య" – జ్ఞానము – వీటివల్ల "అవిద్య" – అజ్ఞానము – మాయ – మరుపు – భ్రాంతి నశించును. ఆత్మ ప్రకాశించును.

1. ప్రారబ్ధము లెఖ్ఖఁజేయని జ్ఞాని. (ప్రారబ్ధ సాక్షి) – తత్వ జ్ఞానము కల్గిన దేహేంద్రియాదులు మిథ్యాభూతములని తెలియును గాన, వానికి స్వస్వరూప నాశము లేదు. కావున అట్టి లౌకికమగు రాజ్యాధికము నట్టి సాధనల చేత నాచరింప వచ్చునుః "తగులు లేని జాగ్ర జ్జీవనము" –

2. ప్రారబ్ధవశుఁడైన జ్ఞాని (ప్రారబ్ధానుభవి) – జ్ఞానులలో కొందరికి మిథ్యా భూతములందిచ్ఛ కలుగదు. కాని, కొందరికి వాంచ కల్గుట వల్ల రాజ్యాదు లేలుదురు. ఉభయులకును తత్వ జ్ఞానము సమము, ముక్తియు సమానము. కాని వైషమ్యము – భేద జీవన విధానమే – అనగా ప్రారబ్ధాధీనమని అర్థము . . . .

రాజ యోగము – సూక్ష్మ & సులభ – ఉపాసనా విధానము –ఈ మార్గము (సదాచారము) –వల్ల ప్రజ్ఞ పెరుగునుః శాస్త్రీయ అనుభవాచారము.

అనాది గా వచ్చిన సంసార – విషయ వాసనలు, నశింపఁజేయుటే "జ్ఞానము". హృదయ (వాసన) గ్రంధుల విచ్ఛేదన మొనర్చు నది "విజ్ఞానము"

ఫలం ⟶ "ప్రజ్ఞానం బ్రహ్మ" – వేద వేదాంత జ్ఞాన పరమావధి.

జ్ఞాన భూమికలు (సప్త సోపానములు) --- జ్ఞానవాశిష్టము.

1. శుభేచ్ఛ :- నిత్యానిత్య వివేక విచారము.

ముముక్షువులు 2. విచారము - శాస్త్ర – గురు భోధలందలి సత్యముల మననము. ఇదే వివేకము (సా.చ.లలో 1వది) – అనగా శాస్త్రీయ జీవనము + సద్గోష్టి

3. తను మానసి – మనస్సు సూక్ష్మత నొందు దశ. సా.చ.లలో 2 వది. విరాగముః తద్వారా మనో నాశముః దుర్విషయ దూరీ కరణ ప్రయత్నము; మెలుకువ.

బ్రహ్మవేత్త - 4. సత్యాపత్తి - పరబ్రహ్మ నిష్ఠను బూని వెలుగు చుండు బ్రహ్మ విదుని అవస్థః వాసనలు – పూర్వ సంస్కారములు నశించి, సత్వ గుణ –

(సురగుణ) సంపదభి వృద్ధి – నిర్మలాత్మానుభవం.

బ్రహ్మ విద్వరుడు-- 5. అసంసక్తి - పరబ్రహ్మ నిష్ఠనుబూని, వెలుగు చుండు బ్రహ్మ విద్వరుని అవస్థ: కేవలం భావనారూప స్థితియే: బాహ్యాకర్షణలు లేవు: అసంగుడు: మోక్షము నందిన వాడు. సాధన చతుష్టయ పూర్తి ఫల భోక్త. కాని అప్పుడప్పుడు బ్రహ్మ నిష్ఠ నుండి మేల్కొని తినుట – భోధించుట వుండును.
శుద్ధజ్ఞానానంద స్థితి.

బ్రహ్మవిద్వరీయుడు - 6. పదార్థభావన – బ్రహ్మ విద్వ రీయావస్థ ; పూర్తిగా ధ్యేయా కారమే సత్య వస్తు స్వరూప పూర్ణత్వము నంది, బాహ్యాభ్యంతరముల నెఱుంగక, పరుల సాయమున (శిష్యులు లేపగా లేచి తిరిగి లయించును) – వర్ధిల్లును, నిస్సంకల్పుడు – స్వార్థ మెఱుఁగడు – బొత్తిగా ప్రపంచ జ్ఞానము లేదు.

బ్రహ్మ విద్వరిష్ఠుడు - 7. తురీయం - బ్రహ్మ విద్వరిష్ఠుడు – ప్రపంచ జ్ఞానం శూన్యం. స్వయంగాను, శిష్యులు లేపినను లేవడు. తిండి తీర్థాదులు లేవు: సర్వావస్థాతీతుడు: సదానందుడు. జీవన్ముక్తుడు. నిర్వి కల్ప సమాధి పూర్తి: జీవ బ్రహ్మైక్యావస్థ.

"తురీయాతీతం" – విదేహ ముక్తి కి సంబంధించిన స్థితి – "ప్రజ్ఞానం బ్రహ్మ" స్థితి.

ముముక్షుత్వము –

శుభేచ్ఛ గల వేయి మందిలో ఏ ఒక్కడో విచార – వివేకములకు దిగును. వివేకము గల వేయి మందిలో ఏ ఒక్కనికో వైరాగ్యాదు లొప్పవు. వైరాగ్యాదు లొప్పిన వేయి మందిలో ఏ ఒక్కడో జ్ఞాని యై – గురు పుత్రుడై – బ్రహ్మాత్వ మొంద గల్గ వచ్చును.

"లక్ష కొక్కడుండు విలక్షుణుండు
నిక్క మైన నీల మొక్కటైనను జాలు –
తళుకు బెళుకు రాలు తట్టెడేల?" –

మానవ జన్మ ఈ సృష్టి లో మహా దుర్లభం. అందులో శుభేచ్ఛాది – బ్రహ్మాత్వం వరకు సాగించి తరించ గల ధన్య జీవులు – మహాత్ములు – కోటికొక్కడు – త్రిలోక వంద్యులు.

శ్లో || బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే
వాసుదేవ స్సర్వమితి స మహాత్మా సుదుర్లభః ||

తా|| పశు పక్షి క్రిమి కీటకాది యోనులలో కర్మానుభవము తీరిన వెనుక మనుష్య జన్మ మెత్తి, అందును అనేక జన్మములలో జ్ఞానార్జనము చేసి నిలువ జేసి కొని తుదకు సర్వము వాసుదేవ మయమని, నన్ను సేవించి కృతార్థుడగును. అట్టి వాడు అనేక కోట్లలో నొకడుండును.

-- భగవద్గీత. అ. 7. శ్లో. 19.

మానవు(డు
- నిత్యమైన ఆత్మ చింతనము వల్ల } మనస్సు యేక ముఖ ధ్యానంవల్ల – సన్నగిల్లి - జ్ఞానానంద రూపమై లయించును.
- అనిత్య విషయ చింతనము వల్ల } బహు ముఖమై – బలిసి – విజృంభించి – చపలమై దుఃఖ దాయని యగును.

మనస్సు నందు కోర్కెలే పునర్జన్మకు బీజములు
- భూత వాసనలు (సంస్కార రూప)
- వర్తమానఅనుభవములు
- భవిష్యచ్చింతనలు (సంకల్ప – వికల్ప రూప)

} వల్లను బలిసి, దృఢమై జన్మ జన్మాంతరముల నుండి పెరిగి బలీయమై, స్థిర పడినవిః అనుకూల పరిస్థితులు ప్రాప్తించిన, బయల్వెడలి విజృంభించును –

కాని, లోక వ్యవహార పరులైన గృహస్థులు, బ్రహ్మో భ్యాసాది సాధనల వల్ల ఉపశాంతులై – యతుల వలె – పై జ్ఞాన పథ అభ్యాసాదుల సాయమున వాసనలు క్షీణించి, “దగ్ధ బీజ తుల్యముగ” (భర్జిత బీజ న్యాయమున) – పునరా వృత్తి రాహిత్య సహజా నందా నుభవమునకు – అపరోక్షాను భూతికి – అర్హులే!!

జ్ఞానుల (యోగుల) దేహములు నిజమైన దేవాలయములేః దేహములు జడములైనను అంతరంగ చారి యగు మనస్సు (సంకల్ప స్వరూపు) నకు నివాసముః మనస్సున్నంత కాలము, స్వస్వరూప విస్మరణము, ఎడ తెగని విషయ చింతనము తప్పదు. కావున, సంకల్ప పరిత్యాగము వల్ల (వృత్తి రాహిత్య) మనస్సు శుద్ధమై బ్రహ్మాకారముఁ జెందును. అనగా, ధ్యేయా కృత నందును.

సంకల్పమే బంధము – సంకల్ప నాశమే మోక్షము. "అద్వైత మెంత దగ్గరైన – ద్వైత మంత దూరమగును." – తన ఘనత తానే మఱచి – దేహాత్మ బుద్ధితో తన్మయుఁడై మాయా సమ్మోహన మంత్ర ముగ్ధుడై – తాను వేరు – జగత్తు వేరని భ్రమసి – భ్రమించి పరి భ్రమించు నంత వరకును ద్వైత పిశాచము వదలదు. బ్రహ్మ భిన్న వస్తువు లేదు. కాదన్న బ్రహ్మకే ద్రోహము.

సన్మార్గము –

పరనింద మాని, వారి యందలి సద్గుణముల నే గ్రహించు – హంస గుణము గల వాడు

శుభచ్ఛా లక్షణుడు

పరహింస మాని, పాప భీతితో భోగాపేక్ష లేక

వేద- గురు వాక్యములందు విశ్వాసము – శ్రవణ మననాదులతో/ అష్టాంగ యోగ సాధన పరుడు –

సమత్వ – సర్వరహితత్వ –మృదుల భాష - ఆగ్రహా వేశ రహిత – పంచ శీల ప్రియ - జ్ఞాన మార్గ గామి.

ఆర్య స్థితి నందిన వాడు, పునర్జన్మ రాహిత్యమున 4 వ స్థాయి నందు కొన్న ఘనుడు.

అభ్యాస – వివేక –వైరాగ్య – విశ్వాస – యుక్తి – శక్తి – భక్తి – పురుష ప్రయత్నాదుల తోడి ముముక్షువు - - - -

విషయ కాంక్షలనెడు పెను భూతములు (జీవులను భాధించి, పతితులం జేయు బలీయ విఘ్నకారులు) తత్వ నిర్ణయాత్మక మైన శాస్త్ర విచారముల సాయమున – సత్పథ సాధన సామర్థ్యముననిగ్రహింపఁబడి – అమృతత్వ నిత్యానందము ప్రాప్తించును. క్రమముగా పునర్జన్మ బీజము లైన వాసనలు – విషయ చింతనాసక్తి నశించి పోవును.

"విషయ విరక్తి – పరతత్వాసక్త లాభ కాంక్ష " ను మరువ రాదు. ఒక జన్మ సాధన చాలదు. జ్ఞానము బహు జన్మార్జిత పుణ్యాఫలమే!!

ప్రకృతి యొక్క విషయ రూప పరిణామము వల్ల పురుషునకు భోగమగు చున్నదిః మరియును, వివేక రూప పరిణామము వలన మోక్ష ప్రసాదనమగుచున్నది. –

శరీర సంబంధాభావము వల్ల 21 దుఃఖములు నాశనమగును. ఆదుఃఖరూప నాశమే న్యాయమతమున మోక్షమందురు.

21 దుఃఖముల వివరము -- 5 జ్ఞానేంద్రియములు
1 మనస్సు
6 విషయములు
6 జ్ఞానములు
2 సుఖ + దుఃఖములు = 21

కర్ణ గోళకమందుండు ఆకాశమును శ్రోత్రమందురు. ఈ కర్ణ గోళకము మోక్ష కాలమందుండదు. ఆకాశరూపమగు శ్రోత్రేంద్రియ ముండియు గోళకా భావము వలన, దానికి జ్ఞానము లేదు !! ఆత్మతో మనస్సంయోగము (సాన్నిధ్యము) వల్ల జ్ఞాన మగును. ఆది లో ఆత్మ వల్ల ఆకాశమాయెనుః లయించుట వల్ల మనస్సు అనిత్యమని రూపితముః మనస్సు ఉన్నది కాని లేదు. ఆత్మ యొక్క స్వరూపమే జ్ఞానముగ నున్నది! "ప్రజ్ఞానం బ్రహ్మ" ఋగ్వేదానుభవ వాక్యం - స్వప్న మందీ పురుషుడు (తైజస) జ్యోతిగ నున్నాడు.

"య ఏష వ్యాంతర్జ్యోతిః పురుషః" – హృదయ మందు
"సత్య జ్ఞానానందం బ్రహ్మ" – "ఏక మేవా ద్వితీయం బ్రహ్మ"
-- చాందోగ్య. అ. 6

పరోక్షాను భూతి (జ్ఞానం) -- చెక్ లేక డ్రాఫ్టు లాంటిది.
అపరోక్షాను భూతి (ప్రజ్ఞానం) -- నగదు (క్యాష్)
జ్ఞానం తో పండిన వాఁడు జ్ఞాన పండితుఁడు – పండా !

జ్ఞానికి విధి నిషేధములు లేవు. కాని, జ్ఞాని లోకాదర్శ నిమిత్తమై – జనకుడు – కైకేయ రాజు – శిభి ధ్వజుఁడు – అశ్వపతి మొ|| రాజ ముఖ్యులు – రాజ యోగులు – కర్మ భక్తుల నాశ్రయించి, ఆదర్శ జీవితములు సాగించిరి. ధర్మ నందనుడు, భీష్ముఁడు, "నేను" (అనగా శ్రీ కృష్ణ పరమాత్మ) అంతే గదా!

అజ్ఞానమే "గ్రంధి" – సుజ్ఞానమే గ్రంధి విచ్ఛేధం. జ్ఞానులకు యోగ క్షేమముల తోను – లేని దాని మీద ఇచ్ఛ – ఉన్న దాని మీద మోహము (లంపట) మొ||

నవి లేవు. సత్యా జ్ఞానాందమయుఁడైన బ్రహ్మా వేత్తకు కర్మ బంధమెక్కడిది? కర్మలు (సంచిత – ప్రారబ్ధ – ఆగాములు) – లింగ శరీరము భంగమైన పిదప (చిద చిద్గ్రంధి – హృదయ గ్రంధి భిన్నమైనంతనే) భర్జిత బీజము అంకురింపఁజాలనట్లు, జ్ఞాని కి పునర్జన్మ లేదు.

మోహ నాశమే మోక్షము ; -

1. సంకల్ప వికల్పములు లేని స్థితి (అమనస్క స్థితి) –

2. ప్రవృత్తులు – ప్రకృతి వికృతుల సంపర్కము లేక –

3. త్రిపుటి – త్రిదశ – త్రివిధ అవస్థలు – త్రిగుణాతీత స్థితి – కాలము ఏక ప్రవాహం.

4. షడ్భావ వికారములు లేవు.

5. అపరిచ్ఛిన్నుఁడైన – తురీయాస్థితుఁడై – సర్వవ్యాపక – అఖండ – అద్వితీయ – నిత్య – నిర్గుణ – నిరాకార – నిర్మల – నిస్సంగ – నిష్క్రియాపరుఁడగు – సచ్చిదానంద శుద్ధ చైతన్య స్వస్వరూపుఁడగును.

శ్లో|| నా భుక్తం క్షీయతే కర్మ, కల్పకోటి శతైరపి
అవశ్యమను భోక్తవ్యం కృతం కర్మ శుభా శుభమ్

తా|| కల్ప కల్పాంతరముల నుండి – అనాదిగా ఆర్జిస్తూ వచ్చినట్టి కర్మ "పుణ్యా పాప" ఫలచయానుభవం జన్మ జన్మాంతరముల కైనను తప్పదు. కాని – "జ్ఞానాగ్నినా సంచితం (తత్వ జ్ఞానేన సంచితం) అన్నట్లు – సర్వ గ్రంధులు జ్ఞానాగ్ని కణము చే దగ్ధమగును. ఇది ప్రమాణ వాక్యము.

శ్లో|| భిద్యతే హృదయ గ్రంధి శ్చిద్యం తే సర్వ సంశయాః |
క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే ||

-- ముండకోపనిషత్. 2. 2. 18.

"అజ్ఞాన ప్రభవం సర్వం – జ్ఞానేన ప్రవిలీయతే"

గురు భోధ చే అజ్ఞానావరణాది మోహ – వాసన – సంసార బంధ భ్రాంతులు విచ్ఛిన్నమై స్వస్వరూప జ్ఞానానుభూతి ప్రకాశించును.

అత్మానాత్మ విచార పరమగు ధ్యాన యోగ జనిత జ్ఞానాగ్ని ప్రజ్వలించి – జ్ఞాన జ్యోతి అనగా ఆత్మైక్యభోధ ప్రకాశము వల్ల సమస్త కర్మలు "భర్జిత బీజ న్యాయము వలె" దగ్ధమగును.

కల నుండి మేల్కొన్న వానికి, జాగ్రత స్థితి లో స్వప్నాను భవం కల్ల గా తోచునట్లు, సత్య జ్ఞానానుభవికి. (ఆత్మ జ్ఞానాను భవునకు) ద్వైత భావము అంతరించి, (త్రిపుటి –త్రిదశ మొ|| ) – అనగా "భోక్తృ – భోగ్య –భోగాదులు" అనెడి బుద్ధి – అత్యాశ్చర్యమున మాయమై – "మృగ తృష్ణ – గగన కుసుమము – గంధర్వ నగరము – వంధ్యా పుత్రుడు - - - " వలె మనోఇంద్రియ కృత యింద్రజాల వైపరీత్య కృత మత్యంతాశ్చర్యముగ – స్పష్టముగాదృశ్య మగును.

జాగ్రతలో స్వప్నము కాన్పింపదు.

వెలుగులో చీకటి కనఁబడదు.

జ్ఞాన స్థితిలో మాయాజాలము మన జాలదు.

త్రిపుటి –ద్వైత – మనోమయ స్థితిలోనే ద్వంద్వాదుల తాకిడి – తథ్యము.

కోపంతో కోపాన్ని శమింపఁజేయ లేము. ఓర్పు సహనం కావాలి. అగ్నిని అగ్నితో ఆర్ప జాలము. నీరు కావాలి. దీనినే ప్రతి క్రియ అంటారు.

నిప్పున్న కట్టె కాలి దగ్ధమవుతుంది. బాధించిన హృదయం బాధ పడుతూంది. "యద్భావో తద్భవతి"

లోకంలో సర్వత్రా అశాంతి – దుఃఖం –ద్వేషం – విరక్తి - - - - స్పష్టంగా కాన్పించడం సర్వానుభవం. చాలామంది వ్యధితచిత్తులు – నిరాశా వాదులు – దుఃఖితులు – ఆర్తులు – క్షోభిత మానసులు – నానా బాధలఁజిక్కి అలమటించేవారు – రోగం – దరిద్రం – మరెన్నెన్నో యిడుములఁబడి - - - తెగించి ఆత్మ హత్యలకు పాలైన వారిని కూడా రోజూ చూస్తున్నాముః కారణం?? తన స్వస్వరూపమును మఱచి – అద్వైత బుద్ధి అంతరించి - "ద్వంద్వములఁజిక్కి" (దేహాత్మ బుద్ధి) – నందుననే!! స్వస్వరూపానుభూతితో "ఆత్మ సాక్షిత్వము శేషించి ప్రకాశించును" – ఇదియే యోగ జ్ఞాన పరమావధి.

"ఐహికాదర్శము కన్నా – ఆధ్యాత్మికాదర్శం గొప్పది" –

"ప్రేమ రహిత హృదయాలు క్రూర రాక్షస గుహాంతరాలు – ప్రేమే దైవము – దైవ మే ప్రేమ"- ప్రేమ – దయ – కరుణ – స్నేహము – లోక హితత్వాదులు మంగళకరమైన దైవిక గుణములు – దివా కాంతి లేని లోక మంతా ఒక చీకటి పేటిక – ఆనంద రహిత జీవిత మొక విషాద మృత్యు వాటిక.

-- ఒక భావ కవి.

సత్య జ్ఞానము (ఆత్మ తత్వానుభూతి) – వాసనామయ (సంచిత కర్మ) మహారణ్యమునకు – గడ్డి పర్వతమునకు – అగ్ని కణము వంటిది: ఇదియే సమాధి ఫలము, కేవలం భౌతిక (దేహ) స్థిరత్వం సమాధి కాజాలదు.

"మణి" ఇచ్ఛారహితమై యుండినను దాని నుండి అప్రయత్నముగ సహజ కాంతి (ప్రభ) ప్రకటితమగు నట్లు, పరతత్వము "సత్తా" మాత్రమై యున్నను, తత్ప్రకాశమున ఈజగత్తంతయు స్పష్టముగా గోచరించును.

కావున ఆత్మ యందు
- (1) అకర్తృత్వము – ఇఛ్ఛ లేనిది కావున
- (2) కర్తృత్వము – సాన్నిధ్య ప్రభావము న యిది కర్తయు నైనున్నది –

అనగా –

(1) సామాన్య చైతన్య స్వరూపమున, ఆత్మ "అకర్త" –

(2) విశేష చైతన్య స్వరూపమున (అచేతనములను – సచేతనములుగ తన సాన్నిధ్య ప్రభావమున చేయుట వల్ల – "సాన్నిధ్య మాత్ర కర్త" గను, అని తాత్పర్యము.

ఉ|| సూర్య రశ్మి ప్రభావమున పద్మములు వికసించునట్లు –
అయస్కాంత సాన్నిధ్యమున ఇనుప ముక్కలు చలించునట్లు –
మణుల సామీప్యమున ప్రకాశము అవిర్భవించు నట్లు –
చంద్రుని కిరణముల స్పర్శతో చంద్ర కాంత శిలలు కరుగు నట్లు,
మంత్రుల ఆసరాలో – "పార్టీ – బంధు" అనుచరులు రాణించునట్లు,
మహాత్ముల సాన్నిధ్య ప్రభావమున లీలా తరంగ ప్రదర్శనమగు నట్లు–
పురుషుని సాన్నిధ్య ప్రభావమున - స్త్రీ (శక్తి) శక్తి వంతమై రాణించి – రంజించి, విజృంభించును –

'"భౌతిక తత్వానికి – ఆధ్యాత్మిక తత్వానికి" – గల పరస్పరసంబంధముతెలుసు కోవడమే వేదాంత శాస్త్రము యొక్క పరమావధి. నిష్క్రియాపర కర్తృత్వము.

(3) శరీరము (శవము) – మనస్సు కాదు – ఆత్మ కాదు – కేవలంపాంచ భౌతిక (స్థూల) జడము : అస్థిరం – నశ్వరం - -

చీకటికి - వెలుగు వలె

అవిద్యకు - విద్య వలె

అజ్ఞానమునకు - జ్ఞానము విరోధి.

నిప్పుకు నీరు వలె

కోపానికి ఓర్పు – క్రాంతికి శాంతి కావాలి.

విద్య సామర్థమున అవిద్య దూరమగును.

విద్య యెంత పరిపక్వమైన అవిద్య అంత సన్న గిల్లి మాయ మగును. విద్య సత్యమును చూపును. అవిద్య లేనిది కల్పించి చూపును. విద్య లేని వారు అజ్ఞానాంధకార పథమునఁబడి, అధోగతికి పోవుదురు. దానికి "తిరుగు – విరుగుడు" జ్ఞానం మినహా మరెద్దియు లేదు.

అవిద్యా స్వరూప వివరణము – ఉ||

- సర్వదా మార్పులు చెందుచున్నట్టి – "షడ్వికారి" యగు శరీరము "నేను" – అనుకొనుటయే "భ్రాంతి" – "అవిద్య"

- "తనకు" (ఆత్మకు) కుల – వర్ణ – వయో – రూపాదులున్న వనుకొనుట యే – "అవిద్య".

- అనిత్య – అసత్య – అశుచి – అమంగళ – కరమైన పాంచ భౌతిక (జడ – నశ్వర – మలిన –సంకుల) దేహమును, నిత్య – సత్య – నిర్మల – మంగళకర అమృతమయ ఆత్మగా భావించడమే "అవిద్య"

- కార్య కారణ – నిత్యా నిత్య – సత్యాసత్య – విమర్శల వల్లనే సత్య దర్శనమగును.

- పరమాత్మయే యేకైక సత్యమనియు – సర్వకారణ మనియు – వేరెద్దియు లేదనెడి దృఢ విశ్వాసమే "విద్య"

నిత్య నిరంతర (ఎడ తెరిపి లేని) – పై సత్య (ఆత్మ) చింతనము వల్ల – అనగా సమస్త స్థూల – సూక్ష్మ చింతలు – విస్మరింపఁబడి - - - - ఏకత్వ లక్ష్య సాధన ఫలము ప్రాప్తించును – ఇందులకు శుక (బ్రహ్మ) కైవల్య రహస్యోపనిషత్ – చతుర్వేద మహా వాక్యార్థ సాధనమే అనన్య శరణము --

జ్ఞాన దూరుడైన వానికి సహజ ప్రతి బంధకములు ; -

1. అజ్ఞానం (ఆవిద్య – భ్రాంతి)

2. అశ్రద్ధ – పురుష ప్రయత్నము లేమి. ఆసక్తి లేమి.
3. సంశయం – అవిశ్వాసం – ఇదే మనస్సు నకు క్షయ వ్యాధి వంటిది.
4. "భక్తి" – "వివేక వైరాగ్యా"దు లందు, ఆస్తికత్వము – లేదు.
5. "పంచ శీలములు" – "శుభ వాసనలు" – "శుభ ప్రారబ్ధం" – "ఈశ్వరానుగ్రహం" కొరత పడటం.

<u>ముఖ్యముగా బంధములు 2 విధములు</u> –

1. స్థూలం – దైహిక (దేహ) సంబంధమైన – ఇంద్రియ విషయాను భవేచ్ఛాదులు –
2. సూక్ష్మం – మానసిక (అంతఃకరణ) విషయానుభవ (వాసనామయ) – పూర్వ విషయానుభవ స్మరణాసక్త్యాదులు –

ముఖ్యంగా –

(1) శ్రవణమననాదుల సాయమున సత్య తత్వ నిశ్చయ బుద్ధి. (2) సంపూర్ణ – అకుంఠిత - దృఢ విశ్వాసం – తర్వాత – (3) ఏకైక అద్వైత స్థితి లక్ష్య చింతనం – (4) నిష్ఠ అనగా ప్రపంచ దూరమైన – నిర్విషయ – "ధ్యానము ' (ఉపరతి) సహజ స్థితి – స్వస్థితి – బ్రాహ్మీ స్థితి - - - - ఇదే ముముక్షుత్వ పరమావధి – (స్వత స్సిద్ధము) - - - మరియు క్రమముగా పంచ శీలముల ప్రగతి ⟶ ఇంద్రియ నిగ్రహం ⟶ జ్ఞానోదయం ⟶ అంతర్ముఖ దృష్టి ⟶ (ఆత్మావలోకనం) : ఉపరతి – శాంతి సుఖం ⟶ పరమానందం (జీవ బ్రహ్మైక్య – మోక్ష స్థితి) –

అన్నిటికి "అధ్యయనము + అనుష్టానము" జ్ఞానము + కర్మ కౌశలము (To know + Act) అత్యావసరము. జ్ఞానం + కర్మ ⟶ మోక్షం (సార్ధకత్వం).

"బ్రహ్మ భావంతో - అభావం స్ఫురించును. క్రమ – మనన నిధి ధ్యాసలతో – స్థిరాద్వైతం వృద్ధియై 1) మోక్ష మివ్వకున్న (ఈ జీవితం లోనే) – 2) జీవితాంత సమయం లోనోః 3) బ్రహ్మ లోకం లోనోః జీవన్ముక్తి 4) మరు జన్మ లోనో లేక విదేహ కైవల్యం తథ్యం – యోగి కి హఠాన్మరణం సంభవించినను మోక్షం తప్పదుః వేద జ్ఞానం "స్వప్న – సుషుప్తుల" తో నశించునా? మేల్కొన్నంత నే జ్ఞప్తికి వచ్చును : సద్గురూపదేశ – సచ్ఛాస్త్ర దృఢ అద్వైత (బ్రహ్మ) జ్ఞానం ఎన్నటికిని నశింపదు!!

"శ్రీ రాముఁడు చేసినట్లు చేయాలి"
"శ్రీ కృష్ణుఁడు చెప్పినట్లు నడచుకోవాలి" -- బుధ జన వాక్యం.

జ్ఞానము సంపాదించుటకు – సాధన చతుష్టయ సంపత్తి – (Four fold wealth) గల వాడే అధికారి!! అనగా,

"అధాతో బ్రహ్మ జిజ్ఞాసా" -- బ్రహ్మ సూత్రములు. అ. 1. భా. 1. సూ. 1.

అనగా వేదోక్త (శాస్త్రీయ) జీవితంలో – బ్రహ్మ చర్య – గార్హస్థ్య – ఆశ్రమముల పిదప వానప్రస్థాశ్రమమున – గురు సన్నిధానమున –ఆరణ్యాక భాగముల నభ్యసించి - - -తదుపరి – కడపటిది యగు "ఉపనిషద్భాగము – వేదాంత విద్య"కు అధికారి, అర్హుఁడగు ననియర్థము.

జ్ఞానమును - - - ఎవరికి వారు "వ్యాయామము – భోజనాదులు" శ్రమించి సాధించినట్లే - - క్రమ విధానమున సాధించ వలెను.

జీవాత్మ యొక్క కళ దేహాత్మ యనఁబడును. రూప నామ, వర్ణ, వయో నిర్ణయాదులు "ఈ తాత్కాలిక పార్థివ దేహమునకే. పూర్వ జన్మలందలి జ్ఞాన సముపార్జనాది సంస్కారములు విలువ గలవి.

వేదాంత సిద్ధాంత గ్రంధమునకు 4 అనుబంధములు గలవు }
అధికారి (1)
సంబంధము (2)
విషయము (3)
ప్రయోజనము (4)

స్థూల దేహ దోషములు – వాత, పిత్త, కఫములని 3 దోషములు –

సూక్ష్మ దేహము (అంతఃకరణ చతుష్టయ) దోషములు } మలము, విక్షేపము, ఆవరణము } అరిషడ్వర్గములు - + త్రిగుణ దశ, అవస్థాది త్రిపుటములన్నియును.

ఆత్మ జ్ఞాన సముపార్జనమే వివేక జీవిత పర మార్ధ లక్ష్యము – క్షేత్ర క్షేత్రజ్ఞ (నిత్యానిత్య) విమర్శ జ్ఞానమే ముక్తి సాధనకు మూల ప్రాతిపదిక. ముక్తి సాధనమున కింకొక సాధిష్ఠమగు సులభ తర మార్గమింకొక్కటి లేదేమో?

భగవద్దూరులగు పాపులు ; - (జీవ చెర)

1. వేదాంత వాసనలు లేనివారు.
2. వినియు అర్థము గాని – తెలుసుకోనిచ్ఛగించని వారు.
3. అవిశ్వాసులు – భగద్విషయము పట్ల ద్వేషాసూయలు గలవారు.

4. అన్నీ విని – బాగా తెలిసి – వాద ప్రతివాద ప్రియత్వమునకులోనై – తాము బాగు పడక – సామాన్యులైన ఆస్తికుల విశ్వాసమును సహా పాడు చేయ ప్రయత్నించు వారు.

మోహ నాశమే మోక్షము

మోహ రోగ నివృత్యర్థమే "ప్రస్థాన త్రయం" ఆవశ్యకత, అనగా – "ఉపనిషత్తులు – బ్రహ్మ సూత్రములు – గీతామృత సేవనం" – ("మోహ కారణం అజ్ఞానం" – అజ్ఞానమే ప్రపంచేంద్రజాలం - - - అనగా, నానా రూప – నామ జనిత సమస్త దృశ్యజాలం - - - "ద్వైత మివ భవతి" - - స్త్రీ పురుష భేధ రహితుఁడైన వాడు "పురుషు"డొక్కడే.)

సృష్టికి మూల భూతమైన సత్పదార్థము – తర్క ప్రజ్ఞ – కుశాగ్రబుద్ధి కౌశలము – గ్రంథ జ్ఞానముల కందనట్టి ఉత్తమోత్తమ పరమ సత్యముగా గ్రహింపదగు దివ్యాను భూతి – "ప్రజ్ఞానం బ్రహ్మ". –

"సర్వం తానే" ననెడి అపరోక్షానుభూతి నందిన అద్వైతికి కోర్కెలెక్కడివి? కోర్కెలు ద్వైత వికారంః "అంతా తానె యై – తను గానిది లేదనెడి" సత్య జ్ఞానానుభవి – ద్వంద్వాతీతుఁడు - - - సర్వార్థ సిద్ధుడు!!.

సముద్రంలో ముంచిన ఘటం (నీరు నిండినది) – అందు మునిగి ఐక్యమై తన్ను తానే మరచును. బ్రహ్మ జ్ఞానికి కర్మ కాండల యావశ్యకత – ప్రయోజనం లేకున్నను, లోకాదర్శకంగాను – లోక సంగ్రహార్థము గాను, ఆచరించడంలో దోషం లేదు! లోక కల్యాణ మే వారి యిచ్ఛ! వారు విదేహులు – నిత్య తృప్తులు – ధన్య చరితులు – సర్వాతీతులు - - -

-- కేవలం "కర్మ – భక్తి" – పరిమిత ఫలదాయకమైనందున పునర్జన్మను తప్పింపఁజాలవు.

-- జ్ఞానం – సర్వోత్తమం. మోక్ష ఫల ప్రదాయని. ముక్తి కరతలామలకం.

బ్రహ్మ తత్వ విచార పరుఁడు (పండని వాఁడు) త్రివిధ – ప్రతి బంధకముల వల్ల చెడి మరు జన్మమున, స్వర్గాది దివ్య భోగము లనుభవించి – జనక – కేకయ, అశ్వపతి, మహారాజుల వలెగాని, అథవా – నిస్పృహులైన యోగుల కులమందు గాని, శుకుడు, ధ్రువుడు, శ్రీ రామ కృష్ణ పరమ హంస, పిండీ నగర స్వాముల (శ్యామ దాసు, రామ సముద్రము) వలె జన్మింతురుః ఇది అత్యంత దుర్లభమైనది.

శ్లో|| ప్రాప్యపుణ్యకృతాన్ లోకా నుషిత్వా శాశ్వతీస్సమాః
శుచీనాం శ్రీమతాంగేహే యోగభ్రష్టోఽ భిజాయతే||

తా|| యోగ భ్రష్టుడు పుణ్యలోకములలొ కొన్ని సంవత్సరములుండి అనంతరమున ఆచారము, ఐశ్వర్యము గల వారియింట్లో పుట్టును.

శ్లో|| అథవా యోగినా మేవ కులే భవతి ధీమతామ్
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ య దీదృశమ్ ||

తా|| కాదా? బుద్ధిమంతులగు యోగులయిండ్లలో బుట్టును. ఇట్టి జన్మము కోటి మందిలో ఎవరికో యొకరికే లభ్యమగును : అందఱకు దొరకదు.

-- భగవద్గీత. అ. 6. శ్లో. 41 – 42.

కావున, యోగ ఫలంపూర్తి గాని (భ్రష్టుడైన) సాధకుఁడు ఎన్నిటికిని చెడడు : సాధించినంతవరకు ఫలము దక్కును. పరీక్షలు దప్పిన వారు తిరిగి పరీక్షింపఁబడి ఉత్తీర్ణులగుదురు.

ముముక్షువు ముక్తి నందకున్న పునర్జన్మ తప్పదు. ఏ భాగము లోటున్న అది పూర్తి చేసిన చాలును. ఆత్మ విద్య – ఆత్మ జ్ఞానము – (ఎఱుక) ఇతర విద్యల వలె గాక – ఆత్మ ను వీడి యుండ జాలవు. దీనినే సత్సంస్కార మందురు. పూర్వాభ్యాసములు బలీయమలై వాని నాకర్షించును.

అజ్ఞానాంధకారమును బాపి జ్ఞాన జ్యోతిని వెలిగించునదే జ్ఞానము.

జ్ఞానము – సామాన్య స్ఫురణ – పరమాత్మను తెలుసుకొను జ్ఞానము.

విజ్ఞానము – విశిష్ట (శాస్త్రజ్ఞ్య) జ్ఞానము, పరమాత్మ – జీవాత్మ లొక్కటేనని తెలుసుకొనుట.

ప్రజ్ఞానము – అనుభవ (బ్రహ్మ) జ్ఞానము – "ప్రజ్ఞానం బ్రహ్మ" అద్వైతానుభవ జ్ఞానము. ఇదే మానసిక వృత్తుల నెఱెంగిడి సాక్షి – ఎఱుక – త్రికాలా (త్రిఅవస్థా) తీత మైన కూటస్థ సాక్షి –(ద్రష్ట) –

శాస్త్ర జ్ఞానము – అనుభవ జ్ఞానము రెండును గల ఆచార్యోపాసన సాధకునకత్యవసరము. దూడను చూచి వాత్సల్యమున ఆవు చేపును. శుశ్రూష – సరళ భాషణ – కార్యాచరణ శక్తి – సుశిక్షణ – గల శిష్యునిఁజూచి నిజ గురు దేవుడు "ఆత్మానుభవ జ్ఞానమును" స్రవింపఁ జేయును.

అభిమానము – అవిధేయత – అహంకారము – గురుని పరీక్షించి ప్రశ్నింప సంకల్పించు బుద్ధి గలవారు గురు అనుగ్రహమునకు అర్హులు గారు.

వాచా వేదాంతము – శుష్క గ్రంథ జ్ఞానము వాదోపవాదములకు పనికి వచ్చునే గాని, తరణ సాధన కాదు. పుస్తక జ్ఞానమున కన్న మస్తక జ్ఞానము గొప్పది.

గురు పీఠమునకు – శాస్త్ర జ్ఞానము + అనుభవ జ్ఞానము + ఆచరణ ముఖ్యము.

శాస్త్ర జ్ఞానము లేని వాడు – గ్రుడ్డివాడు.

అనుభవ జ్ఞానము లేని వాడు – కుంటి వాడు.

లోభి గురువు – సోమరి శిష్యుడు ⟶ కలసి నరకానికి వెళ్ళుదురు.

-- తులసీ దాసు.

గురువులు –శిష్యుల విత్తాపహారులు కారాదు. శిష్యుల హృత్తాపహారులు గావలెను.

గురువులు బరువులు కారు. -- --

గురు గీత

బోధ గురువుల కన్న బాధ గురువులు మెండు.

మహాత్ములు – పరుస వేదులు – వారి సాన్నిధ్య – అనుగ్రహ దృష్టి – స్పర్శ – ఆశీర్వాదము – సంభాషణాదులు – మహా పాపులను పునీతులఁ జేసి తరింపఁ జేయును. గురు పుత్రులు వర పుత్రులగుదురు. జీవుఁడు దేవుడగును.

ఉ|| వాల్మీకి - నారదుని వల్ల
శతాంగుళీకుఁడు - బుద్ధుని వల్ల
జగాయ్ మదాయ్ లు - గౌరాంగ ప్రభువు వల్ల
గిరీష్ చంద్రఘోష్ - శ్రీ రామ కృష్ణ పరమ హంస వల్ల
నామ దేవ్ - జ్ఞాన దేవ్ వల్లను
వేమన - తన గురు దేవుని వల్ల

పాపులు పావను లైరి. భోగులు యోగులైరి. వివేక – వైరాగ్య – భోధోపరతులు – శాస్త్ర – సజ్జన సహవాస – తపో – జప – శమ దమాదుల చే . . . . ప్రజ్ఞాభివృద్ధి అపరోక్షానుభూతి ప్రాప్తించును.

"శాస్త్రతో గురుతశ్చైవ స్వతశ్చైవ త్రిసిద్ధయః"

తా|| "శాస్త్ర జ్ఞానము – గురు వాక్యము – స్వానుభవము" -

పై మూడున్ను జ్ఞాన సిద్ధికి మూలము.

-- యోగ వాశిష్టము.

<u>అను గ్రహ మూర్తుల --</u>

-- కరుణార్ద్ర దృష్టి చేతను

-- సాన్నిధ్య – సంకల్ప – అనుగ్రహముల చేతను.

-- పాద స్పర్శ – శుశ్రూష – ప్రశ్నాదికముల చేతను

-- సత్కర్మ – సదాచారము – మాతా పితృ గురు దేవారాధన – భక్తి – సత్సాంగత్యాది పంచ శీలములు – జ్ఞాన సముపార్జనమునకును – మోక్ష ప్రసాదమునకు సహకరించును.

మోక్ష ద్వారమునకు – నల్వురు ద్వార పాలకులు.

1. శమ దమాదులు 2. విచారణ 3. సంతోషము 4. సత్సంగం.

ఇందు ఏ ఒక్కటి సంపూర్ణముగ లభించెనా, తదితరములు కరతలామలకం.

చతుర్విధ తరణోపాయములు : 1. కర్మ 2. భక్తి 3. జ్ఞానము 4. యోగము.

"వేదాంత విజ్ఞాన మనిశ్చితాః" (తైత్తరీయం)

– అట్టివానికి బ్రహ్మ లోకమున – తదనంతరం – విదేహ కైవల్య ప్రాప్తి . . . .

కాని, కొందరికి విచారణాసక్తి కూడా లభించదు. విచార శక్తి – విజ్ఞాన సంపద – గురు శాస్త్ర వాక్యాదులందు శ్రద్ధాభక్త్యాసక్తులు - - తదను గుణ శుభ పరిస్థితులు లభించనప్పుడు "ఉపాసన (భక్తి – ఆరాధనా విధములు) అవసరముః

పురుష ప్రయత్నమే – పరమేశ్వర ప్రయత్నము – సిద్ధి నందిన (జ్ఞానముతో పండిన – అచార్య శేఖరులు) పరమ గురు "హస్త మస్తక" సంయోగముతో – అపరోక్షాను భూతి అత్యాశ్చర్యముగ" మంత్ర శక్తి ప్రాయముగ – ప్రాప్తించును. మహాత్ములు పరుస వేదులు గదా!!

సత్యాన్వేషి యగు సాధకునకు "దుఃఖము – భయము – దైన్యము – నిరాశ – నిరుత్సాహము – సంశయము – - - అనవసరంః పై వన్నియు జ్ఞానాటంకములు. సాధకునికి శత్రు వర్గము : ప్రగతికి ప్రతి బంధములుః

"భ్రమర కీటక న్యాయ వత్" – యోగ సాధకుడు, నిత్య నిరంతర బ్రహ్మో భ్యాస మొనర్పఁదగును. ఆత్మ యందు ప్రణవమును చేర్చి ధ్యానించుట వలన "భగవత్సాక్షాత్కార ప్రాప్తి" తథ్యము.

"ఆత్మ లేకుండిన శరీరము లేనట్లు"- జ్ఞాని లేకున్న నేనుండ జాలననియు, నన్ను తప్ప మరెద్దియు జ్ఞానులపేక్షింపరనియు – కావున – వారుత్తములు – ప్రియతములు – వారికి నాకు భేదము లేదనియు" – "వారిలో నేను – నాలో వారు" తుదకు ఇద్దరము ఒక్కటే – అద్వైత సిద్ధాంతము – భగవద్గీత.

-- హరనాథ్ –

i. సాధన చతుష్టయము – సాధన చతుష్టయ సంపత్తి.

ii. పంచకోశ విమర్శ – దీనినే భార్గవీ వారుణీ విద్య అందురు. అనగా వరుణుడు పుత్రుఁడైన భృగువునకు సంవాద (ప్రశ్నోత్తర) రూపమున భోధించిన – సుప్రసిద్ధ సాంప్రదాయము.

iii. సచ్చిదానంద స్వరూపనిర్ణయము – వేదాంత పంచదశి (15 అధ్యాయములు, సత్ + చిత్ + ఆనందములని) ( 5 + 5 + 5 = 15 )

iv. "నేతి – నేతి" న్యాయము – 'నే నెవ్వరు ?" - భగవాన్ శ్రీ రమణ మహర్షి.

v. సప్త భూమికలు - జ్ఞాన సోపానములు --- జ్ఞానవాశిష్టము

vi. సాంఖ్య – తారక – అమనస్క – రాజయోగ పథము.

-- శ్రీ సీతారామాంజనేయము.

vii. అష్టాంగయోగము – మరియు హఠము – లయము.

-- పతంజలి

బ్రహ్మ విద్య నశింపదు. బ్రహ్మ వలె అవినాశి. తదితర దేహ భౌతిక విద్యలు – దేహాంతముతో నశించి, సంస్కారములు మాత్రము మరు జన్మమున శేషించి యుండును. కాని, ఆత్మ విద్య యప్పటి కప్పుడు జన్మ జన్మము నందును, పూర్తిగా ప్రతిఫలించి, ప్రజ్వలించి, ప్రకాశించి, ప్రగతింగాంచును.

యోగ పథ సాధనము సంపూర్తిగా గతించని వాడు అనగా యోగ సాధనల మధ్య "పతితుడైన వాడు" - యోగ భ్రష్టుఁడనుకో బడినవాఁడు. - - - సత్ప్రయత్నము పూర్తిగాకుండిన - - - మరు జన్మమున - -

1. శుచీనాం శ్రీమతాం గేహే.

2. అథవా యోగి నా మేవ కులే భవతి ధీమతాం. . . . .

సుకృత – శుభ – భద్ర – జన్మలే ప్రాప్తిస్తాయి. "వివేక భ్రష్ట సంపాతముల్ గావు" : యధాలాభం.

నిర్గుణో పాసన మీ జన్మమున బ్రహ్మ సాక్షాత్కార మివ్వకున్న

1. మరణ కాలమందు గాని –

2. జన్మాంతరమందు గాని –

3. బ్రహ్మ లోకమందు గాని , ఫల మిచ్చి మోక్షమొసంగును.

-- వేదాంత పంచదశి.

యోగ భ్రష్టునకు ప్రతిబంధకములు వీడిన గాని మోక్షము (ఆత్మ సాక్షాత్కారము) లేదు. బ్రహ్మ తత్వ విచారపరుఁడు ప్రతిబంధముల కారణమున బ్రహ్మ సాక్షాత్కారము లభించక. మరు జన్మమున (స్వర్గాది సుఖానుభవానంతరము) – శుభ – శ్రీమంత – యోగి గృహములందు జనించి, పవిత్ర వాతావరణమునందు – పరి పూర్ణతను (ప్రగతిని) గాంచును.

తన ప్రయత్నము లేకనే పూర్వాభ్యాసము వల్ల తత్వ జ్ఞానము వైపు ఆకర్షింపఁబడి, అనేక జన్మ సంస్కార సంసిద్ధుఁడై కైవల్య పదవిఁ గాంచును. సంస్కారములన వాసనలు – వీటి బలము వల్లనే మనఃప్రవృత్తులుత్పన్నమగును. మరియు స్వప్నము లందు పూర్వ జన్మ సంస్కార స్మృతులు ద్యోతమగును.

సమాధి – సుషుప్తి – మూర్ఛలందు త్రిపుటి లేదు. అనగా ద్వైతము లేదు. కావున పై అవస్థ లందు పరిపూర్ణ బ్రహ్మమే ప్రకాశించును. ఇచ్చట విద్వదనుభవము కొరకు సమాధి స్థితియు – సామాన్యుల అనుభమునకై "మూర్ఛ – సుషుప్తులు" చెప్పఁబడినవి.

కేవలం శాస్త్ర జ్ఞానం – శాస్త్ర వాసన –<br>
వాచాలత్వ – వాద ప్రతివాద పటిమ - } పరోక్షం

సద్గురూపదేశ పర బ్రహ్మా భ్యాసఫలిత<br>
అపరోక్షాను భూతి – బ్రహ్మ సాక్షాత్కారము. } అపరోక్షం –

శ్లో|| ఏతాం విభూతిం యోగంచ మమ యోవేత్తి తత్త్వతః|
సో వికంపేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః ||

తా|| నా సంగతిని నతత్వమును చక్కగ గ్రహించినవాడు నన్ను వదల లేడు నా యంత వాడు తానగుటకు ప్రయత్నించును; సందియము లేదు.

-- భగవద్గీత. అ. 10. శ్లో. 7.

"నాసంగతి – నా గొప్ప తనం – నా పూర్ణత్వం – భాగా గ్రహించు వాడు, నన్ను వదల లేడు – తాను నా యంత వాడగుటకు ప్రయత్నించి కృత కృత్యుడగుట తథ్యము!!

"యథా నద్యస్స్యందమానా సముద్రేఽస్తంగచ్ఛన్తి |
నామ రూపే విహాయ ||

అనగా నదులు తమ నామ రూపములను వీడి సముద్ర మై పోవు రీతిని, అవిద్యా సంబంధ సమస్త నామ రూప జగత్తు నశించి – అఖండ తేజో విలాసమే నిల్చును.

"అస్తి, భాతి, ప్రియం, రూపం, నామ, చేత్యంశ పంచకం |
జగ ద్రూపం తదోద్యయం" - అనగా జగద్రూపము పోయి అఖండ అనంత సచ్చిదానంద బ్రహ్మ మేకైక రూపము నిల్చును :

వేదాంత పరమా వధి ఇదే !!

జ్ఞాన సిద్ధికై, చతుర్విధ సాధన సంపన్నుఁడైన అధికారి – శుభమును కోరి విచారింప వలెను. విచారము లేకున్న జ్ఞాన ప్రకాశం లేదు – సత్య వస్తు దర్శనానుభవం దుర్లభం. ఇందుకు భావార్థ సహిత "చతుర్వేద మహా వాక్యముల నిత్య నిరంతర స్మరణయే – మోక్ష సాధన విధానం.

మోక్ష కామిత్వము – ముముక్షత్వం – స్వార్థపరం కాకూడదు. తాము తరించుటే గాక యితరులను గూడా బంధ విముక్తులను జేసి లోకోద్ధరణ కై – లోక కల్యాణమునకై – తమ దివ్య ప్రేమ వాహినిని – (హృదయ గ్రంధులు తెరుచుకొన్న ) - - పరిధులు మీరి విశ్వమయమై "పాపులను – పావనులుగా" చేయుటే - - మానవుఁడు చేయవలసిన మాధవ సేవ!! పరహిత సేవకు మించిన మోక్ష సాధన మరొక్కటి లేదు. ఇందు – కర్మ – భక్తి – జ్ఞాన యోగము లన్నియు విలీనము.

-- స్వామి వివేకానంద.

"వివేక వైరాగ్య బోధోపరతుల వల్ల" – బ్రహ్మ జ్ఞాని – పూర్వా భ్యాసము వల్ల – రంగ స్థల నటుని వలె, తన తటస్థ సాక్షిత్వమును బాగా గ్రహించిన వాడగుట వలన – జగన్నాటక రంగమున (ప్రపంచ జీవన మున) నటించును. గతించిన కాలము – ప్రాయము – అనుభవము తిరిగిరావు: కాల స్రవంతికి వెనుకంజ లేదు. ప్రియాతి ప్రియ మైన వారందరును పోవు చున్నారు. "జాతస్య మరణం ధ్రువం" –

షరా :- అభ్యాస వైరాగ్య ఉపరతులుండిన్ని , తత్వ జ్ఞానం లేకున్న మోక్షం లేదు. కాని, తత్వ జ్ఞానముండి, పై అభ్యాస వైరాగ్య భోగోపరతులు లేకుండినను, మోక్షం తథ్యం. కాని, ప్రారబ్ధవశమున జీవన్ముక్తి సుఖము కలుగదు.

-- వేదాంత పంచ దశి.

వస్తు తత్వము తెలియుటకు వేదాంత విచారమవసరము. సత్య జ్ఞానా నందము – బ్రాహ్మీ స్థితికి – వేదాంత మే పట్టుకొమ్మ. ఆశ – కామాదులు, వదలిన బ్రహ్మ జ్ఞానము – విషయముల పట్ల విముఖులు – మోక్షార్హులు. కాని యీ "ఆయువు – బుద్ధి" చాలునా?

సద్వస్తు స్వరూప నిర్ణయము, విజ్ఞాన వేత్త లైన వేద ద్రష్టలు, తత్వ దృష్టితో పరిశీలన మొనర్చి ఆత్మ స్వరూప మే నని నమ్మిరి –

తత్వ దృష్టి <
- బాహ్య – ప్రకృతి సౌరభ్యము
- అభ్యంతర – ఆత్మ చింతనము

జ్ఞాని – ముకుళిత నేత్రుడై ఆత్మ దర్శనాపేక్షతో తనలోనే ఆత్మను దర్శించెను. - - -"ఆత్మానుభూతి నొందెను". _

శాస్త్ర జ్ఞానము
గురు భోధ

పురుష (స్వ) ప్రయత్నము మొ|| సాధన విధానాలతో, అంతరంగమందలి దివ్య జ్వాలా రూపమును ప్రజ్వలించి, ప్రకాశించు "ప్రత్యగాత్మ" ను గాంచ నగును.

మానవుని లోని అంతరాత్మ ప్రపంచము నందలి సర్వ సౌందర్యములం జూపగల మూల యంత్రము.

సత్యము ప్రతిఫలించు హృదయాకాశమే (హృదయ కుహరము – దహరాకాశము – సూక్ష్మ హృదయము) – ప్రసన్నకాసారము, మానస సరోవిహారము . .

. వెండి కొండల లోని జీవనము (మేరు నిలయము) – నటరాజ తాండవ దృశ్య వైభవముః - దివ్యానంద మేళా; శివ పార్వతుల కల్యాణోత్సవం – కామేశ్వరీ కామేశ్వరుల (అర్ధ నారీశ్వర తత్త్వము) – జీవ బ్రహ్మైక్యము –
హృదయ కుహరమే – ఆత్మ సింహాసనము, దేహ దేవాలయ గర్భ గుడి – పర బ్రహ్మ కళ్యాణ పీఠము -

ఆత్మ చింతన చేయని వాడు ఆత్మ ద్రోహి – బ్రహ్మ తత్త్వ దూరుడైన వాడు "బ్రహ్మహత్యా" పాతకుఁడన వచ్చును. (బ్రహ్మ శాశ్వతుఁడే). అనశ్వర దేహ పోషణ – రక్షణ – శృంగార – సుఖ భోగ ప్రమత్తుఁడై, శాశ్వతమైన ఆత్మ పరిశ్రమ, అన్నిటికన్నా గొప్పది. సర్వ శుభ ప్రదమైన దానిని మరచి పోవు బహు జనాళి, సమ్మోహిత ప్రమాద పతన విధానము మహత్ముల నాశ్చర్య చకితులఁ జేయుట సహజము.

తన్ను తానెరుగక – "నా దేహమే నే నని" భ్రమసి, భోగియై, ఇంద్రియ బానిస (లోలుడు) – సౌందర్య పిపాసియై - - - - తుదకు శవారాధకుడు – భౌతిక పూజారి – అగ్ని కాహుతియై ధగ్ధమగు కళేబరమును గాంచి - - - ప్రశ్చాత్తాపతప్తుఁడగు "జీవుఁడు" – దీనాతి దీనుడైన ఫకీరు – నిర్వాసి, నిజంగా సానుభూతికి అర్హుడైన అనాథ! ఉత్తమోత్తమ జన్మ మెత్తిన మానవుఁడు బుద్ధితో సత్య జ్ఞాన మార్జించి, తరించుట శ్రేయోదాయకముః

తరణ సాధనలు (3) : -

1. "స్వ" – లేక – పురుష ప్రయత్నము.
2. శాస్త్ర సహాయము.
3. గురు భోధ.

కాని, వీటి కనుగుణంగా సహకరించగల శుభ ప్రారబ్ధము, భగవత్కరుణ అనుల్లంఘనీయము.

ప్రతి ప్రయత్నమునకు – సాధనకు, నిర్మాణమునకు, జడ పదార్థమే సాధన సామగ్రి (అనగా ఉపాధులు): చైతన్య (జ్ఞాన) శక్తి రెండవది (నిర్మాత).

ప్రకృతి – శక్తులకు స్వతః ప్రత్యేక నిర్మాణ శక్తి లేదు. ఇది "పంగ్వంధ" సంబంధ సదృశము. కావున, ఈ అనంత, అద్భుత, చిత్ర విచిత్ర - చేతనాచేతన సృష్టికి, మహాశక్తిమంతుడు, అద్వితీయ నిర్మాత (శిల్పి) . . . అవసరం గదా!

పండితులు, ఆత్మ వేత్తలు ఈతనినే "దేవు౹డ" ని, భగవంతు౹డని, ఈశ్వరు౹డని పిల్చు చున్నారు.

మానవు౹డు కూడాకేవలం జడం కాదు. మానవుని యందలి తెలివి కూడా ఈశ్వర స్వరూపమే. –

శ్లో|| "మమై వాంశో జీవ లోకే జీవభూత స్సనాతనః
మనష్షష్ఠా నీంద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి

తా|| జీవాత్మ లన్నియు నాయంశములే. ఇవి జ్ఞానేంద్రియములను మనస్సును
ఆకర్షించి లాగుచున్నవి.

-- భగవద్గీత. అ. 15. శ్లో. 7.

"నా యంశయే అనాదిగా జీవుడై వెలసి నాడని - - - " శ్రీ గీతా ప్రవచనము కనుక –

"భగవంతు౹డు సృష్టి కర్త"

ఇక ఆజీవుల ఉనికి – గమ్య స్థానము - - ఎట్లు? ఎప్పుడు? ఏ విధంగా? - - - అనే నా నా యక్ష ప్రశ్న లుత్పన్న మగుట సహజము – సర్వ సామాన్యముగా తోచును. ఈ లాంటి ప్రశ్నలత్యంత వింతయై తాత్విక రహస్యములకు ముడి పడి యున్నవి. దేవుడు జీవుడై దేహాత్మ బుద్ధికి దిగ జారి, స్వ స్వరూపము మరుగు పడి (మరచి పోయి) – మాయా మోహితు౹డై "తాను దేహమని - నశించు వాడనని" భ్రమ౹జెంది, భయ పడి – కడపట తన నిజ అమృతత్వ – అమరత్వ – సత్య స్వరూప జ్ఞానమును బడయు వరకు, సత్యాన్వేషణ సాగుచునే యుండును. ఇదే ప్రథమ లక్ష్యము. ఇదే "సత్" అన్వేషణ.

సత్యాన్వేషణకు జ్ఞానము మూలము. పూర్ణ జ్ఞాన మే దాని పరమా వధి. అంతవరకు అన్వేషణ మాగదు. విరామ విశ్రాంతు లుండవు. పర్వతముల మీద వర్షించిన జలం తిరిగి తమ జన్మస్థానమగు సాగర గర్భము౹ జేరు వరకు ఆగదు. శాంతి – నిలకడ – తృప్తి – లేదుః కొండలు, గుట్టలు, చెట్లు, పుట్టలు చుట్టి, రేయనక పగలనక పరువులు దీసి, సెలయేళ్ళు నదులై – మహా ప్రవాహములై మాతృ సాగరమున చేరి విశ్రాంతి౹ జెందును. ఇదే "జ్ఞానము" – 'చిత్" (2) ద్వితీయ లక్ష్యము.

"దుఃఖ నివృత్తి – ఆనంద ప్రాప్తి" – సుఖము అందరికిని అభిలషణీయముః ప్రతి ప్రాణియు సుఖమునే కోరునుః దుఃఖమును భరించక –

గర్వించుట సహజము. ఆనందాన్వేషణము – సుఖాపేక్ష – భోగ వాంఛలు సర్వులు అభిలషించడం సర్వానుభవం.

ప్రతి ప్రాణి దుఃఖమును నిరసించి – సుఖము – ఆనందము నకై అర్రులు జాచి, ప్రాకులాడును – పరువులు దీయును. అవివేకులు – అల్పులు – అజ్ఞానులున్ను క్షణిక, ఖండ, తుచ్ఛ ప్రాపంచక సుఖ భోగములకై ఆశించి, ఆనందింతురు.

ప్రాజ్ఞులు – జ్ఞానులు – సత్యజ్ఞానాంద ప్రియులు, భౌతిక (లౌకిక) వాంఛల నభిలషింపక, దివ్యానుభూతి, అఖండానంద ప్రాప్తికై, తపించి, తరింతురు. ఎందుకు? "జీవు(డు ఆనందమయుడు – ఆనంద ప్రియుడు, ఆనందస్వరూపు(డుః ఇదే తృతీయ లక్ష్యము (3). "ఆనంద ప్రాప్తి" –

(1) – (2) – (3) - సత్ + చిత్ + ఆనంద స్వరూప వివరణమిదియే?

"భగవంతు(డు సచ్చిదానంద స్వరూపుడు గదా!!

"సత్యం -- శివం -- సుందరం"

బ్రహ్మాభ్యాసి, బ్రహ్మ నిష్ఠాపరు(డు, అమరత్వము – అమృతత్వమును( బొందును.

వేదాధ్యయనము, వేదోక్త యజ్ఞ కర్మా చరణము, దాన ధర్మములు, తపస్సు (ఇంద్రియములను, ఇంద్రియాధిష్ఠాన మనస్సును తపింప( జేయుట) – త్యాగము, తీవ్ర తర సాధనలు, శాస్త్రీయ కర్మ ప్రియత్వం – కల్గి యుండుట – అనగా - - - కోర్కెలు, ఇచ్ఛలు, విషయాకర్షణలు, ఇంద్రియోద్యోగ లంపటత్వము, అరికట్టబడి, అరిషడ్వర్గముల నిరోధము, జయము, మరియు అంతరింద్రియ నిగ్రహము అంతర్ముఖ (ధ్యాన) దృష్టి, ఏకాగ్ర నిష్ఠ,

అజ్ఞాని తన్ను తానెంతగా ప్రేమించునో, జ్ఞాని లోకము నంత కన్న హెచ్చుగానే ప్రేమించును, ఎందుకని - - - - ?

"సర్వం బ్రహ్మ మయం జగత్" – అనుభవ జ్ఞాన కారణం; బ్రహ్మ వేత్తలు జ్ఞాన – విజ్ఞాన – ప్రజ్ఞాన ధనులు. – విశ్వ కల్యాణావాప్తి దీక్షతో, తమ సుజ్ఞాన వ్యాప్తికై శ్రమించుట వారి పరమ విధ్యుక్త ధర్మము. లోక కల్యాణమే వారి జీవిత పరమా వధి!!

వారి జ్ఞాన ప్రభోధ ప్రసారము :-

- శశితారలు తమ చేల్లని కాంతిని వెదజల్లునట్లు –
- పుష్ప సౌరభము వాయు విస్తృతమగునట్లు –

- సూర్యుని వేడి – వెలుగు ప్రకాశించునట్లు –
- వాయు దేవుఁడు ప్రాణ దాతయై, జీవులను మలయ మారుతముల జోకొట్టు నట్లు
- వరుణుడు పాడి, పంటల ప్రసాదించి అన్నదాన మొనర్చు నట్లు
- నదులు ప్రవహించి ప్రాణి కోట్ల ఆకలి దప్పులు దీర్చునట్లు.
- వృక్షములు పుష్ప - ఫలముల ప్రసాదించి, జీవులకు విశ్రాంతి (నీడ) నొసంగు నట్లు
- జ్ఞానులు – (ప్రజ్ఞాన ధనులు) "మానవ సేవయే మాధవ సేవ యను – అనుభవైక సత్య జ్ఞానానందమయులగు చుందురు.

కస్తూరి మృగం తనలో నున్న కస్తూరి బుడ్డను తెలియక ఎచ్చటనో కస్తూరి వాసన వస్తూన్నదని పరువులు దీయును. ఆలాగే మానవుఁడు తన యందలి ఆత్మను తెలియజాలక దేవుని వెదుకుతూ పరువులు తీస్తున్నాడు –

కథలు : -

1. కర్ణుడు సూతుడు కాదు, కుంతీ పుత్రుడు.
2. పులి మేక కాదు పులియే.
3. దరిద్రుడు అజ్ఞానము చేతనే; నిజంగా శ్రీమంతుడే.
4. భగవంతుని నిందించి దూషించడం అజ్ఞాన హేతువు; ప్రతి అంగము ఒక లక్ష విలువ.

నిరాకార పరబ్రహ్మయే సగుణముగా వ్యక్తమైన ఘన రహస్యమే "వేదాంతము" – దీనికి త్రివిధ దీపికలవసరం -- 1. శాస్త్ర జ్ఞానము
2. లోక – స్వానుభవములు
3. గురు భోధ.

సమస్త "దృశ్యము" ఆతని వ్యక్త రూపమే. ఈ దివ్య రహస్యము – పరమ గుహ్యము – అగమ్య గోచరము :

ఆత్మ స్మృతి యనగా : -

దేహాత్మ బుద్ధి నశించి – (సదసత్ వివేకము) ద్వంద్వముల నధిగమించి – (స్థిత ప్రజ్ఞుడై) వైరాగ్య భోధోపరతుల – పురుష ప్రయత్నమున స్వ స్వరూప జ్ఞాన ముఖోన్ముఖత పయనించి "నే నెవరు" -- - - సత్యా జ్ఞానాను భూతిని

తురీయా వస్థ నంది తరించుటే వేదాంత పరమా వధి.

-------------

"ఒకరి విందు – మరొకరి మందు" – అధికారి అర్హతను గుర్తించి, తరింపఁ జేయగల అచార్యుడే నిజ గురువు!!.

బ్రహ్మ చారులు -- శరీర త్రయము (ఇంద్రియాదుల)ను. నిగ్రహమను అగ్నియందు హోమము చేయుచున్నారు. బ్రహ్మము నందే చరించుట (బ్రహ్మా భ్యాసపరులు) "బ్రహ్మ చర్యము" – గురు శుశ్రూషాదులఁజేయుచు – వేదములందలి తొలి (1/4) "సంహిత" లనెడి భాగమును అధ్యయన మొనర్చి గురుకులవాసమొనర్చెడి వారు.

గృహస్థులు -- శబ్దాది విషయములను –ఇంద్రియములనే అగ్నులందు హోమము చేయుచున్నారు. అనగా, విషయముల నుండి ఇంద్రియములను నిగ్రహించి, నివారించు వారుః వేదములందలి 2 వ భాగముగ రూపొందియున్న "బ్రాహ్మణముల" నాశ్రయించి, యజ్ఞ యాగ దాన ధర్మ క్రతువుల నాచరించు వారు. మరియు సత్సంగత్యా, శ్రవణ, మనన, ధ్యాన, సద్గుణాభ్యాసాదుల వల్ల సంసార జీవన మొనర్చు వారు.

వాన ప్రస్థుడు -- సంసారం యావత్తును, అర్హులైన పుత్రుల యధీన మొనర్చి, అరణ్యములలో భార్యతో కూడ కుటీర జీవన మొనర్చుచు - - - గుర్వాశ్రమ సమీపమున సన్యాసమునకు తయారగుచుండు వాడుః ఈతనికి "వేదములందలి ఆరణ్యకములు" ఆశ్రయింపఁదగ్గవి.

సన్యాసము -- నిరగ్నియు – శిఖా సూత్ర పరిత్యాగి . . . బ్రహ్మా భ్యాస పరుడుః ఉపనిషన్మతాశ్రయుఁడు.

బహూదకుడు -- తీర్థ యాత్రలు చేయుచుండు వాడు.

కుటీచకుడు -- తీర్థయాత్రాదులు ముగించి గాని, ముగింప శక్తి సామర్థ్యము లేక – కుటీ నిర్మాణ నివాసములతో నుండు వాడు.

హంస (హంసుఁడు) -- శాస్త్రానుసారియై – ఆచార సంపన్నుఁడైన సన్యాసి – సాధనలందు లీనమగు పురోగామి.

పరమ హంస -- సర్వా తీత స్థితి, యధేష్టాచరణుడు, వీరిలో తెగలు గలవుః

i. నిరగ్ని సన్యాసి - అంతఃకరణ శుద్ధి కొరకు తీసుకొన్న సన్యాసము.
ii. వివిదిషువు - దోష దృష్టిరూప – వైరాగ్యాది సాధన సంపన్నుడై, జ్ఞానాపేక్షతో చేయు సన్న్యాసము.
iii. విద్వత్సన్యాసము –విద్వాంసుఁడు, దోష దృష్టి రూపము – మిథ్యా దృష్టి రూపము, జ్ఞానోత్తరము చేయు సన్యాసము.

వీరిలో ఒకరికన్న మరొక్క రధికము –

2, 3 కు జీవన్ముక్తి సుఖము కలదు. 1 కి జీవన్ముక్తి సుఖము లేదు. ప్రారబ్ధ భోక్త : ద్వంద్వముల తాకిడికి సొక్కును.

ఆరూఢుడు – స్వేచ్ఛా చరు (ణు) డు. విధి నిషేధముల కతీతుఁడు. ఇతనిని బంధించు శక్తులిహ పరంబములందు లేవు. ఇట్టి వానినే అవధూత యని కూడా అందురు.

ఉ|| శేషాద్రి స్వాములు.

అవధూత - పూర్వమందు, సన్యాస దీక్ష వహింపక – భ్రష్టులై యధేచ్ఛాచరణ యుక్తులై యుండినను, వాని యందు – పరమహంసాది నామ త్రయము యొక్క వ్యవహారము లొనర్చు చుందురు. యిట్టివారి చర్యలందు జ్ఞానాజ్ఞాన విమర్శ లెవ్వరు చేయరు. వీరినే “గిరి – పురీ – భారతీ – సరస్వతీ – తీర్థ – అరణ్య” మొ|| నామములచే పిలుతురు.

బ్రహ్మ నిష్ఠులు నల్వురు. – వీరు అతుల జ్ఞాన వైరాగ్య భోదోపరతులు గల్గియు – మోక్షమందిన మహాత్ములు – సద్రూప తత్వానుభూతి నందిన ఘనులు – సర్వాతీతులు.

(1). బ్రహ్మ విదుడు – దేహేంద్రియక్రియల కర్తృత్వ ఫలాపేక్షల విసర్జించి, విహిత కర్మల నాచరించును. విరక్తుఁడైన యదృచ్ఛా లాభ సంతుష్టాంతరంగుడు.

(2). బ్రహ్మ విద్వరుఁడు – సర్వ కర్మ సన్యాసి – నిష్కర్ముఁడు, కర్మాతీతుడు. తటస్థ సాక్షి భూతుడు – ద్వంద్వాతీతుడుః సత్యాదిగుణ కర్మల నెల్ల విడిచిన (ఉత్తీర్ణుడైన) వాడు. (1) కన్న అధికం. (1), (2) వీరిద్దరి యందును ప్రారబ్ధముండియు అసత్యముగా నుండును.

(3). బ్రహ్మ విద్వరీయుఁడు -- సహజామనస్క రాజ యోగీంద్రుడు. దేహా తీత స్థితి. లయ లీనాదులకు నోచు కొన్న పరమ యోగీంద్రుడు. సమాధి స్థితుఁడు. ఇతరులు మేల్కొల్పిన లేచి ఆహారమును గొని సర్వదా నిద్రించు వాని వలె జగత్తును మరచి నిర్వికల్ప సమాధి యందుండు వాడు. వీని యందు ప్రారబ్ధము కల్గియుండియు లేకుండును. ఉ|| అజగర మహర్షి.

(4). బ్రహ్మ విద్వరిష్ఠుడు -- కూటస్థ చైతన్యమున – నిర్వికల్ప సమాధిలో అఖండ (అచల – అనంత – అద్భుత) తేజో రాశి యై సర్వకాల సర్వావస్థల్లోను వెలుంగు ఏక రూపుఁడై ప్రారబ్ధము ఏ మాత్రము అంటని మహామహుడుః సర్వాతీత స్థితిః దీనిని మించినది మరొక్కటి లేదుః అద్వితీయ స్థితి.

మాయా (స్త్రీ) శక్తి ప్రభావము -

దొంగ "కమండల – కాషాయాంబర ధారణ" కన్న – అంతఃకరణ మాలిన్యపు శుద్ధి మేలు!

"తలలు బోడైన – తలపులు బోడౌనా" – వేమన. ఎవ్వడు త్రికరణాంతఃకరణ పరిశుద్ధ – నిష్కాపట్యా – నిర్భయము గలవాడో అట్టివాడు శ్వేత వస్త్రములను ధరించినను, పూజ్యుఁడే –

కాని కేవలం బయట "స్త్రీ" ని వదలి నంత మాత్రమున, లోని "స్త్రీ" – ప్రకృతి – మనస్సు – మాయ - సులభముగా వదలునా? "స్త్రీ" కాముని ముద్ర – Seal –

1. తలలు బోడి యై – బూడిద పూతలు – రుద్రాక్ష మాలలు – జడలు – బవిరి గడ్డము – కావి గుడ్డలు – కపాల హస్తం – శ్మశాన జీవనం – ఇదే ఆఖరు ఘుట్టం - - - -కాని పరమ శివునిఁగూడా గంగా పార్వతులు వదలలేదే!!

2. పర్ణ – ఫలాది కంద మూలములు భక్షించి – గాలి పీల్చి – వన నివాస మొనర్చి సుదీర్ఘ ఘోర తపమాచరించిన – పరాశర, విశ్వామిత్రాదులను "కామ" దాసులుగఁజేసిన మాయా (స్త్రీ) శక్తి, ఇక త్రికాల షడ్ర సోపేత దివ్యాన్నముల (పలావులు – మసాలాలు మ్రెక్కు) – తిని, కామ కథా పారాయణ శ్రవణా (నవలలు) సక్తులు – నాటకములు – సినిమాలు – డ్యాన్సులు – క్లబ్బులు (Night Clubs) నాశ్రయించి బ్రతికే సామాన్యులను సులభముగా వదలి పెట్టునా?

# 14 . యోగము

## (అష్టాంగ యోగము)

## -- పతంజలి.)

ప్రవేశిక

భక్తుడు -- బయట
యోగి -- లోపల
జ్ఞాని -- లోపల, బయట కూడా భగవంతుని చూతురు.
కర్మయోగి -- భగవంతుని (ఎక్కడను) చూడడు.

శివ శక్తి సామరస్య మే యోగము –
నిగర్వినని కూడా గర్వింప రాదు.
"ఆత్మ స్తుతి - పరనింద" లు సమానమే.

చిత్త వృత్తి నిరోధము -- యోగము –
మంత్ర –హఠ – లయ –రాజ యోగములనియు –
జీవేశ్వరుల సంయోగమే -- యోగమనియు –
భోక్తృ – భోజ్య – భోగములకు బ్రహ్మ భావమే -- యోగమనియు –
జ్ఞాతృ – జ్ఞాన – జ్ఞేయముల ఏకత్వమే -- యోగమనియు –
అసగా త్రిపుటీ రాహిత్య – అద్వైత స్థితి యే యోగ మనిరి.

---------------------------

-- ఆత్మ యందు శాశ్వత జీవనమే "యోగము"
-- అంతర్భాగమున మనోధారణమే "యోగము"
-- యోగమునకు శరీరము సమాధి.

జయము
ప్రాణ (బంధము) = యోగము (హంస) –అజప గాయత్రి.
జయము
మనో (బంధము) = జ్ఞానము (ఓం) - జప గాయత్రి

"ప్రాణ + మనో" లయము = రాజ యోగము.

అజప (హంస) + ఓం (జప)
మారుతి + మనస్సు
తనయ + తండ్రి
(తండ్రి తనయుల ఇక్యము)

= హంసోం - సోహం
తండ్రి తనయుల ఇక్యము

జ్ఞానము + యోగము = రాజ యోగము

జపాజప గాయత్రి
= "సోహం" మంత్ర జపం

"చతుర్వేద మహా వాక్యములు" -- (శుక రహస్యోపనిషత్)
-- వేదాంత పంచదశి. అధ్యా. 5.

1. ప్రజ్ఞానం బ్రహ్మ (ఋగ్వేద ఐతరేయారణ్యాకం)
2. అహం బ్రహ్మోస్మి (యజుర్వేద . బృహదారణ్యాకం)
3. తత్వమసి (సామ వేదం . చాందోగ్య)
4. అయమాత్మా బ్రహ్మ (అధర్వణ వేదం)

వీటి ద్వారా "ప్రత్య గాత్మ" – "పరమాత్మ" ల కభేదమనియు – తానే పర బ్రహ్మ మనియు తాదాత్మ్యాపత్తితో నవిచ్ఛిన్నముగా అనుసంధించుటే "యోగ" మన బడును. యోగము "సత్య దర్శన" – యదార్థ శాస్త్రము. కార్య రూప వేదాంతము. నిత్య నిర్మల శోభితమైన – పరిశుద్ధాత్మ – సంస్కృతీ అభ్యాసము.

ఈ యోగము 2 విధములు :-

చిత్త పరిపక్వము గల వారికి - జ్ఞాన యోగము - రాజ యోగము - బుద్ధియోగము.

చిత్త పరిపక్వము లేని వారికి – అష్ఠాంగ – అభ్యాస – ప్రాణాయామాదులతో కూడిన యోగము.

మనస్సును ఇంద్రియముల ద్వారా బాహ్యా ప్రపంచముల విషయముల పట్ల పోనీయక, అడ్డి, అంతర్ముఖ మొనర్చుటే "యోగము" – మనో వృత్తుల లయము , సమ చిత్తత, అమనస్కస్థితి. మోక్షము యోగాభ్యాస ఫలము.

మోహ నాశమే మోక్షము. బాహ్యేంద్రియ వృత్తుల (విషయాసక్తతను), అంతర్ముఖ మొనర్చి బ్రహ్మ పరం చేయుటచే, ఆకృతి లేని మనస్సు "భ్రమర కీట న్యాయమున" – బ్రహ్మా కారము చెంది, బ్రహ్మమేయగును. ఇది యే యోగ పరమావధి.

జాగ్రత్త – దేవుని స్వరంలో జీవుని స్వరం (శృతి) మేళవింపకున్న అపశృతి యగును. కావున దైవిక గుణములు (అభయం సత్వ సంశుద్ధ్యాదుల) – అలవరచుకొని త్రికరణ శుద్ధిగా, బ్రహ్మ భ్యాసపరుడు గావలెను.

యోగమునకు – భక్తి, వైరాగ్యము లత్యంతావసరము.

<u>యోగము</u> : -

చిత్త శుద్ధి లేని మందాధి కారులకు (1), అభ్యాస యోగము = ప్రాణాయామము — (a), (b), (c)

---- (a) ప్రాకృతము  మంత్ర యోగము

---- (b) వైకృతము  లయ యోగము  అష్టాంగ యోగము, అష్ట సిద్ధుల ప్రసాదించును

---- (c) కుంభకము  హఠ యోగము

Intellectuals

ఉత్తమాధికారులకు (2) జ్ఞాన యోగము = రాజ యోగము — తారక1, సాంఖ్య2, అమనస్కము3 } విధములు

భ్రమర కీటక న్యాయమున 21,600 అజపా మంత్ర సాధన
- (a) సాధా (సహజ) రేచక పూరక కుంభక సాధన.
- (b) "లయ"- ఉచ్ఛ్వాస నిశ్వాసములతో నామ జపమును సంధించుట (ప్రాణా పాన లయించుట).
- (c) ప్రాణ ధారణ సాధన. హఠ యోగము – రేచక పూరక బంధం

పై త్రివిధ ప్రాణాయామ యోగులుకును –

1 2 3
యమ, నియమ, ఆసన
4
ప్రాణాయామములు
} పూర్వాంగకములు

షట్చక్రంబులందు "మనో ప్రాణ" ధారణ

5 6 7
ప్రత్యాహార, ధ్యాన, ధారణ
8
సమాధులు
} ఉత్తరాంగంబులు

(1). యమము – అహింస, సత్య అస్తేయ, బ్రహ్మ చర్య, అపరి గ్రహములు

(2). నియమ :- శౌచ, తప,సంతోష, స్వాధ్యాయ, ఈశ్వర ప్రణిధానము.

(3). 84 ఆసనములు – ఆసన సిద్ది నందిన తర్వాత

(4). తర్వాత ప్రాణ నిరోధన సాధన. క్రమ పాణాయామము –

<u>జ్ఞాన (రాజ) యోగము</u> 3 విధములు <u>(సాంఖ్య, తారక, అమనస్కము)</u>

తారకంబు మన శ్శుద్ధి కారకంబు|
సాంఖ్య మాత్మ స్వరూప విచారకంబు|
అనుభవ జ్ఞాన మమనస్క మట్లుగాన|
నాద్య మెఱిగింతు మొదల నీవవధరింపు|

శాంభవి – భ్రూ మధ్యమున "చిదంబరము"ను –
(చిదాకాశము) దహరాకాశము

<u>పరాశక్తి యే = బిందు రూపము</u> : అబిందువు నుండి – పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ అను చతుర్విధ వాక్కులు పుట్టెను.

= క్షేత్రజ్ఞుడు = చైతన్యుండు = జీవుడు = కళ

శబ్ద బ్రహ్మము = నాదము

జ్ఞానము = శాస్త్ర + అనుభవ + ఆచార్యోపదేశ జన్యము



బ్రహ్మ జ్ఞాన ముదయించును. ఇదే జ్ఞేయము – హృదయమున ప్రత్యక్షముగ భాసిల్లును.




ప్రాణ వ్యాన, అపాన, ఉదాన, సమాన,

5 ప్రాణములు + అంతఃకరణ చతుష్టయము + 5 + 5 = దశేంద్రియములు యొక్కః- ఔద్ధత్సము నశించును. చిత్త శుద్ధి. అష్ట సిద్ధులు – బ్రహ్మ ప్రాప్తి

1. భగవదుపాసన
2. ధ్యాన నిష్ఠ
3. ఇంద్రియ జయము
4. మనో నిగ్రహము
5. ద్వంద్వాతీతత్వం

1. యమ :- అహింస, సత్యం, అస్తేయం, బ్రహ్మ చర్య, అపరిగ్రహథ.
2. నియమ :- శౌచ, తప, సంతోష, సాధ్యాయ, ఈశ్వర ప్రణిధాన.
3. ఆసన :- 64.
4. ప్రాణాయామ :- 21,600 హంసలు, అజప గాయత్రీ జపము.

యోగమునకు శరీరము సమాధి : "నైతిక – మానసిక – ఆధ్యాత్మిక" – అభ్యున్నతి సమాధి వల్లనే ప్రాప్తించును. సమాధి 3 విధములు. 1. సవికల్ప 2. నిర్వికల్ప 3. విదేహా కైవల్యములని.

యోగ మనగా – సంయోగము – కలియుట – జీవ బ్రహ్మైక్యము – ముక్తి – మోక్షము – స్వ స్వరూపానందానుభవమునకు తోడ్పడు ఉపాయము లేక సాధన మార్గముః

చిత్త వృత్తి నిరోధమే యోగము
నివృత్తి స్థితియే యోగ సాధన ఫలము.

ఈ స్థితి చిరతరాభ్యాస – వైరాగ్యముల వల్లఁ గల్గును. అభ్యాస మనగా శాస్త్రీయ విధాన సాధనలు. వైరాగ్యమన – ఇహ పర సుఖముల (విషయ) పట్ల త్రికరణాలా, అనిత్యములని – విముఖత.

చిత్త వృత్తి (అంతఃకరణ) నిరోధము – బాహ్యాంతరింద్రియ విజయ ఫలము

విషయ వాంఛలకు నీవు వశుఁడుఁగారాదు. నీ కవి భోగ్యమై – వశ్యమై యుండ వలెను. యజమానుఁడు భృత్యుఁడు గా మారడం శోచనీయ – విషాద – వైపరీత్యము – ప్రమాద భరితము – ఇదే మోక్ష పథ సాధన నిజ విధానము.

శ్లో|| శ్రోత్రాదీ నీంద్రియా ణ్యన్యే సమ్యమాగ్నిషు జుహ్వతి
శబ్దాదీ న్విషయా నన్యేయింద్రియాగ్నిషు జుహ్వతి

తా|| కొందఱు జ్ఞానేంద్రియములను నిగ్రహించు చున్నారు. కొందఱా యింద్రియముల విషయములను నిగ్రహించు చున్నారు.

-- భగవద్గీత, అ, 4, శ్లో. 26.

సమాధి స్థితిలో జ్ఞానేంద్రియముల నిగ్రహించుచు, సమాధ్యవస్థ నుండి మేల్కొన్న పిదప (జాగ్రదవస్థలో) ఇంద్రియ (బాహ్య) విషయములను నిగ్రహించు చున్నారు.

సమాధిని "ధర్మ మేఘమందురు" – బ్రాహ్మీ స్థితి – అనగా బ్రహ్మాత్వ (జీవ బ్రహ్మైక్య) స్థాయి నుండి, "బ్రహ్మ వాక్కులను" – ఉపనిషత్ప్ర వచనములను- "అద్వైతామృత కుంభ వృష్టి ని కురిపించును. అందుకే వేదముల పౌరుషేయములని పిలువఁ బడును.

మోహ నాశమే – మనో నాశము – మోక్షము. ప్రాపంచక (బాహ్య) విషయముల నుండి – మనస్సును (ఒక మొండి – బండ కుక్కను ఆమేధ్య భక్షణాభ్యాసము నుండి – గొలుసు తోలాగి నట్లు) బలత్కారముగ లాగి – యీడ్చి, అంతర్ముఖ మొనర్చి, లక్ష్యము నందు (గురూపదేశ ధ్యేయము నందు) – పురుష ప్రయత్నమున – శ్రద్ధా భక్తులతో – క్రమా భ్యాసమున – ప్రణవ ధ్యాన (మానసిక) బలమున – లగ్న మొనర్చడమే "యోగా భ్యాస క్రియ – బ్రహ్మాభ్యాస సాధనము" అందురు.

అష్టాంగ రాజ యోగము –

యోగాంగ సాధన ఫలము : -- చిత్త శుద్ధి – సులభ మోక్ష ప్రదాయని.

-- సద్గురు శుశ్రూష

-- పంచ శీల జీవనము

జిజ్ఞాసువున కత్య వసరము.

1. సుదీర్ఘ క్రమ శాస్త్రీయ సాధనాభ్యాసముల వల్ల – సమస్త పాపాది – మల – విక్షేప – ఆవరణలు (వాసనలు) నశించి వివేకోదయమై, మూల కారణమగు జ్ఞాన ప్రకాశము లభించును.
2. అష్ట సిద్ధులు – తమ తమ దివ్య విభూతులను ప్రసాదించును.
3. బ్రహ్మ జ్ఞానము – అపరోక్షాను భూతి – అమర అనశ్వర శుభ శాంతులు చేకూర్చును.

స్థూల (క్రియా) రూపమున- "సాష్టాంగ" నమస్కార మనిన – 8 అంగముల జయము తోటి నమస్కారమని అర్థము. "అష్టాంగ యోగ పథ" సాధకుఁడు గురు దేవుని పాదముల చెంత వ్రాలి ఆశీర్వదింపమని వేడు కొనుట.

అష్టాంగ రాజ యోగము యొక్క భాగములు 2 : -




"యమాం"గ సాధన పరుని "సంయమి" యందురు.

ఇందు "సంయమీంద్రుడు" – "యమ" పదవికి సర్వార్హుఁడు.

యోగా ష్టాంగాను ష్ఠానము తో చిత్త మాలిన్యము తొలంగి, వివేక ఖ్యాతి సిద్ధించును. అష్ట సిద్ధులు ప్రాప్తించి, ముక్తి, (మోక్షము) తథ్యము. మానవుఁడు మాధవుఁడగును.

యమము -

1 2 3 4 5 6

శ్లో|| అహింసా, సత్య, మస్తేయం, బ్రహ్మచర్యం, దయా, ర్జవం|

7 8 9 10

క్షమా, ధృతి, ర్మితాహార, శ్శౌచం, చేతి యమాదశ||

1. అహింసః - త్రికరణములా "హింసా వర్జితం" – దీని వల్ల సహజ శత్రువులు కూడా మిత్రులై చరింతురు. జీవ కారుణ్యాము – దయ – ప్రేమ. ఫలము – అజ వ్యాఘ్రాదులు సహజ శత్రుత్వమును మాని సహచర జీవు లగును.
2. సత్యముః- యదార్థ భాషణము – వాక్శుద్ధి నిచ్చును – ఏకత్వం త్రికరణ శుద్ధి ఫలించును.
3. అస్తేయంః- అన్యాయ – అశాస్త్రీయ- చౌర్యార్జిత ద్రవ్యాదులును పరిగ్రహింపఁకుండుట. యదృచ్ఛాలాభ సంతుష్టుఁడై దేహ ధారణ నిమిత్త మాత్రమేననియు, కర్తవ్యము గాదనియు జీవించఁదగును. ఎవ్వరిని, దేనినిన్ని ఆశింపరాదు. ఇచ్చినను తీసుకోరాదు. అపరిగ్రహము.

ఫలము – అస్తేయ సిద్ధునకు, అజ్ఞాత నిధి నిక్షేపములు ఎచ్చట నున్నవి. తమ్ము పరిగ్రహింపతామై వలచి వచ్చి ఆహ్వానించును. ధనార్జన – రక్షణ – కాంక్షాది క్లేశ దూరు(డైనవానికి, పూర్వోత్తర జన్మ రహస్యము, జన్మమాకస్మికమా? అనాదియా? అనిత్యమా? నిత్యమా యను చింతలు పొడమును.

4. బ్రహ్మ చర్యము – గుహ్యేంద్రియ సంయమము (స్థూలార్థము) మనస్సును సర్వదా బ్రహ్మ యందు చరించునట్లు చేయుటే (సూక్ష్మార్థము) – ఇది ఉప రతి వంటిది. ఫలితము – బ్రహ్మచర్య సిద్ధునకు అప్రతిహతమగు శక్తి సామర్థ్యములబ్బును. "బ్రహ్మ చర్యమే బ్రహ్మాభ్యాసము" నిష్ఠ– ధ్యానము – తీవ్ర సాధన చర్య – యోగ క్రియా సాధనమున అత్యంత ముఖ్యమైన భాగమిది.
5. దయ – కరుణ – మార్దవం – (భజనాది భగవద్భక్తి వల్ల) హృదయము నవనీత తుల్యమై – విశాలమై – భౌతిక పరిధులును మీరి "దయాసాగర" తుల్యమగును.
6. ఆర్జవం – త్రికరణైక్యం – ఏకాకార బుద్ధి
7. క్షమ – ఓర్పు – సహనము.
8. ధృతి – సత్య నిష్ఠ యందు స్థిరత్వం.
9. మితాహారం – మిత – క్రమ – లఘు – సత్వ – (పునీత) ఆహార సేవనం –
10. శౌచం – బాహ్యాంతర శుద్ధి – (యమ + నియమములు ఇందే యిమిడి యున్నవి).

ఈ ప్రథమాంగ సాధన విజేత యే "యమ" పదవికి అర్హుడుః యమ సాధనా ప్రియుని "సంయమి" అందురు. ఇవి సర్వ సాధకులకును మహా వ్రతములు. "అహింస" – ప్రథమాంగములో – ప్రథమ పాదము గదా! ఈ ఒక్క గుణ ప్రాధాన్యంతో గౌతము(డు బుద్ధుడయ్యెను. కఠిన కర్కశ పాషండ వ్యాధుడగు వాల్మీకి హృదయము నవనీతమై, క్రౌంచ మిథున వియోగ (దుఃఖ) శోక తప్తమై – ద్రవించి "రామాయణ" గ్రంథ రూపము దాల్చి, అత(డు ఆది కవి యయ్యెను. "దయ – ప్రేమ" ఈశ్వర ప్రియ మణి రాజములు.

ఇక బ్రహ్మనిష్ఠుల పూజా (మంత్ర) పుష్పములఁజూడుడు : -

శ్లో|| అహింసా ప్రథమం పుష్పం పుష్పమింద్రియ నిగ్రహం|
సర్వ భూత దయా పుష్పం క్షమాపుష్పం విశేషతః|
శాంతి పుష్పం తపః పుష్పం ధ్యాన పుష్పంతదైవచ|
సత్యమష్టవిధం పుష్పం విష్ణోః ప్రీతికరం భవేత్||

"యమ నియమములు" – రెండును, నీతి వర్తనమున కేర్పడిన విధులు. యోగాభ్యాస సౌధమునకు పునాదులు. ఇవి సుస్థిర మైనంతనే యోగ సిద్ధుల ప్రభావము ద్యోత మగును.

సూ|| శౌచ, సంతోష, తపస్స్వాధ్యాయేశ్వర ప్రణి ధానాని – నియమాః||
-- సాధనపాదము. సూత్రము. 32.

<u>నియమ</u> :

1 2 3 4 5
శ్లో|| తపస్సంతోష మాస్తిక్యం దాన మీశ్వరపూజనం
6 7 8 9 10
వేదాంత శ్రవణం చైవహ్రీర్మతిశ్చ జపో వ్రతం||

అల్పాహార – మితభాషణ (మౌన) – ఏకాంత వాస – మనో నిరోధ బ్రహ్మాభ్యాసం.

తా|| 1. తపస్సు – చిత్తైకాగ్ర ధ్యానము – ఇంద్రియోద్వేగమును అణచి – అంతర్ముఖ మొనర్చి – "తపింపఁ"జేయుట. ఇది యోగ సాధనకు ప్రాణ పట్టు.

ద్వంద్వసహనము – సుఖ దుఃఖ – శీతోష్ణ – క్షుత్పిపాసలు – మానావమానములు – నిగ్రహానుగ్రహ ప్రాప్తులు మొ|| నవి.

సిద్ధిఫలం – విక్షేపావరణలు నశించి – అష్ట సిద్ధులు – సర్వాభీష్ట సిద్ధి ప్రాప్తి – చిత్తము ప్రపుల్లమై – చాపల్యము నశించును. సంకీర్తన –భజన – ఆరాధన – భక్తి భావములు సహకరించును. తపస్సు పాకమునకు అగ్ని వంటిది. ఇది లేకున్న కర్మ బీజములు దహింపబడవు. (తపోగ్ని జ్వాల మహిమ) –

2. సంతోషము – తృప్తి ఆనందము "యదృచ్ఛా లాభ సంతుష్టితో దేహ యాత్ర (ప్రారబ్ధానుభవం) సాగించుట. నిత్య తృప్తి – మనశ్శాంతి -, అంతఃకరుణ శుద్ధి, మనోనిగ్రహము వల్ల అపార శక్తి ప్రాప్తించును. అరిషడ్వర్గ నిగ్రహ స్థైర్యమును.

మైత్రి – అందరి యెడల – సద్విషయములందు.

కరుణ – దుఃఖితుల పట్ల – దుఃఖ నివారణాసక్తి – భూత దయ.

ముదిత – (సంతోషము) – సుఖము – పుణ్య కార్యముల పట్ల.

ఉపేక్ష – ఉదాసీనత – దుర్మార్గులు – పాప కార్యములందు.

ఫలము – ఆశ అంతరించి మహదానందము – షోడశ కళల వికాశము – మహోత్సుఖము "ఆనందో బ్రహ్మ" – సురగుణ ఆమోదము – అసురగుణ నిరాదరణము. ఈ సాధనల వల్ల – అపర శక్తి – నిగ్రహము – పునీతత్వము లభించి "మానవత్వము – దివ్యత్వముగ" పరిణమించును. సర్వ శుభములు చేకూరి, లోక కల్యాణ ఫల ప్రదాత యగును. సత్వ శక్తి బలీయమై (పునీతమై) మనోజయ నేత సర్వాతీత స్థిర – స్థిత ప్రజ్ఞుఁడు. మానసిక శక్తులు పెద్ద యెత్తున అద్భుత లీలా తరంగిణిని ప్రదర్శించును. ప్రఫుల్లత – ప్రసన్నత – స్థిత ప్రజ్ఞ తో కూడా నిగ్రహానుగ్రహ శక్తులు కూడ (సిద్ధ లక్షణములు) ద్యోత మగును.

శౌచము – (బాహ్యాభ్యంతర) – సర్వేంద్రియ మాలిన్య నాశము – త్రికరణ శుద్ధి – త్రిదశ ఏకత్వము – స్నానాదుల చే దేహము, అంత శ్శత్రులగు కామ క్రోధాది అరిషడ్వర్గములను – ఇంద్రియ నిగ్రహాది, వివేక వైరాగ్య భోధోపరతుల వల్ల నిర్జించుట.

సిద్ధి ఫలము – దేహము నందు (పునర్జన్మయందు) విరక్తత – జుగుప్స – రోత – తద్రీతిగనే పర కామినుల శరీరములందు కూడా హేయ భావము. తీవ్ర వైరాగ్య ఫలము.

ఆస్తిక్యము = విశ్వాసము (ఆత్మ – భగవంతుని యందు).

దానము – బ్రహ్మ వేత్తలకు – సాధు సత్పురుషుల కాశ్రయ మిచ్చు ఆశ్రమములకు – ఆర్తులకు – దివ్య (సుర) గుణ ప్రభావ సమస్త పరోపకార సత్ప్రయత్నములకు – త్రికరణాల సాయ పడుట. సత్పాత్రదానం గోప్యమైయున్న ఫలమధికం.

ఈశ్వర పూజ – ఆత్మ పూజ లేక ఈశ్వర ప్రణి ధానము మరియు "మానవ (మాధవ) సేవా తత్పరత – నిష్కామ భక్తి – అర్చన – ఆరాధన – అష్ట విధ పుష్పములతో మరియు అర్థ భావ సహిత "మంత్ర పుష్పములతో జీవ దేవునకు (తన యందున్న ఆత్మ పరంగా) సర్వ కర్మలు ఉపాయనముగ సమర్పించు "మనోవృత్తి" – మానసికారాధనము.

ఫలం : - నిర్విఘ్న యోగ సిద్ధి ప్రాప్తి – ఉపాసనా ఫల సిద్ధి. వేదాంత శ్రవణము – శాస్త్ర పఠన – శ్రవణ – మననాదులు గురూపదేశ ప్రవచన – భోధలు వినుట.

లజ్జ – బ్రహ్మాభ్యాసుల కనర్హమైన "తలంపులు – మాటలు చేతలందు" సిగ్గు గల్గి సన్మార్గ గతుఁడగుట –

మతి – జ్ఞప్తి – ప్రజ్ఞ – యెఱుక అనగా బుద్ధి – అనగా దేహత్రయ – అవస్థాత్రయాతీత శుద్ధ భోధ స్వరూపమే "తానను స్థిరత" – ఏక లక్ష్య బుద్ధి –

జపము – ప్రణవ – హంస – ద్వ్యక్షరి – త్ర్యక్షరి – పంచాక్షరి - - - - మొ|| మంత్రముల జపించుట - - ఇష్ట దైవ నామ మంత్రోచ్చారణముతో హృదయమున పర బ్రహ్మను సంధానముగా ధ్యానించుట.

వ్రతము – బ్రహ్మ నిష్ఠని నిత్య కృత్యములన్నియు వ్రతాచరణ క్రమ విధానమున సాగి పోవుట. మోక్ష పర్యంతము "వ్రత రథ" మాగరాదు.

స్వాధ్యాయమనగా – ప్రణవాది మంత్ర జపము – మోక్ష శాస్త్రాధ్యయనం – పారాయణాదుల సిద్ధుల ఫలము – దేవ – ఋషి – సిద్ధాదులు – దర్శనమిత్తురు. దివ్య దర్శనములనంతము – దివ్య లోక సంచారము కూడా సంభవము –

ఆసనము – 84 లో సుఖ – స్థిరతలు గలదే – సులభాసనమే – ఆచరణీయము. సిద్ధ – పద్మాసనములు ముఖ్యము – ఇవి కాయ శుద్ధికి సాయ పడును. ఏది బ్రహ్మ నిష్ఠకు సాయ పడునో, అదియే "బ్రహ్మాసన" మనఁబడును.

"స్థిర సుఖమాసనం" -- పతంజలి.

అనంత వస్తు ధ్యానం వల్ల (ఆకాశం, సాగరం, హిమవత్పర్వతాదులు మొ|| ) ఆసన స్థిరత్వం ప్రాప్తించును.

పద్మ, వీర, భద్ర, స్వస్తిక, దండ, సోప, పర్యంక, క్రౌంచ, నిషద హస్తి, ఉష్త్ర, శీర్ష, మయూర, హల, కుక్కుట మొ|| 84 ఆసనములు గలవు.

శ్లో|| "వ్యాహృతి సంస ప్రణవాం గాయత్రీం శిరసాసహ|
త్రిః పఠేదాయత ప్రాణః ప్రాణాయామస్స ఉచ్యతే" || -- మనువు.

ప్రాణాయామము – అభ్యాస యోగము : - 3 విధములు.

శ్వాస ప్రశ్వాసముల యొక్క సంచారమును నిల్పుట –

1. ప్రాకృతము = మంత్రయోగము (ధ్యాన)

2. వైకృతము = లయయోగము.

3. కేవల కుంభకం = హఠ యోగము.

1. ప్రాకృతము- అనగా, మంత్రయోగము – అజప (సహజ) జపింపకనే జపించు గాయత్రి లేక హంస మంత్రము.

ఈ మంత్ర యోగము – 4 విధములు

అజపము = 15 x 60 x 24 = 21,600 "హంసలు" – రోజుకు ఉచ్ఛ్వాస నిశ్వాసములు.

జపము = సోహం (ఓం + హంస) = జపాజప గాయత్రులు.

క్రియ = ప్రాణ లయము (తండ్రి తనయుల ఐక్యము)

స్మరణ = మానసికం – ప్రాణ ధ్యానం.

- మంత్ర యోగమున – ఋషి , ఛందస్సు, దేవత బీజము, శక్తి, ధ్యానము, మొ|| వానితో, తొలుత "ఓం" ప్రణవము తోను, నడుమ ఇష్ట దేవత (ఉపాసనా దైవ) నామమును, కొనను, చతుర్ధ్యంతము గల మంత్రము నిష్ట సిద్ధికై జపించుట జప రూప మంత్ర యోగమనఁ బడును.

- వేద మంత్రోచ్చారణ పూర్వకముగ, శ్రౌత స్మార్తాది కర్మల నాచరించుట క్రియా రూప మంత్ర యోగము.

సర్వకాలములందును, నిత్య నిరంతరముగ కాల స్థల నిషేధము లేక, భగవన్నామ స్మరణము – స్మరణ రూప మంత్ర యోగ మందురు.

మంత్ర జపము యొక్క – సౌలభ్య – సుఖ – క్షేమ – కారణములిందు తెలుపఁబడినవి.

"ఆత్మ యందు శాశ్వత జీవనమే యోగము" – అనగా అంతర్భాగమున మనోధారణమన్న మాట.

"ఓం" ప్రణవ ధ్యానము మొ|| "సోహం" మంత్రము వరకు గల సగుణ, నిర్గుణ మంత్ర జప సముదాయము, వ్యక్తుల, విభిన్న, విశ్వాసాభిరుచుల గుర్తెరింగి, ఆచార్యోత్తములు ఉపదేశించుట భావ్యము. –

శ్రీ రామ, శ్రీ కృష్ణ, తారక, రామ తారక, శివ పంచాక్షరి, అష్టాక్షరి, ద్వాదశాక్షరి, షోడశాక్షరి, కలి కల్మష నాశన మంత్రాదులు . . . హంస – గాయత్రుల వరకు –

అనుభవించని కలిమి వలె – ఆచరణ లేని ప్రజ్ఞ నిరుప యోగము – నిష్ప్రయోజనము. పండు గాని పుష్పము (గొడ్డు పువ్వు) వలె.

తత్వ సాధన - సాఫల్యమునకు –

1. శాస్త్ర జ్ఞానము
2. గురు వాక్యము
3. స్వానుభవము.

} మూల కందములు

మరియు –

ప్రయత్నము - (Effort)
విశ్వాసము - (Faith)
ఆర్తి - (Urge)
అభ్యాసము - (Practice)
వైరాగ్యము - (Detachment)

} అత్యవసరము

"కోటీశ్వరుఁడై అజ్ఞానిగా బ్రదుకుట కన్న –
సుజ్ఞాని యై భిక్షాటన మొనర్చుట మేలు"

మనో నిగ్రహ మొక్కటే (సంకల్ప రాహిత్యము) స్వరూపోద్ధారమునకు చాలును (సంకల్ప ధ్యానము) –

హెచ్చరిక – మానవుని నుండి వెడలిన సమస్త వృత్తులు – సంకల్పములు – (స్థూల – సూక్ష్మ) – రాగ ద్వేషాది సర్వ భావములు, పరిభ్రమించి, తుదకు కర్త నే చేరును. కాని, యిప్పుడు, దారుణాస్త్రములవలె అప్రతిహత శక్తితోయధాస్థానమున "యద్భావో తద్భవతి" గ చేరును. సర్వ సంకల్పముల గమ్య స్థానము "కర్త" యే. కడపట వృత్తులన్నియు వలయాకార చలన వృత్తి గలవి.

2. వైకృతము – లయ యోగము – నాదమునందు మనో లయా కృతం – విలీనత – ప్రాణాపానము ల కలయక.

"మనో గ్రేవసతే బిందుః| ప్రాణాగ్రే వసతే కళా|
ఉభయోర్లీయతే సాదో| లయ ఇత్యుచ్యతే బుధైః|
అనాహతస్య శబ్దస్య తస్య శబ్ద స్యయోధ్వనిః|
ధ్వనిరంతర్గతం జ్యోతి ర్జ్యోతి రంతర్గతం మనః|
తన్మనో విలయం యాతి తద్విష్ణోః పరం పదం||

ఇట్టి ప్రమాణములచే కొట్టబడకయే ధ్వనించు చుండెడి "అనాహత" (హృదయ) చక్రమందలి – దశ విధ (ప్రణవ) నాదముల నెఱిఁగి, దశమ నాద మెచ్చట లీన మగునో అచ్చట ప్రాణాగ్రస్థితమైన చిత్కళ యొక్కదర్శనముతోఁ గూడి యుండు మనస్సు లయమగును.

అనగా వృత్తి రాహిత్య, వాసనాక్షయ – మనస్సు బ్రహ్మాకారమై స్వస్వరూపానుభూతి – మోక్షము.

-- ఉత్తర గీత.

"క్షణమేకం క్రతు శతం" --

అనగా ఒక క్షణ కాలం స్వస్వరూపము నందు లయించిన - సర్వ తీర్థ యాత్రలు – అనంత యజ్ఞ యాగాదులు – కోటి పూజలు – సకల వేద వేదాంతాధ్యయనములు చేసినంత ఫల ప్రదాయని : దీనిని సాధించిన చండాలుడు గూడా ముక్తి గాంచును. -- శివ గీత.

భ్రూమధ్యమందు – ప్రణవోచ్చారణతో మనస్సును ఐక్య పరచి, ఒక ముహూర్త కాలము మాత్రంధ్యానింతురో వారి యొక్క శత జన్మార్జిత పాప చయములు నశించి, పునీతులగుదురు.

అథవా – ఎడమ ముక్కు గుండా గాలిని పీల్చి – పూరించి – సగము కుంభకము నందు నిల్పి, మిగత సగము భాగము కుడి ముక్కు గుండా రేచింప వలెను. మరల కుడి ముక్కు గుండా గాలిని పూరించిసగము కుంభకము నందు నిల్పి కడమ సగము ఎడమ ముక్కు గుండా రేచింప వలెను. ఈ తీరున శక్తి యుక్తము గా ప్రాణాయామ మొనర్పఁదగును.

-- గురు భోద.

3. హఠము - కేవల, కుంభక ప్రాణాయామము – ప్రాణధారణాత్మకం. ఈ సాధన శ్వాస బంధము వల్లను (ధ్యాన సహిత) - - ఆత్మ, కపాలం పగిలి ప్రాణం పోవును. సాధకుఁడు పొగ గూడు వలె పైకి లేచును. సాధన క్రమము దుర్లభము – కష్ట సాధ్యం – అనుభవ పరుఁడైన యోగీశ్వరుని సమక్షముననే అభ్యసింప వలెను. పాము తో చెరలాటం వంటిది. జాగ్రత్త!! గురు ప్రసాదితము. ప్రమాద భరితము.

సత్ప్రభు రాజ్యమందు – పుణ్య నదీ తీరమున – ఆశ్రమ మొండు నిర్మించి, యోగ జ్ఞాన పరుఁడైన సద్గురు మూర్తి పర్య వేక్షణ క్రింద, దేహ రక్షణ చేసుకొంటూ,

సాత్త్విక, మిత, క్రమాహార విహారాదులకు లోనై గుదా కుంచనము చే నీళ్ళు పీల్చి యధో మలములఁ కడిగి విడచి, తంత్రోక్తమగు ఘృత ముల చేతను, గండూషాదుల చేతను, వక్షస్థల – కంఠము లందలి కఫ పిత్తాదులను పైకి క్రక్కుచు, దేహ శుద్ధిఁ గావించుకొని, కాలాను గుణ్యా భస్మాదుల దేహమునకు పూసు కొని - - - - ప్రాణాయామము గావించుచు - - - కాయ శుద్ధితో . . . ఆకాశ గమన, దూర దర్శన, దూర శ్రవణ, గు*గా పాదుకా సిద్ధులు – (అష్ట సిద్ధులు – స్వచ్ఛంధ మరణాది శక్తులు గల్గి యుందురు. కఠిన సాధన క్రియ. జాగ్రత్త!! సాహసోపేతమైన క్రియ.

ఎడమ మడమును గుదమున – కుడి మడమను నాభి స్థానమున పొందించి, గడ్డం రొమ్మున కానించి, షణ్ముఖీ ముద్రను బట్టి – "సోహం" మంత్రమున కుంభించి - షట్చక్రముల భేధించిన యోగి మోక్షార్హుడు. తారక యోగ పంచ ముద్రలు గమనార్హము.

అనగా, మూల బంధ, ఉడ్యాణ బంధ, జాలంధర, బంధములఁగావించి వాయువును పూరింపక, రేచింపక ఏక రీతిని నిల్పుట –

ప్రాణ శక్తి బ్రహ్మ నుండి పుట్టినది. సర్వ దేహ వ్యాప్తమై – విశ్వమయమైనది. సర్వేంద్రియాధిపత్యము వహించును. ప్రాణ ధారణ రక్షణ చేయును ః సూక్ష్మ మైనది.

ప్రాణాయామము ః - ప్రాణ + ఆయామము

ప్రాణ = విశ్వాంతర్భూతమైన అద్భుత శక్తి. (Vital force or Energy)

విశ్వ సాముదాయ శక్తి; (Universal Vital Force) -

ఆయామము = (ప్రాణ వ్యాపార) నిరోధము –

ప్రాణ శక్తి విశ్వమయమై – సమస్త అనంత కోటి దృశ్యా దృశ్య మండలాల్ని పాలించే శక్తి కలది. ఇంద్రియాతీతమైనది.

ప్రాణాయామము 3 విధములు –

సామాన్య – 12 క్షణములు – పరిమితి గలది.

మధ్యమ - 24 క్షణములు - కొంచెం మేలు.

ఉత్తమ - 36 క్షణములు - మేలు –

రేచక – పూరక – కుంభకములని 3 భాగములు –

ఫలము మున్ముందు స్వేదము – అనంతరం కంపము – తర్వాత భూమి మీద నుండి లేచుట (వివరములు తర్వాత) క్రమ సాధన జయమును – విశుద్ధుడై – శాంతతత పొంది – మోక్ష ప్రాప్తికి నోచుకొనును.

ప్రాణాయామము వల్ల ఇంద్రియములు + మనస్సు ప్రాణాధీనములై యుండును – కళ్ళెములు యీడ్చి, బిగించినంత, గుఱ్ఱములు లాగుకొని పోవునట్లు – ప్రాణమును నిగ్రహించుటతో ఇంద్రియములు (10 + 1) – స్థంభించ గలవు. తద్వార ఇంద్రియ జయ ఫల ప్రాప్తి.

ప్రాణ శక్తి కేవలంగాలి (ఉచ్ఛ్వాస నిశ్వాసము లు) గాదు – వాటిని నడపించు శక్తి – ప్రాణ నిరోధము వల్ల – మూలాధార చక్రమందలి కుండలినీ శక్తి, శక్తి వంతమై ఉత్తేజిత మగును.

క్రమముగా షట్చక్ర బేధనము వల్ల -అణిమాది అష్ట సిద్ధులు – (అష్టైశ్వర్యముల వలె) ప్రాప్తించును.

1. అణిమ - అణు ప్రమాణమై చరించు శక్తి
2. మహిమ - బ్రహ్మాండముగ పెరిగి, మహిమాన్వితుఁడగుట.
3. గరిమ - బరువై పోవుట.
4. లఘిమ - తేలి పోవుట – వేగ గమనము.
5. ప్రాప్తి - ఇష్ట కామ్య ప్రాప్తి
6. ప్రాకామ్యము – ఇశ్వర్యము.
7. ఈశత్వము - సర్వ శక్తులు – నిగ్రహాను గ్రహ శక్తులఁబడయుట.
8. వశిత్వము – సర్వ వశీకరణ శక్తి.

జల, వాయు, అగ్ని, స్తంభనాదులు – దూర శ్రవణ – దర్శన – గమనాది అపూర్వ శక్తులు ప్రాప్తించును. సిద్ధులనగా – స్థూలమున కసాధ్యమై – సూక్ష్మము చే సాధింప గల ప్రత్యేక శక్తులు –

ప్రాణాయామము – యోగుల పాలిట కల్ప వల్లి – షట్చక్ర సాధనతో, అణిమాది అష్ట సిద్ధులు ప్రాప్తించును. తద్వారా మోక్షము. యోగులు ప్రతి చక్ర జయంతోను, ఇంద్ర జాల మహేంద్ర జాల మహత్తర లీలాతరంగ – వింత క్రియలు ప్రదర్శింతురు.

యోగము < అభావ – ఆత్మ శూన్యము – నిర్గుణమని. / మహాభావ – ఆత్మ నిష్కళంక, ఆనంద స్వరూపము.

పరమాత్మ తుల్యమని భావించి ధ్యానించుట : ప్రాణాయామముతో ప్రాణశక్తి స్వాధీనమగును. దీని తో మనో జయము – ముక్తి కరతలామలకము –

ఏ స్థితి యందు యోగి, తానును, సమస్తప్రపంచమును కూడా బ్రహ్మమేనని కనుఁగొనునో అట్టి దివ్యయోగ ఫలానుభూతికి ఏ యితర యోగములును సాటిరావు.

ప్రాణ శక్తి విశ్వమయమై – అనంతకోటి బ్రహ్మాండ దృశ్యాదృశ్య వ్యాప్తమై పాలించు అద్భుత శక్తి. వృధాగా పోతున్న యీ ప్రాణ శక్తి ని, అడ్డుపెట్టి స్వాధీనం చేసుకొన్న (శాస్త్రీయ – గురు ప్రసాదిత – సాధనలత్యంత సుసమర్థ –జాగరూకతతో) ఘన విజయుఁడు – సర్వశక్తి సంభరితుఁడై, విశ్వాధికారియై లోక కల్యాణ మూర్తిగ రూపొంది – మహత్తర చరిత్రను సృష్టించును.

షరా : - 1. పాలుమాలిక, అనారోగ్యము, దుఃఖము, ధైన్యము – ఆవేశోద్రేకాలు న్నప్పుడుయోగాభ్యాసము తగదు.

2. ప్రాచీన యోగ సాంప్రదాయ ప్రకారము, క్రమ – మిత – సాత్వికా హార విహార నియమములు – గురు దైవ ప్రార్థనలు తర్వాత ప్రారంభించవలెను.

3. ఎత్తు, తగ్గులు లేని, విపరీతంగా గాలి రాని, శుభ్ర స్థలమున జింక చర్మము మీద మెత్తని ఆసనమమర్చి, దాని మీద ఉత్తరముఖముగా కూర్చుండి యోగమభ్య సింపదగును.

ప్రాణాయామము –

1. పూరకము - ఉత్పత్తి - బ్రహ్మ.
2. కుంభకము - స్థితి - విష్ణు.
3. రేచకము - సంహారము - శివ . . . . . . రూపములు.

1. పూరించుట (విధారణము) – కుడి ముక్కును మూసి, ఎడమ ముక్కుగుండా వాయువును లోపలికి పీల్చుట – క్రమ దారగా –

3. రేచించుట (పచ్ఛర్ద్రనము) – ఎడమ ముక్కు మూసి కుడి ముక్కు గుండా వాయువునులోపలి నుండి బయటకు విడుచుట. – దీని వల్ల చిత్తము ప్రసన్నమై యేకాగ్ర స్థితి పదము నందును.

2. కుంభించుట – ఇది రెండు విధములు.

ఊర్ధ్వ కుంభకము – పూరించిన వాయువును కొన్ని నిమిషములు, రెండు ముక్కులు మూసికొని, రేచింపకుండ నిల్పుట –

అధః కుంభకము – రేచించిన పిమ్మట వాయువును కొన్ని నిమిషములు రెండు ముక్కులు మూసి పూరింప కుండ నిల్పుట – చాలా జాగ్రత్తగా – నెమ్మదిగా – క్రమాభ్యాస మొనర్పఁదగును.

మూల బంధము – ఎడమ కాలు యొక్క మడిమ చేత గుద స్థానమును మూయుట –

ఉడ్యాణ బంధము – కుడి కాలు మడిమ చేత నాభి స్థానము ను మూయుట.

జాలందర బంధము – తల వంచి గడ్డము రొమ్మును తాకు నట్లుంచుట.

ఈ విధముగ గురు పర్య వేక్షణ క్రింద – బహు జాగ్రత్తతో - క్రమ పద్ధతిని – నిత్యమాచరించిన, శరీరము తేలికయై, చిత్త శుద్ధి, ఆరోగ్యము, చేకూరును. భుజించన వెంటనే చేయ రాదు. ప్రాతఃకాల – సాయంకాలములు మేలు. యోగులు నడి జాము లందు ప్రశాంత సమయమున సాధింతురు. దీనికి బ్రహ్మ చర్యాది నియమములు అవసరము - నాడీ శుద్ధి, ఏకాగ్రత – బ్రహ్మ చర్యము - ధ్యాన పటిమ ప్రాప్తించును.

భస్త్రిక – తొలుత రేచక పూరకము 10, 20 తూర్లు కమ్మరి కొలిమి తిత్తుల వలె, త్వర త్వరగా – వెంట వెంటనే చేయ వలెను. ఇది ఒక వరుస ప్రాణాయామమునకు ముందు యీలా చెయ్యడం ఊపిరి తిత్తులకు బలము నిచ్చును. కూర్చుని, నిల్చుని చేయ వచ్చును. ఇది బలమైన అభ్యాసము. నూతనోత్తేజము. శక్తి – వీర్యము కల్గును. నాసిక, రొమ్ము, ఊపిరి తిత్తుల వ్యాధులు, ఉబ్బసము, క్షయ, మొ|| శమించును. ఆకలిని హెచ్చించును. కుండలినీ శక్తిని లేపును.

1. శుభ్ర స్థలము – ఏకాంత వాసము – పవిత్ర వాతావరణము.
2. ప్రాతఃకాలమున – శుద్ధ జలముతో ముఖ ప్రక్షాళనం – నాసిక కడుగు కొని, కొంత చన్నీటిని త్రాగుట.
3. సుఖాసనము – దినమునకు 1, 2, 3, తూర్లు ప్రాణాయామము, శక్తి, వసతి, వీలు, ననుసరించి చేయ వలెను – గురు పర్యవేక్షణం అత్యంతావసరం –

ప్రాణాయామముచే – మనశ్శాంతి – జితేంద్రియత్వము – ఆరోగ్యము – చిత్తైకాగ్రత – లభించును. అందునుండి వాసనా క్షయము – అభ్యాస వైరాగ్యములు బలియును. తద్వార సమాధి స్థితి కల్గును.




ప్రాణాయామమునకు ఫలితం – కుండలినీ ప్రభోధం – చిత్త ప్రకాశము యొక్క ఆవరణం క్షీణించును – చిత్త సంచలనము సహజముగ, తనయందే కల్గుచున్నది. చిత్తము సాత్విక పరమాణువుల సంపుటి కాని, రజస్ + తమో రేణువుల ఆవరణమున నున్నది. ప్రాణాయామము వల్ల ఆయావరణము తొలంగును. అందు వల్ల మనస్సు ధారణము పొందును.

ప్రాణాయామము –

ప్రాణము కూడా యింద్రియముల వలనే – దేహ ధారణ – మరియు – పోషణ శక్తుల కాధారమై యున్నది.

వీటికి జీవాత్మ అధిష్టానము –




1. క్షణ ప్రళయం –

తిల లందలి తైలము వలె –

పండ్ల యందలి రసము వలె –

పాల యందలి నేయి వలె -

హారము నందలి దారము వలె -

తప్త లోహము గోళము నందు అగ్ని వలె –

2. దిన ప్రళయము –

తెల్ల వారి మేల్కొనుట (నిద్ర నుండి) – సృష్టి.

తిరిగి నిద్రించు వరకు – స్థితి.

నిద్ర తో లయము.

3. జగత్ప్రళయము.

సృష్టి – స్థితి – లయము (కల్పారంభం – జగజ్జీవనం – జగత్ప్రళయం) –

ప్రత్యాహారము – Practice of Concentration ఏకాగ్రత, స్థిరత సాధన ప్రయత్నం
ధారణ – Achieving retention – fixation – స్థిరత్వ ప్రాప్తి
ధ్యానం - Prolongation of Meditation – స్థిరత నిరతి

ప్రత్యాహారము – Practice of Concentration ఏకాగ్రత ను పెంపొందించు కొను సాధన -

"భాహ్యాభ్యంతర" పీకట్లను (Worries) – నిగ్రహించి, మనస్సును విశ్రాంతి కై మరల్చునట్లు అనగా – పేకాట, సినిమా, నాటకం, క్రికెట్ కామెంటరీ వినడం - - - - విసిగి వేసారి - - - త్రాగుడు (భంగి, ఓపియం – సారాయి, LSD ) మొదలగు మత్తు మందుల సేవించి, తాత్కాలిక మనశ్శాంతిని పొందుట - - - కాని యీ విధానం, మానవుని ఆరోగ్యమును, అంత స్తత్వమును సహా కృంగ దీసి పతితుని( జేయును.

గుఱ్ఱపు పందెములు – వినోద కార్యక్రమములు కూడ, తాత్కాలికోపశమనములే సుమా!

ముఖ్యముగా, మనస్సును "స్వ" విషయ మందుచుకొని, పర విషయముల నుండి మరల్చుట – ఏకాగ్రత, ఇంద్రియములను తమ సహజ విషయ సంపర్క (సంబంధ) వ్యాపారముల నుండి, మరల్చి, అంతర్ముఖ మొనర్చి – చాంచల్యాము నరికట్టి – ఏకాగ్రత (మనస్సు) లక్ష్యము నందు లగ్న మొనర్చి సాధించు క్రియయే "ప్రత్యాహారము" –

ఈ సాధన యోగ పథమున ప్రథమ పాదము. దుస్తరము –దుర్లభము – సాహసోపేతము – ఎదురీత లాంటిది. "10గుర్రములు + 4 విమానముల" – విశృంఖల వీర విహార విజృంభణల నరికట్టి, ఏకోన్ముఖ మొనర్చి, త్రొక్కి పట్టు బృహత్క్రియ - - - ""చంచలం హిమనః కృష్ణ ప్రమాథి బలద్దృఢ" - - - అన్నాడు విజయుఁడు భయపడి. "గాలినైన మూట కట్ట వచ్చు – మనస్సు నెట్లు పట్టగలను" - - - కోతి మూకల తీర్చితిద్ది స్వాధీన మొనర్చుకొని, విజయమందు సామర్థ్యము ఒక్క శ్రీ రామ చంద్రునికే చెల్లు.

"మర్కట స్య మధు పానం  మధ్యే వృశ్చిక దంశనం
తన్మధ్యే భూత సంచారం" - - - - - ఇది మనః స్వరూపం.

తా|| అసలే కోతి. దానికి దయ్యం పట్టినది. మద్య పానం సేవించినది. తేలు దానిని కుట్టింది. అప్పుడు కోతి ప్రవర్తన ఏలా వుంటుందో, మనస్సు ప్రవర్తన ఎప్పుడూ అలాగే వుంటుంది.

"చిత్తము విషయములందు లగ్నము కాక యుండగా, ఇంద్రియములును విషయ విముఖములై చిత్తము ననుకరించియుండుట" - ప్రత్యాహారము

-- పతంజలి.

బహు జన్మ కర్మ వాసనలు –
ఈ జన్మ ప్రతికూల పరిస్థితులు –
ప్రారబ్ధ ప్రాబల్య బలము –
బాహ్యాంభ్యంతర వాతావరణ ప్రభావము!!

వీటి ప్రాబల్యము చాల వరకుమానవుని ఆధ్యాత్మిక ప్రగతి – తిరోగతులకు దోహదమొసంగును. కాని, పురుషుఁడు "ఆవేశోద్రేక ద్వేషాదుల తోను, తీవ్ర తర ధృఢ విశ్వాస అబ్యాస బలము – గురు సంపూర్ణ సహకార అనుగ్రహములతోను – పంచ శీలముల సాయమునను - - - మనస్సును (వృత్తులను) నిరోధించి, యింద్రియ పరాఙ్ముఖ మొనర్చి (అంతర్ముఖమొనర్చి) లక్ష్య (ధ్యేయ) మందు నిల్పి - - - చాంచల్యమును క్రమాభ్యాసమున పోకార్చి – స్థైర్యమును సాధించి - చిద్విలాస పరతత్వాను సంధాన మొనర్చు ప్రయత్నమే "ప్రత్యాహారము".

(10 + 4) ఇంద్రియములు క్రమముగా తమ తమ వ్యాపారములు తగ్గి – బలహీనమై – దిగజారును. వస్తువులు కాన్పింపవు – మాటలు విన బడవు మనస్సు లోనికి లాగ బడి – ఖైదీయై - - - చిత్త శాంతి - ఇంద్రియ విజయము – పరమానందము – ధన్యత - శుభోదయ మగును.

ధారణ :- ప్రత్యాహార ఫల సమాప్తి స్థితి ప్రారంభం.

చిత్త స్థైర్యము – ఇంద్రియ జయము – ఏకాగ్రత – నిర్మల – నిశ్చల ధ్యాన శక్తికి ప్రాతి పదిక. అచల – ఏకాగ్రత – హృదయ కుహరమున జ్యోతిర్మయుఁడై ప్రణవ ధ్యానమున నుండుట. హృదయ కమలమున మనస్సు నెక్కువ కాలము లగ్నము చేయుట.

అంతః కమలముల అధిష్ఠాన దేవతల ధ్యానము –

| అనగా (అంతః) | (బాహ్యా) లక్ష్యములు. |
|---|---|
| మూలాధార | గణపతి |
| మణిపూరక | లక్ష్మీ నారాయణులు |
| అనాహత | పార్వతి పరమేశ్వరులు |
| విశుద్ధ | ఈశ్వరుఁడు |
| ఆజ్ఞా | సదాశివుఁడు |
| సహస్రార | పరమేశ్వరుఁడు (పరమ పురుషుఁడు)రుషోత్తముఁడు |

రోజూ క్రమముగా ఆయా చక్ర స్థలములందు, మనస్సును నిల్పి – వృత్తి రహితమై – ప్రాణము యొక్క రాక పోకలు 1 జాము (రోజూ) నిల్పిన సమర్థుఁడగును. అనగా అంతః మరియు బాహ్యా లక్ష్యములందు మనస్సు నిల్పుట యని యర్థము.

"ఏకాగ్రత" – "ఏక ప్రవాహము" (ధారణ – ద్యానములు) బాహ్యా లేక అంతర ఏక లక్ష్య ధ్యాన ఫలము, ముఖ్యముగా "అనాహత లేక సహస్రార" కమలము నందు మనస్సు నిల్పు సాంప్రదాయము ( హృదయ – భ్రూమధ్యము లందు) – సుప్రసిద్ధము – "కోతికి మెడ గొళుసు బిగించుట" – చాపల్య రాహిత్య స్థితి.

1. సిద్ధాసనమున సుఖాసీనుఁడై – ఏకాగ్ర చిత్తుడై – తన ఆత్మను "పూర్వారణి" గాఁజేసి – ప్రణవమును (ఓం) – ఉత్త్రారారణిఁగాఁజేసి (ధ్యాన మథనము) చిలుకుటచే – "ఆత్మ నవనీతము" బ్రహ్మ తేజో రాశి ప్రాప్తించును. (అరణు లనగా యాగాగ్ని కొరకు నియోగించు రాపిడి కర్రలు"

2. ఆలాగే హృదయామృత భాండమున - ప్రణవ కవ్వముతో – ధ్యాన మర్థనమొనర్చిన – అమృత రూప పరమాత్మ సాక్షాత్కారము ప్రాప్తించును.

--- ఉత్తర గీత

కోట్లను మార్చినట్లు – హృదయమును (మనస్సు)మార్చ లేము. ధ్యాన సిద్ధిని పొందిన మనస్సు ధ్యేయా కారమై - రాకెట్ల వలె విజృంభించి, ఊహాతీత విజయ ప్రాప్తి తథ్యము. -- యోగ దీపిక.

కోతిని –
- మెడ గొళుసు బిగించుట = ప్రత్యాహారము
- కోతిని కర్ర కొన కెక్కించుట = ధారణ
- కోతిని ఇంక దించ రాదు = ధ్యానము

ధ్యానము – (ఉపాసన = లక్ష్య ధ్యాన స్థిరత్వం)

- ఆభావ – ఆత్మ శూన్యము – నిర్గుణము – అని ధ్యానించుట
- మహాభావ – ఆత్మ నిష్కళంక – నిర్మలానంద స్వరూపము పరమాత్మ యేనని భావించి ధ్యానించుట

ఏ స్థితి యందు యోగి తానును, సమస్త విశ్వమును కూడా బ్రహ్మ మేనని కను గొనునో అట్టి దివ్య యోగమునకు ఏ యితర యోగము సాటి రాదు.

1 ధారణ = మనస్సును 12 క్షణము లొక లక్ష్యమందు నిల్పుట.

12 ధారణలు = 1 ధ్యానము

12 ధ్యానములు = 1 సమాధి.

ధ్యానము - ధారణ యొక్క ఏక భావ ప్రవాహ రూపమైన జ్ఞానము చిత్త ఏకాగ్రత క్రియ. ధ్యానము వల్ల క్రమముగా విజాతీయ – సజాతీయ – స్వగత – భేధ వృత్తులన్నియు నశించును. తదుపరి సజాతీయ వృత్తు లేకమై ధ్యేయా కారమున లయించును. స్థిరమై తద్రూపమున నిల్చి తన్మయమగును. వృత్తి ఏక ప్రవాహము – "భ్రమర కీటక న్యాయ ఫలము" – అభ్యాస ఫలము – ధ్యేయమును (లక్ష్యమును) పదే పదే ధ్యానించుట అనగా "సదా తద్భావ భావితః" – ఎల్లప్పుడు అవిచ్ఛిన్న (ఎడ తెరిపి లేని) తైల ధార వలె, ఏక ధాటిని, నిష్ఠగావించుట – (అర్జునుని లక్ష్య దృష్టి వలె) – పర చింతలు మాని "స్వభోధ ప్రజ్ఞ యందు ఆత్మతో బుద్ధిని లయ పరచి – ధ్యేయాలంబనంబుతో ఏకత్వ స్థితి నంది "రమించు" ధన్య స్థితి యే ధ్యానము.

ధ్యానము

- సగుణ – హృదయ పీఠమున ఇష్ట మూర్తిని నిల్పి మానసిక పూజ - ఈశ్వర ప్రణిధానము గుర్తింపఁదగును.
- నిర్గుణ – వీరాసనమున, తొడల మీద చేతులుంచుకొని, కళ్ళు మూసి చతుర్వేద మహా వాక్యముల - భావ లక్ష్యాదుల గ్రహించి – దేహ త్రయం తాను కానని, పర బ్రహ్మ స్వరూపమే తాననియు సర్వదా బ్రహ్మ నిష్ఠయందే యుండుట. ఇదే బ్రహ్మో భ్యాస మందురు.

ధ్యానం – ఉపాసన – ఒక చోట నిలుపఁబడిన మనస్సును, భగవదాకార వృత్తిగఁజేయుట – మధ్య మధ్య – యితర కారణములచే "వ్యవహితమగుట" –

గురూప దేశముతో – స్వప్రయత్నం లేకనే ఉపాసన సిద్ధి ప్రాప్తించు టెట్లు? పరుస వేది వంటి గురోర్గురు ప్రత్యేక అనుగ్రహ – కరుణా కటాక్ష – అమృత భోధ ఫలముగా మోక్ష ప్రాప్తి సంభవము అరుదు.

ధ్యాన విధాన వివరము ; -

1. ప్రతి మంత్రమునకును – జపించుతరి – "ఓం" (ప్రణవము – గాయత్రి) చేర్చి – "ప్రారంభమున – కడపట కూడా – ప్రణవోచ్చారణ మొనర్చుట శ్రేష్ఠము – పూర్ణ ఫల ప్రదాయని.

ఓం రామాయనమః ఓం –

ఓం నమశ్శివాయనమః ఓం – వలె

2. "రేచక – పూరక – కుంభక" ములతో ప్రతి భాగము నందును, ప్రాణాభ్యాస సమయమున , మానసికంగా ప్రణవ ధ్యానం (ఓం) – చేయుట - - "సోహం" (జప + అజప) గాయత్రీ మంత్ర జపము – తద్వారా ఇంద్రియ జయము – మనో జయము= ప్రత్యాహారము.

ధ్యానమున త్రిపుటి గలదు (Trinity) –
- ధ్యాని (మనస్సు)
- లక్ష్యము (ధ్యేయము – మూర్తి – లేక నిర్గుణం)
- ధ్యాన క్రియ

ఫలము – శాంతి – ప్రసన్నత – ఆనందము – చిద్విలాసానుభూతి ప్రాప్తించును.

ధ్యేయము (లక్ష్యము) –

1. నాసికాగ్ర లక్ష్యము (శాంభవీ ముద్ర) – భ్రూమధ్య
2. అష్ట దళ కమలము (సహస్రారము – అంతర్లక్ష్యము)
3. హృదయాకాశ మధ్య (దహరకుహర) లక్ష్యము - జ్యోతి స్వరూపము. –

తపస్సు - ఏకాదశేంద్రియములను తపింపఁజేయుట. సంతర్పణ కలవాటు పడ్డ యీ అరబ్బీ గుఱ్ఱములు సులభముగా లోబడవు. అభ్యాస వైరాగ్య భోధోపరతులను యుక్తి కౌశలముతో సాధించిన గాని జితేంద్రియ ప్రాప్తి లేదు. ముఖ్యంగా శ్రవణ, మనన, విచారాదులతో ప్రారంభించి --- విపుల విచారాదులచే "దృక్" (నేను) ఆత్మ – నిత్య సత్య శాశ్వతమనిన్ని, దృశ్య జగత్తంతయు – అనిత్యం, అసత్యం, అశాశ్వతం, అనిన్ని – గ్రహించి – సాధించి – అనుభవించిన వాడేముక్త పురుషుఁడు. ఇంద్రియ జిత్!!

ద్వైతత్వంలో పరస్పర వ్యతిరేకములగు రెండును
- దృక్- సత్యం – (శాశ్వత్వం) = ఆత్మ = చిత్
- దృశ్యం – కల్పితం – (వైకల్పికం –అశాశ్వతం) = అనాత్మ = అచిత్

దృశ్యము నశించుటే మోక్షం : దృక్ – దృశ్యముల కలయికయే "దృష్టి లేక దర్శనము" – "విషయేంద్రియ సంపర్కము". దీనికి కారణము మనస్సు - సంకల్ప రూపము.

పరబ్రహ్మకు ఆది సంకల్పము వల్ల ⟶ చతుర్ముఖుని జననం.

ప్రాణి
- అధి భౌతిక (1) – కర్మ కొరకు ప్రకృతాంశ –పాంచ భౌతిక జడ – వినాశి -
- అతి వాహిక (2) – లింగ శరీరము – సూక్ష్మ దేహం – అమృతాంశ – మృత్యువునకు దొరకదు. (జీవుఁడు) –

దృక్ + దృశ్యము = మనస్సు –

(ఆత్మ) (అనాత్మ) ⟶ ఈ రెండును కాదు – రెంటిని కల్పి (సంధించు)

కల్పిత – మాయా మృగము – "సంకల్పము" – "బంధము"

"గ్రంధి" – చిద చిద్గ్రంధి : -

"వెలుగును నేనే – అన్నింటికి వెలుగు నిచ్చెడి వాడను నేనే"

తేజ పంచకము నా తేజముననే ప్రకాశించును –

సచ్చిదానంద తత్వమైన యోగ సంపూర్ణ పరమావధిని నేనే.

ప్రాణ + మనోవృత్తులు + ధ్యాన లక్ష్యం ⟶ మనో లయం (సమాధి).

1. అద్వైత సిద్ధాంత రూప జల సాగరం – వేదాంత గ్రంధములు (ప్రస్థాన త్రయాదులు) అందలి అధ్యాయ తరంగ జాతము – హంస నౌక – బుద్ధి చుక్కాని – ఆత్మ గమ్య స్థానము – జీవుడు ప్రయాణికుడు – ఇంద్రియములు + విషయములు + అరిషడ్వర్గములు = జల చరములు, సుడిగుండములు, తుఫాన్లు – సర్వ సాగరోత్పాదములు - - భక్తి జ్ఞానాదులు తరణ రక్షణ సాధానాతీతులు –

2. సంసార సాగరం లో జిజ్ఞాసువు యొక్క బుద్ధి నౌక – అభ్యాసం శుభ పవనం – బ్రహ్మ నిష్ఠాచారుఁడైన కర్ణ ధారుడు (చుక్కాని) – జీవ యాత్రికుడు – సంసార సాగర తరణము – సాధన ఫలమే "మోక్షము" -

ధీ = బుద్ధి
ధీర
ర = రక్షణ

సర్వత్ర బుద్ధి రక్షణ సాధన శక్తి –

త్రిపుటి యేకమై – ధ్యేయా కారమై – తన్మయత – తాదాత్మ్యం – ఇదే యోగ సాధన పరమా వధి – అపరోక్షాను భూతి – సమాధి స్థితి – ఆత్మ సంయమ యోగ ఫలము.

ధ్యాన క్రియాంగములు – పంచ శీలములు – శ్రవణ మననాభ్యాస – "ఏక ధారా" సంస్మరణ – "ధ్యానమే" – అనగా –

సంయమము – "ధారణ, ధ్యాన, సమాధులు" – మూడును కలసి.

"ధ్యాన యోగ పరాః" - వీరందరు ఈశ్వర విలాసమును చాటు వారు; (ఈశ్వర విలాసము ప్రత్యేక రచన) –

ఉన్నతోన్నత మహా పర్వత పంక్తులు భగవంతుని శిల్ప శక్తి ఔన్నత్యమును చాటును.

అనంత – అపారవార విశ్వ విశాల సాగరములు – భగవంతుని యొక్క హృదయ వైశాల్యమును చాటును –

అసంఖ్యాక దివ్య సుందర నందన వనములు – కాశ్మీర్ – స్విడ్జర్లాండు లో వలె –

పరమ రూప రేఖా విలాస సౌందర్య రూపులు –

అత్యద్భుత శిల్ప – చిత్ర లేఖన – గాన – కావ్య – పాండిత్యాది కళాకారులు –

సృష్టి లోని సమస్త – మానవ, జంతు, సర్ప, పక్షి, వృక్షాదులు - - ప్రభుని యపూర్వ శక్తి ప్రాభవాన్ని చాటును.

సూర్య, చంద్ర – నక్షత్ర మేఘ – విద్యుల్లతాది గగన చిత్తరువులు – వరుణ వాయు అగ్ని జల పృథ్వ్యాదులు, ఋతువులు – రంగులు – నానా ఇంద్ర మహేంద్ర జాల మాయామయ శక్తి ప్రభావప్రదర్శనము ఊహాతీతము కాదా? మనస్సు – మాయ – స్త్రీ వంటిది. మరువ రాదు!!

మానవుని మనస్సు ఉపాధులలో కెల్ల మహా బలవత్తరమైనది. నిగ్రహానుగ్రహ (శాపాశీర్వాద) శక్తు లనగా మహిమాన్విత యోగ బల ప్రభావమే. యోగ సాధనల వల్ల మనస్సు సంస్కరింపఁబడి, సత్వ శుద్ధ మై, శక్తి మంతమై చురుకు మెలుకువలు గల్గి, అనునయ – ఉపయుక్తంబై యుండును. మనస్సు ఎంత చంచలమో అంత

బలవత్తరమై – ప్రమాద భరితమైనది. ఆంజనేయుడెంత చపలియో – అంత ఘనుఁడు – అప్రతిహత శక్తిమాన్ –

యోగి అహంకార రహితుఁడు, నిగర్వినని కూడా గర్వింపరాదు.

బ్రహ్మ చర్యము, అహింస, క్షమ, సత్యము, ఆస్తిక భావము, నిస్సంగత్వము, అక్రోధము, అభయము, భగవదాయత్త చిత్త స్థితి – శరణా గతత్వము – పవిత్రత – అద్వేషము – దయ – కరుణ – సమత – అహంకార మమకార రాహిత్యము – అసంశయం (విశ్వాసం) – ధృతి, "హర్ష క్రోధ భయ విషాద వికార దూరుడైన" - - - అనపేక్షశ్శుచిర్దక్షాది సర్వ లక్షణ సమన్వితుఁడు - - - అభయం సత్వ సంశ్శుద్ధ్యాది భగవల్లక్షణో పేతుఁడైనవాడు - "యోగ రాజు" – రాజ యోగి" –

భ్రూమధ్యమున ఆకాశ సంధి కలదు. (ఘటాకాశ – మహాకాశముల) – గురూప దిష్ట ఉపనయన సునీల ద్వారావతి (నీల తోయదమధ్యస్థా విద్యు ల్లేఖేవ భాస్వరా, నీ వార సూక వత్తన్వీ పీతా భాసస్సమానమ) - - స్వారాజ్య పదవి – కల్యాణము –

సమాధి – ధ్యానమే ధ్యేయాకారముగ వెలింగి –ఏకమై – తన్మయమై – ధ్యేయ స్వభావావేశము నొందుట. అతీత స్థితి. చిత్త శుద్ధి – సత్య జ్ఞానానంద – నిరతిశయ తృప్తి – సర్వ సమత్వం – జితేంద్రియత్వం – ద్వంద్వాతీత సహజ స్థితి.

సమాధి – త్రిపుటీ రహిత – ద్వందాతీత – బ్రహ్మాకార వృత్తి – దేని వల్లను అడ్డు తగులని ఏకాకార వృత్తి – బ్రహ్మానందాను పదవి. బ్రాహ్మీస్థితి – తురీయము. రాగాది దోష దూషితము గాక – అచంచల మనోవ్యాప్తి చేత – శుద్ధ బ్రహ్మ భావమును బడయుట – ప్రజ్ఞారూపానుభావమే-



(B) నిర్వికల్పము – బాహ్యాభ్యంతర భేధముల చేత 6 విధములు.

1. బాహ్య దృశ్యాను విధి –

నేత్రములకు గోచరములగు సమస్త బాహ్య దృశ్యములున్ను – చేతనా చేతనములు తన తెలివి యందె పుట్టి నశించును గనుక – అట్టి దృశ్యములకు – తాను విలక్షణుడనియు – తానే పరబ్రహ్మ స్వరూపుడ ననియు తలంచుట.

2. ఆంతర దృశ్యానువిధి –

తనలో సహజముగ పుట్టు అంతర్దృశ్యములకు తాను విలక్షుణుడనియు, పరబ్రహ్మ స్వరూపుడనియు తలంచుట.

3. బాహ్య శబ్ధాను విధి –

బాహ్య శబ్దములనెడి నామములకు తాను విలక్షుణుడనియును, నామ రూప క్రియా రహితమగు పర బ్రహ్మ మని తెలయుట.

4. అంతః శబ్ధాను విధి –

అంతశ్శత్రు విజృంభణ శబ్ధములనగా – అరిషడ్వర్గ ప్రేరేపణలు మొ|| వాటికి తాను విలక్షణ బ్రహ్మమని తలంచుట.

5. బాహ్య నిర్వికల్ప సమాధి - పై నాలుగు విధము లగు సవికల్ప సమాధులందును – బాహ్యంతరములందు తనకంటె భిన్నమైన దేదియు తోచక పర బ్రహ్మ స్వరూపముగనే కాన్పించుట.

6. ఆంతర నిర్వికల్ప సమాధి – తాను విలక్షణుడనియును నిర్వృత్త పరబ్రహ్మ – అఖండ పరిపూర్ణ సచ్చిదానంద స్వరూపుడనెడి యనుభవమే "ఎఱుక" – ప్రజ్ఞయే – యోగ పరమా వధి :

శ్లో|| యస్సర్వ త్రానభిస్నేహ స్తత్తత్ ప్రాప్య శుభా శుభమ్
నాభినందతి నద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా

తా|| అతడు తన దేహమునందుగాని, కళత్రాదుల దేహములందు గాని స్నేహము చేయక తటస్థుడుగా నుండును. శుభా శుభములు కలుగు నపుడు కావలయుననడు, వలదనడు, ద్వేషించడు, స్నేహము చేయడు, వాడే స్థిత ప్రజ్ఞుడు. వాని యింట మరణమైనను పుట్టుకయైనను వాని కొకటే.

-- భగవద్గీత. అ. 2. శ్లో. 57.

ఎన్ని నదులు తన యందు ఎడ తెగక పడుచున్నను – ఎన్ని మేఘములు సూర్య తాపము చే రచియింపఁబడు చున్నను – తన గర్భమున ముత్యములు – పగడములు – రత్న రాసులు – నవ నిధులు – క్రూర ఘోర జల చరతతులు - - - ఎన్ని యున్నను ఏ మాత్రము చలింపక, అచంచల – స్థిర తత్వమును ప్రదర్శించు సాగరము వలె . . . . . "స్థిత ప్రజ్ఞుడు" "తరతి శోక మాత్మవిత్" . . . . . . సమస్త ద్వంద్వముల కతీతుఁడై – చలింపక – సత్య నిత్య సుఖ రూప పరబ్రహ్మమే తానని నిశ్చయాత్మక బుద్ధి తో – సర్వాతీతుడై ఉత్కృష్ట పదవిని బడయును: ఇదియే సమాధి స్థితి.

ఇదే బ్రాహ్మీ స్థితి – ఈ స్థితి నుండియే మహర్షులు అద్వైతామృత కుంభ వృష్టిని – ఉపనిషత్ప్రవచన రూప మున – బ్రహ్మ వాక్కులు – దివ్య సూక్తులను – ప్రవచించి లోక పావనులైరి: అందుకే జీవ బ్రహ్మైక్య – (సమాధి) స్థితిని "ధర్మ మేఘమందురు"

నైతిక సమాజము : - మొదటి మూడు ఆశ్రమ జీవనము.

ధర్మాతీత సమాజము : - సన్యాసము – మహోత్కృష్టమైనది.

సన్యాసి ప్రపంచ బాహ్యుడుగ సంఘమునకు దూరమున నున్నను – లోక కల్యాణ ప్రియుడు – సర్వ జీవ కృపా పరతంత్రుడుగ నుండును: విశ్వ మానవ కల్యాణమే అతని సంకల్పము –

చిత్తము భూమికా భేధమున 5 విధములు.

1. {
   1. క్షిప్త – రాగ ద్వేషాదుల బలం వల్ల విషయాసక్తతతో చిత్తము ఈగ వలె చలించును.
   2. మూఢ – నిద్ర, బద్ధకం, కునికి పాట్లు కూడిన చిత్త భూమిక.
   3. విక్షిప్త – విషయాసక్తమయిన్ని, అప్పుడప్పుడు దైవ చింతన కలదు.

2. { 4. యేకాగ్ర – అవిచ్ఛిన్న – తైల ధార వలె – ఘంటా నాదం – సంప్రజ్ఞాన సమాధి – లక్ష్య శుద్ధి –

3. { 5. నిరుద్ధ - ధర్మ మేఘము.

జ్యోతిశ్శాస్త్రమున "జీవన విధానమని"
వైద్య శాస్త్రమున "ప్రయోగమని"

వేదాంత శాస్త్రమున “కూడిక – లయము”

- “నిష్ఠ” అని అర్థము.

ప్రతి దినమున – ప్రయత్న పూర్వముగ – బ్రహ్మ మూర్త సమయముననుసాయం సమయముననుసాయం సమయమునను . . . . . మామూలుగా – ఏకాంత ప్రదేశమున – శుచిగా – పవిత్ర వాతావరణమున – భాహ్యాభ్యంతర అలజడులు – పొగ – ఆవిటిగాలి – మొ|| ఆటంకములు లేని – ప్రదేశము మిగుల ఎత్తు తగ్గులు లేని చోట – జింక చర్మము – దర్బ చాపలు – దాని మీద మృదువైన వస్త్రపు మడత పరచి – సుఖ – స్థిరాసనమున – అన్య చింతనలు మాని – మనస్సు ఏకాగ్రమొనర్చి – గురు ఆదేశ ప్రకారం లక్ష్యమున (భ్రూ మధ్యముననో – హృదయ కమలము నందో) (?) – దృష్టి గురి నిడి - - - (అంతర్ముఖ మనస్కు(డై) - - ధ్యాన మొనర్ప వలెను. సగుణ నిర్గుణో పాస్తుల కందరికిని, - శిరము మెడ, దేహము, సమముగా, నిశ్చలముగా, దిక్కులు చూడక, నిర్భయు(డవై, ప్రశాంత చిత్తు(డవై, సావధాను(డువై, బ్రహ్మ చర్య వ్రత దీక్షతో, బుద్ధిని “భ్రూమధ్య” (శాంభవీ ముద్ర) – మున లగ్న మొనర్చి, కేంద్రీకరింపవలెను. ఇదియే ధ్యాన క్రమము –

ఉచిత, సాత్వీక, మితాహార విహారము – మిత భాషణ – నిద్రలు గల్గి, క్రమముగా దృఢ శ్రద్ధాసక్తులతో, భక్తి జ్ఞాన వైరాగ్యాది మెలుకవలు గల్గి పూర్ణ విశ్వాస – ఉత్సాహ – ఆర్తులతో ఆత్మ ధ్యాన మభ్యసించు వారు ధన్యులు –

లౌకిక – ప్రాపంచిక కార్యములే ముఖ్యావసరములని, యోగాభ్యాసమును నిర్లక్ష్యము చేయరాదు. దేహ సుఖాభి వృద్ధుల కాహార మెంత పోషణ కారియో – ఆత్మోన్నతికి, మోక్ష సామ్రాజ్య పదవికి యోగాభ్యాసమంత అవసరము.

దివ్య ప్రసాదితమైన పవిత్ర దేహమును – జీవిత కాలమున వృధా చేయక సాధకుడు సార్థక జీవియై “యోగః కర్మ సుకౌశలం” – మరింత శ్రద్ధ – ఆసక్తి – నేర్పరితనమును – నిర్దుష్టముగను, ఆదర్శముగను, లోక హితార్థమై, పురుషు(డు (స్త్రీ కూడా) – ముముక్షువు, సాధకు(డు – మోక్షకామియై – నిర్విరామ కృషి సాగించ వలెను. ఇహ పర సాధన కర్మ లందు తారతమ్యముండరాదు. లోక సేవ చేయ జాలని మానవు(డు లోక ఋణమున( బోవును.

వృత్తి నిరోధమే (నివృత్తి స్థితి) – అనగా మనస్సు అంతర్ముఖమైన . . . . “ఆత్మ + వృత్తుల” (మిశ్రమైన) ⟶ మనస్సగును. ఆ వృత్తులను తీసి వేసిన –

నశింపఁజేసిన మిగులునది "శుద్ధాత్మ" యేః ఈ విధముగ వేరు చేయు నట్టి పలు విధములైన ముక్తి మార్గములే "యోగములు" – అవి అన్నియు అనుభవ జన్య శాస్త్రీయ పథములే!!

ఈ (కర్మ యోగ – జ్ఞాన యోగ) – రాజ యోగ రహస్యము న కధికారి యగు సూర్యుడు – భగవంతుని కర్మాధికారి – సూర్య వంశముల రాజులకుపదేశించెను. అందు వల్ల సత్పరిపాలన – పరివర్తన శీలమైనందున – ప్రజలు సుఖించి – దేశము శోభించెను. కాల క్రమమున ధర్మ ప్రవర్తకులగు రాజ ఋషులు లోపించుట చే ఆ యోగము మరుగు పడి, లోకము అంధకారమున మునిగినది –

ఈ విద్య రాజుల రహస్య విద్య. మొట్ట మొదట శ్వేత కేతు తండ్రి ఆరుణి ఒక రాజ యోగి యగు రాజు నుండి గ్రహించెను.

-- శ్వేత కేతో పనిషత్.

భూమి సూర్యుని చుట్టడం – 1 సెకండుకు = 18 ½ మైళ్ళు.

వెలుతురు గమనం - 1 సెకండుకు = 18,600 మైళ్ళు

సూర్యుడు సప్తాశ్వరథారూఢుడు.

రాజ యోగము —
- సాంఖ్య (1) – జ్ఞానం – మనోజయం - ఓం
- తారక (2) - యోగం – ప్రాణ జయం – హంస → సోహం
- అమనస్క(3) – నివృత్తి – మోక్ష ఫలం(1) (2) యొక్క-

అనగా "మనో + మారుత" సమ్మేళనం – లయ యోగం –

"జ్ఞానం + యోగం" = రాజ యోగము = యోగ రాజము.

దీనినే – రాజ విద్య – రాజ గుహ్యం – ఉత్తమోత్తమ పరమ విద్య సులభ లభ్యం – ధర్మ స్వరూపం – ఈశా వాస్య మిదం సర్వం" – జ్ఞాన దీపిక – "సర్వం నేనే – నేను లేని దెద్దియు లేదు" – "ఆత్మ పూజ – ఆత్మ ధ్యానము" – ఈశ్వర ప్రణి ధానము ప్రతి పాదితము – శరణాగతి – ఆత్మార్పణ – సర్వాంకిత యోగము.

దీనినే బ్రహ్మార్పణ యోగము – స్వర్ణ యోగము – కేసరీ యోగముః ఇది, గీతా హృదయము – "చేవ – నాభి" అని కూడా అందురు – విద్యల లో కెల్ల రాజు వంటిది – మేటి విద్య. పూర్వము దీనిని రాజులవలబించి, రాజ ఋషులై – పిదప బ్రహ్మా ఋషులైరి.

"మనోజయ విద్య" (రస విద్య) అనగా – రసము, మనస్సు వలె చంచల మైనది కావున – మనస్సును రసముతో పోల్చినారుః ఈ విద్య భగవంతుడు తొట్ట తొలుత సూర్యునకు – సూర్యుడు (సూర్య వంశము) రాజులకు తెల్పిరి. దీనిని, "అవతార యోగము" – "కర్మ బ్రహ్మార్పణ యోగము" – " జన్మ కర్మ యజ్ఞ విజ్ఞాన యోగము" అని అందురు.

సూర్యుడు తేజో రాశిః అతని ఆగమన అనుగ్రహంతో సూర్య వంశపు రాజుల్లోని అజ్ఞాన నిభిడాంధకారము పటా పంచలయ్యెను –

రాజ యోగము – తారక, సాంఖ్య, అమనస్కములని 3 భాగములు.

-- శ్రీ సీతా రామాంజనేయం.

1. తారకం - మనశ్శుద్ధి కారకంబు. పంచ ముద్రలు మొ|| ప్రాణాయామాది – హఠ యోగములు గలది.
2. సాంఖ్యమాత్మ స్వరూప విచార భాగము. జ్ఞాన యోగ పరమావధి.
3. అమనస్కము – అనుభవ జ్ఞానము – అపరోక్షాను భూతి ప్రాప్తి – జ్ఞాన + యోగముల యొక్క – ఏక లక్ష్యము

ఆత్మ విద్య – ఆది విద్య – ఏక గమ్యము – దీనినే బ్రహ్మ విద్య – మూల విద్య . . అందురు

తారకమన – జనన మరణ సంసార సాగరము నుండి తరింపఁజేయునది. తరణ సాధనము – దీని వల్ల మనశ్శుద్ధి – తద్వారా – పరమాత్మ స్వరూప విచార జ్ఞానము - బ్రహ్మ జిజ్ఞాస వల్ల – బ్రహ్మప్రాప్తి – ఇదే రక్షక జ్ఞాన మందురు.

మంత్ర యోగమే "తారక" – ప్రణవము – భవ సాగర తరణి. ప్రాణ వాయు ఘోషణమే ప్రణవ నాదంః మనోగ్రమై, అందుకు ప్రతి బింబ మైనదే ప్రణవము

"అ + ఉ + మ్" = ఓం

(నాదము + బిందువు + కళ) -

# 15. జప - అజప గాయత్రి.
## ప్రవేశిక

**ఓం – హంస**

**హంసోం -- సోహం**

**అజప గాయత్రి -- హంస విద్య**

**మహా మంత్రము**

**హంసం + ఓం = హంసోం -- సోహం**

**జప + అజప = సోహం.**

రాజ యోగ సులభ సాధన – దేహము అంతరంగమున – ఆద్యంతము – నఖ శిఖ పర్యంతము – ప్రాణ సంచార – సంచలనము వల్ల ప్రణవ నాదముత్పన్న మగుటను – సాధారణ ప్రయత్న గమనిక వల్ల, ప్రతి ఒక్కరు "నాద బ్రహ్మము" ను, గ్రహించ గలరు.

సులభ యోగాభ్యాస సాధనకై మనస్సున నాదము నందు, అభ్యాస యోగ సాధనతో "లయింప" జేయుటత్యంత – ఉత్తమోత్తమ దివ్య పథము. మనస్సు క్రమముగా అంతర్ముఖమై లయ యోగ సిద్ధి ప్రాప్తించి (మనస్సు లయించి) అమనస్క (రాజ) యోగ పథ గమ్యమును చేర్చును.

వివరములిందు విపుల విశదీకరణ మగును!!

ఓం

"బ్రహ్మమునకు ఓం కారంబు వాచకంబు!
అఖిల జగమునకున్ బ్రహ్మ మాత్మగాన!
వాచకము ప్రణవంబుసర్వంబునకును
"ఓం" సర్వమునకు ప్రాణము – ప్రధమారాధ్యము"
-- (తైత్తిరీయం), – రావు బహదూరు బచ్చు పాపయ్య శ్రేష్టి.

| | | |
|---|---|---|
| అ కార లయముతో | ఉ కార లయముతో | మ కార లయముతో |
| (ప్రథమ) | (ద్వితీయ) | (తృతీయ) |
| భూమి, అగ్ని - | అంతరిక్షము | ద్యులోకము, సూర్యుడు |
| ఋగ్వేదము | యజుర్వేదము | సామ వేదము |
| భూలోకము | భువర్లోకము | స్వర్లోకము |
| బ్రహ్మయు పుట్టుచున్నారు. | సనాతనుడైన విష్ణువు పుట్టు చున్నారు | మహేశ్వరుడు పుట్టు చున్నారు |
| "అ" కారము–పచ్చని రంగు | "ఉ" కారము-తెల్లని రంగు | "మ" కారము-నల్లని రంగు |
| రజో గుణమును పుట్టించును. | సత్వ గుణమును పుట్టించును | తమో గుణమును పుట్టించును |

అ + ఉ +మ్ = "ఓం" జ్యోతి స్వరూపము పుట్టునుః
"ప్రత్యగ్రూపా, పరాకాశా, ప్రాణదా, ప్రాణ రూపిణీ"
-- శ్రీ లలితా సహస్ర నామ స్తోత్రం (781 -784).

"భ్రూ మధ్యమున ఆకాశ సంధి గలదు. గురూప దిష్ట ఉపనయనాంతర్గత సునీల ద్వారకావతిఁజొచ్చి కుచేలుడు (మనస్సు) చరితార్థుఁడయ్యెనుః జీవుడు దేవుడౌను. అగతికుఁడు అతులైశ్వర్యవంతుఁడగునుః మానవుడు మాధవుఁడగును!! –

గర్భ గోళమున ప్రాణాది వాయు సంచార సంచలనము వలన గల్గు నాంతర శబ్దమే "ప్రణవ నాదంబనఁబడును.

దశ విధ (ప్రణవ) నాదములందును చిద్బిందువు నందును కళలయందును } తోచఁబడు - అశేషవిశేషములకు సాక్షియు, చిద చిదాత్మకములగు, చతుర్వింశతి తత్వములకు నధీశ్వరుండును, జ్ఞానాధికుండును, పరతత్వ జ్ఞాన స్వరూపమే సర్వసాక్షి.

"వాయు + మనో" – నిగ్రహవిద్యయే హంస తత్వానుభవము.

క్షీర నీర (సార అసార) విభజనయే హంస వృత్తి – చిద చిత్ వివేక రహస్య మిదియే –

- జప గాయత్రి - సావిత్రి

ఓం – శబ్ద బ్రహ్మము – ఆది మంత్రము – సర్వ మంత్ర మాతృక – సర్వోపనిషత్సారము - చతుర్వేద సార సర్వస్వం –

ప్రణవము = అ + ఉ + మ్ = ఓం = 3 మాత్రలు + ½ మాత్ర( తురీయము.

ఏకాక్షరం – అక్షరం = ఆత్మ మంత్రం = వేద సార తారకం – "ఓం"

"ఆది లో ఒక శబ్దము పుట్టెను" -- బైబిల్.

ఈ ఆది శబ్దమునే "గ్రీకులు" – "(Logas)" "లోగాస్" అందురు.

అదే ప్రణవ శబ్దము – శబ్ద బ్రహ్మము – "ఓం" – ఇదియే ఆది మంత్రము.

గాయత్రి = గాయః + త్రి = Singing of the three – అనగా "అ + ఉ + మ్" = ఓం (మూటిని కల్పి పాడుట) –

"ఆదిలో నిర్గుణ బ్రహ్మము నందొక నాదముదయించెను" ఆ నాదోపాసన వల్లనే యోగీశ్వరులు నిష్పాపులై ముక్తి(గాంచిరి. అదియే "ఓం" కారము – శబ్ద బ్రహ్మము.

"ఓం" కారమే సర్వ వేద – వేదాంత (ఉపనిషన్మూలమై) మూల భూతమగు వేద మాత – శబ్ద బ్రహ్మము.

అర్ధ నారీశ్వరుని వలె ⟶ సగుణ + నిర్గుణ (ప్రకృతి పురుషుల) రూపిణి యైనది. ఆది పరాశక్తి – త్రిపురాంబ.

ఓం కారము త్రిగుణాత్మకము. "అ + ఉ + మ్" త్రి వర్ణ రూపమైనదిగా ప్రకాశించెను.

అంత నా బ్రహ్మ దేవుడా ప్రణవము వలన – "స్వరము – స్పర్శము – ఊష్మము – అంతస్థము మొ|| లక్షణములు గల "అక్ష"ర ("అ" నుండి "క్ష" వరకు) సముదాయమును సృష్టించెను. అందుండి యే "వేద" జననము. సమస్త మంత్ర రాజములకు ఏకైక మూలము – మాతృక – ప్రాణ బీజము – "ఓం" – (అక్షర మాల)

"సమస్త కామ సంకల్పములు – వాసనలు – దేహాభిమానములు – ఇంద్రియోద్వేగములు – విజృంభణలు" (సమస్త వృత్తులు – ద్వంద్వములు – మొ||) లేక, నివృత్తి పథమున, నిష్కామియై నిర్గుణోపాసనా సాధనమున, బ్రహ్మ సాక్షాత్కార ప్రాప్తి తథ్యము. ఇదియే మోక్షము. స్వారాజ్య పదవి.

వేదము లందలి వేద విద్యలు 32 – నానా ఉపాసనలు – అన్నియు "ప్రణవోప" పాదిత నిర్గుణోపాసనలే. భ్రమర కీటక న్యాయమున, ప్రణవోచ్చారణ మార్గమున శబ్ద బ్రహ్మము నాశ్రయించిన బ్రహ్మత్వ మబ్బుట నిజము. సర్వ కాల సర్వావస్థలయందును, ఆత్మ ధ్యాన ఫలముగ దేహాత్మ బుద్ధి నశించి, అమృతత్వ ఆనంద పదవి ప్రాప్తించును.

"భ్రమ జ్ఞానము పోయి బ్రహ్మ జ్ఞానము కల్గును."

ప్రణవోచ్ఛారణ 3 విధములు :-

హ్రస్వము - సమస్త పాపములను భస్మము చేయును.

దీర్ఘము - మోక్ష దాయకము

ప్లుతము - సర్వ సిద్ధి ప్రాప్తి. ప్రణవ ధ్యానికి ఆత్మ దర్శనం తథ్యము. – పతంజలి.

"ఓం కారం సర్వ వేదానాం" -- అశ్వ. 44 - 6.

శ్లో|| ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహర న్మా మనుస్మరన్
యః ప్రయాతి త్యజన్ దేహం స యాతి పరమాంగతిం

తా|| అట్లు ప్రాణ వాయువులను సహస్రారము వరకు చేర్చి భగవంతుని స్మరించుచు, ఓం ఉచ్ఛరించుచు దేహము త్యజించు వాడుత్తమ గతి ని చెందును.

-- భగవద్గీత. అ. 8. శ్లో. 13.

శ్లో|| మహర్షీణాం భృగు రహం గిరా మస్మ్యేక మక్షరమ్
యజ్ఞానాం జపయ జ్ఞో஽స్మి స్థావరాణాం హిమాలయః

తా|| ఋషులలో శాంతముగల భృగు మహర్షిని, అక్షరములలో ఓం కారమును, యజ్ఞములలో భగవన్నామ యజ్ఞమును, కొండలలో హిమవత్పర్వతము నేనే యని భావించుము.

-- భగవద్గీత. అ. 10. శ్లో. 25.

శ్లో|| రసోSహ మప్సు కౌంతేయ ప్రభాస్మి శశి సూర్యయోః
ప్రణవ స్సర్వ వేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు

తా|| నీటి యందు రసమును సూర్య చంద్రుల యందని కాంతియు, ఆకసము నందలి శబ్దమును, పురుషుల యందలి పౌరుషము, వేదముల యందలి ఓం కారమును, నేనే యగు చున్నాను.

-- భగవద్గీత. అ. 7.శ్లో. 8.

32 శుద్ధ విద్యలు –

32 వేద విద్యలున్ను "ప్రణవమునే" ప్రతిపాదించు చున్నవి. "ప్రణవోపాసనమే" - ఆది విద్య" – మూల మంత్రము. లింగ (మూర్తి) పూజ పార్థివ పూజః ప్రణవధ్యానం బ్రహ్మోరాధన. (శబ్ద బ్రహ్మోపాసన = నాద బ్రహ్మ) –

గాయత్రి స్వరూపము

ఓం

| అ | ఉ | మ్ | | |
|---|---|---|---|---|
| సత్ | చిత్ | ఆనందము | | |
| నాద | బిందు | కళ | | |
| వినుట | కనుట | మనుట | | |
| బ్రహ్మ | విష్ణు | మహెశ్వర | -- | మూర్తి త్రయం |
| విశ్వ | తైజస | ప్రాజ్ఞ | -- | జీవ త్రయం |
| జాగ్రత్ | స్వప్న | సుషుప్తి | -- | అవస్థా త్రయం |
| నేత్ర | కంఠ | హృదయ | -- | స్థాన త్రయం |
| సూక్ష్మ | స్థూల | కారణ | -- | దేహత్రయం (జీవ) |
| సత్యం | శివం | సుందరం | | |
| ఋగ్ | యజుర్ | సామ | -- | వేద త్రయం |
| అధి భౌతిక | అధి దైవిక | ఆధ్యాత్మిక | -- | తాప త్రయం |
| వైషయక | వాసనాప్రాప్త | బ్రహ్మ సంభవ | -- | సుఖ త్రయం |
| పుణ్యా | పాప | మిశ్రమ | -- | కర్మ త్రయ |
| జీవుడు | ఈశ్వర | ప్రత్యగాత్మ | -- | కర్తృ త్రయ |
| సత్వ ప్రధాన | రజః ప్రధాన | తమః ప్రధాన | -- | బుద్ధి త్రయ |
| సత్వ | రజస్ | తమస్ | -- | శ్రద్ధాత్రయ |
| సత్వ | రజస్ | తమస్ | -- | ధృతిత్రయ |
| సత్వ | రజస్ | తమస్ | -- | గుణ త్రయ |
| ఇచ్ఛా శక్తి | జ్ఞాన శక్తి | క్రియా శక్తి | -- | శక్తి త్రయ |
| భూత | వర్త మాన | భవిష్యత్ | -- | కాల త్రయ |

| | | | | |
|---|---|---|---|---|
| దేవ | భూ | పాతాళ | -- | లోక త్రయ |
| వసువులు | రుద్రులు | ఆదిత్యులు | -- | విశ్వ దేవత్రయ |
| నాభి | హృదయం | భ్రూమధ్యం | -- | లక్ష్య త్రయం. |
| శాంత | ఘోర | మూఢ | -- | వృత్తి త్రయం |
| విరాట్ | హిరణ్యా గర్భ | ఈశ్వర | -- | సమిష్టి |
| వైరాజస | సూత్రాత్మక | అవ్యాకృత | -- | ఈశ్వర త్రయ |
| ఇహ | పర | ఇహ పర | -- | విరక్తి త్రయ |
| బాహ్యా | ఆంతర | ఐకాంతిక | -- | భక్తి త్రయ |
| బహిర్లక్ష్యం | మధ్య లక్ష్యం | అంతర లక్ష్యం | -- | లక్ష్య త్రయం |
| లోక | శాస్త్ర | బ్రహ్మ | -- | జ్ఞాన త్రయం |
| సూర్య | చంద్ర | అగ్ని | -- | మండల త్రయం |
| ఇడ | పింగళ | సుషుమ్న | -- | నాడీ త్రయం |
| గంగ | యమున | సరస్వతి | -- | వేణీ త్రయం |
| కంచి కామాక్షి | మధుర మీనాక్షి | కాశి విశాలాక్షి | -- | అక్షి త్రయం |
| క్రమ ముక్తి | జీవన్ముక్తి | విదేహ ముక్తి | -- | ముక్తి త్రయం |
| అ | ఉ | మ్ | -- | వర్ణత్రయం |

పై మూటి యొక వాచ్యార్థం ⟶ "ఓం" కారములయమొందించి, విశ్వాధిష్టానమును, సర్వాధార భూతమును, పరిపూర్ణంబును నగు తురీయము – అవస్థాత్రయంబు నకు పైది – నాల్గవ అవస్థ – అదియే అఖండ, ఆనంత, అక్షర, అవ్యక్తముః "అ + ఉ + మ్" లు తమలో తాము లయమొంది, పరిశుద్ధమగు కేవల ప్రణవ స్వరూపుండు నై ప్రకాశించును.

అఖండ, పరిపూర్ణ, సచ్చిదానంద, శుద్ధ చైతన్య ఆనంద తత్త్వము "ప్రణవము" – ఓం. బ్రహ్మ ప్రణవము ( ( ) నాల్గవ పాదము – (అవస్థ) – తురీయము. శుద్ధ చైతన్యము. సర్వ వ్యాపక – సత్య స్వరూప పర బ్రహ్మమే!!

"చతుర్వింశతి వర్ణ రూపం" – 24 తత్త్వములు గలది గాయత్రీ మంత్రం –

"ఓం" + 24 తత్త్వములు "ఓం భూర్భువః - - - - - -"

"పురుష + ప్రకృతి"

"ఓం + భూర్భువః సువః తత్సువితుర్ వరేణ్యం
భర్గోదేవస్య ధీమహి దియో యోనః ప్రచోదయాత్" –

వాల్మీకి రామాయణం లోని 24 వేల శ్లోకములలో ప్రతి వేయి యొక్క మొదట ఒక్కొక్క బీజాక్షరం వేయ బడినది. వాటిని ఏరి కూర్చిన యీ "గాయత్రి మంత్రం" రూపొందును.

జ్ఞాన వాసిష్టం – శ్రీ రామునకు వసిష్టులు ఉపదేశించినది -32 వేల శ్లోకములు గల ఉద్గ్రంధము -

– శబ్ద బ్రహ్మము – అన్ని "శబ్దములు – వృత్తులు" లేని స్థితి – ఏ స్థితి లేని స్థితి యే "ఓం" –

"భావ శూన్య సద్భావ సుస్థితి" -- భగవాన్ శ్రీ రమణ మహర్షి.

"నిత్య ప్రబుద్ధ చిత్తస్త్వం కుర్వన్నాపి జగత్రియాం
ఆత్మైకత్వం విది త్వాత్వం తిష్ఠాక్షుబ్ధ మహాబ్ధివత్"||

తా|| మెలుకవ తోడి మనస్సు తో, ఆత్మ అద్వితీయమని తెలసి, జగత్కార్యముల నాచరించుచు, "నివృత్తి" నాశ్రయించి – నిస్తరంగ మహా సముద్రము వలె – నిశ్చలుఁడవగుము. (జగత్తు కొరకే కార్యాచరణము – కర్మలు ప్రకృతి ధర్మములు – ప్రకృతి తృప్త్యర్థమేః అనగా భౌతిక వాంఛలు – కర్మలు, దేహ (భౌతిక) ధర్మములన్నియు "ఆత్మ" ధర్మములుగావనియు అర్థము.

-- మహోపనిషత్.

అ + ఉ + మ్ = పర బ్రహ్మ + ప్రత్యక్ + ఆనంద స్వరూపము

(ప్రత్యక్ = చిత్ = దృశ్యము కన్న విలక్షణ మైన ప్రత్యేకుఁడు – అనగా స్వప్న తైజస స్వరూపము) –

కం|| ధ్వని పుట్టిన నాలించుచు|
ధ్వని మధ్యము నందుఁజేరి – ధ్వని తానై తాఁ|
గనిపించు నంత తన హృ
ద్వన జంబునఁ జూడ ముక్తి వశమగు వేమా||

గీ|| మాటలుడుగకున్న మంత్రంబు దొరకదు|
మంత్రముడుగకున్న మది కుదరదు|
మనసు నిలుపకున్న మరి ముక్తి లేదయా ||విశ్వ||

గీ|| విత్తనంబు గురువు విశ్వంబునకు నెల్ల|
ప్రణవ మంత్రమరయ(బరమ గురువు|
కర్మ గురువు సుమ్ము గాయత్రి మంత్రంబు ||విశ్వ||

"ఓం" – ఈ శబ్ద బ్రహ్మము నుండియే – సమస్త వేదములు – సర్వ స్వరములు – నాదబిందు కళలు – సర్వ చరాచర సృష్టి – విలాసోద్భవము. "ప్రణవము లేని మంత్రము శిరస్సు లేని (నిర్జీవ) మొండెము" – శవ తుల్యము – నిష్ఫలం.

అవిచ్ఛిన్న (తెరిపిలేని) తైల ధార వలె – అఖండ ప్రణవ ధ్యాన వాహిని – సుదీర్ఘ ఘంటానాదము వలె – అవాచ్యమైన "ఓం" కారము నెవ్వ(డెఱు(గునో – అతడే వేద వేదాంత సర్వ రహస్యము నెఱిగిన వా(డు – ధన్యుడు – మహనీయు(డు.

-- ఉత్తర గీత.

"పర బ్రహ్మము"(శబ్ద) – ప్రణవ స్వరూపమైన – "ఓం" ధ్యానం జీవిత పర్యంతం చేయవలెను. తిరుగు లేదు. తుది బోధ సారము.

-- సన్యాస సముచ్చయము.

1. శ్లో|| ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహర న్మా మనుస్మరన్
యః ప్రయాతి త్యజన్ దేహం స యాతి పరమాం గతిం

తా|| అట్లు ప్రాణ వాయువులను సహస్రారము వఱకు చేర్చి భగవంతుని స్మరించుచు, ఓం ఉచ్చరించుచు దేహము త్యజించు వాడు త్తమ గతిని చెందును.

"ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ" – ప్రణవోచ్చారణముతో మరణించిన ముక్తి.

-- భగవద్గీత. అ. 8. శ్లో. 13.

2. శ్లో|| రసోఽహ మప్సు కౌంతేయ ప్రభాస్మి శశిసూర్యయోః
ప్రణవ స్సర్వ వే దేషు శబ్దః ఖే పౌరుషం నృషు

తా|| నీటి యందు రసమును సూర్య చంద్రులయందలి కాంతియు, ఆకసము నందలి శబ్దమును, పురుషులయందలి పౌరుషమును, వేదములందలి ఓంకారమును, నేనే యగుచున్నాను.

"ప్రణవ స్సర్వవేదేషు" - వేదములందలి "ఓం" కారమును నేనే.

-- భగవద్గీత. అ. 7.శ్లో. 8.

3. శ్లో|| మహర్షీణాం భృగు రహం గిరా మస్మ్యేక మక్షరమ్
యజ్ఞానాం జపయ జ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః

తా|| ఋషులలో శాంతముగల భ్రుగు మహర్షిని, అక్షరములలో ఓం కారమును, యజ్ఞములలో భగవన్నామ యజ్ఞమును, కొండలలో హిమవత్పర్వతము నేనే యని భావించుము.

"యజ్ఞానాం జప యజ్ఞోస్మి" -- "ఏ కాక్షర బ్రహ్మ"
"ఓం" ఏకాక్షర జపయజ్ఞం ఉత్తమోత్తమ మైనది
-- భగవద్గీత. అ. 10. శ్లో. 25.

4. శ్లో|| పితాऽ హ మస్య జగతాం మాతా ధాతా పితామహః
వేద్యం పవిత్ర మోంకార ఋక్సామ యజు రేవచ

తా|| నేనే ఈ ప్రపంచములకు తండ్రిని (సంపాదించి పెట్టు వాడను), నేనే తల్లిని (పోషించు వాడను), నేనే తాతను (ప్రేమించి లాలించు వాడను). వేదములును నేనే. వేదములలో తెలియదగినదియు నేనే. ప్రణవస్వరూపమగు ఓం కారమును నేనే.
-- భగవద్గీత. అ. 9. శ్లో. 17.

5. "త్రైవిద్యాం" – అ + ఉ + మ్ = ఓం
-- భగవద్గీత. అ. 9. శ్లో. 20.
("వేద త్రయీ పరానందా - - - - - !")

6. ద్వే విద్యేవేదితవ్యే – శబ్ద బ్రహ్మ పరంచయేత్ –
శబ్దం & పరబ్రహ్మ విద్య –రెండు.
-- అమృత బిందూపనిషత్. (17).

7. "తస్యవాచకః ప్రణవః"
తా|| ఓం కారమే అతని నామ ధేయం.
-- పతంజలి.అ. 1.సూ. 27.

8. "అర్ధ భావేచ్ఛ" -- బ్రహ్మ సూత్రములు.
అర్ధ భావములతో ప్రణవ ధ్యానము అత్యంత ఫల ప్రదాయని.

9. "తజ్జపస్తదర్ధ భావనమ్" -- పతంజలి.అ. 1.సూ. 28.
ఓం కార జపము "అర్ధ + భావము" లతో చేయడం శ్రేయస్కరం.

మరియు ఆగమ జప శ్లోకములు 28,29 30, ప్రణవ ధ్యానమునే పేర్కొన్నవి. వేదములందలి 32 విద్యలు జప & అజపస్వరూపములే. “ఓం” – సమస్త వేద విద్యలకు మాతృక. “ఓం” – అర్థ భావ సహిత ధ్యానము వల్లనే, ఆధ్యాత్మిక సంస్కారములుద్దీపితములై – సద్భావములు – సద్వాసనలు – సదాచార – సచ్ఛీల – సత్సంగ –సద్గతులలవడి సద్గతి ప్రాప్తించును.

శారీరక – మానసిక ప్రణవ జపము వల్లనే అంతర్దృష్టియు – విఘ్ననాశమును కల్గును.

అష్ట విధ యోగ విఘ్నములు నశించును :-

| | | |
|---|---|---|
| 1. రోగము | 5. మత్తత | 8 యోగ విఘ్నములు నశించును. |
| 2. జడత్వము | 6. అతృప్తి | |
| 3. సంశయము | 7. భ్రమ | |
| 4. అజాగ్రత్త | 8. చిత్త అస్థైర్యము | |

మరియు, మైత్రి, కరుణ, ముదిత, ఉపేక్షల వల్ల ⟶ చిత్తప్రసన్నత ఏకాగ్రత లభించును.

దశ విధ నాదములు :-

“ఓం” కారము – ఘంటాది నాదములతో లక్ష్యాభ్యాస పరుని హృదయమందెప్పుడు వాగు చుండును. ఈ ఓంకార నాద శ్రవణాభ్యాసము చిత్త శుద్ధిని కల్గించి, మోక్ష సాధనమగును.

శ్లో|| బ్రహ్మ ప్రణవ సంలగ్న నాదో జ్యోతిర్మయాత్మకః|
మనస్తత్రలయం యాతి తద్విష్ణోః పరమంపదం|
సదానాదాను సంధానాత్సంక్షీణ మతినా మయా|
నిరంజనేవిలీ యేతే మనో వాయూన సంశయః||

దశ విధ ప్రణవ నాదములందును, చిద్బిందువు నందును, కళల యందును, ప్రతీయ మానములగు సకల విశేషములకు సాక్షియు, చతుర్వింశతి తత్వముల కధీశ్వరుఁడును, మహా జ్ఞాన నిధియుఁనగు పరమ పురుషుడే, ఆ పరమాత్మ –

“బ్రహ్మ విద్య – బ్రహ్మ జ్ఞానం” ⟶ పరమావధి “మోక్షం”.

బ్రహ్మమునకు “ఓం” కారము - వాచకంబు.
అఖిల జగమునకున్ బ్రహ్మ - మాత్మ గాన

వాచకము ప్రణవంబు సర్వంబునకును”

“ఓం” సర్వమునకు ప్రాణము – పరమారాధ్యము.

తర్వాతనే -- మాతృ దేవో భవ

పితృ దేవో భవ

ఆచార్య దేవో భవ

అతిథి దేవో భవ ఓం శాంతిః !!

మహర్షులు – పరబ్రహ్మ నక్షర మందురు. అదియే “ఓం” కారము, వ్యాపక పరమాత్మకు ఓం కారము వాచకము (శబ్ద బ్రహ్మము) – ఇదియే వాచ్య వాచకము. సర్వ శబ్ద గణములు ఓం కారమునఁబుట్టినవేః నిర్మల – నిశ్చల – నిర్విషయ పరిశుద్ధ విషయ వాసనా శూన్యమైన – వేదాంత పరిజ్ఞానముతో (అర్థ భావ యుత) పల్కు (ఉచ్చరించు) ప్రణవము ఓం కారము మోక్ష దాయని. దీనిని మించిన మంత్రము – సత్తా – లేదు. మూల మంత్రము – ఆది – అనాది.

అంత్య కాలమున పరిశుద్ధ – నిస్సంకల్ప – దృఢ విశ్వాస పూరిత మనస్సుతో ప్రణవోచ్చారణము తో ప్రాణము వదలిన మోక్షము తథ్యముః లేదా రెండవ (మరు) జన్మమున జీవన్ముక్తితో ప్రకాశించును.

వేదములందలి 32 విద్యలు – (ప్రణవ ప్రాధాన్యమైనవి) – వేదములందు ప్రణవో పాసన నిర్గుణ పరమేగాని, ప్రత్యేకంగా కొన్ని చోట్ల యందు సగుణం కూడా –

ఓం – పర - నిర్గుణ / అపర – సగుణ – బ్రహ్మోపాసనము (నాద బ్రహ్మోపాసన) } విధానమును

--1) పిప్పలాదులు సత్య కామునకు చెప్పిరి.

-- ప్రశ్నోపనిషత్.

-- 2) యముఁడు నచికేతునకు చెప్పెను.

-- కఠోపనిషత్.

-- 3) నిర్గుణో పాసన దుర్లభమైన – ప్రత్యగాత్మ రూప బ్రహ్మమునుపాసింపఁదగును.

సహజముగా సగుణోపాసన – నిర్గుణోపాసనకు తప్పక తీసుకొని పోవును. పిదప, నిర్గుణోపాసనము ఖండితముగా బ్రహ్మ సాక్షాత్కారమును చేకూర్చును.

అథవా, జన్మాంతరమందైనను, ఇహమున మరణ కాలమందైనను లేదా బ్రహ్మ లోకమందయినను – బ్రహ్మ సాక్షాత్కారమును ఖండితముగా ప్రసాదించును.

-- వేదాంత పంచదశి మరియు ఆత్మ గీత.

- తీవ్ర ప్రణవ ధ్యాన సాధనలవల్ల, ఈ జన్మమందే అపరోక్షానుభూతి తథ్యము - - ముక్తుడగును.

-- ఓంకార గ్రంథము.

ప్రశ్న – ఆ జన్మ పర్యంతము ప్రణవ ధ్యానమొనర్చిన వాడు ఏ లోకమునకు పోవును?

జ – ఓం! (శబ్ద బ్రహ్మము) --- బ్రహ్మకు < పైది / క్రిందిది కూడా.

త్రి మాత్రిక = అ + ఉ + మ్ = ఓం.

"అ" - ఏక మాత్రోచ్చారణ వల్లనే "ఇహ" సామ్రాట్టగును.

ఇక "ఉ + మ్" ల వల్ల "యజుస్" – చంద్ర లోకానికి చేర్చి, అందు దివ్యులతో సుఖించి, తిరిగి వచ్చును.

కాని, మూటిని కల్పి "ఓం" అనిన యెడల, సూర్య తేజస్సుతో ఐక్యమై – సూర్య లోక ప్రాప్తి అనగా సూర్యత్వమందును – ఆదిత్య పదవి –

మరియు, ప్రణవ ధ్యాని (1) పాపములనుండి – పాము పొర నుండి విడుదలయినట్లు, విముక్తుఁడగును.

(2) రవి – చంద్రులు – రాహు కేతువుల నుండి విడివడునట్లు – విడివడి – సామ గానముతో బ్రహ్మ లోకము చేర్చఁబడును. ఆంతర్యామిని దర్శించి "తైజస" – హిరణ్యాగర్భు" ల నధిగమించును, అనగా స్వప్న సుషుప్తుల మీది, తురీయ (బ్రాహ్మీ) స్థితి – ముక్తావస్థనందును. "ఓం" జ్ఞానులకు పరమావధి – అభయం – అజరామరణ – అనంత – అపరిచ్ఛిన్న – అతీత స్థితి:-

-- సిబి పుత్రుఁడు సత్యకామ –

-- ప్రశ్నోపనిషత్ (అధర్వణం).

"దేవుఁడు జీవుఁడైనట్లు – జీవుఁడు దేవుడౌట తథ్యము"

పశ్చాత్తాప తప్త హృదయుఁడు – త్రివేణీ సంగమ దివ్య తీర్థ ప్రక్షాళిత పాపచయుఁడు – పునీతుఁడు – దివ్యుఁడైనవాడు – తిరిగి పాప పంకిలమునఁబడ

జాలఁడు. ఒక వేళ తొట్రిల్లినను, బహు జాగ్రత్తగా లేచి భద్రమగును. పశ్చాత్తాపమునకు మించిన ప్రాయశ్చితము లేదు. పశ్చాతాప తప్పుని కన్నీరు "ప్రయాగ" త్రివేణి సంగమ దివ్య తీర్ధ సదృశము. మహా పాపిని కూడా పునీతుని చేయును.

గంగ + యమున + సరస్వతి –నదులు
ఇడ + పింగళ + సుషుమ్న - నాడులు
సూర్య + చంద్ర + అగ్ని – నేత్రములు

} వీటి కలయికయే బ్రహ్మ లోకము- కన్నీరే దివ్య గంగ - భాష్పాంజలి "ప్రశ్చాత్తాపమే పాప పరిహార ప్రాయశ్చిత్త క్రియ" "కన్నీరే పావన గంగ – పాపి పావనుడౌను"

-- శ్రుతి & బైబిల్.

"అర్ధ భావ సహిత" ప్రణవోచ్చారణ – ప్రణవ ధ్యానము – సాధకుని "హృదయమును" – దివ్య తీర్థము – పుణ్య క్షేత్రముగ మార్చును: భక్తునికి భగవంతునికి అభేదము."ఓం"

శ్లో|| పితా హమస్య జగతో మాతా ధాతా పితామహః
వేద్యం పవిత్ర మోంకార ఋక్సామ యజురేవచ

తా|| నేనే తండ్రిని, తల్లిని, తాతను, సర్వ వేదములు –ప్రణవ స్వరూపుఁడను "ఓం" –

-- భగవద్గీత. అ. 9.శ్లో. 17.

శ్లో|| "ద్వే విద్యే వేదితవ్యేశబ్ద బ్రహ్మ పరంచయేత్"

తా|| శబ్ద బ్రహ్మము (ఓం), మరియు పరబ్రహ్మ విద్య – రెండు (సగుణ నిర్గుణము)ను నేనే –

-- అమృతబిందూపనిషత్.

ఓం – I. ప్రణవము – ధనస్సు
బ్రహ్మ -- లక్ష్యము
ఆత్మ -- బాణము
II. ఉపనిషద్ధనస్సు
ధ్యాన బాణము,
మనోనారిని లాగడం
పరమాత్మ లక్ష్యం -




-- మాండూక్యం.

శ్లో|| నాభి కమలమధ్యే జ్యోతిరానంద రూపం|
హృదయ కమల మధ్యే సూర్య బింబాను రూపం|
భ్రూయుగ ద్విదళ మధ్యే హంస మార్గాను రూపం|
దశశత కమల మధ్యే బ్రహ్మ మార్గానురూపం||
"పరమాత్మ స్వరూపోహంసః"
"అంతః ర్బ హిశ్చరతి హంసః" –

బ్రహ్మ సృష్టి కర్త – చతుర్ముఖుఁడు – (అంతః కరణ చతుష్టయ రూపుఁడు) – మనస్సు – జీవతత్వం – బ్రహ్మకు వాహనం "హంస" – క్షీర నీర విభాగ నైపుణ్యము గలది (స్థూలార్థము) – ప్రాణ శక్తి (ఉచ్ఛ్వాస నిశ్వాస క్రియా శక్తి) – "Vital force" – కూడ, అహర్నిశలు, బాహ్యాభ్యంతరముల – ఉచ్ఛ్వాస నిశ్వాస రూపమున చరించెడు ప్రాణమే "హంస" – ఈ ప్రాణ శక్తి గాలి యందలి ప్రాణ వాయువును మాత్రము గ్రహించి, మిగత అనవసర (ప్రయోజనము లేని) గాలిని వదలి వేయును. ఇది సహజ "హంస" వృత్తి కావున, ప్రాణమునకు – "హంస" అని నామకరణ మొనర్చిరి.

ఈ "ప్రాణ" గమనము - - ఉచ్ఛ్వాస నిశ్వాస క్రియలు – నాసికాగ్రము (భ్రూమధ్య – తికుటాద్రి – బ్రహ్మ స్థానము) నకు క్రింద జరుగుట వల్ల – "హంస" (ప్రాణము) – బ్రహ్మకు వాహనమనిరి.

ఊపిరి తిత్తుల (హృదయ భాగము వెలుపల – బయట) లోని గాలి బయటికి, లోనికి ఎడ తెగక నిమిషమునకు 15 – 16 తూర్లు (రోజునకు 21,600 మార్లు) తిరుగుట - - - అనగా "హంస" సంచారము – మానస సరోవరమున జరుగును: ఎందుకన . . . ప్రాణ చలనము వల్లనే – మనో వృత్తులు (సంకల్ప – వికల్పములు) జనించును: అనగా ప్రాణమున (వాయువు = మారుతమున) – మనస్సు – (మారుతి – చపలి – ఆంజనేయుడు) పుట్టెను.

హంస = అజప గాయత్రి అందురు. అనగా జపించకనే జపించునది. ఓం = జప గాయత్రి – సావిత్రి – ప్రణవము.

అహంకార నాశనమునకు రెండు మార్గములు.
1. భగత్ప్రేమను సాధించుట – భక్తి.
2. గురు పాదముల చెంత సర్వ భావార్పణ మొనర్చుట. (Self surrender)

హంస ⟶ "దశ ప్రాణములు + అంతఃకరణ చతుష్టయ" సాముదాయక
జీవ తత్త్వము – ప్రత్యగాత్మ కేవలం సాక్షి, అంతర్యామి
అమృతము (పాలు) – అమర లోక వాసుల (దివ్యుల)
ఆహారము.

నీరు (జలము) – భూలోక మానవుల ఆహారము. హంస (బ్రహ్మ వాహనము) – అమర లోక జీవనమే కోరును. ప్రకృతి సిద్ధమగు జలమును తృణీకరించి – నిరాకరించును.

ఉచ్ఛ్వాస నిశ్వాస రూపమగు ప్రాణమే "హంస" – ఉచ్ఛ్వాస నిశ్వాస క్రియకధిష్ఠాన శక్తియే "ప్రాణ శక్తి" Vital force. ప్రాణము జడము. ప్రాణ శక్తి చైతన్య వంతము. ప్రాణ చలనము (భాహ్యాభ్యంతర) – ప్రాణ శక్తి యధీనము. పీల్చిన గాలి యందలి ప్రాణ వాయువును మాత్రము స్వీకరించి, అనవసర మైన గాలిని బైటికి త్రోసి వేయు క్రియ – "ప్రాణ శక్తి" దే.

ప్రాణ చలనము వల్ల సంకల్ప వికల్పములు పుట్టును. వీటి స్వరూపమే మనస్సు. వాయువు నందు పుట్టినందున "మనస్సు" నకు వాయు పుత్రుఁడనియు, మారుతి అనియు (జీవాంశ) పేర్లు.

"హంస" – ప్రాణ గమనం – ప్రాణ క్రియ – అజప గాయత్రి.

"ఓం" -- ప్రణవము – నిర్గుణ తత్త్వం – జప గాయత్రి.

ప్రాణము, మనస్సునకు మాతృక – పితృతుల్యము – అనగా వాయు పుత్రుడు – మనస్సు (మారుతి) – చపలి –

| | | | |
|---|---|---|---|
| జప గాయత్రి | | అజప గాయత్రి | = జపా జప గాయత్రిః |
| ఓం | + | హంస | = హంస + ఓం = హంసోం |
| ప్రణవం | + | ప్రాణం | = సోహం – సోహం |
| | | | = తండ్రి తనయుల ఐక్యం |

మనో మారుతుల సమ్మేళనమే - తండ్రి తనయుల ఐక్యము.

పర తత్త్వం| సర్వసాక్షి –తెలివి నాద బిందు కళలకు
మూలము ⟵ హ అనగా ఈశ్వరుఁడు – పూరకం – దేవుఁడు – చిదాకాశము
0 అనగా జీవాంశ - కుంభకం – మనస్సు - చిత్తాకాశము
16 వికృతులు
సర్వ తత్త్వము ⟵ స అనగా ప్రకృతి(మూల) – రేచకం – జీవుడు – భూతాకాశము

హం
జీవు(డు < } హంస – (ఉచ్చ్వాస +నిశ్వాస) క్రియలు = జీవనము
స = ప్రాణము

"0" అనగా ఈశ్వరునకును, తచ్ఛక్తియగు ప్రకృతికిని గల తాదాత్మ్యయమును తెల్పును.

శ్రుతి ప్రమాణమును బట్టి పరిశుద్ధు(డగు జీవు(డు ప్రకృతి సంబంధము వలన దేవతిర్యఙ్మనుష్యాది సమస్త సృష్టి రూపములను పొందెను.

"హ" పరమ పురుషు(డు.

"0" జీవుండు – చిదాత్మకుండగు ప్రత్యగాత్మ (10 వాయువులు + 4 అంతః కరణయుతు(డు)

"స" – జడ ప్రకృతి. (సమస్త తత్వ సముదాయ సమిష్టి)

హంసః - క్షీర నీర విభాగ విధాన నైపుణ్యము గలది (స్థూలార్థము). తద్వతు – "ప్రాణ శక్తి"– పీల్చిన గాలిలోని "ప్రాణ" వాయువును మాత్రము గ్రహించి, అనవసర భాగములను గెంటి వేయు చున్నది. (సూక్ష్మార్థం).

పరమ హంసః- నిత్యా నిత్య వివేకాది చతుర్విద మోక్ష సాధనల నధిగమించి – పరిపూర్ణత్వ మందిన మహాన్ః ప్రవృత్తి నివృత్తులకు – స్వర్గ మోక్షములకు – సర్వాతీతు(డు – సత్య – నిత్య – ఆనంద నిలయమైన - - - సర్వ సన్యాసి.

హంసః - నమ్మిన వారి సంసార (పాప) బంధముల( హరించి మోక్షమిచ్చును.

హంసరూపమైన సాధక – ఆరాధకులను – పరమ హంసలగ(జేయును.

ప్రాణముః- అంతఃప్రాణము – దేహమందలి వేడి నిచ్చును. కాలమానిః 1 నిమిషమునకు 15 నుండి 18 మార్లు (Breaths) ఉచ్చ్వాస నిశ్వాసములు గలది. 1 దినముకు 21,600 "హంసలు" – ఇదే ఆయుః ప్రమాణమునకు పరిమాణము. కావుననే యోగులు, ప్రాణాయామ (కుంభక) శక్తి వల్ల ఆయుః ప్రమాణమును అధికముగా (పెంపు) చేసుకొందురు. బ్రహ్మా లిఖితము, మానవుని ఆయుః పరిమాణము "హంస" లలోనే యుండును.

సూర్యు(డుః- బయట వేడినిచ్చుట వల్ల బహిః ప్రాణము ప్రాణదాత. కాలమాని. అనగా ఒక సూర్యోదయంతో ప్రారంభమై తిరిగి సూర్యోదయం వరకు "1 దినం" అందురు.

ప్రాణాయామము (ప్రాణ బంధము) యోగము –

ప్రాణ ధ్యానము – హంసోపాసన – (జ్ఞాన) యోగము.

జప + అజప – గాయత్రుల సమ్మేళ పరచి.

ఓం + హంస = సోహం – హంసో - - ప్రాణ గమనము (అనగా ఉచ్ఛ్వాస నిశ్వాసము) తో మనస్సును ముడి పెట్టి – గమనిస్తూ – ఏకధారా ప్రవంతిగా గమనిస్తూ వుండడమే – రాజ యోగ క్రమము – ఇదే సర్వాతీత మహా రాజ యోగము – యోగ రాజము – స్వర్ణ యోగము – "రాజ గుహ్యా రాజ యోగం". ఎంత సులభం? ఎంత గొప్ప ఫల ప్రదాయని? యింకా అనుమాన – ఆలస్యములెందుకో? వేద – వేదాంత సాగర మథనమున ఆవిర్భంచిన 32 వేద విద్యల మూల సార కంద మిదియేః 14 లోకములందు వెదకినా – సర్వ శాస్త్ర – గురు భోదల సారము కూడ యిదియేః ఇదియే సర్వం –ఆఖరు.

హ -- పురుష

0 -- మనస్సు – మాయ – జీవత్వం – భ్రాంతి "0" –

స -- ప్రకృతి

జప గాయత్రితో + అజప గాయత్రిని చేర్చిన –

"ఓం" ప్రణవ మంత్రం + హంస = ప్రాణ మంత్రం.

ఓం + హంస = హంసో సోహం . . . .

ప్రాణము = మారుతం - తండ్రి } వీరి ఇక్యమే మోక్ష

మనస్సు = మారుతి - తనయుఁడు } సాధనం

"ప్రాణ గమనంతో లయించిన మనస్సు" - జీవ బ్రహ్మైక్యమును ప్రాప్తింపఁజేయును.

రాముని + సీతను --- మారుతి కల్పెను

▼ ▼

పరమాత్మ + జీవాత్మ --- మనస్సు సంధించును.

ఇదియే పరమ నిగూఢమగు రహస్య భోదనము – సర్వ వేదాంత శాస్త్ర సార సంగ్రహ – దృతి!! ఇందుకు మించిన రాజ గుహ్యాము మరెందును లేదు!!! కడ మాట!!!

<u>హంస</u>

విషయానుభవ తృష్ణ – లంపటత్వము నందగిలి "పునరపి జననం – పునరపి మరణం" గా జనన మరణ ప్రవాహమునఁజిక్కి, పంజర నిబద్ధమగు కీరము వలె విముక్తి కై రెప రెప లాడుచు – దరి దాపులుఁదోచక యీ హంస

హృత్పుండరీకమున (మానస సరోవరమును – విడుచునప్పుడు ప్రణవ నాదమున విలీనమగును. తురీయావస్థ. మూలాధార చక్రం మొదలు బ్రహ్మ రంధ్రం వరకు – శుద్ధ స్ఫటిక సదృశమై – పరిశుద్ధమై – పరిపూర్ణ మై ప్రకాశించు - యా చిద్విలాసానంద స్వరూపమే – పర బ్రహ్మయొక్క వాస్తవ స్వరూపమని యోగులు వచింతురు.

"నేను సచ్చిదానంద చిద్విలాసుఁడను, అఖండ దివ్యజ్యోతి ప్రకాశం – నిత్య ముక్త శుద్ధ స్వరూపుడను – ప్రకృతి సంపర్కము వల్లనే సంసార కల్మష మంటు కొన్నది – కాని "అది వాస్తవము కాదు" – అని తెలుసు కొన్నఁగాని ప్రకృతి బంధము (చిద చిద్గ్రంధి) వీడదుః

"సోహం" ధ్యాన జప విధానము –

ప్రతి దినమును – రెండు యామములు – రాజ యోగ నిష్టుఁడవై – తైల ధార వలె – అవిచ్ఛిన్న – యేకాగ్ర – (స్మృతి) "అర్థ భావ" యుత ధ్యానము వల్ల, తన్మయత్వము సిద్ధించి, తద్రూప ఫలమగు "ఉన్మన్యవస్థ" - - అనగా – మనస్సు + ప్రాణము + ఇంద్రియములు" – సహా కూడా లీనమగును. ఇట్టి జీవ బ్రహ్మైక్యమే – ఉపనిషత్ప్రతిపాదిత మగు రాజ యోగము. కేసరీ యోగము.

పూర్వోక్తుఁడు – హంస శబ్ద వాచ్యుడు నగు – జీవుఁడును – దశ విధ (ప్రణవ) నాదములును – చిద్బిందువు – చిత్కళలు – అను వీనితో – జ్ఞాన కర్మేంద్రియముల తోఁగూడిన అంతఃకరణ చతుష్టయమును, ప్రాణాది దశ విధ వాయువులును – భగవదుపాసనా రూపకమగు యోగా భ్యాసము చే నెప్పుడు భగవంతుని యందైక్య మగునో - - - ఆయవస్థ మూడింటికి (జాగ్రత్స్వప్నసుషుప్తులు) అవ్వలిదియగు "తురీయా వస్థ" అనంబడును.

మనస్సు బాహ్య (విషయ) సంగముల విడిచి పరమాత్మ యందు లగ్నమగుటయే "ఉన్మన్యవస్థ" యనంబడును.

ప్రకృతి సంసర్గ విరక్తుఁడై – నిర్మల నిశ్చల పరిశుద్ధ మగు మనస్థితియే "సహజా మనస్కం" బనఁబడును.

క్రమముగా- అభ్యాససాధన పరంపరలవల్ల ప్రాప్తించు "జీవ బ్రహ్మైక్య" అనుసంధానానుభవము వల్ల, మనస్సుఅన్య విషయ విముఖమై స్థిరత నొందును. ఇదియే "సహజావస్థ" – "స్థిత ప్రజ్ఞ" "నిర్మలోద్యోగము" అందురు.

నాల్గు యోగములకును గమ్య స్థాన మొక్కటే.- "All roads lead to Rome"

"పరిశుద్ధ మగు మనో" నిగ్రహ సాధనల వల్లనేగాని, మనో వేదనల వల్ల – ఆత్మ జయమబ్బదు"

బ్రహ్మణ్యుండు (ఆత్మ వేత్త - విదేహుడు) – వేదము, తపస్సు, జ్ఞానములకు హితము కూర్చువాఁడు – సంసారమున (లోక పంకిలమున) నున్నను, మానస సరోవరమున విహరించినను నీరంటుకోదు. హంస – పరమ హంస వలె ప్రకాశించును. "హంస బ్రహ్మల" అవినాభావ సంబంధమని – తామరాకును నీరంట నట్లు| కుమ్మరి పురుగునకు బురదంటనట్లు| నిప్పునకు చెదలంటనట్లు|

భగవన్నామ స్మరణ –

భగవన్నామోచ్చారణమందే మనస్సు లయించాలి, అది (మంత్రము) – అన భగవన్నామము, ఉచ్ఛ్వాస నిశ్వాసములతో – ప్రాణ గమనముతో – ఊపిరితో – తైల ధార వలె – పుష్పమాల వలె – తెఱిపి లేకుండ – నెమ్మదిగా మేళవింపఁ జేయ వలెనుః అప్పుడు, లోక (బాహ్య) చింతలు సహజంగా అడ్డు వచ్చినను, "అభ్యాస – ప్రయత్నముల" ద్వారా నిగ్రహించి, మనస్సును నిశ్చలము గను, ప్రశాంతముగను, భగవన్నామమును (ఇష్ట మంత్రమును) ప్రాణాను సంధానా భ్యాసము ననే నిల్పిన, ఆయాసక్తి బలపడి, బ్రహ్మాండమైన దివ్య ఫల ప్రభావము ను చేకూర్చును.

-- మెహర్ బాబా.

"శ్వాస శ్వాస హరినామ సుమిరిలే సీఖ మనలే మోరి"

-- భక్త కబీర్.

అనగా| ఓ మనస్సా| నీవు ప్రతి శ్వాసయందును, భగవన్నామమును కల్పుట నేర్చుకొనుము!

భగవన్నామ సంకీర్తనము- శబ్ధ, భజన, గీతముల ద్వారాను . . . .

అంతరంగమున (ఏకాంతమున) సర్వదా- "మంత్ర + ప్రాణ" లయ, ధ్యాన + ధారణల రీత్యా అనుసంధాన మొనర్చుటే, మానవుని, తుది కర్తవ్యముః వేదాంత పరమార్థ రహస్యముః మంత్రోపదేశ రహస్య కీలకముః ఇదే తండ్రి తనయుల ఐక్యము.

-- భగవాన్ శ్రీ రమణ మహర్షి.

మారుతం + మారుతి
వాయు + ఆంజనేయులు
ప్రాణ + ప్రణవ
హంసం + ఓం = హంస ఓం = సోహం.

ఆ|| ఇంద్రియముల నిగ్రహించి ప్రాణములతో| మానసమును(జేర్చి వాని తోడ హంస
యనగ నొప్పు అక్షర ద్వయము యోచించి సంతతము భజింప వలయు.
(అజప హంస యోగము).
హంస తత్వమే – "వాయు – బిందు - మనంబు"ల నిశ్చలత్వమునకు
మూలము.

"మాయా ప్రతిబింబితమగు బ్రహ్మ చైతన్యము మాయా తాదాత్మ్యము నొంది, "హంస" యన(బడు జీవ రూపమగు "హంస మండలము" – షట్కమలముల గమి మధ్యమున సంచరించుచు, భ్రూమధ్య (ఆజ్ఞా చక్రస్థ)- బ్రహ్మకు వాహనమై – సొంపగు మానస సరోవరమున - సత్య లోక (సద్వస్తు) ప్రీతిచే తనరారుచు నుండు "జీవ" తత్వము –

రాజ హంస (రాజయోగి). క్షీర నీర విభాగ నైపుణ్యా రీతిని, పరమ పురుష సత్తత్వమును గ్రహించి , దుఃఖ భాజనమగు "ప్రకృతి" – అసత్ తత్వమును నిరాకరించి విసర్జించును.

హంస తత్వ విమర్శ నాడీ విభాగము –
షడ్చక్ర నిరూపణము. (శ్రీ సీతా రామాంజనేయ సంవాదము. 294)

ఈశ్వరుడు నిష్క్రియా పరుడు.

ప్రకృతి జడము - ఇక
10 ఇంద్రియములు }
10 వాయువులు } జీవాంశ
4 అంతః కరణములు }

10 ఇంద్రియములు
5 పంచ ప్రాణములు
+
4 అంతఃకరణ
చతుష్టయముతో
కూడి నప్పుడు
→ జీవుడు = హంస అన(బడును
అనగా ప్రకృతి సంబంధ సంసార బంధమని
అర్థము.

తల్లి -- శక్తి -- సగుణ
తండ్రి -- పురుష -- నిర్గుణ
తనయ -- మనస్సు -- సగుణ నిర్గుణం (చిదచిద్గ్రంధి)

శ్లో|| ఆత్మాన మరణిం కృత్వా ప్రణవం చోత్తరారణిమ్|
జ్ఞాననిర్మథనాభ్యాసాత్ పాశం దహితి పండితః||

తా|| జీవాత్మ భావం అరణిగా, ఓం కారం పై అరణిగా చేసే జ్ఞాన మార్గాన్ని అభ్యసించే పండితుడు, ఆ జ్ఞానం ద్వారా సమస్త బంధాలను నశింపచేసుకుంటున్నాడు. "జీవుఁడు నిరంతర ప్రణవోపాసన చేత పునర్జన్మ కారణమైన పాశ బంధమును నాశనము చేయ గలడని" –

-- కైవల్యోపనిషత్ – 11 శ్లో.

"ఇది నా యిల్లు"

"ఇవి నా కళ్ళు"

ఇంటిలో ఉన్నంత మాత్రమున – ఇల్లు నీవు కాదు. ఆలాగే దేహము కూడ. కన్నులతో చూచినంత మాత్రమున కన్నులు నీవు కాదు. ఆలాగే యింద్రియములు + అంతఃకరణము లన్నీ కూడా! - వీని విచారమును గ్రహించి, నిర్ణయించి, నిశ్చయించు పదార్థమే "నీవు" – సాక్షిగా – ద్రష్టగా – శేషించి – దేని చేత గ్రహింపఁబడక నిల్చు "నీవు" – ఆత్మ – పరమాత్మః

ఆత్మ దర్శనమునకు అభ్యంతరము – "ద్వంద్వములు" – "వాసనలు" - విషయములు - - - వీట్ల తాకిడి – ఘర్షణ లే!! పూర్వ జన్మ దుస్సంస్కారములు.

నిర్వికల్ప పరమాత్మలో వికల్ప మేర్పడి – 3 రూపము లుత్పన్నంబగును.

1. సూక్ష్మ – సుషుప్తి – సత్వ – జ్ఞాన శక్తి – ఆత్మ రూపం
2. మధ్యమ – స్వప్న – రజో – ఇచ్ఛాశక్తి – సంకల్పం – (మనస్సు).
3. స్థూల – జాగ్రత – తమో – క్రియా శక్తి – దేహం

2, 3 ను సాధించుటకే 1 ప్రస్తావింపఁ బడినది.

(One in three and three in one)

"లీలావతి" భర్తకు (పద్మ రాజు) నకు సరస్వతీ దేవి ప్రత్యక్షమై అమృత తత్వము నుపదేశించెను. అదే జపాజపగాయత్రి మంత్రముః హంస + ఓం = హంసోం ~ సోహం. -- జ్ఞానవాశిష్టం.

హం = శివ (పురుష) = హంస = శివ శక్తి.

స = శక్తి (స్త్రీ)

హంస + ఓం = హంసో హంసో – సోహం సోహం

-- "సర్వ సమ్మోహన మంత్రము"

అజప + జప = గాయత్రి - శివ శక్తుల ఏక రూప మంత్రం = "సూక్ష్మ + స్థూల" – అనగా జ్ఞాన కర్మల కలయిక.

మం = To think = జ్ఞానం
త్ర = Movement = కర్మ (శక్తి)
మరియు : -

హ = దేవుడు = చిదాకాశము
0 = మనస్సు = చిత్తాకాశము
స = జీవుడు = భూతాకాశము

జ్ఞానార్ణవ తంత్రంలో ----- (x x I -22)
చిత్కుండంలో : - మూలాధార చక్రం లోనిది – xxx.
అంతయు చిత్కుండ గతం –

పరమాత్మ
అంతరాత్మ
జ్ఞానాత్మ
ఆత్మ
→ సాకార సాక్షి రూపకం

ఆత్మ = ఉచ్ఛ్వాస నిశ్వాస ప్రాణ స్వరూపిణి
హంస = జీవాత్మ (Vital Force)
విశ్వ ప్రాణ శక్తి (Cosmic Breath) నుండి జీవ ప్రాణ శక్తి (Individual Breath) వేరు చేయఁబడినది.

"భ్రూ మధ్యమున ఆకాశ సంధి గలదు"
"చలనము" శక్తి లక్షణము.

శంభు → సదాశివ → ఈశ → రుద్ర → విష్ణు → బ్రహ్మ –
పంచ ధర్మములు

(1) సృష్టి ---స్థితి --లయ – అను గ్రహ - నిగ్రహ శక్తులు గలవు –

ఓం (2) ఓం పరమాత్మ → శక్తి (ఆది శక్తి) → త్రిమూర్తులు / త్రిగుణములు → సృష్టి, స్థితి, లయం } Trinity = ఓం

హంస – మనస్సు నుండి – విషయముల దూరీకరించి – నిర్విషయమై "మనస్సు" ఆత్మగా మారిన – ఆత్మ జ్ఞాన రూపమే – దివ్య దృష్టి – సద్విచారము = సత్ +విచారము

# 16. మాయ

## ప్రవేశిక

ఆది పరాశక్తి

మహామాయ– మహా శక్తి– మహారతిః – సర్వ శక్తి మయీ – సర్వమంగళ - సద్గతి ప్రదా

శ్రీ లలితా సహస్రనమ స్తోత్రమ్ (215, 217, 218, 199 – 201)

"ప్రత్యగాత్మ"

పంచ ప్రేతాసనాసీన – పంచ బ్రహ్మ స్వరూపిణి

-- శ్రీ లలితా సహస్రనామ స్తోత్రమ్ (249, 250)

బలవాన్ ఇంద్రియ గ్రామో విద్వాంస మపకర్షతి -- వ్యాస పాఠం

3 మార్లు "నాప కర్షతి" – అన్నాడు జైమిని – సామ వేద కర్త.

<u>నిర్వచనము</u>

మాయ - మహారణ్యము – పెద్ద కొలను – సమిష్టి జీవ కోటి అజ్ఞాన సముదాయము. త్రిగుణ సామ్యావస్థయే – మూల ప్రకృతి – మాయ – మోహమే రూపముగా గలది. సమస్త ప్రపంచమునకు మూల కారణము. అవిద్య, అవ్యక్తం, తమస్సు, సుషుప్తి, ప్రకృతి, ప్రధానము – అజ్ఞానము - - - - మాయ.

మాయ

1. నీటిలోన బుట్టి నీటినే ఆవరించిన "పాచి" వలె
2. సూర్యుని వలన పుట్టి, సూర్యునే ఆవరించు మేఘము వలె
3. శ్రీ మంతుని కుక్క, యజమానునికి తెలియ కుండా యెవ్వరిని, సమీపమునకు రానివ్వదుః కాని, దూరము నుండి ఎలుగెత్తి యజమానుని పిల్చి, ఆతడు "ఓ' – రారమ్మ, అన్నంతనే, కుక్క నోరు మెదపదు. మాయ కూడా అంతే. భగవంతుని శరణాగత బుద్ధితో, సర్వార్పణ – భక్తితో మొరలిడిన, అతడే అభయ మిచ్చిన, మాయ ఏమియు చేయదు.

## మాయ




నిర్వికార పరబ్రహ్మ నుండి బయల్వెడలిన
మూల ప్రకృతి (మూలావిద్య)-

మాయ

అవిద్యల వల్ల కల్పితములైన, శరీర త్రయము – మొ|| ఉపాధులను బట్టి నామ రూపములు -. యీ సర్వోపాధులందు సర్వ సాక్షియైన చిత్స్వరూపుడు "పరమాత్మ" – ప్రకృతి ధర్మముల కతీతుడై, (నిత్య సత్య) సచ్చిదానంద శుద్ధ బుద్ధ ముక్త స్వభావుడను –శుద్ధ చైతన్య ప్రకాశ ప్రభావ ప్రాబల్యమున "జగత్చైతనమంతము" తమ పాత్రల నిర్వహణమును కొన సాగించును.




1. ఈ లోకంలో – ఎందరెందరో – లీలామానుష విగ్రహులు – భగవాన్లు – బాబాలు - హంసలు – పరమ హంసలు – జగద్గురువులు – అవతార మూర్తులు – మహర్షులు - మహా త్ములు – తపస్వులు – యోగిపుంగవులు – అవధూతలు – ఆరూఢులు - సిద్ధులు – సాధువులు – కిన్నరులు – కింపురుషులు అవతరించిరి.

వీరి నిగ్రహానుగ్రహ అద్భుత లీలా తరంగిణి – అగణితము – అనంతము – అనూహ్యాము – అమరము – అపర్యాప్తము.

2. సామన్య దేహ ధారులే – మాంత్రిక తాంత్రిక యాంత్రిక ఐంద్రజాలిక సమూహం – చిచ్ఛక్తి (Will power Volition), హస్త లాఘవము (Dexterity of hand), మంత్రోచ్చారణ (magical chants) – తంత్ర కౌశలము (Trickery), లతో – Rope Trick, శిర చ్ఛేదం, క్షణంలో మామిడి చెట్టు సృష్టి – మోడీ మంత్ర తంత్రాలు మొ|| నవి. ఊహా తీత మైన - అద్భుత – అత్యాశ్చర్యకరమైన లీలా జాల ప్రదర్శనం - - - కాని ఇవన్నియును భగవన్మాయను మించినవా?

3. లీలా మానుష చిత్ర – విచిత్ర – ఘటనా ఘటన క్రియలు – నిగ్రహాను గ్రహ – అవాంఙ్మనస గోచరంబగు దివ్యానుభవములు – మరియు – మహాత్ములు తమ అవతార లీలలుగ – కఠిన, కర్కశ, క్రూర, కిరాతక, కుటిల, జటిల మహా పాతకులను సహా పునీతులను జేసి పుణ్య మూర్తులుగఁనొనర్చిన అనంత గాథలు గలవు. ఉ|| వాల్మీకి, వేమన, శతాంగుళీమాలుడు – జగాయ్ – మదాయ్ – గిరీష చంద్ర ఘోష్ – మొ|| వారు.

మహాత్ముల దర్శన – స్పర్శన – ప్రశ్నాది అనుగ్రహముల ద్వారా – సర్వ కర్మ క్షయమును – దివ్య జ్ఞాన ప్రభోదమున్ను . . . క్షణ మాత్రమున ప్రాప్తించడం – జగద్విదిత సత్యము – శాస్త్ర సమ్మతము – పూర్వ జన్మ సుకృత ఫల – భగవత్కారుణా ప్రసారం కావచ్చును. ముఖ్యంగా, - త్రికరణ శుద్ధిగా తపస్సు – పూర్వ పుణ్య ఫలాను కూల్యత – అవిద్యా (అజ్ఞాన) నాశం . . . . వల్ల మోక్ష ప్రాప్తి చేకూర వచ్చును.

"సర్వ శక్తిమయీ, సర్వమంగళ, సద్గతిప్రద, సర్వేశ్వరి, అనంత కోటి బ్రంహాండ జనని, మహా ప్రళయ సాక్షిణి" - - - శ్రీ లలిత సహస్రనామ స్తోత్రమ్.(199 - 202, 620, 571).

4. ప్రభు శక్తి (మాయ) నియామక అత్యద్భుత క్రియా జాల మనంతము – అనూహ్యము – అచింత్యము – అగమ్య గోచరము -

a). సూర్య చంద్ర – అనంత కోటి తారా గణము – గగన మండలమున మంత్ర ముగ్ధముగ – నిరా ధారముగ – రస బుడ్ల వలె – తమ తమ స్థానము లందు క్రమ బద్ధముగ గతులు దప్పక – విధ్యుక్త ధర్మ కర్మ నిర్వహణా సక్తతను ప్రదర్శించుట.

b). పృథ్వి – వాయు – వరుణ – అగ్ని – మృత్యువు – మొ|| పంచ దేవతలు . . . భగవంతుని కర్మాధికారులు; తమ తమ – విధ్యుక్త ధర్మ కర్మ నిర్వహణలో పూర్తిగా, నిమగ్నులై "నిష్కామ కర్మ" సాగించడం.

c). సప్త సముద్రములు – మేరలు మీరక – సృష్టికర్త అదుపాజ్ఞలలో – ఆలన పాలనలలో ఒదిగి ఉండటం –

d). మహోన్నత గిరి శిఖర పంక్తులు – అచల మూర్తులుగా – తపో నిధుల వలె భగవంతుని మహోన్నతతను చాటడం.

e). అజ్ఞాతంగా దాగి యుండిన్ని – అన్నీ తూ.చ తప్పకుండా పాలించి, పోషించే సర్వాధి నేత – ఎంత దయామయుఁడో, అంత నియంతగా ఉండటం – విదితం కాదా?

f). అనంత సృష్టి జాలము యొక్క సృష్టి, స్థితి (పోషణ), లయాది క్రియలు - - - ప్రాణుల దేహమున అణువణువును చైతన్యవంతమై – భగవంతుని సర్వ వ్యాపకత్వమును (Every Cell is a live Unit) చాటు చున్నవి. కోట్లాది నక్షత్రములు - - - రవి, చంద్ర, పృథ్వుల కన్న నూర్లు – వేల –కోట్ల రెట్లు కూడా పెద్దవిగా నున్నట్లు శాస్త్రజ్ఞుల అంచనా!!

g). ఆకలి – జీర్ణాది క్రియలు – నిద్ర మెలుకవలు – గర్భస్థ శిశు పోషణ, ప్రసవాది దివ్య క్రియా రహస్యాలు . . . అణువణువునా . . . అడుగడుగునా . . . భగవంతుని మహోన్నత దివ్యత్వాన్ని నిశ్శబ్దముగా చాటుట లేదా? సృష్టిలో అనంత కోటి ప్రాణుల దేహాల్లోని ప్రతి అణువు – ప్రతి కణము – ప్రాణంతో స్పంధించడం – ఊహిస్తే భగవంతుని మహత్వ మత్యద్భుతమని యబ్బుర పడక తప్పదు –

జీవత్వ
మాయ ⟨ ⟩ రహస్యం --- అభాస ప్రసంశాదులు.
దేవత్వ

ఈ మాయామయ మహేంద్ర జాల పద్మ వ్యూహ్యామే దేవుని జీవునిగ౹ జేసి – జగన్నాటక చక్ర భ్రమణమును – కల్ప కల్పాంతరములుగా – ఆద్యంత రహిత విజృంభణలతో సాగించుచున్నది.

అవిద్యే జీవునకు కారణ శరీరము – అవిద్యావరణం – అజ్ఞానం – "తమస్సు + రజో" మలినం –

జీవుని త్రిదశ (విధ) పతనం : - (3 Stages of Fall)

1. జీవు౹డు దేహంలో ప్రవేశించి – అవిద్యావరణంతో (అశుద్ధ సత్వః అనగా – రజస్తమో మిశ్ర) దేహి కావడం – "దేహ ప్రవేశం" } 1వ పతనం
2. ఇంద్రియములు + అంతఃకరణములు – వాటి క్రియలు – తనవే నను కొని భ్రమ పడటం – "దేహాత్మ బుద్ధి" } 2 వ పతనం
3. స్థూల (బాహ్యా) ప్రపంచదృష్టి – భోగ పదార్థముల (విషయముల) ఆకర్షణ – సర్వేంద్రియముల విజృంభణ – బాహ్యా దృష్టి – తగులాటం – సంసారం – స్వస్వరూపం మరుపు – విషయముల వేట – అనుభవేచ్ఛ – లంపటత్వం – "సంసారం & బాహ్యా విషయానుభవం" } 3 వ పతనం

కడపటి స్థితి – తన్ను తాను మరచిపోయి – జీవత్వ భ్రాంతి – సంసార బంధం – పూర్ణ భ్రష్టత్వం –

కూటస్థ బ్రహ్మా జీవేశ్వరస్థితి : -



అద్దమునందలి ప్రతిబింబమునకును, సూర్యునకును, ఏలాగు సంబంధం లేదో, ఆలాగే బ్రహ్మమునకును, మాయా జాల విద్యలకును సంబంధము లేదు. బింబ ప్రతిబింబములకు పోలికలుద్దేశింప(బడినవిః అదెట్లనగా : - సముద్రము నందు ప్రత్యేక పరిస్థితులందు "మంచు కొండలు"త్పన్నంబై, వాటి యందు సముద్రము ప్రతిబింబించునట్లు - - - కొండలు కదలిన – మలినముగా నున్న - - - నిర్మలమైన సముద్రము యొక్క ప్రతి బింబము . . . (మంచు కొండల మీద) చలించి, మార్పులు విపరీతముగా ప్రదర్శించినట్లు - - - - - .

"సంభవ అసంభవాలు – అసంభవ సంభవాలు"

"శశ విషాణము" (కుందేలు కొమ్ము) –

"వంధ్యా పుత్రు(డు"

"గగన కుసుమము"

"ఎండ మావుల జలం" (మృగ తృష్ణ) –

"శుక్తి రజతం"

"రజ్జు సర్పం"

ఉండి (కాన్పించిన్ని) లేకున్నవి!! ఆభాసలు – కల్పితములు – ఆరోపితములు.

ఈ మాయ ఊహ కందని అర్థం కాని . . . . భ్రమయే!!

1. శ్రుతుల దృష్ట్యా కాలత్రయం లేదు – ఏక వాహిని కాల ప్రవాహని –
2. యుక్తి సంబంధమగు దృష్టి చేతను – వాక్కు చేతను – చెప్ప(నలవి గానిది.
3. లోక సంబంధమైన దృష్టి చేత వాస్తవమైనదిగా కాన్పించునది.

మాయ – "తుచ్ఛ – అనిర్వచనీయ, అవాస్తవి" – అని 3 గుణములు గలది.

-- శ్రుతి.

"కలిమి లేముల( జూపు విస్తరిత – మరియు సంకోచిత చిత్ర వస్త్రము వంటిది" –

-- వేదాంత పంచ దశి.

"మాయ (ప్రకృతి) చిద్రూపు(డైన ఆత్మను వదలి స్ఫురింపదు గాన – అస్వతంత్ర.

అసంగు(డైన కూటస్థుని సంగము గా గల వానిని గా చేయుట చేత - స్వతంత్ర . . . . . . యని ఉభయ రూపిణి అగుట వల్ల –

"స్వతంత్రా స్వతంత్రత్వేన" – రెండును గలదనెడి హేతువు చెప్పబడినది.

"స్వతంత్రా, సర్వతంత్రేశీ, దక్షిణామూర్తి రూపిణీ"

-- శ్రీ లలితా సహస్రనామ స్తోత్రమ్. (723 – 725)

శ్లో|| మాయాంతు ప్రకృతిం విద్యాన్మాయినంతు మహేశ్వరం|
అస్యావయవ భూతైస్తు వ్యాప్తం సర్వమిదంజ గత్||

మాయ యీజగత్తునకు ఉపాధాన కారణం – అగుచు – ప్రకృతి యనఁబడు చున్నది. ఇట్టి మాయకు ఆధారుఁడైన అంతర్యామిని మహేశ్వరునిగా నీ యంతర్యామి యొక్క అంశ స్వరూపులైన జంగమ – స్థావరాత్మకమైన (పశు – పక్షి – మనుష్య – వృక్షాది రూపమైన) సర్వ ప్రపంచము – వాని చే వ్యాపింపఁబడినదని – "వేద వచనము" –

"సర్వం ఈశ్వర రూపమే" -
"మాయా చతమో రూపా" -
"మాయ తదేతజ్జడం – మోహాత్మకం – అనంతం –"
"మాయ సదస ద్రూపిణి" - -- శ్రుతులు.

జగత్తు 3 విధములు
- ఉపేక్ష్యం -- ఉదాసీన – తాటస్థ్యం (Neutral)
- ద్వేష్యం -- ప్రతికూలం – (Negative)
- సేవ్యం -- అనుకూలత్వం (Positive)

బ్రహ్మము నిర్వికారము – బ్రహ్మము నాశ్రయించి యున్న మాయా శక్తి "భూత భౌతిక" ప్రపంచముగా పెక్కు రీతులఁ పరిణమించి - మాయ – జగత్తునకు పాదాన కారణంగా వున్నది. మహేశ్వరుఁడు, సాధన కారణమగు మాయకు నియామకుఁడు – బ్రహ్మ నిమిత్త కారణం – (సృష్టి పూర్తిగా) –

బ్రహ్మ – కుమ్మరి – నిమిత్త కారణం.
ఈశ్వరుఁడు – చక్రం – సాధన కారణం
ప్రకృతి – మట్టి – ఉపాదాన కారణం

పురుష ప్రకృతులకు - కుమ్మరి కుండల సామ్యం కుదరదుః కారణం కార్యం గా మారదు గదా!

సాలె పురుగు – గూడు<br>పత్తి -- గుడ్డలు<br>బంగారం – నగలు<br>సముద్రం - అలలు

} కార్య కారణ వాదం సమన్వయం.

కార్యంలో కారణం వుండటం సమంజసం –

శూన్యం నుండి ఏమి వెలువడ గలదు? - శూన్య వాదం – నిరాధారమై – నిర్వీర్యమై – నిలువ౹ జాలదు. కావున, సృష్టి (స్థూల) కి పూర్వం – "సూక్ష్మ" మూల సత్తా ఉండి తీరాలి!! చుట్ట౹ బడిన బొమ్మల తెర వలె! "Roll Unroll" –

కూటస్థునికి సంగ మెట్లు గల్గెను?

స్వాభావికంగా నిర్వికార – అసంగ – ప్రత్యగాత్మను – జగద్రూపునిగా౹ జేసినది (సర్వ జగత్తును ప్రత్యగాత్మ యందు యదార్థముగా లేని వానిని కల్పించినది) -

మరియు 'మాయ' – జీవేశ్వరు లిద్దరిని చిదా భాస స్వరూపము చేత విభాగ మొనర్చినది. ఈ యర్థము –

"జీవేశా వా భావా సేన కరోతి" -- శ్రుతి.

కూటస్థ స్వరూపమున కే మాత్రమున్ను హాని కలుగ నీయక, ఆ కూటస్థుని యందు, జగత్తు నంతయు కల్పించి – అఘట నాఘటన సామర్థ్యమును ప్రదర్శించు మాయా శక్తి "ఇట్లు – అట్లు" చేయ గలదనుట ఒక వింత గాదు.

- మాయా స్వరూపములు చోద్యములే –
- ఇంద్ర జాల మహేంద్ర జాలమే –
- మాయా మయమీ ప్రపంచము –

కావున, బుద్ధిమంతులీ రహస్యమును విచారము వల్ల – వివేచించి - చర్చించి – భేధించి – నిజ స్వరూప (సత్య) నిర్ణయమున – ఇంద్రజాలమని తీర్పు చెప్పుట జ్ఞాన పథము.

ఆకాశం - (శబ్దం) – ఉన్నది కాని లేదు.



గాలి -- (స్పర్శం) – కాన్పించదుః కాని శబ్ద, స్పర్శలు గలవు –



అగ్ని -- (రూపం) - కాన్పించును – వెలుగు రూపం – వేడి, స్పర్శ.

శబ్ధ + స్పర్శ + రూపములు గలది.



జలం -- (రసం) - కాన్పించును – రుచి గలది – (ప్రవహించి)

పారి శబ్ధించును

శబ్ధ – స్పర్శ – రూప – రసములు గలవు –



పృథ్వి -- (గంధం) గంధ కాఠిన్యములు ప్రత్యేకత –

శబ్ధ స్పర్శ రూప రస గంధములు గలవు –

ప్రతి భూతమునకును మాతృక గుణములు + ప్రత్యేక (తన) గుణమును కూడా కలదు

మాయ – అనగా – అజ్ఞానము – దీనికి విరోధి జ్ఞానము.

అవిద్యకు విరోధి విద్యయే. చీకటికి వెలుగు వలె.

తత్వజ్ఞుని లో అవిద్య లేదు. శుక్తి యందు రజత మారోపింపఁబడినట్లు, అవిద్యా వరణము గల కూటస్థుని యందు స్థూల సూక్ష్మము లనెడి రెండు శరీరములు గల చిదా భాసుఁడారోపింపఁబడెను.

విక్షేపాధ్యాసమనగా : - చిదాభాసుడే – జీవుఁడు. అనగా, మనస్సు తోడి "ఆత్మ" – మనస్సున ఆరోపింపఁబడిన ఆత్మయే జీవుఁడు – అనగా "మనస్సు" యొక్క ఉనికియే జీవత్వ కారణము. –

చిదాభాసుని యందు – కూటస్థుని – "అసంగత్వం – అనంతత్వము – పరిపూర్ణత్వం" మొ|| నవి, మరుగు పడినవిః శుక్తికాస్థలమందు కల్పితమైన. పదార్థమునకు వెండియను పేరు గల్గినట్లు, ప్రత్యగాత్మయందు కల్పితుఁడైన చిధాభాసుని పేరు "అహం" – ఆత్మను చూస్తూ ఆత్మేతరమైన అహంత్వాభిమానమును పొందుచున్నాడు. అనగా "నేను" వేరని తలంఛుట (పరస్పర

వైషమ్యము లేదు) – రూప – నామములతోడ ప్రపంచము రూపొందుటకు కారణమిది యే – ఉ||

మట్టి -- పాత్రాదులు . . . . . . . వేరు వేరుగా
బంగారము -- ఆభరణములు "
చక్కెర -- మిఠాయి రఖాలు "
ఇనుము -- పనిముట్లు "
దూది -- వస్త్రములు "
పిండి -- వంటలు (పదార్థములు) "

దారము ముత్యములను ధరించునట్లు - - - -

అవిద్య అనగా అజ్ఞానము - (భ్రాంతి జన్య) – దాని విశేష స్వరూపము – సమస్త ప్రపంచమునకు మూల కారణమై మూల ప్రకృతియను తత్వము గలదు. మరియు నా నా విధ రూప నామ వర్ణ భేధములు – విభిన్న పరిణామ ప్రకృతులు – సమస్త సృష్టి జాలము, - అన్నియు – త్రిగుణముల "కూర్పు – మార్పు" ల వల్లనే సంభవించినవి. ఆదిలో ఆ మూల ప్రకృతిలో ఆత్రిగుణములు సామ్య స్థితి లో నుండెను - - (సాంఖ్యము) సమ – సామ్య – సహజ (నిర్గుణ) స్థితియే "బ్రాహ్మీ స్థితి"

"పురుషు(డు – ప్రకృతి" – విడ దీయ రాని అవినాభావ సంబంధమతి నిగూఢము - - అంతే!! "విత్తు ముందా - చెట్టు ముందా" - - - యీలాంటి జిడ్డు ప్రశ్నలకీ క్రింద జవాబు చాలును – ఏది ముందు?

మణి -- కాంతి
సముద్రము -- అలలు
శక్తుడు -- శక్తి
సూర్యుడు -- వేడి +వెలుగు
అగ్ని -- వెలుగు (లేక వేడి)
పుష్పము -- వర్ణము + వాసన
నీరు -- శీతల స్పర్శ (ప్రవహించు శక్తి)

ఒకటిని విడిచి, మరి యొకటి లేదు కదా!!

ఇక పురుషు(డు – ప్రకృతి అంతే!!

శ్లో|| దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా

తా|| ఈ త్రి గుణములతో గూడిన దేవతా సంబంధమగు నా మాయను దాట శక్యము గాదు.

-- భగవద్గీత. అ. 7.శ్లో. 14.

నా మాయ దాట శక్యము గానిది – దురూహ్యాము. సమస్త సృష్టి క్రియలకు మూల కారణము. మహా మాయా మహేంద్ర జాల శక్తి యుక్తులు గలది. పూర్ణ సమర్థత గల విశ్వ మోహిని – నా శక్తియే!! మాలో మాకు భేదం లేదు. ఈ జ్ఞానమే అద్వైతము. మేము "ఆది – అనాది" దంపతులంః ఒక్కటే :-

మాయ ఈజగత్తునకు పాదాన కారణమగుచు ప్రకృతి యనఁబడు చున్నది. ఇట్టి మాయకు అంతర్యామి ఆధారుఁడైన మహేశ్వరుఁడు. ఈ అంతర్యామి యొక్క అంశ స్వరూపులైన జంగమ స్థావరాత్మక మైన (అనగా – మనుష్య – పశు – పక్ష్యాదుల స్వరూపములు) సమస్త ప్రపంచము వానిచే వ్యాపింపఁబడినదని వేదములు చెప్పు చున్నవి.

"మాయ" – ఈశ్వర స్వరూపము (తమో గుణ ప్రధానమైన) } ఉపనిషత్తులు -

" జడం – మోహాత్మకం. అనంత స్వభావములు గలది.

"ఇది నాయొక్క బుద్ధికి అందకున్నది" – అన్నట్టి అనుభవం – అనగా మోహ స్వరూపము – రూపనామాత్మక మైన – "కుండ - గోడ" . . . అని, . . . అచేతనము లనెడి బుద్ధి యేది కలదో అది కూడా జడ స్వరూపమే – ఆ యనుభవమే . . . "మాయ"-

ఈశ్వరుఁడు -- ప్రకృతి – మరియు రెండును కాదు.

"సత్ -- అసత్" . . . . అంతా మాయయే –

"ఉన్నది -- లేదు" . . . . ఏమో? అనిర్వాచ్యము.

సంభవము -- అసంభవము ?

మాయ < మనస్సు / నిద్ర / స్త్రీ

మాయ < వికాసమే - సృష్టి / సంకోచమే - విలయం (ప్రళయము)

స్పష్టా స్పష్టములైన యుపాధులు ( మేఘము – ఘట జలము) గల వారగుట చేత స్పష్టో పాధికుఁడగు వాని జీవుఁడనియును, అస్పష్టమై యున్న మాయో పాధికుడీశ్వరుఁడనియును, జీవేశ్వరుల భేధమేర్పడెను –

మాయ – మేఘము వంటిది. – మేఘమందుడెడి ఉదక బిందువుల వంటివి – ఆ మాయ యందుండెడి బుద్ధి వాసనలు; ఆ బుద్ధి వాసనల యందు ప్రతిబింబించిన జీవుడే చిదాభాసుఁడని, మేఘ జలమందు ప్రతిబింబించిన యాకాశమువంటి వాడు అని తెలియ వలెను - -

మాయ యందు ప్రతిబింబించి మాయాధీనుఁడై – మాయకు ఆధారుఁడైన చిదాభాసుని, ఈశ్వరుఁడనియు, ఆ చిదాభాసుడే – సర్వజ్ఞుడు – అంతర్యామి, జగద్యోని మొ|| శబ్దములచే శ్రుతుల యందు – చెప్పఁబడినది.

ఈశ్వరాంతర్భూత మైన మాయను ⟶ విశ్వం

మాయాంతర్భూతమైన ఈశ్వరుఁడు ⟶ జీవుఁడు

వీరి అవినాభావ సంబంధ (గ్రంధ) విచారమే వేదాంతము.

పాలు చూస్తే వెన్న కాన్పించదు.

నోటు చూస్తే నాణ్యాలు కన్పిస్తాయా? . . . .

మర్రి విత్తన మందు వృక్షం కాన్పిస్తుందా? –

మేఘములు చూస్తే నీటి బిందువులు కాన్పిస్తాయా? - - -

"కార్య కారణ రూపేణ" – "మాయా ఈశ్వరు"లను ఊహించు కొని అర్ధం చేసుకోవాలి!

పది తలలతో రావణుడు రాముని గుర్తించ డయ్యె|

కాని, విభీషణుఁడు ఒక్క తలతో ధన్యుఁడయ్యెను.

పదార్ధము వేరు – అందు నిగూఢ శక్తి వేరు – ఈశ్వరశక్తి ఆనందమయ కోశము మొదలు కొని సమస్త మందును నిమిడి యుండుటఁజేసి, ఇంద్రియాగోచరమై, గర్భీ భూతము గనున్నది. ఇది లేకున్న సృష్టి లోని వస్తు ధర్మములు - క్రమ నియమాదులు లేక జగద్విప్లవము తథ్యము.

స్వయముగా మాయాశక్తి, జడమయ్యును చైతన్య ప్రతి బింబ ప్రభావము చేత – చేతనము వలె తోచి "శక్తి" యని ఉపాధినిఁబట్టి – బ్రహ్మకు ఈశ్వరత్వము ఆరోపింపఁబడెను.

కావున, "బ్రహ్మము" పంచకోశ్యుపాధిచే జీవుఁడగును. మాయోపాధిచే (శక్త్యుపాధిచే) ఈశ్వరుఁడగును, పిలువఁబడును. ఉపాధులను బట్టియే "ఈశ్వర" – "జీవత్వ"ము లారోపింపఁబడినవి. లేకున్న బ్రహ్మము బ్రహ్మమే.

ప్రత్యగాత్మ యే బ్రహ్మమని తెలుసుకొన్న వానికి, బ్రహ్మము వలెనే పునరావృత్తి లేదు.

మాయాజాల యధార్థ స్థితిని గ్రహించిన వాఁడు తటస్థుఁడగును. ఉ|| కుష్టు యోని నర్తకి శృంగార సుందర అభినయ నర్తన చాక చక్యములు, సభికుల నాకర్షించి, హర్షింపఁజేసినను, దాని పొందున దాని యాంతర్య (జాడ్య) మును, కనుగొన్న (గ్రహించిన) విటుని యెదుట, విటురాలు (మాయ) లజ్జతో తల వంచును. జ్ఞాని సత్య దర్శకుఁడు – సత్యజ్ఞానానంద మయుఁడు. మాయ యాతని సమీపింప వెఱచును. నిప్పునకు చెదలంటునా?

ఉపనిషదుపమానములు : -

ఇవి అవినాభావపు జంటలు – విడ దీయ రాని తత్వములు.

ద్వైతము ⟵ అద్వైతము
మంచు గడ్డ ⟵ జలము
అగ్ని రవలు ⟵ నిప్పు ▲
నాదము ⟵ వేణువు
సృష్టి ⟵ బ్రహ్మము
నేయి ⟵ పాలు
వెలుగు ⟵ దీపము
దారము ⟵ సాలె పురుగు

-- సాంఖ్యం.
ఉద్దాలక.

తే|| తెలియఁబడుచున్న విశ్వంబు దృశ్య మంచు|
దెలివి నై సర్వమును గాంచు దృక్కు నేను|
మిగుల నాకంటె నన్యమేమియును లేదు|
సత్య మిది సర్వ వేదాత సంగ్రహంబు||

-- శ్రీ సీతా రామాంజనేయ సంవాదము.

ఆమె దేవి – ఆది శక్తి – దుర్గ – చండి – మహామాయ – పరాశక్తిః ఏమైనా – ఎవ్వరైనా కావచ్చుః పురుషుని కర్తవ్య దీక్షలో ఉత్సాహం లేదు. మాయా దేవి ఆకర్షణ చేత జాగృత మౌతుంది. మాయ భోగ్య వస్తువు కాదు. మరీచికః మాయావి.

చిత్ర విచిత్ర – ఇంద్ర మహేంద్ర జాల దృశ్యములను స్పష్టముగా చూచుచున్నను, నిర్ణయింప సాధ్యము కానిదేదో "అది మాయ" యని నిశ్చయింపఁబడినది. ఆలాగే, జగత్స్వరూపము మాయా కార్యము. పండితులు సుదీర్ఘ చర్చలు సాగించి నిర్ణయింప జాలక విసిగి అంతా "మాయ" అని లేచి పోయినారు.

మాయామయ వినోదములు : -

1. దేహేంద్రియాదులు – శుక్ల శోణిత ముల వల్ల నెట్లు గల్గెను? ఇదియు వైకల్పిక మే గదా? మరియు ఇంద్రియములు – వాటి క్రియలు??
2. అణు ప్రాయమైన మర్రి గింజలో – అంత పెద్ద వృక్ష మెట్లి మిడెను?
3. నెమిలి అందమున అన్ని రంగులు అమర్చడం?
4. నిద్ర – మెలుకువ – శక్తులు – వచ్చి పోవుటల చిత్రం?
5. చిత్ర విచిత్ర స్వప్న ప్రపంచ సృష్టి?
6. గగన మండల స్థితి – రవి చంద్ర తారాగణముల – అనంతాద్భుత మహిమా విలాసాదుల రచన?
7. మహా పర్వత – సముద్ర – నదీ నదముల చిత్ర సృష్టి?
8. ఋతువులు – గ్రహ గమన క్రమాదులు –
9. సృష్టి – స్థితి – లయాది వింత క్రియలు –
10. జనన – జరా - మరణ – పునర్జన్మ రహస్యాదులు – ద్వందములు – కర్మలు – వాసనలు – మార్పులు – కూర్పులు –చేర్పులు - - -

వేద పురాణాదులందు – అనుభవంలోను యీలాంటి బహుళ సాదృశ్యము లెన్నియో గలవు. వీటికి తర్కము – హేతు వాదము – సమాధానము దుర్లభం. అత్యద్భుత – అతీంద్రియ – దివ్య సంఘటనలకు సమాధానములు – మానవ మేధ కందనివి. శ్రమించినను ఫలం లేదు –

"యా మా సామాయా" -- శ్రుతి.

“అదిగో! ఈశ్వరుని నుండి మాయా శక్తి – ప్రకృతి వెడలు చున్నది. స్వామి అర్ధ నారీశ్వరుఁడు గాఁ దోచు చున్నాడుః చిత్రము – పురుషుని నుండి → స్త్రీ -- స్త్రీ నుండి పురుషుఁడు → ప్రకృతి →
“ప్రకృతి – పురుషుల” అవినాభావ అనుబంధ స్థితియే – “సంధ్య వస్థ” కాబోలు.

1. జగన్మిథ్య కాదు – హేతు వాదము నిజము.
2. ఈశ్వరుని యంద – “సదస ద్రూపములు” రెండును గలవు. అసద్రూప మాయా శక్తి లేక ఆత్మ విభూతి.
3. ఈశ్వరుఁడు
   - పురుష (చైతన్య) శక్తి → చిదా భాసుఁడు.
   - ప్రకృతి (జడ) శక్తి → మాయ –
4. భగవంతుఁడు – మాయావరణము చే – కప్పఁబడిన వాడు. స్వయం కృతాపరాధము లేదా క్రీడ – లీల – నటన అన వచ్చును.
5. ఈశ్వరుఁడు – కర్త
   జగత్తు -- కార్యము.

శ్లో|| మ మైవాంశో జీవ లోకే జీవ భూత స్సనాతనః
మనష్షష్ఠా నీంద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి

తా|| జీవాత్మ లన్నియు నా యంశములే. ఇవి జ్ఞానేంద్రియముల ను మనస్సు ను ఆకర్షించి లాగుచున్నవి.

-- భగవద్గీత. అ. 15. శ్లో. 7.

జీవాత్మ పురుషోత్తముని నిజమైన అంశ. ఆంశ అనగా – భాగముగాఁనుండు “అంశము” (జగద్యోనిం) – దైవాంశ సంభూతుఁడు. దేహ మనో బుద్ధ్యాదులచే (ఇంద్రియాదులతో సహా) – బద్ధ మైన కారణమున జీవాత్మ “అంశగాఁ” జెప్ప బడెను. పురుషుఁడు, ప్రకృతి తో కలసి. ప్రకృతి సంజాత ద్రవ్యముల ననుభవించును. సద సద్రూప జన్మమున కిదియే కారణమై, గుణ సంబంధము గల్గియుండును.

--“చిదచిద్గ్రంథి” అనగా యీ బంధమే ముడి.

<u>సుషుప్తి</u> బాహ్యేంద్రియములకు – వాటి వృత్తులకు దూరమై, స్వప్నములకు సహా, పై నాడులందు వర్తించు దోష దూరమై – పురుషునందున్నందున - - -

మృత్యువు దేహము విడిచి, సూర్య కిరణముల ద్వారా వాడు (ఉపాసకుడు) దలంచి – ప్రణవ శబ్దము వచించి మనో వేగమున, సూర్య మండలముం జేరు | ఇదే బ్రహ్మలోక ద్వారము. 101 నాడులలో (హృదయ – సూక్ష్మ), ఊర్ధ్వముఖమైన యొక దాని ద్వారా ఉపాసకుడు పైకి పోయి ముక్తిఁ గాంచును.

సుషుప్తిలో నున్న వాడు తన్ను తానెరుగ లేడు.

భూత జాలములయునికి నెరుంగడు| తానే నశించి నట్లుండును| నిజంగా దేహము నశించునదే| శాశ్వితుఁడైన ఆత్మకే దేహము (నశించునది) కర్మఫలానుభవార్థమై ప్రసాదింపఁ బడిన ఉపాధి మాత్రమే|

సుషుప్తిలో ఆత్మ పరమాత్మలందు శాంత్యనుభవ మొందును. ఇంద్రియములాతనికి సాధనములు మాత్రమే|

"నీల తోయద బ్రహ్మంబును" – మనమున- అందలి చిదచిద్విశిష్ట తేజో బ్రహ్మమును చింతించి సంతుష్టుడగుట ఉత్తమోత్తమ పథంబు.

"నీలతోయద మధ్యస్థా విద్యుల్లేఖేవ భాస్వరా" – నీవార సూకవత్తన్వీపీతా భాస- - -"

-- మంత్ర పుష్పం.

"హయము రోమాళి విదిలించినట్లు" సర్వ
పాప జలము విదిలించి వైచి రాహు|
ముఖము వెడలి వచ్చెడి చంద్రు బోలె కర్మ|
బంధముల వీడి దేహంబుఁబాసి యర్థ|
సిద్ధిఁజెందిన యాత్మ సంశుద్ధి తోడ||

స్వప్న రహస్యము –

"పరమేశ్వరుని యందలి మాయా శక్తి. జాగ్రత్ప్రపంచమును రచించి నట్లు, జీవుని నాశ్రయించి యున్న (ఉపాధిగాఁగల) నిద్రాశక్తి స్వాప్నిక ప్రపంచమును, సృష్టించు చున్నది. రెండును మిథ్యయే"

-- వేదాంత పంచదశి.

బీజము నందు వృక్షము లీన మై యున్నట్లు – సుషుప్తి యందు బీజ స్థితి (లీనా వస్థ) లో జాగ్రత్స్వప్న ప్రపంచము లిమిడి యున్నవి.

అదే విధంగా, సర్వ జగద్వాసనలా మాయ యందు లీనమై (లయమై) యున్నవి – బుద్ధి వాసనలవలె! కావున, మాయయే జగత్కారణము.

ఆ బుద్ధి వాసనలయందు కూటస్థ చైతన్యము – ప్రతి బింబించియు, మేఘా కాశము వలె – మనకు తెలియ(బడుట లేదు. (అస్పష్టం – ఊహచే – అనుమాన ప్రమాణము చేత – ఊహింప(దగినది) –

అస్పష్ట చిదాభాసునితో కూడి నట్టియు – మాయ యనెడి కారణమైన అజ్ఞానము బుద్ధి రూపముగా పరిణమించు చున్నది. కనుక బుద్ధి ప్రతి ఫలించిన చైతన్యము చిదాభాసు(డని స్పష్టము.

మాయా శక్తి "జీవేశ్వరు"ల నిద్దరిని ఆభాసులుగా( జేసెనని వేదములందు(జెప్ప(బడియె. మేఘమందు (జలమున) ప్రతిబింబించెడి యాకాశము వలె అస్పష్టమగు కూటస్థ చైతన్యము నీశ్వరు(డనియు, బుద్ధి రూపముగా పరిణమించిన ఆ యజ్ఞానము నందే – ఘటమునందలి జలమందు ప్రతి ఫలించిన యాకాశము వలె ప్రతి బింబము స్పష్టముగా( నుండు వానిని జీవు(డనియు( దెలియ వలెను.

మాయా వాదం

బాధితా నువృత్తి –

ప్రశ్న : - 1. సత్య జ్ఞానానుభవానంతరం కూడా మేల్కొన్న పిదప స్వప్నానుభవం నశించు నట్లు, మాయామయ జగత్ప్రపంచం ఎందుకు నశించదు.

జవాబు -- భయంకర దుస్వప్నం నుండి మేల్కొన్నను, కొంత సేపు భయ కంపనాదులు, స్వేద తాపాదులు, కొంత సేపు ఆలాగే వుండితర్వాతనే ఉపశమించునట్లు.

ఉదాహరణకు – రజ్జు సర్ప భ్రాంతి జనిత భీతి – భావోద్వేగ హృదయ కంపనాదులు, దీపము తెచ్చినంత మాత్రముననే, హఠాత్తుగా నిల్చి పోవు గదా!!

ఆలాగే జాగ్రత్ప్రపంచం, అనిత్య మని జ్ఞానోదయ మైనను "జగన్మిథ్యా" జ్ఞానంతో, జగం మాత్రం మాయం కాదు. ఎందు కనగా, ఇది యుగ యుగాలుగా, జన్మ జన్మాంతరముల నుండి ఉంటున్న భ్రాంతి కదా! జగత్తు యీనాటిదా?

2. ఎండ మావులని తెలిసి కూడా, అందున్నట్లు కాన్పించు"నీరు" మాయము కాదు కదా! జన్మ జన్మాంతరములనుండి భ్రమింప(జేసి మన గల్గిన భ్రాంతి గదా!

నిశ్చితార్థ బుద్ధి జనించినంతనే జగత్తు ఎట్లు క్షణంలో అంతరించ గలదు?. దీనినే "భాధితాను వృత్తి" – అందురు.

శాంతుడనగా, శమము గలవాడుః బ్రాహ్మీ స్థితిచే "మనస్సు" ఉపశమించినవాడు.

కల్పాంతములో కార్యం (Effect) merges into కారణం (Cause). కాని, యీ లయం వల్ల కారణంలో ఏలాంటి మార్పు (పరిణామం) ఉండదు. దీనికి తర్క వాదములు ఆఖర్.

-- శ్రుతులు.

నీవు స్వప్నము నుండి మేల్కొన్న తరువాత - "కల – కల్ల" అందువు కదా! అలాగే అజ్ఞాన దశలో ప్రపంచము సత్యముగా తోచినను దివ్య జ్ఞాన (తురీయ) అవస్థలో అది లేదు. ఇవన్నియు దృష్టి భేద జనితములే!! తత్వములు గావుః విషయ వాసనలు దయ్యముల వంటివి. యుగ యుగాలుగా అలుము కొన్న – సూక్ష్మ లేక లింగ దేహమును – బలవత్తరమై సంస్కారములు - వాసనలు – ఆవరణలై, సుదీర్ఘ ప్రాబల్య బలము చే, బంధ (గ్రంధి) రూపమున (చిదచిద్గ్రంధిగా) నిలువరించుకొని వుండును.

శ్లో|| భిద్యతే హృదయ గ్రంధి శ్ఛిద్యం తే సర్వ సంశయాః |
క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరాపరే ||
-- ముండకోపనిషత్. 2. 2. 8.

తా|| ఎగుడు దిగుడులలో కూడా ఆత్మను సాక్షాత్కరించుకోవడం వలన అతని అజ్ఞానపు ముడి వీడిపోతుంది. అన్ని సంశయాలు సమసిపోతాయి. అన్ని కర్మలు క్షయించిపోతాయి.

"When he that is both high and low is seen, the knot of the heart is untied; all doubts are solved and all his karma is consumed".

" ఓం పూర్ణ మదః పూర్ణ మిదం పూర్ణాత్
పూర్ణ ముదచ్యతే పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే".

---------------------

## REFERENCES

1. “భగవద్గీత – బైబిల్ –కొరాన్” By శ్రీ విన్న కోట వెంకటరత్న శర్మ (శ్రీ విన్నకోట లక్ష్మీ నరసింహం గారి తృతీయ పుత్రుడు) విన్న కోట, గుడివాడ తాలుకా, కృష్ణా జిల్లా. ప్రభాత ముద్రణాలయము, నెల్లూరు. ఆంధ్ర ప్రదేష్, 1939 Edition.

2. వేదములు, ఉపనిషత్తులు మరియు వివిధ వేదాంత గ్రంధములు.

# About the Author

The author, my father, Late Dr.D.Siddappa Chetty (1906–79) was a Registered Medical Practitioner at PUNGANURU. He lost his father Sri Donti Ramaiah Chetty during his child hood. His mother Smt Donti Muni Lakshmamma brought him up and educated him etc. She was a patient of "Epilepsy". My father cured her with one single dose of medicine. Fits never occurred, till she passed away in 1961. But he could not cure other patients from same problem. Sri Tankasala Rangaswami Chetty, former Diwan of Punganuru Zamindari, was a friend of his. He suffered a paralytic stroke in 1959 and sought my father's treatment and was totally cured.

He was a great philosopher. Sri Pindinagara (Shyama Das) Swamy (A Bramha Jnani) of Ramasamudram was frequent visitor to our house during 1930-40s. My elder brother Late Dr. Donti Haranath Guptha (1939 – 89), a medical practioner and a philosopher in his own right , was fortunate to play with Swamiji and also eat from his hands.

During later years 1950 – 70s, Sri Vellaluri Venkatadri Sathyanarayana Swamy of Bengaluru, a mystique, disciple of Sri Lalitha Devi, philosopher, extraordinary astrologer etc etc. was also frequent visitor to our house. I have seen him perform some miracles and extraordinary spiritual and literal feats. Once he sees an horoscope, he will remember it for ever. Once he had brought "Brigu Naadi" to my elder brother Dr. Haranath Guptha's house and showed him its miraculous powers in predicting the future. Even at an young age of 20s, he knew all the philosophical/spiritual books by heart and can explain each shloka in a lucid manner with so many references and also without referring to the books. Even University professors of Sanskrit, Learned Brahamins used to be wonderstruck with his proficiency in Sanskrit language and spiritual knowledge. We are all blessed with our association with him.

On 24-04-1978, Sri Sri Chandra Sekhara Sarasawathi, "Peria Swamygal" of Kanchi Kama Koti Peetam was a visitor to Punganuru. My father led the delegation of the town to receive Swamiji. He preferred to stay in a temple. My father observed that Swamiji had developed boils in his feet and was walking with great difficulty. While they were sitting and talking, my father took one of swamiji's feet and started applying ointment. After he had finished with that foot, swamiji withdrew that foot and extended the other one to my father, so that he can treat that foot also. Which my father did. Later the followers and attendants of swamiji told my father , that it was an extraordinary gesture which they have never seen all their lives. Swamiji never allows any body, even his closest attendants to touch his body. If by any chance, if any body touches even accidentally, swamiji will rush to nearest well and pour buckets of water on himself.

Swamys, sanyasis from various places used to drop in, meet and spend time with my father and accept his hospitality and food offered by my mother.

He was freedom fighter, Orator, Social Worker, a born Leader and above all a Philosopher. He studied up to S.S.L.C. in Basava Raja Board High School, Punganuru and Intermediate in Pachhiappa's college , Chennai and L.I.M in a medical college at Chennai. He was very active in Freedom movement from his college days. He could address any size of audience on any subject and keep them spell bound with his knowledge, humor and oratory skills for any length of time. Even now we have several letters received by him from Sri Chakravarthi Rajagopala Chari, first Indian Governor General of India, Sri Kattamanchi Ramalinga Reddi and several other stalwarts of freedom movement. Even one letter from Mahathma Gandhi, addressed to my father in his own hand writing exists. Sri Ananathasayanam Iyyengar the first speaker of Lok Sabha of independent India was a frequent visitor to come and meet my father. One such meeting was on 09-03-1957. During one of his later visits, after he left, my father commented "his visit means elections have come". By that time political degradation has started. My father was disillusioned with many of his co freedom fighters, who have become politicians and power mongers.

He was spiritually oriented from his child hood. He will never miss a chance to meet Swamys and Gurus. In his own words

"స్వానుభవ రహస్య దివ్య తత్వము. (పరమ మధురానుభూతి) –

12-04-1940 – 10-30 to 11-00 AM at Morrumpalli Mitta – on a stone Bench- on the way from Ramasamudram to Chembakur. Divine experience – "లింగ శరీరం" – "అంగుష్ట ప్రమాణః పురుషః" –seated on the "Optic Thalamus" – భ్రూమధ్య స్థానం (ఆజ్ఞా చక్రం) లో "విశ్వ" సంజ్ఞ గల జీవుడు (పురుషుడు) – ప్రత్యగాత్మ (తేజోవతి – అంతర్యామి – త్రిపురసుందరి – చిద్విలాసం - ఆకర్షణతో విశుద్ధ చక్రం స్థానంలోనికి దూకి (ఆ దివ్య తేజస్సులోకి) – అటునుండి "తైజస" సంజ్ఞగల లింగ దేహం (Dark అంగుష్ట ప్రణామము గల) - - next – అనాహత చక్రం (హృదయ స్థానం – "ప్రాజ్ఞ" సంజ్ఞ గల "జీవుడు" – లో లీనమై పోవుట – గ్రాహ్యమై – దివ్యానుభవం – ఉపనిషత్ప్రవచనం సమ్మతమై - - - 3 అవస్థలు (జాగ్రత్ – స్వప్న – సుషుప్తి) అవస్థల్లోను "విశ్వతైజస ప్రాజ్ఞుల" తో "ఆజ్ఞా – విశుద్ధ – అనాహత చక్ర సంచారిగా" ప్రత్యగాత్మ (తేజస్సు)లో – తల్లి ఒడిలో చరించు దివ్యానుభూతి మరువరాని "ప్రజ్ఞానం బ్రహ్మానుభూతి" లభ్యం.

“దర్శనం – స్పర్శనం – ప్రశ్న” – మహాత్ములు – బ్రహ్మవేత్తలు – జీవన్ముక్తులు – చతుర్వేద మహా వాక్యముల పరిపూర్ణ అనుభూతి నందిన – అమృత పాన మత్తులు – మహా ఋషిపుంగవుల – వల్ల ఈజన్మములోనే మోక్షమును చూర గొని తరింతురు.-

ఉ|| వాల్మీకి – (హంతకుడు – దోపిడిదారు – రక్త పిపాస గల మహా పాపి) నారద మహర్షి “దర్శన – స్పర్శన – ప్రశ్న”ల ప్రభావ ఫలితంగా – అదే జన్మలోనే “ఆది కవి – బ్రహ్మఋషి” అయినాడు. - - - ఆలా మరెందరో ఉ|| శతాంగుళీకుడు మొ||

స్వానుభవం:-

1. పరమహంస – సద్గురు దేవుడు – అనుగ్రహ మూర్తి అయిన – శ్రీ శ్రీ పిండి నగరం (శ్యామ దాసు) స్వాముల వారి, సాన్నిధ్య – దర్శన – స్పర్శన – సంభాషణాదులు – సుమారు 10 సం|| లు ప్రత్యేక అనుగ్రహ, ఆశీర్వాదముల నందుకొన్న ప్రత్యేక పునీత ధన్య చరిత్ర.
2. భగవాన్ హరనాథ్ బాబా గారి ధర్మ పత్ని కుసుమాదేవి పవిత్ర పాద స్పర్శ (04-07-37) మదరాసు లో.
3. భగవాన్ రమణ మహర్షి వారి “దర్శన – స్పర్శ – ప్రశ్న” 06-07-1937, తిరువణ్ణామలైలో.
4. కంచి కామ కోటి పీఠ జగద్గురు శంకరాచార్యుల (పెద్ద స్వాముల) “దర్శన – పాద స్పర్శ (కల్లు పల్లె లో – on 24 – 04 -1978 –- 3–30 PM) పుణ్య లభ్యం. తిరిగి 2 – 3 రోజులు పూర్తిగా సాన్నిధ్య సేవా ప్రాప్తి – ఇంకేంకావాలి?

-------------------------------

(Translation of above paras in TELUGU to English)
“ Secret Self Divine Spiritual experience” ( The most plesureable feeling) 12- 04-1940 - 10-30 to 11-00 AM at MORUMPALLI MITTA – on a stone bench – on the way from Ramasamudram to Chembakur.

( Description of the divine experience in Telugu by the author.
PS : Beyond my capacity to translate it in to English)

Darsanam ( Seeing ) – Sparsa ( Touching ) – Prasna (Questioning) – of Mahathmas, Bramhavetthalu ( Realised Souls) – Jivanmukthulu (Liberated Souls) - Chathurveda Maha Vakyamula paripurna anubhuthi nandina Amritha Paanamathulu –( People who have read and assimilated all Vedas

and Scriptures) – Maha Rishipungavulu (Maharshis) - will bring Moksham ( Liberation) in the present birth (Janma) it self.
Ex:- Valmiki – ( murderer – robber – Blood thirsty sinner) , with Darsanam ( Seeing ) – Sparsa ( Touching ) – Prasna (Questioning) – of Narada Maharshi became " First Poet – Bramha Rishi" in the same janma.

Another example is "Shatangulikudu" etc, like so many souls turned to divine souls in the same janma.

Self Experience.

1. Parama Hamsa – Sadguru Devudu – Anugrahamoorthy – Sri Sri Pindi Nagara (Shyama Das) Swamy - His nearness – Darshan – Sparsha (Touch) – Sambhashanaadulu ( Discussions) etc for nearly 10 years. Received His privileged blessings.

2. Touched the lotus feet of Matha Kusuma Devi wife of Sri Sri Haranath Baba in Madras on 04-07-1937.

3. Darsanam (Seeing) – Sparsa (Touching) – Prasna (Questioning) – of Bhagawan Sri RAMANA MAHARSHI on 06-07-1937 in Tiruvannamalai.

4. Darsanam (Seeing) – Sparsa (Touching) – Prasna (Questioning) – of Kanchi Kama Koti Pitaadhipathi Jagadguru Sankaracharyulu (Peria Swamigal) on 24 – 04- 1978 – 3-30 PM at Kallupalli. Further opportunity to serve Swamiji and be near to him for 2- 3 days continuously.

What more is wanted?

----------------------------

My father was a bold and fearless person.. Once as a student in 1920s, was waiting in Chittoor bus stand, and saw a Britisher misbehaving with some women. He warned him not to trouble them. But when the Britisher continued with his misbehavior, thrashed him. Whole district was stunned with my father's daringness. Every one thought, the British Government will take serious action against my father. But, fortunately, the Government knew about the misdeeds of the Britisher and did not take any action against him.

One of my father's friend Sri Pindikuri Lakshminarayana Setty, who was President of Punganuru Panchayath several times, told me about my father's above daring act. Sri PLN, as he was popularly known himself was a great adventurist himself . He travelled in a two wheeler from Madras

to Bombay and back in 1920s, which was a great feat and was published in all over news papers, with his photo along with his motor cycle.

My father was a great orator. He is so knowledgable, he can speak extempore on any subject at any time. On 20 th May 1957, at 08-00 PM, there was a "Switching on Electrical Lights" ceremony in palace premises in Punganuru . Sri Dr Neelam Sanjiva Reddi, then Chief Minister of Andhra was the Chief Guest and switched on power to Punganuru first time. Sri Pindikuri Lakshminarayana setty, President Punganuru Panchayath presided. Sri Balarami Reddi M.P, & Zamindar, who was the then MLA were on the dias. My father, who was also panchayath Board Member was the main speaker and presented Civic Address to the Chief Guest. The entire palace grounds was full with people. Even intermittent drizzle did not deter the gathering. The function was followed by a dinner in local Basava Raja Board High School.

During his life time, he was associated with all most all such functions in Punganuru.

In 1955, the Ex-Zamindar of Punganur Sri Raja Veera Basava Chikkarayalu wanted to contest the General Elections to the Andhra Assembly and invited my father for help. The zamindars are well known for their benevolence and are highly respected. My father helped him in organising the campaign including number of meetings all through the constituency, and mobilised full support. The zamindar was elected with such a huge majority (92% of votes polled) which was and is a record. The ex-zamindar presented a marble statue of Gautham Buddha to my fathera as a token of respect and gratitude. The statue was installed in the hall of our house. My father was a staunch devotee of Gautham Buddha. He named one of his sons "Ananda Mohan" after Ananda, Gautama Buddha's cousin and personal attendant. On a pilgrimage tour, he visited Bodh Gaya.and was sitting along with my mother near the Bodhi tree. Two dry leaves from the sacred tree fell in his lap. He brought them home and preserved and worshipped.

Sri V. Umamaheswara Rao, a lawyer, stage artist, singer, writer etc acted in a hit film " Illalu" released in 1940. He also acted in 2 more movies Panthulamma and Bhgyalakshmi. He was a tall and handsome person. He was a close friend of my father and visited our house several times. During one of his visits in 1944, I was a child of few months old and was crying in the cradle in the hall, when he entered the house. As there was no other person, he started rocking the cradle and started singing a melodious song in his loud voice. It seems many of the neighbours came and watched this scene with curiosity, as Sri Umamaheswarar Rao was a famous cine actor.

My father was a very very humorous person. Myself and my elder brother, invariably used to accompany him in his evening walks and have

spent so many memorable times with him. I can only say, we are blessed to be born as his children.

My sincere thanks to my elder sister, Late Smt Komarla Girijamba (1941 – 2013) w/o Late Sri Komarla Suryanarayana Setty (1934 -1999) of Devanahalli, for safely preserving the manuscript of this book. After her passing away, her elder son Sri. K.S Ramesh Babu and his wife Smt.K. Gomathi have handed over the same to me.

I thank Sri Thanikesh Aravindan and his wife Smt. Aparna Thanikesh of Singapore (my son-in-law and daughter) for scanning the entire manuscript for preservation. Miss Anoushka Thanikesh, their daughter ably assisted them in the job.

I thank my son Ch. Donti Vishwanth and his wife Smt Donti Kavita, who themselves are computer experts, in processing the typed copy for making e-books and also for uploading it on to the internet. Their children Ch Donti Shreyas and Ch, Donti Sahas were all enthusiastic in performing the job.

My thanks also to my wife, Smt Donti Annapurni, who is a multi linguist, in carefully comparing the typed copy with the manuscript and also for searching the various missing references for the quotations.

The manuscript of this book came in to my hand very recently and so, final editing was not done by the author (my father). Hence, there are repetitions, gaps and errors. My sincere and deep apologies to all readers. Any suggestions/comments for improvement of the book are humbly welcome.

My grand daughter Ms.Anoushka Thanikesh (aruna2207@gmail.com) will be the custodian of this book for the future.

**15-09-2016**

**Donti Chandramouli**
**dchandramouli@yahoo.com**
**080 – 2846 30 74**
**9481102784**

I am ever grateful to Sri, Vinjamuri Seshaphani Sarma garu, Hon. Telugu Lecturer, Sri Satya Sai Higher Secondary School, Prashanti Nilayam – 515134, Anantapur District for patiently going through the entire book and pointing out the errors/mistakes/omissions etc.

Any suggestions/comments for further improvement of the book are always humbly welcome.

18-09-2017 Donti Chandramouli

**10012019**



Front Row Sitting: Sri Sri Acharya Bramhasri Vellaluri Venkatadri Satyanarayana Swamy, (Second from Right) Dr. Donti Siddappa Chetty (Third from right/Centre)

(1962 -63)



Author’s family. (1977)



Sitting : Smt Subbalkshmamma (Ch. Kavita d/o Ananda Mohan) Dr. Donti Siddappa Chetty (Author)
Standing : Mrs. Annapurni (Ch. Aparna), Mr.Chandramouli (Ch. Vishwanath)

(1977)